# పక్షులు

రచన :

సాలీమ్ అలీ
లయీక్ ఫతే అలీ

అనువాదకుడు :

శ్రీ యస్. యల్. నరసింహారావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
న్యూఢిల్లీ

మే 1977 (వైశాఖం 1899)



రూ. 17-00

COMMON BIRDS (TELUGU)

డిస్ట్రిబ్యూటర్సు :
ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతి రోడ్డు
సికింద్రాబాదు

PUBLISHED BY THE SECRETARY, NATIONAL BOOK TRUST, INDIA, NEW DELHI - 16 AND PRINTED AT STREE SEVA MANDIR PRESS, MADRAS - 17.

# విషయసూచిక

ఈ ప్రచురణకై కొన్ని వర్ణ చిత్రాలను బ్లాకులను ఎరువు ఇచ్చిన బొంబే నేచురల్ హిస్టరీ సొసైటీ, బొంబాయి, వారికి ప్రచురణ కర్తలు కృతజ్ఞులు.

# ప్ర వే శి క

ఈ ప్రపంచంలోని వెన్నెముక గల జంతువుల నన్నింటినీ శాస్త్రజ్ఞులు — ఉష్ణరక్త జంతువులు, శీతరక్త జంతువులు — అని రెండు తరగతులుగా విభజించినారు. ఉష్ణరక్త జంతువుల రక్తము ఒక స్థిరోష్ణతలో ఉంటుంది. ఆవరణము నందలి గాలి యొక్క ఉష్ణతా ప్రభావము దానిపై ఎంత మాత్రముండదు. చేపలు, కప్పలు, సరీసృపాలు శీత రక్త జంతువుల తరగతిలోకి వస్తాయి. ఈ జంతువుల రక్తము యొక్క ఉష్ణత వాటి నావరించియున్న గాలియొక్క ఉష్ణతను బట్టి మారుతూ ఉంటుంది. ఉష్ణ రక్త జంతువులను తిరిగి సస్తనులు, పక్షులు అని రెండు చిన్న తరగతులుగా విభజించినారు. సస్తనుల తరగతిలోనే మానవులు కూడా చేరుతారు. సస్తనుల శరీరంపై రోమాలుంటాయి; అవి పిల్లను కంటాయి; వాటికి పాలిచ్చి పెంచుతాయి. పక్షుల దేహంపై ఈకలుంటాయి; అవి గ్రుడ్లను పెడతాయి. సర్వసాధారణంగా వాటి దేహముల యొక్క వేడితో ఆ గ్రుడ్లను పొదుగుతాయి. మనమిప్పుడు కేవలం ఈ పక్షులు లేక 'ఏవియన్సు' తరగతిని వర్గీకరించు విధానమును మాత్రమే వివరింతుము.

పక్షులంటే ఏమిటో నిర్వచించడం సులభమే. ప్రపంచంలో ఈ ఒక్క తరగతి జీవులకే ఈకలుంటాయి. స్థూల దృష్టికి పక్షులన్నింటికి ఒకటే లక్షణాలున్నట్లు కనపడుతుంది. ఏలన పక్షులలో చాలవరకు ఎగిరేవే; అవి గ్రుడ్లు పెడతాయి. కాని సూక్ష్మదృష్టితో పరిశీలించినట్లయితే పక్షులలో పెక్కులు తెగలు (forms) ఉన్నాయనీ, ఆ తెగలలో ఒకదానికి మరియొక దానికి చాలా తేడాలుంటాయని మనకు తెలుస్తుంది. ఒక్కొక్కప్పుడు కొన్ని తెగల పక్షులలో ఒకదానికీ వేరొకదానికీ మధ్య ఏవిధమైన సంబంధం ఉన్నట్లే కనపడదు. మనుష్యుని బొటన వ్రేలంత చిన్నదైన తేనెపిట్టా, పోనీ గుఱ్ఱమంత ఎత్తుండే నిప్పు కోడీ పక్షి జగత్తు లోనివే. వేలకొలది మైళ్లు ఎగిరిపోగల పక్షులూ, భూమిని వదలి కించిత్తైనా పైకి లేవలేని పెంగ్విన్ వంటివీ పక్షి జగత్తులోనివే. అతి ప్రయత్నముతో అందమైన గూళ్లను కట్టే బంగారు పిచ్చుకలూ ఎట్టి ప్రయత్నము లేకుండా

తిన్నగా నేలమీద గ్రుడ్లను పెట్టే పక్షులూ ఈ తరగతిలోకే వస్తాయి. ఒక ప్రత్యేకమైన ఆహారాన్ని మాత్రమే గ్రహించే పక్షులూ, మృత కళేబరాలను మాత్రం తినే రాబందుల వంటి పక్షులూ, లోహాలు తప్ప మరే పదార్థాన్నైనా భక్షించే కాకుల వంటి పక్షులూ ఇందులోనివే. సంవత్సరానికి రెండుసార్లు పయనించి వలసపోయే పక్షులూ, వాటి జీవిత కాలమంతా ఒకే ఒక తోట పరిసరాలలో గడిపే పక్షులూ, ఈ తరగతిలోనే చేర్చబడ్డాయి. గ్రుడ్ల నుండి వెలువడగానే పరుగెత్తుతూ నేలను బరికే పిల్లలు గల పెంపుడు కోడి పెట్టలూ, కొన్ని వారాలవరకు గూళ్లను వదలలేని పిల్లలు గల రామచిలుకలూ, గ్రద్దలూ ఈ తరగతికి చెందినవే. మానవుడు తోడు లేకుండా బ్రతుకలేని పక్షులూ, నిర్జన ప్రదేశాలలో ఉండటానికి అలవాటుపడి వాటి పరిసరాలలోనికి మానవుడు జొరపడితే నశించిపోయే పక్షులు కూడా తుదకు ఈ తరగతిలోనే చేరతాయి. ఈ పలురకాల పక్షుల సముదాయాన్ని ఒక నియమబద్ధమైన వర్గీకరణంలోకి తేవడం ఎలాగ ?

జంతు జగత్తు యొక్క వర్గీకరణాన్ని ఒక పద్ధతిలోనికి తేవడానికి మొట్ట మొదటిసారిగా ప్రయత్నించినవాడు అరిస్టాటిల్. తరువాత పద్దెనిమిదో శతాబ్దంలో లిన్నియసు అనే స్వీడస్ ప్రకృతి వేత్త ఈ వర్గీకరణానికి మరో పెద్ద ప్రయత్నం చేశాడు. కొద్దిపాటి మార్పులతో అతని పద్ధతే నేడు సర్వత్రా వాడుకలో ఉంది.

ఆయా పక్షుల నిర్మాణ, వికాసాలలో గల ముఖ్య భేదాలను ఆధారంగా చేసికొని పక్షి జగత్తును 27 ప్రధాన వర్గాలుగా విభజించారు. ఉదాహరణకు చెట్లలో నివసించుచు మనకు బాగా పరిచయమైన పక్షులను పెస్సరీఫార్మిస్ అనే వర్గంలో చేర్చారు. జలాశయాల పరిసరాల్లో జీవితాలు గడిపే సారస పక్షులను, కొంగలను సైకోనీ ఫార్మిస్ వర్గంలో చేర్చారు. ఏన్సరీఫార్మిస్ వర్గంలోకి పొట్టి బాతులు, పెద్ద బాతులు, హంసలు — ఇలాంటి ఈదే పక్షులు వస్తాయి.

ఈ పెద్ద వర్గాలలో ఒక్కొక్కదానిని తిరిగి కుటుంబాలుగా విభజించారు. కొన్ని ప్రముఖ లక్షణాలు గల ఒక్కొక్క పక్షి సముదాయాన్ని ఒక కుటుంబం అంటారు. ఉదాహరణకు పెస్సరీఫార్మిస్ లేక కూర్చొనే పక్షులు అనే వర్గంలో — తోక పిగిలి పిట్టలు (మ్యూసికాపిడె), కాకులు (కార్విడె),

తేనెపిట్టలు (నెక్టారినిడె) — ఈ విధంగా రమారమి 40 కుటుంబాలున్నాయి. ఈ కుటుంబాలు అచ్చంగా కుటుంబాలే. ఎందుచేత నంటే ఈ ప్రతి కుటుంబంలోనూ ఉన్న జాతుల మధ్య పరిణామక్రమాన్ని అనుసరించి ఒకదానికీ వేరొకదానికీ మరీ దగ్గర సంబంధం ఉంది. అంతేకాదు. ప్రవర్తనలోనూ, అలవాట్లలోనూ అవి ఒకదానితో ఒకటి స్పష్టంగా పోలి ఉంటాయి. ఒకే కుటుంబానికి చెందిన వివిధ జాతుల పక్షుల అలవాట్లు — వాటి సామాన్య ఆకారంలోను, వాటి చలనంలోను, వాటి ముక్కులు, గోళ్లు, రెక్కలు మొదలగువాని స్వరూపంలోను ప్రతిఫలించి ఉంటాయి. పక్షుల గోళ్లు, ముక్కుల మీద వాటి ఆహారపు అలవాట్ల ప్రభావాన్ని గూర్చి తరువాత వివరంగా తెలిసికొందాం. మనకు ఇదివరలో తెలియని ఒక క్రొత్త పక్షిని, దాని జాతి యేదో మనకు కచ్చితంగా తెలియకపోయినప్పటికీ, దాని కుటుంబంలో దానిని చేర్చడానికి తరుచుగా వీలవుతుంది. పై పుటము, క్రింది పుటము పైకి వంగి పటిష్టంగా ఉన్న ముక్కు, చదునైన తల, భయంకరమైన కన్ను, పటిష్టమైన దేహ నిర్మాణం — వీటిని చూడగానే ఆ పక్షి డేగ అని కచ్చితంగా పోల్చగలము. ఈ పోల్చుకోవడంలో పొరపాటు పడడానికి ఏమాత్రం సావకాశం లేదు. ఒక పక్షి కచ్చితంగా ఏ జాతికి చెందుతుందో మనం చెప్పలేక పోవచ్చును గాని అది డేగ కుటుంబానికి చెందుతుందో లేదో మనం సులభంగా ఊహించవచ్చును. అదే విధంగా తేనె పిట్టలకు చాలా సన్నని, పొడుగైన, కొంచెంగా వంగిన ముక్కులుంటాయి. ఆ ముక్కులను అవి మకరందము కొరకు నాళాకారంగా ఉండే పుష్పముల మకుట దళావళిలోనికి దొన్పుతాయి. ఆ పక్షి యొక్క ముక్కు, మొత్తం మీద ఆ పక్షి ఆకారము, ప్రవర్తనము — ఈ లక్షణాలు ఒక పరిశీలకునకు దానిది ఏ కుటుంబమో నిర్ణయించడానికి చాలును. కాని సమానమైన ఆహారపుటలవాట్లకు సంబంధించిన పైపై పోలికలను చూచి మనం ఒక్కొకప్పుడు నిజంగా మోసపోవచ్చును. ఉదాహరణకు రామచిలుకలు, డేగలు — ఈ రెండింటికీ వంపు తిరిగిన ముక్కులుంటాయి. రామచిలుకలకా ముక్కులు పండ్లను కొరకడానికి, డేగల కా ముక్కులు మాంసం చీల్చడానికి పనికి వస్తాయి. కాని రామచిలుకలు, డేగలు పూర్తిగా రెండు విభిన్న కుటుంబాలకు చెందినవి. అంతేకాదు. అవి వేర్వేరు వర్గాలకు చెందిన పక్షులు. అదేవిధంగా క్రొత్త ప్రపంచంలోని తేనె పిట్టలూ, పాత ప్రపంచం

లోని తేనెపిట్టలూ వాటి బాహ్య రూపంలోనూ, ముక్కులను పుష్పాలలోనికి దూర్చే అలవాట్లలోనూ చాలావరకు ఒకే రకానికి చెందినట్లు కనపడినా అవి పూర్తిగా విభిన్నమైన కుటుంబాలకు చెందినవే.

ప్రతి కుటుంబాన్ని 'వంశములు' అను చిన్న గణాలుగా విభజించినారు. వంశము కుటుంబము కన్న చాల చిన్నది. దీనిలో మిక్కిలి దగ్గర సంబంధము గల జాతులను చేర్చినారు. సౌలభ్యత కొరకు సమాన లక్షణాలు గల చాలా జాతులను గుంపుగా చేర్చి ఈ వంశమును ప్రత్యేకంగా మానవుడు కల్పించినాడు. 'లిన్నియస్' వంశమునకు ఎక్కువగా ప్రాధాన్యత నిచ్చినాడు. ఇప్పుడు దాని ప్రాముఖ్యత కొంత వరకు తగ్గిపోయినది. జాతులను వంశాలలో చేర్చడం విషయంలో ప్రవీణుల మధ్య అభిప్రాయ భేదాలు ఎప్పుడూ ఉంటూనే ఉన్నాయి. ముందు కూడా ఉంటాయి. ప్రస్తుతం మనం వంశానికి ఎక్కువ ప్రాముఖ్యత నిస్తున్నాము. ఏలన ప్రతి జాతి శాస్త్రీయ నామంలోనూ మొదటి భాగంగా వంశం పేరు వస్తుంది. ఒకే వంశానికి చెందిన సభ్యుల కన్నింటికి సాముదాయకంగా ఒకే వంశ నామముంటుంది. కాకులలో విభిన్న జాతులు గలవు. అయినప్పటికీ వాటి కన్నింటికీ కొన్ని సాముదాయక లక్షణాలుంటాయి. కనుక వాటినన్నిటినీ 'కార్వస్' అను ఒకే వంశంలో చేర్చారు.

పక్షుల వర్గీకరణంలో తుదిఘట్టం వంశములను 'జాతులు'గా విడదీయుట. జాతియే ఆ జీవిని గురుతుపట్టగల ప్రకృతి ప్రమాణము. ఒక దానితో నొకటి కూడి గర్భము ధరించి ప్రత్యుత్పత్తిని చేయగల పక్షుల నన్నిటినీ ఒక జాతిలో చేరుస్తారు. జాతులుగా విడగొట్టడానికిదియే శోధన. స్వల్పమైన తేడాలున్నప్పటికీ ఎఱ్ఱని గుదము గల పిగిలి పిట్టలన్నీ ఒక జాతికి చెందుతాయి. ఎఱ్ఱని మీసాలు గల పిగిలి పిట్టలన్నీ మరియొక జాతికి చెందుతాయి. తెల్లని బుగ్గలు గల పిగిలి పిట్టలు మరో జాతికి చెందుతాయి. వాతావరణమును బట్టియు, పరిసరముల భౌగోళిక పరిస్థితులను బట్టియు ఒకే జాతికి చెందిన పక్షులలోనే ఈకల పరిమాణంలోనూ, వర్ణచ్ఛాయలోనూ తరుచుగా కొద్ది తేడాలుంటాయి. ఉత్తర దేశాలలో నివసించే పక్షులు దక్షిణ దేశంలో నివసించే వాటి ప్రతి రూపాలకన్నా సాధారణంగా పెద్దవిగా ఉంటాయి. ఒడి శీతోష్ణ స్థితులలో

నివసించే పక్షులకు, అదే జాతికి చెంది పొడి శీతోష్ణస్థితులలో నివసించే పక్షులకంటే దట్టమైన రంగులుంటాయి. అటువంటి తేడాలు ప్రస్ఫుటంగానూ, ఏక రీతిగాను ఉంటే వర్గీకరణ శాస్త్రవేత్తలు ఆ జాతిని యింకా ఉపజాతులుగా విభజించారు. వివిధ ఉపజాతులు ఒకదానితో నొకటి కూడి ప్రత్యుత్పత్తిని జేయగలవు కాపున ఆ ఉపజాతులన్నియు ఒకే జాతిలో ఉంటాయి. కనుకనే వర్గీకరణంలో జాతి ఎల్లప్పుడూ తుది ప్రమాణమై యున్నది.

అందుచేత ప్రతి పక్షినీ మొట్టమొదట దాని వర్గంలోనూ, తరువాత దాని కుటుంబంలోనూ, పిమ్మట దాని వంశంలోనూ చేర్చవచ్చును. తుదకు దానిని జాతిలోనూ, తరుచుగా భౌగోళిక ఉపజాతిలోనూ చేర్చి కచ్చితంగా దానిని వర్ణించవచ్చును. ప్రపంచంలో నేడు రమారమి 8650 జాతుల పక్షులున్నాయి. వాటిని 27 వర్గాలలో ఒక స్వాభావికమైన ఆరోహణ క్రమంలో అమర్చారు. ఈ క్రమంలో మొదటి మెట్టు మునుగు కోళ్లు కల వర్గము. ఈ వర్గంలోని పక్షులు అభివృద్ధి చెందిన పక్షులలో అధమస్థాయికి చెందినవని శాస్త్రజ్ఞుల నమ్మకము. ఈ క్రమంలో అన్నింటి కన్న పైమెట్టు పెస్సరీఫార్మిస్ (లేక కూర్చొనే పక్షుల) వర్గం. ఈ వర్గంలోని పక్షులు అభివృద్ధి చెందిన పక్షులలో ఉత్తమ స్థాయికి చెందినవని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. అయినప్పటికీ ఈ వర్గాలలోని అభివృద్ధి క్రమం విషయంలో శాస్త్రజ్ఞులకు అభిప్రాయ భేదాలున్నాయి. కొందరు శాస్త్రజ్ఞులు కాకులకు అగ్రస్థానం ఇస్తే మరి కొందరు తూటి పిట్టకు ఆ స్థానం ఇస్తున్నారు.

నేడు భారతదేశంలో 1200 జాతుల పక్షులున్నాయి. ఇవి 75 కుటుంబాలు, 20 వర్గాలుగాను ఉన్నాయి. ఇది చాల పెద్ద సంఖ్య. ఒక్క దేశంలో ఇంత ఎక్కువ సంఖ్య గల రకాలున్నాయంటే చాల గొప్ప విషయం. దీనికి కారణం మన దేశంలో నానా విధములైన శీతోష్ణ స్థితులుండటమే. చెమ్మగా ఉండే ఉష్ణప్రదేశముల నుండి హిమాలయ పర్వత శ్రేణుల కంటె అతి శీతల ప్రదేశములును, పొడిగాను, మిక్కిలి వేడిగాను ఉండే ఎడారి శీతోష్ణస్థితి గల రాజస్థానమును, చల్లని సమశీతోష్ణ స్థితి గల కొండ ప్రదేశములును మన భారతదేశంలో ఉన్నాయి. దట్టమైన అడవులు, చిట్టడవులు, గ్రామ సీమలూ, సేద్యపు భూములు, సముద్ర

తీరములు, నదీ గర్భములు, రాళ్ల గుట్టలు, ఎత్తైన పర్వతములు మన దేశంలో ఉన్నాయి. కనుక వందలకొలది జాతుల అభిరుచులకు తగిన నివాస స్థానములను ఆయా జాతులకు ఏర్పాటు చేయగలము. ప్రపంచంలో ఉన్న పక్షులలో చాల రకాలు మన భారతదేశంలో ఉన్నాయి. చాలా జాతులు సంవత్సరము పొడుగునా మన దేశంలోనే నివసించి ఉంటాయి. మరికొన్ని చలికాలం గడపడానికి మన దేశానికి ఇతర దేశాల నుండి వలస వస్తాయి. కొన్ని పక్షి వర్గాలూ కుటుంబాలూ కేవలం క్రొత్త ప్రపంచానికీ, ఆస్ట్రేలియాకీ చెందుతాయి. ఆ బాపతు పక్షులు మన తీరములందు అసలు కనపడవు. దక్షిణ ధ్రువపు శీతల సముద్రాలలో ఉండే పెంగ్వినుల వంటి పక్షులు కూడా మన దేశంలో లేవు.

# పక్షి శాస్త్రము — పక్షి పరిశీలనము

బ్రిటిషు వారి రాకకు పూర్వం భారతదేశంలో పక్షులను గూర్చిన అధ్యయనం లేదనియే చెప్పవచ్చును. 19 వ శతాబ్ద ప్రారంభంలో ఈస్టు ఇండియా కంపెనీలో పనిచేస్తున్న కొంతమంది సివిలు అధికారులూ, మిలిటరీ అధికారులూ కొన్ని సంవత్సరాలు పక్షులను సేకరించడం, వాటిని వర్గీకరించడం చెదురు మదురుగా చేసినా, సరిగా చెప్పుకోవాలంటే భారతీయ పక్షిశాస్త్రం 1862-66 లో టి. సి. జెర్డనుచే ప్రచురింపబడిన "ది బర్డ్సు అఫ్ ఇండియా" అనే పుస్తకంతోనే ప్రారంభమయింది. డాక్టరు జెర్డను మిలిటరీ సర్జనుగా ఉండేవారు. ఆయన ఈ దేశములో వేర్వేరు ప్రాంతాలలో అనేక సంవత్సరాలున్నారు. ఆయన పక్షులను సేకరించడం, వాటిని పరిశీలించడం చాలా ప్రయాసతో కావించారు. ఈ పుస్తకంలో స్వయంగా ఆయన సంగ్రహించిన విషయాలూ, అంతకు పూర్వం ఇతర పరిశీలకులు సంగ్రహించిన విషయాలు బాగా సమన్వయింపబడ్డాయి. ఈతనికి పూర్వులైన పరిశీలకులలో బ్రియాన్ హాగ్సను, ఎడ్వరు బ్లైతు అనువారు ముఖ్యులు, దీర్ఘకాల అనుభవం గలవారున్ను. బ్రియాన్ హాగ్సను నేపాలులో బ్రిటిష్ రెసిడెంటుగా ఉండేవారు. ఎడ్వర్డు బ్లైతు కలకత్తాలోని ఏసియాటిక్ సొసైటీ మ్యూజియము యొక్క క్యూరేటరుగా పనిచేయుటకై భారతదేశానికి వచ్చారు. డాక్టరు జెర్డనుకు పూర్వమైనా, అప్పటినుండి ఇప్పటివరకూ అయినా భారతదేశంలోని పక్షి శాస్త్రజ్ఞులు చేస్తున్న ముఖ్యమైన పని ఏమిటంటే వర్గీకరణం కొరకు పక్షులను వేటాడటం, వాటిని సేకరించడమూను. అందుకై వారు తరుచుగా స్థానికంగా ఉండే షికారీల యొక్కయు, పక్షులను పట్టుకొనే బోయవాళ్ల యొక్కయు సహాయం తీసుకొంటూండేవారు. ఆనాడు ఇది అవసరం కూడాను. ఎందుచేతనంటే అప్పుడు వాళ్లకు చాలా పక్షులు తెలియనే తెలియవు. వాటిని గూర్చి అధ్యయనం చెయ్యటానికి మ్యూజియంలో మాత్రమే అవకాశం ఉండేది. అచ్చట వాటిని వర్ణించి వాటికి నామకరణం చేసేవారు.

ఆ రోజులందు పక్షులను పరిశీలించాలనే అభిరుచి ప్రజలలో కలుగలేదు. మంచి దూరదర్శినులు లేకపోవుటచేతనూ, పక్షుల పటములతో సులభ గ్రాహ్యములైన పుస్తకాలు లేకపోవడంచేతనూ, పక్షి చేతిలో ఉంటేనే తప్ప దానిని గుర్తించడం కష్టమయ్యేది. అంతేకాదు. ఆ రోజులలో మ్యూజియములను నడిపే జంతుశాస్త్రజ్ఞులు, పక్షిపరిశీలనం పిల్లలు కాలాన్ని వృథా చేయడానికి చేసే పనుల వంటి పని అనీ, పనీపాటూ లేని ధన వంతులు కాలక్షేపానికి చేసే పని అనీ, వాస్తవానికి ఈ కార్యంలో శాస్త్ర ప్రాధాన్యత ఏమీ లేదనీ అనుకొని, దానిని తూష్ణీభావంతో చూచేవారు. ఈ విధంగా పక్షులను చంపి తీసికొనిరావడం, గ్రుడ్లను సేకరించడం అనేవి చాలాకాలం భారతదేశంలోని పక్షివైజ్ఞానికుల 'గౌరవ కార్యం'గా ఉండి పోయింది. జెర్డను వ్రాసిన 'ది బర్డ్సు ఆఫ్ ఇండియా' అనే పుస్తకంతో ఈ క్షేత్రంలో ఒక క్రొత్త విధానం ప్రారంభమయింది. ఈ పుస్తకంలో విభిన్న జాతులకు చెందిన పక్షుల బాహ్య నిర్మాణము, ఈకల అమరికను గూర్చిన వర్ణనతోపాటు వాటి సామాన్యమైన అలవాట్లను గూర్చి క్లుప్తమైన వివరణలు కూడ సామాన్య పాఠకునకు జిజ్ఞాస కలిగించేవి ఉన్నాయి. ఈ పుస్తకం ప్రచురితం కాగానే 'పక్షి ప్రేమికుల' యొక్క కార్యక్రమాలు ఒక్కసారిగా విస్తరింపబడ్డాయి; ఉత్సాహపూరితులైన ప్రకృతి శాస్త్రజ్ఞుల సంఖ్య బాగా పెరిగింది.

భారతీయ పక్షుల అధ్యయన కార్యక్రమాల వికాసంలో ప్రముఖ వ్యక్తి యైన ఏలన్ ఆక్టేవియన్ హ్యూము దొరగారి సహకారం మరి యొక మహత్తరమైన మెట్టు. ఏ. ఓ. హ్యూమ్ సివిల్ సర్వీసుకు చెందిన బ్రిటిష్ పౌరుడు. ఆయన ప్రముఖ పక్షి వైజ్ఞానికుడుగానే కాకుండా ఇండియన్ నేష నల్ కాంగ్రెసు సంస్థాపకులలో ఒకరుగా కూడ సంస్మరింప తగినవారు. హ్యూమ్ ఈ క్షేత్రంలో చాలా సంవత్సరాలు కృషి సాగించారు. ఆయన పరిశ్రమవల్ల నైతేనేమి, ప్రోత్సాహ ప్రభావములవల్ల నైతేనేమి దేశంలో విభిన్న ప్రాంతాలలో ఒక గొప్ప ప్రకృతి అధ్యేతల వర్గం ఏర్పడింది. పక్షుల చర్మాలను సేకరించడం, ప్రకృతిలో పక్షులను పరిశీలించి వాటిని గూర్చిన వివరాలను వైజ్ఞానిక పద్ధతులలో నోట్సు వ్రాసి జాగ్రత్త పెట్టడం మొదలైన అంశాలపై ఈ వర్గానికి హ్యూము పెక్కు సలహాలనిచ్చి ప్రోత్స హించారు. శాస్త్రజ్ఞులు తెచ్చిన నమూనాలను పరిశీలించి, గుర్తించి వివరణ

ములను వ్రాసి యిచ్చేవారు. ఇలా పరిశీలనములు జరిపేటప్పుడు పెక్కులు కొత్త జాతులను కూడ వర్ణించినారు; శాస్త్రజ్ఞులు సమర్పించిన నోట్సును సవరించి వాటిని 'స్ట్రే ఫెదర్సు' అనే భారతీయ పక్షిశాస్త్ర పత్రికలో ప్రకటించేవారు. 1872 - 1888 సంవత్సరముల మధ్య ప్రకటించిన పదకొండు 'స్ట్రే ఫెదర్సు' సంపుటములలోను అనేక మౌలిక శాస్త్ర విషయములు పొందుపరుపబడినవి. భారతీయ పక్షిశాస్త్ర విషయములను గూర్చి గంభీరముగా కృషిచేయదలచిన వారు ఈ పదకొండు సంపుటము లలో నున్న విషయములను అధ్యయనము చేసిననేగాని, ఒక్క అడుగైన ముందుకు వేయజాలరైరి.

1889 – 1898 సంవత్సరముల మధ్య ఇండియా ఆఫీసువారి ప్రోత్సాహ మున ఇ. డబ్ల్యు. ఓట్సు, డబ్ల్యు. టి. బ్లేనుఫర్డు రచించిన "ఫానా ఆఫ్ బ్రిటిష్ ఇండియా" అనే గ్రంథమాలలో పక్షులను గూర్చిన నాల్గు సంపుటములు వెలువడగానే భారతీయ పక్షులు, వాటి అలవాట్ల విషయమైన అభిరుచి సామాన్యులలో కూడా పెల్లుబికింది. ఈ ఇద్దరు గ్రంథకర్తలు ప్రవీణులైన పక్షిశాస్త్ర వేత్తలే కాని వారిలో మొదటివారు పబ్లికు వర్క్సు డిపార్టుమెంటు ఇంజనీరు, రెండవ వారు ప్రభుత్వ భూగర్భ శాస్త్రజ్ఞులు కావడంచేత వారు కేవలం వృత్తిచేగాక ఆసక్తి వలననే ఈ శాస్త్రంలో శ్రమించారని చెప్పాలి. హ్యూము, అతని శిష్యవర్గము సంగ్రహించిన సమాచారమంతయు ఈ సంపుటములలో పొందుపరుపబడింది. ఆనాడు అమలులో నున్న ఆధునిక భావములకు అనుగుణ్యముగా వర్గీకరణము, శాస్త్రీయ పారిభాషిక పదజాలము తీర్చిదిద్దబడింది. అంతేకాదు. వారి పరిశీలనా క్షేత్రంలోకి సింధు, కాశ్మీరం, అస్సామ్, బెంగాల్ (ఇప్పటి తూర్పు పాకిస్తాన్‌తో సహా), బర్మా, అండమాన్, నికోబారు, సిలోనులు కూడా చేర్చబడ్డాయి. హ్యూము కాలంలో ఈ ప్రదేశాలను పరిశోధించకుండా విడిచిపెట్టి వేశారు. పక్షిశాస్త్ర విద్యార్థులకు పరిచితమైన 'ది ఫానా' అనే గ్రంథముయొక్క పరిధిలోనికి ప్రథమ ముద్రణములోనే ఆనాటి బ్రిటిషు భారతీయ సామ్రాజ్యము నంతటిని తెచ్చినారు; ఈ విధముగా పక్షి శాస్త్రమును అధ్యయనము చేయుటకును, వివరముల నోట్సు వ్రాయుటకును, అభి ప్రాయ సేకరణము చేయుటకును సంబంధించిన క్షేత్రము విస్తృతము గావింపబడెను. ఈ విధంగా పక్షి ప్రేమికులు సర్వత్రా-అందు ముఖ్యంగా

తోటలోనూ, సివిలు, మిలిటరీ సర్వీసులలో పనిచేయుచున్న బ్రిటిషు వారలకు - ఈ గ్రంథములోని విషయములు మార్గదర్శకములగుటచే ఈ గ్రంథమును వారు సద్వినియోగము చేసికొన్నారు. దీని ఫలితముగ భారతదేశములో పక్షులను గూర్చిన అధ్యయనము తీవ్రతరమయింది. 'స్ట్రే ఫెదర్సు' యొక్క ప్రచురణ ముగిసిన తరువాత 'జర్నల్ అఫ్ ది బాంబే నేచురల్ హిస్టరీ సొసైటీ' క్రొత్తగా ప్రారంభింపబడింది. ఈ క్రొత్త పత్రికలో భారతీయ పక్షులను గూర్చిన వివరములు, ప్రాదేశిక వ్యాసములు విరివిగా ప్రచురింపబడినవి. అప్పటినుండి నేటి వరకూ ఈ పత్రిక (ఇప్పుడు 66 వ సంపుటము వెలుబడినది) వివిధ వృత్తులలో నున్న క్షేత్ర ప్రకృతి శాస్త్రజ్ఞులు భారతీయ పక్షులను గురించి వ్రాయుచున్న వివిధ వ్యాసములను అవిచ్ఛిన్నముగా ప్రకటించుచునే యున్నది.

ఈ విధముగా 1920 సం॥ చివరకు పక్షుల భౌగోళిక వ్యాప్తి, అలవాట్లను గురించిన జ్ఞానం అభివృద్ధి పొందుటచే, 'ఫానా' ను తిరిగి సవరించి వెలువరింప వలసిన ఆవశ్యకత ఎంతైన కానవచ్చినది. ప్రకృతి శాస్త్రమునందు విశేషాభిరుచిగలవాడు, ప్రవీణుడునగు ఇ. సి. స్టువర్టు బేకరు 1921–1930 సంవత్సరముల మధ్య పూర్వపు నాల్గు సంపుటముల "ఫానా" కు బదులుగా ఎనిమిది సంపుటముల "న్యూ ఫానా" ను రూపొందించినాడు. బేకరు భారతీయ పోలీసు అధికారి. ఆయన తన ఉద్యోగమును పురస్కరించుకొని అస్సాములో చాలాకాలం గడిపారు. అచ్చట ఆయన పక్షులను సేకరించి, వాటిని గూర్చి, అవి గూళ్లను కట్టే అలవాట్లను గురించి బాగా అధ్యయనం చేశారు. సంస్కరించిన "న్యూ ఫానా" లో నాటివరకు తెలిసినంతమట్టుకు భారతీయ పక్షులను గురించిన వర్గీకరణము, నామకరణము, సామాన్య సమాచారము సమీకరించుటయేగాక పాశ్చాత్య దేశములయందు పక్షి శాస్త్రములో జరిగిన ప్రగతి ననుసరించి శాస్త్రీయ పద్ధతిలో విషయము స్పష్టము చేయబడినది. అంతేకాదు; అందులో భారతీయ పక్షులను గూర్చిన మన జ్ఞానములోగల అవధులను వ్రేలెత్తి చూపి, ఏ దిశలో మన మెక్కువగా కృషిచేయవలసి యున్నదో సూచించుటయు జరిగినది. ఈ విధముగ ఈ సంపుటములలో సూచించిన సవాలును పక్షి పరిశీలకులు వెంటనే స్వీకరించి త్వరితముగ కృషిచేయుటయు జరిగినది.

'న్యూ ఫానా' ప్రచురింపబడిన తరువాత 35 సంవత్సరముల వ్యవ

ధిలో ఈ ఉపఖండమునందంతవరకి విషయములో కృషి జరుగని తావులందు పక్షులను సేకరించి, వాటిని గూర్చి పరిశీలనలు జరిపినారు. ఇందు ఎక్కువ కృషిని బ్రిటిషువారే చేశారు. ఈకాలములో ముఖ్యముగా స్వాతంత్ర్యం సిద్ధించిన 1947 సం॥ నుండి ఈవిషయంలో భారతీయ సహకారం కూడా మెండుగానే ఉంది. ఈ కాలంలో పనిచేసిన వారిలో హ్యూ విస్లరు, క్లాడు బి. టైస్‌హార్స్ట్ అనువారు ముఖ్యులు. స్టువర్టు బేకరు వలెనే, హ్యూ విస్లరు కూడా భారత పోలీసు ఆఫీసరు. టైస్‌హార్స్ట్ అన్ననో "రాయలు ఆర్మీ మెడికలు కోర్సు"కు చెందిన వైద్యుడు. మొదటి ప్రపంచ సంగ్రామ సమయములో ఆయన నేటి పశ్చిమ పాకిస్తాన్‌కు చెందిన విభిన్న భాగములలో పనిచేసినప్పుడు, ఆయనలో భారతీయ పక్షి శాస్త్ర అధ్యయ మునందు అభిరుచి ఏర్పడినది. ఈ ఇరువురు "న్యూ ఫానా" ప్రచురణకు పూర్వమునుండి, విశేషించి దానిని ప్రచురించిన తరువాత భారతీయ పక్షి శాస్త్ర క్షేత్రంలో మహత్తరమైన కృషి చేశారు.

ఇదివరలో పరిశోధనలు గావించని ఏవో కొన్ని విశిష్ట వర్గాలవి, కొన్ని దూర ప్రాంతాలవి తప్ప, పక్షుల చర్మాలను విశేషంగా సేకరించ వలసిన అవసరం ఇప్పుడు భారతదేశానికి లేదు. ఆ స్థితికి మన దేశం చేరుకుంది. ప్రపంచంలోని పెద్ద పెద్ద మ్యూజియములలో ఇప్పుడు వర్గీకర ణానికి సంబంధించిన అధ్యయనం చేయడానికి కావలసిన నమూనా లున్నాయి. పరిశోధనా కార్యక్రమాలకు వాటిని ఎరువు తెచ్చుకొని ఉప యోగించుకోవచ్చును. అయితే ఈ శాస్త్రాధ్యయనానికై నేడు మ్యూజియ ముల నుండి, పరిశోధనాగారాల నుండి పక్షులుండే ప్రత్యక్ష క్షేత్రాలకు మనం మరలడం ఎంతైనా అవసరం. మరోలా చెప్పాలంటే సజీవులైన పక్షులను, ప్రకృతి సిద్ధమైన వాటి నివాసాలలో పరిశీలించి, వాటి ఆవర ణకు సంబంధించిన విషయాలు, అలవాట్లు, ప్రవర్తనలను గురించిన కచ్చిత మైన సమాచారం సేకరించాలి. ఏ పక్షి ఎక్కడ, ఎలా జీవిస్తుందో దాని ఆవరణకు అది అనుగుణ్యంగా ఎలా మారుతుందో, తన జోడును అది ఎలా సంపాదించుకొంటుందో, ఎటువంటి గూడు అది కట్టుకొంటుందో, తన కుటుంబాన్ని ఎలా పోషించుకొంటుందో, దాని సంఘజీవనం, జనాభా మార్పు—ఈ విషయాలు ప్రత్యక్షంగా అవి నివసించే సహజమైన స్థలాల లోనే పరిశీలించి తెలిసికోవాలి. ఆర్థికదృష్ట్యా కూడా పక్షుల ఆహారం,

ఆహారపుటలవాట్లను గురించి పరిశోధించటం ఎంతైనా ముఖ్యం. ఈ పరిశోధనల ఆధారంగా ఆయా పక్షులు మానవునకు మిత్రులా, శత్రువులా అన్న విషయం మదింపుచేసి తేల్చవచ్చును. వ్యవసాయము, అడవులు, దట్టమైన జనాభాగల మనదేశంలాంటి దేశంలో, తరుచుగా ఆహారపదార్థాల కొరత ఎదుర్కోవలసి యుంటున్నపుడు ఈ విషయ సేకరణకు అవశ్యకత ఎంతైనా ఉంది. ఈ సమాచారమంతా మ్యూజియమ్లోని చర్మాల ద్వారా లభింపదుకదా!

విభిన్న జాతుల జీవచరిత్రలు, అవి మిగతా జీవులతో వ్యవహరించే పద్ధతి తెలిసికోవడం అతినెమ్మదిగా జరిగే పని. ఈ కృషికి ఓర్పు, పట్టుదల ఎంతైనా అవసరం. భారతదేశంలో ఇంతవరకు స్వల్ప సంఖ్యలో మాత్రమే పక్షిజాతుల జీవచరిత్రలను తెలిసికొన్నారు. అదికూడా అంతంత మాత్రమే. ఇప్పటికినీ చాలా పక్షుల అలవాట్లు, ప్రవర్తనలను గురించి మనకున్నది సామాన్య జ్ఞానమే. అదికూడా చెదురు మదురుగానే ఉన్నది. ఆసక్తిగల పక్షి పరిశీలకులు ఇచ్చే యుక్తమైన, నమ్మదగిన సమాచారము అప్పుడప్పుడు ఒక జాతి జీవచరిత్రను పూర్తిగ అవగాహనం చేసికోవటానికి ఎంతైన ఉపయోగపడవచ్చును.

స్థానికంగా తరుచు కనపడే పక్షులను బాగా గుర్తించగలగడం పక్షి పరిశీలనలో మొదటి మెట్టు. ఈ పని చేయగలిగితే తప్ప ఎవరికైనా పక్షి శాస్త్రంలో ముందంజ వెయ్యడం అసాధ్యమే అవుతుంది. ఓనమాలు నేర్చుకోకుండా పుస్తకాన్ని చదవడం ఎంత అసాధ్యమో పక్షులను గుర్తింపలేని వాడు పక్షి శాస్త్రంలో ముందుకు వెళ్ళడం కూడా అంతే. పక్షి పరిశీలనకు సంబంధించిన ప్రాథమిక విజ్ఞానాన్ని సంపాదించడానికి మూడు పరికరాలు దగ్గర ఉండటం అవసరం: ఒక జత బైనాక్యులర్సు, ఒక నోటుబుక్కు పెన్సిలు, పక్షులను గుర్తించడానికి పనికివచ్చే రిఫెరెన్సు బుక్కు.

పక్షులను పరిశీలించడానికి 8×30 లేక 7×50 సైజు బైనాక్యులర్సు సరిపోతాయి. అవి మోయడానికి వీలులేనంత స్థూలంగా ఉండకూడదు. అంతేకాదు. అది తగినంత అధికీకరణ శక్తి కలదై ఉండాలి; దగ్గర నుండే ఫోకసు చేయడానికి వీలయినదిగా ఉండాలి. ఉత్కంఠ కలిగిన పక్షి పరిశీలకుడు ప్రారంభదశలో స్థానికంగా బయట తాను చూచిన

పక్షులను పుస్తకాల సహాయంతో గుర్తించటం అలవరచుకోవాలి. ఈ పనికి ఈ పుస్తకం కొంతవరకు ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాం. విస్లరు రచించిన "పాప్యులరు హేండు బుక్ ఆఫ్ ఇన్డియన్ బర్డ్సు", సాలీమ్ ఆలీ రచించిన "ది బుక్ ఆఫ్ ఇండియన్ బర్డ్సు" మిక్కిలి ఉపయోగకరమైన మరో రెండు పుస్తకాలు. పైన చెప్పిన రెండవ పుస్తకంలో పక్షుల పరిమాణము, ముఖ్యమైన రంగులు, పొడుగైన ముక్కులు, కాళ్లు మొదలుగా గల ప్రధాన లక్షణాలను సూచించే పట్టికలున్నాయి. వాటితో పాటు ఆ పుస్తకంలో పక్షి జాతుల వర్ణ చిత్రాలు కూడా ఉన్నాయి. ఈ చిత్రాల సహాయంతో పక్షులను గుర్తించడం సులభమవుతుంది.

పక్షులను గుర్తుపట్టడానికి ముఖ్యంగా తాను చూచినదేమిటో నిర్ధారణ చేసికోవడం ఎంతైనా అవసరం. మాట వరుసకు ఒకరు నలుపు – తెలుపు గల పక్షిని చూచారనుకొందాం. వారు దృఢపరచుకోవలసిన విషయం ఏమిటంటే — ఆ పక్షి శరీరంలో ఏ భాగాలు తెలుపు — అనగా తెల్లదనం తల మీదనా, తోకలోనా — లేక క్రింది భాగాల్లోనా అని. ఆ పక్షిని గురించి ఒకటో, రెండో ఇతర లక్షణాలను పరిశీలించడం కూడా ఎంతైనా అవసరం — ముక్కు యొక్క రూపము, రంగు, కాళ్లు, తోక యొక్క పరిమాణము, రంగు, శిఖ వంటి మరేదైనా ప్రత్యేక లక్షణం ఉంటే అదికూడా తెలిసికోవాలి. కేవలం మొదటిసారి ఎవరైనా ఒక పక్షిని చూచినపుడు ఈ విషయాలన్నీ పరిశీలించడం సాధ్యంకాదు. ఎందుచేతనంటే తరుచుగా పక్షి ఆకుల మధ్య ఎగురుతున్నప్పుడు దానిని ఒక్క క్షణం మాత్రమే చూడగలుగుతాం. అందుచేత ఒకటి రెండు విషయాలను మాత్రమే జ్ఞాపకముంచుకొనడం మంచిది. చాలా విషయాలను ఒక్కసారి తెలిసికోవాలని ప్రయత్నించ కూడదు. పరిశీలకుడు ఒక పక్షి మైనగోరంత ఉందనీ, దాని కాళ్లు ఎట్లా ఉన్నాయనీ తెలిసికొంటే చాలు. అతనికి ఆ పక్షిని గుర్తించడం కొంత వరకు సులభమవుతుంది. కాని అది గోధుమ – ఎరుపు రంగుల పక్షి అని అక్కడక్కడ నలుపు, బూడిద రంగులు ఉన్నాయని అనుకొంటే దానిని గుర్తించడం కష్టమే అవుతుంది. గుర్తించడం కష్టసాధ్యం అనడానికి మరో విషయం కూడా ఉంది. వాస్తవానికి మన జ్ఞాపకశక్తి మీద మనం పూర్తిగా ఆధారపడలేము. మనం చూచిన పక్షి రంగు, దానిని గూర్చిన ఇతర

విషయాలూ ఒకటి రెండు గంటలలో మరిచిపోవడం అసంభవమేమీ కాదు. కనుకనే మనము చూచిన విషయాలను వెంటనే నోటు చేసికోవడానికి వీలుగా ఒక నోటు బుక్కు, పెన్సిలు విధాయకంగా మన దగ్గర ఎప్పుడూ ఉంచుకోవాలి.

పక్షి స్థిరంగా ఒక చోట నిలిచి ఉన్నప్పుడు దానిని చాలాసేపు పరిశీలించడానికి అవకాశం దొరికితే, దానిని గూర్చిన అన్ని విషయాలూ అప్పుడే నోటు చేసికోవాలి. మనకు బాగా పరిచయమైన పక్షితో దానిని సరిపోల్చుతో దాని పరిమాణము, సామాన్యమైన రంగు, ప్రత్యేకమైన గుర్తులేమైన ఉంటే దేహం మీద అవి ఉన్న చోట్లు, ముక్కు, కాళ్లు, రెక్కలు, తోక, మెడ, వీలైతే వాటి కళ్లు మొదలైన వాటి పరిమాణము, ఆకారము, రంగు నోటు చేసికోవాలి. అక్కడికక్కడ ఆ పక్షి చూచాయ పటము చిత్తుగానైనా సరే వ్రాసికొంటే అది సాధారణంగా ఉపయోగ పడుతుంది. ఆ పక్షిని ఎక్కడ చూచామో— నేల మీదా, ఆకుల మధ్యా, చెట్టు మోడు మీదనా, నీటి మీదనా అన్న విషయం వ్రాసికొనడం చాలా ముఖ్యం. అప్పుడది ఏం చేస్తోందో కూడ వ్రాసికోవాలి. కొన్ని పక్షులకు గెంతడంలోనూ, ఎగరడంలోనూ, నిర్దిష్టమైన లేదా విలక్షణమైన పద్ధతు లుంటాయి. ఆ చలనములను బట్టి కూడా పక్షులను గుర్తించడం సులభ మవుతుంది. కనుక వాటిని తప్పకుండా వ్రాసికోవాలి. పక్షుల కూత లేక పాట వాటిని గుర్తుపట్టడానికి ఉపయోగపడే మరో చిహ్నం. కాని తరుచుగా ఈ కూతను గాని, పాటను గాని మాటల ద్వారా వర్ణించడం కష్టమే. కాని అది ఎటువంటి ధ్వని చేస్తుందో — ఉదాహరణకు ఒకే ఒక స్వరం, ఈల, అది ఎగిరేటప్పుడు చేసే కటుక్కు లేక కిచకిచ మనే ధ్వనీ—ఇటువంటివి ఆ పక్షిని గుర్తుపట్టడానికి బాగా సహాయపడతాయి. ఆ పక్షిని చూచిన తేదీ, అది నివసించే స్థలం వాస్తవానికి చాలా అవసరం. కొన్ని తేదీల వల్ల పక్షులు వలసపోయేవని నిర్ధారణ చేయవచ్చును. గ్రుడ్లు పెట్టే కాలంలో అవి ఎటువంటి ఈకలు ధరిస్తాయో వివరాలు తెలిసికో వచ్చును. వాటి నివాసస్థలాలను గూర్చిన వివరాలు ఒక పక్షిని మరో పక్షి అని పొరపాటు పడకుండా మనకు తోడ్పడతాయి.

పుస్తకాలలోను, చిత్తరువులలోను పక్షి యొక్క రంగులను గూర్చిన వివరములున్నప్పటికీ, పక్షి పరిశీలనం క్రొత్తగా ప్రారంభించిన వారికి

మొదటిసారే అన్ని రంగులనూ, చిహ్నాలనూ చూడ గలగడం సాధ్యపడదని త్వరలోనే తెలిసికొంటారు. ఆకాశంలో ఎగిరే పక్షుల యొక్కయు, ఆకుల వెలుగునీడలలో చెట్లపైకి చేరే పక్షుల యొక్కయు రంగులు మొదటిసారిగా పోల్చుకోవడం మరీ కష్టం. సూర్యరశ్మిలోనున్న పక్షులను చూచునపుడు కూడా రంగులను గుర్తించడంలో దగా పడిపోతాము. ఎందుచేతనంటే ముఖ్యంగా వట్టి కంటితో చూసేటప్పుడు ఒకానొక కోణంలోంచి చూచిన రంగులు అసలు రంగులకు విరుద్ధంగా కనపడతాయి. కనుక పక్షిని గుర్తించడానికి కేవలం దాని రంగు మీదనే ఆధార పడకూడదు; ముక్కు, కాళ్ళు, శిఖ, తోక — ఇలాంటి వాటికి సంబంధించిన కనీసం మరొక లక్షణాన్నైనా నోటు చేసికోవాలి. అభ్యాసంతో కొంత కాలానికి అంతకు పూర్వం తెలియని పక్షులను కూడా వాటి కుటుంబాలలో చేర్చడం తరచుగా సాధ్యమవుతుంది — మానవులలోలాగే పక్షులలో కూడా కుటుంబపు పోలికలు, కుటుంబపు టలవాట్లు వ్యక్తమౌతుంటాయి. కనుక ఒక పక్షి ఏ జాతికి చెందిందో ఖచ్చితంగా నిర్ణయించలేకపోయినా అది ఏ కుటుంబానికి చెందిందో సులభంగా చెప్పవచ్చును. మెడను వెనుకకు ముడుచుకొని ఎగరడాన్ని బట్టి కొంగల కుటుంబాన్ని, ముక్కు స్వరూపాన్ని బట్టి లకుముకి పిట్టల కుటుంబాన్ని, తల, ముక్కు లక్షణాలను బట్టి డేగల కుటుంబాన్ని సులభంగా చెప్పవచ్చును. అభ్యాసం వలన క్రమేపీ జాతులను గుర్తు పట్టడానికి ఎక్కువగా ఉపయోగపడే చిహ్నం 'చలనం'. దగ్గర సంబంధం గల కొన్ని 'చలనాలు' ఒకే మాదిరిగా ఉంటాయి. ఉదాహరణకు అన్ని పిగిలి పిట్టలూ, ఎగిరే చిన్న కీటకాల మీదకు, అకస్మాత్తుగా ఒకే మాదిరిగ ఎగిసి పడతాయి. తోక పిగిలి పిట్ట ఒక పద్ధతిలో ఎగురుతుంది కాబట్టి దానిని స్పష్టంగా చూడకపోయినా గుర్తు పట్టగలం. అలాగే కూజు పిట్టను అది సూటిగా ఎగరకుండా పైకి క్రిందికి ఎగరడాన్ని బట్టి పోల్చుకోవచ్చును. అనుభవజ్ఞుడైన పక్షి పరిశీలకుడు 'బొంబే నేచురల్ హిస్టరీ సొసైటీ'లో గాని కలకత్తా 'జూలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా' లో గాని ఉన్న నమూనాల సహాయంతో అరుదైన లేక దేశద్రిమ్మరులైన పక్షిజాతులను సాధారణంగా గుర్తు పట్టగలడు.

సులువుగా పరిశీలించడానికి కనువైన చోట మనకొక గూడు కనబడితే

అది నిజంగా అదృష్టమనే చెప్పాలి. ఆ పక్షియొక్క వివరాలను సేకరించ డానికా గూడు అద్భుతమైన అవకాశాన్ని కలుగచేస్తుంది. మనమా గూటిని పరిశీలించేటప్పుడు కాకుల్లాంటి బందిపోటు పక్షులకా గూటి యునికి తెలిసి పోకుండా అతి జాగరూకతతో పరిశీలించాలి. అంతేకాదు. గూటిలోని గ్రుడ్లనుగాని, పిల్లలనుగాని పట్టుకొని చూడాలనే ఉబలాటాన్ని అరికట్టు కోవాలి. మనుష్యుడు తాకిన పిల్లలకు వాటి పితలు ఆహారం పెట్టవంటారు. కాని అది వాస్తవం కాదు. పక్షుల చిన్న పిల్లలు అతిసుకుమారంగా ఉంటాయి. కనుక వాటిని తాకడం, భయపెట్టడం కూడని పని. పక్షిని చేత పట్టడం తప్పనిసరియైనపుడు – మాట వరుసకు దెబ్బ తగిలిన పక్షి అందాం – దానిని పట్టుకోవలసిన రీతిలో పట్టుకోవాలి; అరచేతిలో దాని రెక్కలను ప్రక్కలకు నొక్కి దాని మెడ కిరుప్రక్కలా చూపుడు వ్రేలు, మధ్య వ్రేలు ఉంచి దానికి బాధ కలుగకుండా గట్టిగా పట్టుకోవాలి. కొన్ని చిన్న పక్షులు మిక్కిలి బలహీనంగా ఉంటాయి; దాని రొమ్ము మీద ఏమాత్రం ఒత్తిడినిచ్చినా అది దానికి ప్రాణాంతకం కావచ్చును. పక్షిని పరిశీలించేటప్పుడు అరచేతిలో దానిని వెల్లకిల పడుకోబెట్టి పరీక్షించడం మంచి పద్ధతి. ఎందుచేతనంటే అది వెల్లకిల ఉన్నంతసేపు కదలకుండా శాంతంగా వుంటుంది. దానిని విడిచి పెట్టేటప్పుడు దాని కాళ్లు క్రిందికి వచ్చేలాగున మన పిడికిలిని సుంద్రంగా త్రిప్పి మరీ వదలి పెట్టాలి.

పక్షి పరిశీలకులలో ప్రతివాడు పక్షులను గూర్చి అద్భుతమైన క్రొత్త విషయాలు కనిపెట్టడం అసంభవమే. అయితే చాలకాలం పక్షులను జాగ్రత్తగ పరిశీలిస్తూ అధ్యయనం చేయడం వలన వాటితో మనకొక సన్నిహితత్వం ఏర్పడి, ఆనందానుభూతి కలుగుతుంది. అంతేకాదు, ఎటు వంటి పరిస్థితులలోనైనా జీవితాంతం వరకు అభ్యసించడాని కనువైన అభి మాన విషయం పక్షి పరిశీలనము.

# ప్రత్యుత్పత్తి

పక్షుల కన్నిటికి తమ కుటుంబాన్ని పోషించి పెంచడం అనేది ప్రతి సంవత్సరము మిక్కిలి వ్యాకులపాటుతో కూడిన పని. ఏంచేతంటే ఈ పనిలో అనేక గండాలు, అపాయాలు ఎదుర్కోవలసి ఉంటుంది. గూళ్లను కట్టడానికి పూర్వం దీర్ఘమైన వలస ప్రయాణం చేయవలసి ఉంటే ఈ ఆపదలూ, గండాలూ మరీ హెచ్చుగా ఉంటాయి. గూళ్లుకట్టే పక్షి కుటుంబము ఎక్కువగా ప్రమాదానికి గురి అవుతుంది. దాని పరిసరాల నుండి దానికి అనేక విధములైన రక్షణ, సహాయం కావలసి ఉంటుంది. శత్రువుల బారి పడకుండా గూటిని దాచడానికి పక్షులకు రహస్యమైన స్థలం కావాలి; గూడు కట్టుకోవడానికి తగిన వస్తుసంపత్తి కావాలి; ప్రథమంలో వాటి గ్రుడ్లకు పిదప వాటి పిల్లలకు రక్షకమైన వెచ్చని వాతావరణం కావాలి; వాటి పిల్లలకు సమీపంలో సమృద్ధిగా ఆహారం లభించాలి. అంతేకాదు, ఆ ఆహారం వెదకి తెచ్చుకోడానికి దీర్ఘమైన పగటి వేళలు కూడా ఉండాలి. అన్నిటిలోకి ప్రధానమైన అంశం ఆహారపు సరఫరా. మిగతా విషయాలలో అనుకూలంగా ఉన్నా లేకపోయినా బాగా ఆహారం దొరికే ఋతువులోనే పక్షులు గూళ్లు కడతాయి. బొంబాయి పరిసరాల్లో చిన్న పక్షులు వర్షాకాలంలో గూళ్లు కట్టడం చూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. కుంభ వృష్టిగా వర్షం కురుస్తూ, పెనుగాలులు నిరంతరంగా వీచే కాలాన్ని అవి గూళ్లు కట్టుకోవడానికి ఎన్నుకోవడం చాలా ఆశ్చర్యంగా లేదూ! అయితే ఆ సమయంలో పక్షులు తినడానికి సిద్ధంగా కీటకాలూ, క్రిములూ పైకి వస్తాయి. వాటి గూళ్లు కొట్టుకొని పోవడంకన్నా, ఆహారం లభించడమనేదే వాటికి ప్రధానమైన విషయం. శీతల దేశాల్లో ఉండే పక్షులు చాలావరకు సహజంగా అనుకూల పరిస్థితులు గల వసంత ఋతువులోనూ, గ్రీష్మ ఋతువులోనూ గూళ్లుకట్టి గ్రుడ్లు పెడతాయి. ఇక్కడకూడా వేర్వేరు జాతులకు చెందిన పక్షులు వాటి కిష్టమైన ఆకు పురుగులూ, క్రిములూ విశేషంగా లభించే సమయాన్ని అనుసరించి కొద్ది పాటి తేడాలతో వేర్వేరు ఋతువులలో గూళ్లు కడతాయి.

ప్రతి జాతి పక్షులూ వాటికి కావలసినంత ఆహారం లభించే ఋతువులో

చుట్టు ప్రక్కల ప్రమాద పరిస్థితులంతగా లేనప్పుడు గ్రుడ్లను పెడతాయి. గ్రుడ్లను పెట్టడానికి కావలసిన శారీరక మార్పులు కూడా వాటికి సరియైన ఋతువులందే వస్తాయనిపిస్తుంది. వాతావరణ పరిస్థితులు వాటికి ప్రీతి కరంగా లేకపోతే చాలా పక్షులు గ్రుడ్లను పెట్టనే పెట్టవు. వర్షకాలం పిదప 'రాన్ అఫ్ కచ్' లో గ్రుడ్లను పెట్టే రాజహంస తగిన పరిస్థితులు వచ్చేవరకు ప్రత్యేకంగా వేచి ఉంటుంది. వర్షపాతం మరీ హెచ్చుగా వున్నా, మరీ తక్కువగా వున్నా ఆ సంవత్సరంలో అది గూళ్లను కట్టనే కట్టదు.

గ్రుడ్లు పెట్టే ఋతువు సమీపించిన వేళకి మగ పక్షులకు జతకట్టే సమయాన వచ్చే ప్రత్యేకమైన ఈకలు కూడా వస్తాయి. ఈ సందర్భంలో క్రొత్త ఈకలు అందమైనవి రావచ్చును లేదా శాంతి కొంగకు తలమీదా, మెడ మీదా నారింజ ఛాయ వచ్చినట్లు అదనంగా ఒక రంగు మచ్చ రావచ్చును; లేదా ఉన్న ఈకలకే క్రొత్తదనం వచ్చి, ఆ పక్షి అలంకరించుకొన్నదా అన్నట్లు పూర్వంకన్నా అందంగా కనబడవచ్చును. అదే సమయాన మగ పక్షులలో చాలా జాతులకు ఒక పాటకూడా అలవడుతుంది; లేదా అవి అనుదినం కూసే కూతలు కాక మరికొన్ని అదనపు స్వరాలనైనా కూర్చుకొంటాయి. పాట, పిలుపు కూతలు ఒకటే అని భ్రమ పడకూడదు. సంవత్సరంలో మిగతా సమయాల్లో పక్షులు ఒకదానిని వదలి మరియొకటి దూరంగా పోయి తప్పి పోకుండా, వాటి ఉనికిని ఒకదాని కొకటి తెలుపుదు చేసికొనడానికి పనికి వచ్చేవి పిలుపు కూతలు. ప్రత్యుత్పత్తి సమయంలో గ్రుడ్లను పెట్టే కార్యక్రమానికి ఉపయోగపడే నిర్దిష్టమైన సాధనం ఈ ప్రత్యేకమైన పాట. పక్షులకు అలవడే ఈ శ్రావ్యమైన పాటలు – వాటికి ఒక గంభీరమైన కార్యానికి ఉపయోగిస్తాయని తెలియుచున్నది. అవి గ్రుడ్లు పెట్టే స్థలంపైన వాటికున్న అధికారాన్ని ప్రకటించడానికి, తమ పోటీదారులను ఆ స్థలంనుండి దూరంగా వైతొలగ వలసినదని హెచ్చరించడానికాపాటను వినియోగిస్తాయి. మగపక్షి పాట ప్రత్యేకం పెట్టను ఆకర్షించడానికే అని ఒకప్పుడు అనుకొనేవారు. ఆడపక్షిని ఆకర్షించడంలో మగపక్షి పాటకేమైనా పాత్ర ఉందో లేదో తెలియదు. కాని అక్కడ పెంటిలేని పుంజొకటి ఉందనీ, అది ఆప్రాంతాన్ని తన అధీనంలోకి తెచ్చుకొన్నదనీ, గూడుకట్టడం ప్రారంభించడానికి దానికి తగిన పెంటి

కోసరం నిరీక్షిస్తున్నదనీ ప్రకటించడానికి ఆ పాట నిజంగా ఉపయోగ పడుతుంది. ఒక నిర్ణీతమైన వైశాల్యంగల స్థలంలో ఆహారం పరిమితంగా మాత్రమే ఉంటుంది కనుక పాడే చిన్న పక్షులు ఆ స్థలంలో ఒక కుటుంబానికంటే ఎక్కువ కుటుంబాలకు పోషణ జరుగదన్న విషయం తెలిసికొంటాయి. అందుచేత మగపక్షులు ఒకానొక క్షేత్రాన్ని ఎంచుకొని, ఇతర మగపక్షులు ఆ క్షేత్రంలోకి జొరబడితే వాటితో యుద్ధంచేసి పంపివేస్తాయి. పక్షుల పాట వాటి ఆయుధాగారంలో ఉన్న శక్తివంతమైన ఆయుధం అని చెప్పాలి. ఏపాట పాడలేని పక్షులకుకూడా ప్రత్యుత్పత్తి కాలంలో అదనంగా ఏదో విధమైన గోలచేసే శక్తి వస్తుంది; ఉదాహరణకు కొంగలకు స్వర కండరాలు లేకపోయినప్పటికీ, వాటి దవుడలతో చట చటమని చప్పుడు చేస్తాయి.

పక్షులలో చాలా జాతుల్లో మగపక్షి ఆడుపక్షి హృదయాన్ని వశపరచు కోవడానికి ఉపసర్పణంలో ఏదో విధమైన ఆడంబరం ప్రదర్శిస్తుంది. ఈ విషయంలో నెమలి నృత్యం చాలా ప్రఖ్యాతి చెందింది. పక్షైనా సరే మనిషైనాసరే తనని చూసేవారి నెవరినైనా ఆకర్షించడాని కది నృత్యం చేస్తుంది. ఎవరూ దానిని చూడనప్పుడు కూడా అది అలా నృత్యం చేస్తూనే ఉంటుంది. తనవైపు చూస్తున్న ఆడుపక్షి ముందు పాలపిట్ట నైపుణ్యంతో అనేక విధాలుగా గాలిలో మొగ్గలు వేస్తుంది. రామచిలుకలైతే మొదట ఒక కాలిమీద పిమ్మట మరో కాలిమీద నిలబడుతూ నవ్వు పుట్టించేటట్లుగా అనేక విన్యాసాలను ప్రదర్శిస్తాయి. కొన్ని మగ పక్షులు వాటి ప్రత్యేకమైన నిగ నిగలాడే ఈకలను ఆడుపక్షులకు ఆడంబరంగా ప్రదర్శిస్తూ గర్వంగా నడుస్తాయి. కొన్ని పక్షులు ప్రశాంతంగా వివేకమైన పద్ధతిలో ఉపసర్పణ జరుపుతాయి. గిజిగాళ్ళ వంటి కొన్ని పక్షులలో గూటిని నిర్మించడమే ఒక రకమైన ఉపసర్పణ మవుతుంది. ఏ గూడు ఆడుపక్షి మనసును ఆకర్షిస్తుందో ఆ గూటిని కట్టిన మగపక్షి నది భర్తగా ఎన్నుకొంటుంది. చాల జాతులలో ఒక క్రిమినో, మరేదైనా మంచి రుచిగల వస్తువునో కానుకగా ఇవ్వడం ఉపసర్పణంలో ఒక భాగమవుతుంది; ఆడుపక్షి తరుచుగా మగపక్షి ఉత్కంఠతను సద్వినియోగం చేసికొని కమ్మని పదార్థాలను ఇమ్మని ఆ మగ పక్షిని కోరుకొంటుంది.

తరువాత దశ గూడు నిర్మించడం. ఈ పనిని కొన్ని జాతుల్లో జతకట్టిన ఆడుది, మగది కలిసిచేస్తాయి. కొన్ని జాతుల్లో కేవలం మగపక్షి కాని ఆడుపక్షి కాని నిర్మిస్తుంది. సాధారణంగా పక్షులు ఏ ఆవరణలో ఉండటానికి అలవాటు పడతాయో ఆ ఆవరణలోనే గూళ్లనుకూడ నిర్మించు కొంటాయి. మిక్కిలి ఎత్తైన ప్రదేశాలలో జీవించడాని కలవాటు పడ్డ గ్రద్ద ఎత్తైన కొండ శిఖరాలమీద, రాతి బండలమీద గూటిని నిర్మించు కొంటుంది. చెట్లమీద నివసించే పక్షులు చెట్ల ఆకుల మధ్య గూళ్లను నిర్మించుకొంటాయి. ఎక్కువగా భూమి మీద కాలక్షేపం చేసే కౌజులు, ఎలిసెలవంటి పక్షులు నేలమీదనే గ్రుడ్లు పెడతాయి; నీటిమీద నివసించే నీటికాకులు, నారాయణ పక్షులు నీటికి సమీపంలోనే తమ గూళ్లను నిర్మించుకొంటాయి. సాధారణంగా పక్షులు ఈ పద్ధతినే గూళ్లు కట్టు కొంటాయి.

కాని ఈ సూత్రం సర్వత్రా వర్తించదు; గూళ్ల నిర్మాణ వైఖరిలో ఈ సూత్రాన్ని అనుసరించనివి కూడా ఎన్నో ఉన్నాయి. చిన్న పసిరిక పిట్టలు, పొట్టిబాతులు అలాంటి పక్షులు. పసిరిక పిటలు చెట్లమీదనే కాని ఏపరిస్థితులలోనూ నేలమీద ఉండవు. అయినా అవి మట్టిగట్లలో అడ్డంగా సొరంగాలు నిర్మిస్తాయి. చెక్కలు పొట్టిబాతులు చెట్లలో గూళ్లను కట్టు కొంటాయి.

గూళ్ల ఆకృతి, నిర్మాణంలో కూడా చాలా వైవిధ్యం ఉంటుంది. నేలమీద ఉండే కొన్ని పక్షులు నేలమీద మట్టిని ఒక ప్రక్కకు గోకి నిరాడంబరంగా ఒక పల్లం చేస్తాయి. ఆ పల్లంలో అవి గ్రుడ్లు పెడతాయి; గిజిగాళ్లు ఎంతో శ్రమపడి గూళ్లు అల్లుతాయి. ఆ గూటిలో గ్రుడ్లు పెట్టడాని కొక గది ఉంటుంది. ఆ గూటిని చూస్తే నిపుణుడైన మేదరి ఎవరైనా దానిని తయారు చేశాడా అనిపిస్తుంది. కొన్ని పక్షులు క్రుళ్లిన వృక్షశాఖలోనో, గోడలో ఉన్న కన్నంలోనో గ్రుడ్లు పెడతాయి. ఆ కన్నాలలో మెత్తదనం కోసరం మెత్తని పదార్థాలుంచుతాయి; కొన్ని సొరంగాలు త్రవ్వుతాయి; మరికొన్ని వృక్షశాఖలలో పచ్చగడ్డితో గిన్నెలవంటి గూళ్లను నిర్మిస్తాయి. బకానాలవంటి కొన్ని నీటిపక్షులు, నీటిమొక్కల తేలే ఆకులమీద ఇరుకైన గూటిని కడతాయి. కొన్ని పక్షులు అవి కట్టిన గూళ్ల సమీపంలో అదే జాతికి చెందిన మరే పక్షులూ గూళ్లు కట్టకుండా జాగ్రత్త పడతాయి. అలా ఉండగా




పటము 1

**చిన్న మునుగుకోడి**

(*Podiceps ruficollis*)



పటము 2

**మచ్చలముక్కు గూడకొంగ**

(*Pelecanus philippensis*)

పే. 31

పటము 3

కలికి పిట్ట

(*Anhinga rufa*)

పుట 32





పటము 4
చిన్న నీటి కాకి
(*Phalacrocorax niger*)
పేజీ 33




పటము 5

**నారాయణ పక్షి**

(*Ardea cinerea*)

పేజి 35



పటము 6

చిన్న తెల్లకొంగ

(*Egretta garzetta*)

పేజి 36

పటము 7

శాంటి కొంగ

(*Bubulcus ibis*)

పుట 37





పటము 8

గ్రుడ్డి కొక్కెరాయి

(*Ardeola grayii*)

పేజి 38

మరికొన్ని జాతులు పెద్ద పెద్ద గుంపులుగా చేరి గూళ్లను నిర్మించుకొంటాయి. పక్షులు మందలుగా కలిసి గూళ్లను ఒకేచోట నిర్మించుకొంటే ఎక్కువ రక్షణ కలగడం నిజమే కాని, ఆశ్చర్యమేమిటంటే కొంగలు, నారాయణపక్షుల వంటి పెద్దవి, బలమైనవి, నష్టము కలగడానికవకాశము తక్కువగా నున్న పక్షులే మందలు మందలుగా ఒకేచోట గూళ్లు కట్టుకొంటాయి; చిన్నవి, సాధువైనవి అయిన దర్జీపక్షులు, కూజుపిట్టలు, నల్లంచిగాళ్లు ఒంటరిగా శత్రువులకు కనబడకుండా మాటున గూళ్లు నిర్మించుకొంటాయి. చిన్న పక్షులు మేతను వెతకడానికి చాలా దూరం వెళ్లలేకపోవడం, చుట్టుప్రక్కల ఇతర పక్షులతో ఆహారానికి పెనుగులాట ఉండదన్న నమ్మకం, బహుశా దీనికి కారణాలు అయియుండ వచ్చును. పెద్ద పక్షులు చాలా దూరంపోయి ఆహారం వెతుక్కోగలవు. అందుచేత చుట్టుపట్ల మేతకోసరం పెనుగులాడే పక్షులు ఉన్నాయా లేదా అనే విషయాన్ని అవి పట్టించుకోనక్కరలేదు.

గ్రుడ్లు పొదగడం, పిల్లలకు మేతపెట్టడంవంటి పనులు చేయడంలో జంటలోని రెండు పక్షులకూ వేర్వేరు జాతులలో వేర్వేరు నిష్పత్తులు ఉంటాయి. కొన్ని జాతులలో ఈ పనిని మగపక్షి, ఆడుపక్షి సరిసమానంగా నిర్వహిస్తాయి. కొన్నింటిలో ఆడుపక్షి ఎక్కువ భారం వహిస్తుంది. రంగుల ఉల్లాము పిట్ట (Painted snipe), జకానావంటి కొన్ని జాతులలో గృహకృత్యం చాలవరకు మగపక్షియే నిర్వహిస్తుంది. ఏమైనా పక్షిజాతిలో మాతాపితలు విశేషించి కష్టపడి పని చేయవలసి ఉంటుంది. పుట్టిన కొద్ది రోజులవరకు పక్షిపిల్ల రోజుకి తన భారానికి రెట్టింపు తిండి తింటుందని అంచనా వేశారు. గూటి పిల్లల పెరుగుదల రేటు మిక్కిలి అసాధారణంగా ఉంటుంది; కాని తొలిదశలో మాత్రమే పిల్లలకు మిక్కిలి తరుచుగా ఆహారం పెట్టవలసి ఉంటుంది. గ్రుడ్లనుండి పిల్లలు బైటికి వచ్చిన ఒకటి రెండు వారాలవరకూ వాటి తల్లి దండ్రి పక్షులు సూర్యోదయం మొదలు సూర్యాస్తమయం అయేవరకూ విరామం లేకుండా దూరంగా పోయి ఆహారం తెచ్చి పెడుతున్నా అవి ఎంత మాత్రం తృప్తి చెందవు.

గూటిలోని పిల్లలు వాటిని తినే జంతువుల నుండి, తదితర ప్రమాదాలు నుండి తప్పించుకొన్నా, వాటి జీవితం అపాయ భూయిష్టమే. ఆఖరున పొదిగిన గ్రుడ్డు నుండి వెలువడిన పిల్లకు, మొదటి నుండి బలహీనంగా

ఉన్న పిల్లకు తగినంత ఆహారం లభించదు. ఆ గూటిలో తక్కిన పిల్లలకే ఆహారమంతా లభిస్తుంది. ఇది సహజమే. పట్టిన పట్టు విడువకుండా ఏ పిల్లలు నోళ్లు తెరచికొని ఉంటాయో వాటికే ముందు పెడతాయి ఆహారం తల్లి దండ్రి పక్షులు. మరో అపాయం కూడా ఉంది. బలహీనమైన పిల్లలను మిగతా పిల్లలు తొక్కి వెయ్యవచ్చును లేదా అది గూటిలోనుండి క్రింద పడిపోవచ్చును. ఈ ప్రమాదాలు కాక పిల్లలు గూటిని వదతి పెట్టినా పిల్లులు, తొండలు, ఎలుకలు, పాములు, కాకులు మిగతా పక్షులు, తుఫానులు, పెనుగాలులు — ఇలాంటి ప్రాకృతికమైన వాటివల్లకూడా అపాయాలు ఉంటూనే ఉంటాయి. పక్షులలో చాలా జాతులు ఒక్కొక్క తూరి విశేష సంఖ్యలో గ్రుడ్లను, పెక్కు తడవలు పెట్టినప్పటికీ, వలసినంత సంఖ్యలో అవి తమ జనాభాను ప్రత్యుత్పత్తి చేసికోలేకపోవుటకు కారణం ఈ అపాయాలే. సహజంగా అపాయాలకు ఎక్కువగా లోనయే పొట్టి జాతులవంటి పక్షి జాతులు మిగతా జాతులకంటె హెచ్చుగా గ్రుడ్లు పెడతాయి; పాట పాడే చిన్న పక్షులు ప్రతి ఋతువులోను ఒకటికంటే ఎక్కువ తడవలు గ్రుడ్లు పెడతాయి. ఒకవేళ గూటిలో పిల్లలన్నీ కాని, గ్రుడ్లన్నీ కాని నాశనం అయిపోతే తల్లిదండ్రి పిట్టలు ఏడుస్తూ కూర్చోవు. వెంటనే అవి క్రొత్త గూటిని కట్టడం ప్రారంభిస్తాయి. ఈ అధ్యాయ ప్రారంభంలో చెప్పినట్లు అన్ని జంతువులలో లాగే పక్షులలో కూడా సంతానాన్ని పొందాలనే ఆంకాక్ష విపరీతంగా ఉంటుంది; దానికోసరం ఎన్ని అడ్డంకులు ఎదురైనా అధిగమించి విజయం సాధిస్తాయి.

# వలసపోవుట

పక్షి శాస్త్రంలోని అద్భుతమైన విషయాలలో వలసపోవడం ఒకటి. ఇందలి రహస్యాన్ని ఇంతవరకు ఎవరూ పరిష్కరించలేదు. వసంత ఋతువులోనూ, శరదృతువులోనూ సంవత్సరంలో రెండు పర్యాయాలు లక్షలాది పక్షులు ఒక ప్రత్యేకమైన గమ్యస్థానాన్ని చేరుకోవడానికి ఆకాశ మార్గాన బయల్దేరి అప్పుడప్పుడు మహాసముద్రాలను, ఖండాలను కూడా దాటుకొంటూ చాలా దూరం పయనిస్తాయి. ఏ బలవత్తరమైన ఒత్తిడి వలన అవి వలసపోతున్నాయి? అటువంటి సాహసమైన ప్రయాణాలు చేసి అవి ఆపదల నెందు కెదుర్కొంటున్నాయి? ఏ మార్గాన్ని బట్టి పోవాలో వాటికెలా తెలుస్తోంది? జాగ్రత్తగా చేసిన ప్రయోగాలవలనా, వలసపోయే పక్షులకు పెద్ద ఎత్తున ఉంగరాలు తొడగడం వలనా పూర్వంకంటే ఇప్పుడు పక్షులను గూర్చిన మరికొన్ని సత్యాలు తెలిసినప్పటికీ, పై ప్రాథమిక ప్రశ్నలకు మాత్రం సంతృప్తికరమైన సమాధానాలు ఇంతవరకు లభించలేదు.

రెండు గమ్యస్థానాల మధ్య నియమబద్ధంగా ముందుకు వెనుకకు రాకపోకలు జరపడం అనేవి పక్షుల వలసలో ఉన్న ప్రధాన లక్షణం. వాటి రాకపోకల చలనాలను గూర్చి ఒకవారం మేరలో కొద్ది రోజులు ముందుగానే చెప్పవచ్చును. వాటి వేసవికాలపు నివాసాలకు, శీతకాలపు నివాసాలకు మధ్య ఎన్నో వేల మైళ్ళ దూరం ఉన్నప్పటికీ, అవి ఎప్పుడూ ఆయా నివాసాలకు, సరిగ్గా అదే తోటలోకో, పొలంలోకో వస్తాయి.

కొన్ని జాతుల పక్షులే ఎందుకు వలసపోతుంటాయి? తక్కిన వెందుకు పోవు? ఈ ప్రశ్న మనకు ముందుగా ఎదురౌతుంది. దీనికి స్పష్టమైన జవాబు ఏమిటంటే — కొన్ని జాతుల పక్షులు బ్రతికుండాలంటే అవి వలసపోయి తీరాలి. మరికొన్ని పోనక్కరలేదు. కొన్ని జాతుల పక్షులలో జీవించడానికి షరతు పూర్తిగా తప్పనిసరి కాకపోవచ్చును. ఎందుచేత నంటే కొన్ని జాతులలో ఒకే జాతిలోవే కొన్ని వలసపోతాయి, కొన్ని ఉండిపోతాయి. బోడికోళ్లు (Coots), తెడ్డుమూతి కొంగలు ఇందుకు

ఉదాహరణములు. ఈ జాతులలో కొన్ని మందలు ప్రతి సంవత్సరం వలసపోతాయి ; మిగతావి ఏవిధమైన అనర్థం లేకుండానే దేశంలో ఉండి పోతాయి.

ఉత్తరార్థగోళంలో పక్షులు గ్రుడ్లుపెట్టే చోటునుండి ఆకురాలు కాలంలో వలసకు బయల్దేరుతాయి. అవి ఉత్తరదిశ నుండి దక్షిణదిశకు, ఉన్నత అక్షాంశం నుండి నిమ్న అక్షాంశం వైపుకు పోతాయి. దక్షిణార్థ గోళంలో పక్షులు పోయే దిశలు వీనికి వ్యతిరేకంగా ఉంటాయి. దక్షిణార్థగోళం లోని చలిబాధ నుండి తప్పించుకోవడాని కవి సహజంగా దక్షిణంనుండి ఉత్తరదిశగా పోతాయి. చాలా పక్షులు కఠోరమైన శీతాకాలాన్ని తప్పించుకోవడానికి శీతకాలం వచ్చేలోపుగానే అంతకంటె వెచ్చగా ఉండే ప్రదేశాలకు పోవడం, స్వదేశంలో వెచ్చదనం ప్రారంభిస్తుందనగానే అవి తిరిగి స్వదేశానికి పోవడం మనకు సువిదితమే. అవి స్వదేశానికి వెళ్లే టప్పటికి చెట్లన్నీ ఆకు మొగ్గలూ, పూ మొగ్గలూ తొడుగుతూ ఉంటాయి. కుటుంబాన్ని పోషించడానికి అక్కడ క్రిములు, కీటకాలు సమృద్ధిగా ఉంటాయి. వేసవి పూర్తి అయేసరికి పిల్లలు పెద్దవై స్వతంత్ర జీవనం చేయ గలుగుతాయి. ఆకురాలు కాలంలో చలి ప్రారంభింపక పూర్వమే ఈ పక్షులు దక్షిణ యాత్రకు సిద్ధంగా ఉంటాయి. కొన్ని జాతుల పక్షులు అవి గ్రుడ్లు పెట్టే స్థలాలలో కనీస కాలం మాత్రమే ఉండేటట్లు తోస్తుంది. ఉదాహరణకు, మధ్య ఆసియాలో గ్రుడ్లు పెట్టే గులాబీ స్టార్లింగు మే నెలలో భారతదేశం వదలి మళ్లీ సాధారణంగా ఆగస్టు నెలలో తిరిగి వస్తుంది. చాల పక్షులు మరికొంత హెచ్చు కాలం తీసికొంటాయి ; అవి మార్చిలో మనలను వదలి, సెప్టెంబరులో తిరిగి వస్తాయి.

ఈ కఠినమైన వలస ప్రయాణాలకు ఏదో ఒక నిర్దిష్టమైన విలువ ఉన్నట్లు కనపడుతుంది. బహుశః ఆయా జాతుల పక్షులకు వలస పోవటం తప్పనిసరియేమో! కాని కొన్నిజాతుల పక్షులు తూర్పునుండి పడమరకు, పడమరనుండి తూర్పుకు స్థూలంగా ఒకే అక్షాంశ రేఖపై రమారమి ఒకేవిధమైన శీతోష్ణస్థితిగల ప్రదేశాలకే గ్రుడ్లు పెట్టడానికి వెళతాయి. అవి అలా ఎందుకు వెళతాయో మనకు బోధపడని విషయం. అంతే కాకుండా కొన్ని పక్షులు కొద్దిమైళ్లు మాత్రమే చిన్న చిన్న ప్రయాణాలు చేసి వస్తూంటాయి. ఈ విధమైన స్థానిక వలసల ఆవశ్యకత

ఏమిటో, ప్రయోజనం ఏమిటో అర్థం చేసికోవడం కష్టంగానే ఉంది. ఉదాహరణకు బొంబాయిలో ఉండే వంగపండు పిట్టలు, పసిరిక పిట్ట లాంటి పక్షులు వర్షాకాలంలో నగరాన్ని వదలి కొంచెం దూరం దక్కను పీఠభూమిలోకిగాని, మధ్య భారతంలోకిగాని వెళ్లి సరిగ్గా సెప్టెంబరు మాసారంభంలో తిరిగి వచ్చేస్తాయి. స్థానికంగా కొద్దిదూరం పక్షులు పెద్ద ఎత్తున వలసపోతాయి అన్న విషయం తప్ప, అంతకు మించి వాటిని గూర్చి ఇంతవరకూ మనకేమి తెలియదు. ఎందుచేతనంటే వీటైనంత హెచ్చు సంఖ్యలో పక్షులకు ఉంగరాలు తొడిగి వదలిపెడితేగాని వాటి రాకపోకలను గురించి ఖచ్చితమైన విశేషాంశాలను సేకరించలేము.

ఈ ప్రవాస సమస్యను ఇంకా క్లిష్టతరం చేసే మరోవిషయం కూడా ఉంది. వచ్చేటప్పుడు వెళ్లిన మార్గాన్ని కాక మరోమార్గాన్ని తిరిగి వచ్చినా చాలా పక్షులు సంతానోత్పత్తి స్థలాలకు మాత్రమే సాధారణంగా పోయి తిరిగి వస్తాయి. కాని సాహసంగల కొన్ని పక్షులు అంతకంటె జటిలమైన ప్రయాణం చేస్తాయి. అవి వాటి గ్రుడ్లు పెట్టే స్థలాలకు పోయి, అచ్చట వాటి కుటుంబ వృద్ధి పూర్తి చేసుకొని, అటవిడుపుకా అన్నట్లు మరోచోటుకు పోతాయి. అచ్చటనుండి తిన్నగా అవి తమ శీతల నివాసానికి తిరిగిరాక, గ్రుడ్లుపెట్టిన స్థలాలకు పోయి అచట కొంతకాలం ఆగుతాయి. ఈ విధంగా పక్షుల వలసలో వాటి రాకపోకలు తికమకలతో కూడుకొని ఉంటాయి. వాటి చలనాలలో కొన్ని మన కర్థమే కావు. అయినప్పటికి ఇదివరలో మేము సూచించినట్లుగా పక్షుల వలసలో — అవి స్వదేశాన్ని విడిచిపోయి తిరిగి వెనక్కి రావడం, అందు క్రమాభిసరణం, సంవత్సరంలో విభిన్న ఋతువులలోను సుఖంగా జీవించడానికనువైన పరిస్థితులను పొందడం — అనేవి ముఖ్య లక్షణాలు.

దూరప్రయాణానికి బయల్దేరేముందు కొన్ని రోజులవరకు వలస పక్షులు అందుకు తగిన సన్నాహం చేసికొంటాయి. వాటి శరీరంలో అదనమైన మరో క్రొవ్వుపొర ఏర్పడడం కోసరం అవి ఎక్కువగా మేతమేస్తాయి. ప్రయాణంలో ఈ క్రొవ్వు వాటికి పుష్టినిస్తుంది; అవి గుంపులుగా కూడటం గుంపులుగా ఎగరడం అభ్యాసం చేస్తాయి. వలసపోయే పక్షులకు సూర్యోదయం సూర్యాస్తమయం అయే వేళలు ప్రస్థాన సమయాన్ని సూచిస్తాయని ప్రయోగాల వలన తేలింది. వాటి దీర్ఘయాత్రలలో వాటికి సూర్యుడే దిక్సూచి.

సూర్యుని కోణాన్ని అనుసరించి పక్షులు తమ మార్గాన్ని నిర్ణయించుకొంటా యని నేడు శాస్త్రజ్ఞుల అభిప్రాయం. పొగమంచు, మబ్బు సూర్యుని కప్పిన పుడు పక్షులు కొంతవరకు మార్గం తప్పిపోయినా, తిరిగి సూర్యుడు కనప డగానే అవి సరియైన మార్గం పడతాయి. త్రోవలో కొండ గుర్తులేమైనా ఉంటే అవి వాటిని వినియోగించు కొంటాయి కాని పగటివేళ సూర్యుడు, రాత్రివేళ నక్షత్రాలు మాత్రమే వాటికి ప్రధానంగా మార్గదర్శకములు. సాధారణంగా పక్షులు 600 నుండి 1300 మీటర్ల వరకు ఎత్తున ఎగురు తాయి. కావున చిన్న చిన్న కొండ గుర్తులు వాటికి కనబడనే కనపడవు. చాలా జాతులలో మొట్టమొదటి సారిగా వలస ప్రయాణం చేసే యువక పక్షులు వాటి తల్లిదండ్రులతో సంబంధం లేకుండా, ముందుగానే వలస పోతాయి. దారిలో కొండ గుర్తులకు ప్రాధాన్యమంతగా లేదనడానికి ఇది ప్రబల తార్కాణము. ఏ ఇంద్రియ జ్ఞానం వలన పక్షులు సూర్యుని అనుసరించి తమ మార్గాన్ని తెలిసికోగలుగుతున్నాయో దాన్ని విశ్లేషించి చెప్పజాల కున్నాము; అందుచేతనే అది పక్షులకు ''సహజాతము'' అనగా పుట్టుకతో వచ్చిన ప్రజ్ఞ అంటున్నాము.

పక్షులలో చాలవరకు చిన్న చిన్న గుంపులుగనో లేక పెద్ద పెద్ద మందలుగనో ప్రయాణం చేసినా, కొన్ని జాతుల పక్షులు మాత్రం ఎప్పుడూ ఒంటరిగానే ప్రయాణం చేస్తాయి. చిన్న పక్షులలో చాలవరకు అవి సహజంగా పగటివేళ మాత్రమే సంచరించేవియైనా రాత్రులందే ఎగిరి పోవడానికిష్ట పడతాయి. అవి రాత్రులందు వలస పోవడానికి కారణం బహుశా వాటిని వేటాడి చంపే జంతువుల బారినుండి రక్షించుకోవడానికి అయి ఉండవచ్చును. చిన్న పక్షులు గంటకు సుమారు 30 కిలోమీటర్ల వేగంతో ఎగురుతాయి. వలసపోయే పక్షులు రోజుకు రమారమి 8 గంటలు ఎగురుతాయి. అందుచేత వలస యాత్రలో చిన్న పక్షుల మజిలీ 250 కిలో మీటర్ల లోపుగా ఉంటుంది. పెద్ద పక్షులు గంటకు 80 కిలోమీటర్లలో తగ్గకుండా ఎగురగలవు. అందుచేత రోజులో ఇంకా చాలా దూరం ప్రయాణం చేస్తాయి. సముద్రాలను దాటేటప్పుడు సహజంగా పక్షులు ఒక్క బిగిని చాల దూరం ఎగరవలసి వస్తుంది. అలాంటప్పుడు చాలా మందలు విరామం లేకుండా 36 గంటలవరకూ ఎగిరినట్లు తెలుస్తోంది. పక్షుల గుంపు ముఖ్యంగా నేలమీదకు దిగేటప్పుడు పెనుగాలులకు

చిక్కుకో వచ్చును. అలాంటప్పుడు చాల పక్షులు మరణిస్తాయి. మొత్తం మీద వలస యాత్ర ఎల్లప్పుడూ బాధతోను, ప్రయాసతోను కూడుకొన్న పని. అంతేకాదు; తరుచుగా ఆ ప్రయాణాలలో ప్రమాదాలు కూడ తటస్థి స్తూంటాయి.

పక్షులు ఏ సంఖ్యలో వలస పోతాయో ఊహించడం కొంత కష్టమే. యూరపులోనూ, ఆసియా ఉత్తర భాగంలోనూ గ్రుడ్లు పెట్టే పక్షులలో సుమారు 40 శాతం అనగా సగానికి కొంత తక్కువగా వలస పక్షులే అని అంచనా వేశారు. బ్రిటనులోని పాటపాడే పక్షులలో 68 జాతులలోనూ 22 జాతులు వలస పక్షులే. భారతదేశంలో కనపడే 1200 జాతుల పక్షులలో 300 జాతులకు పైగా శీతకాలంలో దూరదేశాల నుండి వచ్చినవేను. కొన్ని వలస పక్షులు పయనించే దూరాలు కూడ మనకు చాలా ఆశ్చర్యం కలుగ జేస్తాయి. ఉత్తర ధ్రువానికి చెందిన టెర్న్ (రీవ) పిట్ట ప్రతి సంవత్సరం ఉత్తర ధ్రువము నుండి దక్షిణ ధ్రువానికి ఎగిరి వెళ్ళి, తిరిగి ఉత్తర ధ్రువానికి వస్తుంది. ఈ ప్రయాణం రానూ పోనూ సుమారు 35,000 కిలోమీటర్లుం టుంది. అనేక వేల కిలోమీటర్లు ఇలా ప్రయాణం చెయ్యడం పక్షులకు అసాధారణమైన పనేమీకాదు. యూరపులో ప్రత్యుత్పత్తి చేసే చాల జాతుల పక్షులు శీతాకాలంలో దక్షిణాఫ్రికా వరకూ వెడతాయి; కొన్ని జాతులు పెద్ద సంఖ్యలో మధ్యధరా దేశాలకు ఎకాఎకీని వెళ్లి అక్కడ ఆగిపోవడం కూడా కలదు.

భారతదేశానికి వచ్చే వలస పక్షులలో ఎక్కువ భాగం చలికాలం గడుపుకోవడానికే అక్కడకు వస్తాయి. అక్కడవి సంతానోత్పత్తి చెయ్యవు. తూర్పు యూరపులోనూ, ఉత్తర, మధ్య ఆసియాలోనూ, ఇంకా హిమా లయ పర్వత శ్రేణులలోనూ గూళ్లుకట్టే చాల జాతులు శీతకాలంలో మన ద్వీపకల్పానికి వస్తాయి. ఇలా మన దేశానికి వలస వచ్చే పక్షులలో చాల భాగం మన సముద్ర తీరాలవద్ద, మన నదులు, సరస్సుల చుట్టుపట్ల చేరే పొట్టి బాతులు, నీటిలో నడిచే పక్షులు ఉంటాయి.

ఈ యదార్థ విషయాలకు మించి, భారతదేశంలో పక్షుల వలసను గూర్చి మనకేమీ తెలియదనే చెప్పాలి. వలస పక్షుల విభిన్న జాతులు, అవి ఏయే నిర్ణీతస్థలాల నుండి వచ్చునది, వాటి సంఖ్య, ఈ దేశానికి వచ్చే టప్పుడు, ఈ దేశం నుండి పోయేటప్పుడు అవి పయనించే మార్గాలు,

ఋతువులకు సంబంధించి వాటి రాకపోకలను గురించిన వివరాలు —వీటిని గురించి మనకు తెలిసినది చాల తక్కువ. వలస పక్షులను గురించి సమాచారం సేకరించడానికి ఈ శతాబ్ది ఆరంభం నుండీ ఈ ప్రపంచంలో విరివిగా ఉపయోగిస్తున్న ఒక పద్ధతి పక్షుల కాళ్లచుట్టూ అల్యూమినియము ఉంగరాలు తొడగడం. పక్షులను వలలు పన్నికాని, బోనులను పెట్టికాని పట్టుకొని, ఉంగరం తొడిగి, రిజిస్టరు చేసి విడిచిపెడతారు. ఉంగరాలు ఆయా పక్షులకు తగిన పరిమాణాలలో ఉంటాయి. ఈ తొడుగులపైన వరుస నంబరు, ఉంగరములు తొడిగిన వారి చిరునామా ముద్రింపబడి ఉంటాయి. ఎవరికైనా ప్రమాదవశాత్తుగాని, మరియేకారణం వల్లగాని ఆ పక్షి దొరికితే ఆ విషయం ఉంగరంపైనున్న చిరునామాకు తెలియచేయ వలసి ఉంటుంది. భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లోని వలస పక్షుల వివిధ జాతులకు ఉంగరాలను తొడిగే ప్రోజెక్టు నొకదానిని "ది బోంబే నేచురల్ హిస్టరీ సొసైటీ" వారు పెద్ద ఎత్తున నిర్వహిస్తున్నారు. గత 10 సంవత్సరములలో, అంతకు పూర్వం ఏ మాత్రం తెలియని అనేక వాస్తవిక విషయాలను వారు సేకరించారు. మన అడవి జాతులలో కొన్నింటిని 4,800 కిలోమీటర్ల దూరంలో ఉన్న సైబీరియాలో స్వాధీనం చేసికొన్నారు. మిగతా జాతులను గూర్చి కూడా, వాటిని స్వాధీన పరచుకొన్న ప్రాంతాల నుండి కొంచెం కొంచెంగా ఉపయోగకరమైన సమాచారం ప్రోగవుతోంది. ఉంగరాల మీద వరుస నంబరుతోపాటు, "బోంబే నేచురల్ హిస్టరీ సొసైటీ వారికి తెలియచేయండి" అను అభ్యర్థన కూడ ఉంటుంది. ఈ విషయాన్ని ప్రజాబాహుళ్యంలో విస్తృతంగా ప్రచారం చేయుండని పాఠకులను కోరుతున్నాం. అందువలన ఈ పక్షులను స్వాధీన పరచుకొన్న వారు చనిపోయిన పక్షిమీద ఉంగరం కనపడటం తటస్థిస్తే ఆ విలువైన సమాచారాన్ని అందజేస్తారు. పరదేశీయమైన ఉంగరాలు గల చాల పక్షులు కూడా భారతదేశంలో తటస్థపడతాయి. భారతదేశానివైనా, విదేశాలవైనా, అన్ని ఉంగరాలూ పై సొసైటీకి పంపటం ఉత్తమమైన పని. అలా ఉంగరాలు పంపడానికి వీలుకాకపోతే ఆ ఉంగరంపై నున్న వరుస నంబరు, దొరికిన తేదీ, స్థలము, పరిస్థితులు మున్నగు వివరాలనైనా వ్రాసి పంపాలి. ఈ విధమైన సహాయ సహకారాలతోనే భారతదేశంలో పక్షుల రాకపోకలను గూర్చిన సరియైన విజ్ఞానం లభింపగలదు.

పటము 9

కసపుకొంగ

*(Ibis leucocephalus)*

పేజీ 40





పటము 10

తెఱపిముక్కుకొంగ

(*Anastomus oscitans*)

పేజీ 41



పటము 11

డొగ్గుడుకొంగ

(*Leptoptilos dubius*)

పుట 42




పటము 12

నలకంకణం

(*Pseudibis papillosa*)

పటము 13

## చెంచాముక్కు కొంగ (తెడ్డుమూతికొంగ)

(*Platalea leucorodia*)

పేజీ 46





పటము 14

**రాజహంస**

(*Phoenicopterus roseus*)

పేజీ 47




పటము 16
**బూడిదరంగు హొట్టిబాతు**
(*Anas poecilorhyncha*)
పేజీ 51

**పొడిసిపెడిఫార్మిస్ వర్గము — మునుగు కోడి** (The Order PODICIPEDIFORMES — Grebes) — ఈ వర్గంలోని నీటి పక్షులకు పొట్టి రెక్కలుంటాయి. వాటికి తోకలు లేవనే చెప్పవచ్చును. కాళ్లు బాగా వెనుక భాగాన్ని ఉంటాయి. కాలి వ్రేళ్ల కిరువైపులా నడిమి కాడగల ఆకును బోలి చర్మం ఉంటుంది.

చిన్న మునుగు కోడి (The Little Grebe or Dabchick — Podiceps Ruficollis) — పటము 1 — హిందీ : పాండూబీ, డూబ్‌డూబీ, లావోక్రి. ఇది ఈ వర్గంలో మనకు బాగా పరిచయమైన పక్షి. ఇది మట్టిరంగు కలిగి పుష్టిగా ఉండే ఈదెడు చిన్నపక్షి. దీని క్రిందిభాగం పట్టువలె మృదువుగా వుంటుంది. దీని ముక్కు పొట్టిగా కొనదేరి ఉంటుంది. ఈ పక్షికి తోక ఉండదు. గ్రుడ్లు పెట్టే కాలంలో క్రొత్తగా వచ్చే ఈకల మూలాన దీని తల, మెడ ముదురు గోధుమరంగులోనూ, చెస్‌నట్ రంగులోనూ ఉంటాయి. దాని పసుపు రంగు సోకు ప్రస్ఫుటంగా ఉంటుంది. అవి గ్రామాల్లో ప్రతి చెలమలోను, చెరువులలోను, బావలోను చిన్న బాతుల వలె ఈదుతూ కనబడతాయి. అనుమానం ఏమాత్రం కలిగినా వెంటనే అవి నీటిలో మునిగిపోతాయి. చిన్న చెరువులలో ఈ పక్షులు రెండేసి, మూడేసి కలిసి ఉంటాయి. పెద్ద పెద్ద తటాకాలలో యాభైమించి ఈ పక్షులు కలిసి ఉండటం వింతకాదు. మునిగే కళలో అవి బాగా ఆరితేరాయి. నీటి ఉపరి తలంపైన ఒక చిన్న కెరటమైన ఏర్పడకుండా మునుగు కోడి నీటి అడుక్కి త్రుటిలో మాయమవడం నిజంగా ఆశ్చర్యంగానే ఉంటుంది. తుపాకీతో కాల్చినప్పుడు తుపాకీ గుండు దానికి తగులక మునుపే ఆ పక్షి మాయమవుతుంది! అవి నీటిని వదలిపెట్టడాని కిష్టపడవు. వాటిని కలత పెట్టినట్లయితే రెక్కలు చప్పుడయేటట్లు కొట్టుకొంటూ, నీటి తలంమీద కొంచెం దూరం ఎగిరి, మళ్లీ నీట మీదికి బరువుగా దిగుతాయి. వాటి రెక్కలు చిన్నవైనప్పటికీ నీరింకి పోయినపుడు, ఒక చెరువు నుండి మరియొక చెరువుకు పోవలసి వచ్చినపుడు అవి ఎంత దూరమైనను ఎగురగలవు. సాయంవేళల్లో అవి వాటి పొట్టిరెక్కలను టప టప కొట్టుకొంటూనూ, నీటి తలంపైన సగం

పరిగెడుతూ, సగం ఎగురుతూనూ క్రీడిస్తూ ఉంటాయి. ఇలా క్రీడించే టప్పుడు ఈ పక్షులు ఒక దాన్ని ఒకటి పిలుచుకొంటూ ఉంటాయి. ఈ పిలుపు కూతలు కీచుగాను, శ్రావ్యంగాను ఉంటాయి. వాటి ఆహారం నీటిలో ఉండే కీటకాలూ లార్వాలూ, చిరుకప్పలూ, నత్తలు, చిన్న చేపలూను. ఈ పక్షులు ఆహారాన్ని తేలుతున్న మొక్కల నుండి ఏరుకుంటాయి లేదా నీటిలో మునిగి పట్టుకొంటాయి. చిన్న మునుగుకోడి నీటిలో కొంత భాగము మునిగి, కొంత తేలుతున్న మొక్కల పైన, రసముగల కలువు మొక్కల కాండములను కుదురుగా అమర్చి గూడు కడుతుంది. ఆ గూటిలో 3 – 5 గ్రుడ్లు పెడుతుంది. పెట్టినపుడు గ్రుడ్లు తెల్లగా ఉంటాయి. కాని ఈ పక్షి కలత చెందిగాని లేదా అది ఆహారం కోసరంగాని బైటకు పోయేటప్పుడు ఈ గ్రుడ్లను తడిగడ్డితో కప్పుతూంటుంది. ఆ తడిగడ్డి స్పర్శచేత ఆ గ్రుడ్లు వివర్ణములై మాసిపోతాయి. ఈ పక్షుల పిల్లలకు మెత్తని యీకలు, చారలు ఉంటాయి. ఈ పిల్లలను తరచుగా వాటి తల్లిదండ్రులు వీపుపై నెక్కించు కొని వాటితో కూడా తీసికొని పోతూంటాయి.

పెలికానిఫార్మిస్ వర్గం (Order PELECANIFORMES) లో పెలికానిడె – గూడకొంగలు, కలికిపిట్టలు, (Family Pelecanidae — Pelicans and Darters) ఫాలాక్రొకొరాసిడె – నీటికాకులు (Family Phalacrocoracidae - Cormorants) అనే రెండు ముఖ్య కుటుంబాలున్నాయి.

గూడకొంగలు బరువుగా కనపడే పక్షులు. వాటి కాళ్లు పొట్టిగానూ, లావుగానూ ఉంటాయి. వ్రేళ్లమధ్య పూర్తిగా చర్మం ఉంటుంది. ముక్కులు పెద్దవిగానూ, బల్లపరుపుగాను వుంటాయి. దాని క్రింది పుటమునుండి సాగి ముడుచుకొనగల ఒక పెద్ద చర్మపుసంచి వ్రేలాడుతూ ఉంటుంది. ఈ పక్షుల ముఖ్యమైన ఆహారం చేపలు. చేపలను పట్టుకొనడానికి పక్షి దాని సంచిని వలవలె ఉపయోగిస్తుంది. అవి పైకి బరువుగా కనపడి నప్పటికీ వాటి ఎముకలు తేలికైనవవడం మూలాన గూడకొంగలు సునాయాసంగా, తేలికగా, బాగుగా ఎగురగలవు. సూర్యరశ్మి బాగా ఉన్న రోజున అవి వాటి చుట్టాలూ, రాబందులూ, కొంగలతోపాటు ఆకాశంలో

చాలా ఎత్తున ఉష్ణవాయు ప్రవాహాలమీద రెక్కలను కదల్చకుండా ఎగురుతూ కాలక్షేపం చేస్తాయి. భారతదేశంలో మూడురకాల గూడకొంగలు కనిపిస్తాయి. వాటిలో చుక్కలముక్కు గూడకొంగ (The Spottedbilled or Grey Pelican — Pelecanus Philippensis) — పటము 2 — హిందీ: హావాసిల్ లేక కూరర్ ఒకటే మనదేశంలో నివాసం కలది. తక్కిన రెండూ శీతకాలంలో ఈ దేశం వస్తాయి. చుక్కల ముక్కు గూడ కొంగ ముక్కు పై పుటముపైన నీలము - నలుపు మచ్చలుంటాయి. ముక్కు అడుగున ఉన్న సంచీ లేత ఊదారంగులో ఉంటుంది. ఎదిగిన పక్షులు నెరిసిన వెంట్రుకల రంగులో ఉంటాయి. పిల్లలు బూడిదరంగులో ఉంటాయి. ఈ పక్షి ఎగిరేటప్పుడు స్ఫుటంగా కనపడే దాని నల్లని రెక్క ఈకలనూ, దాని బూడిద వర్ణపు తోకనూ చూచి దానిని ఇంకా సులభంగా గుర్తుపట్టగలం. ఇవి చిన్న చిన్న గుంపులుగా గాని లేక పెద్ద పెద్ద మందలుగా గాని తటాకాలలో చేపల కోసరం ఈదుతోనో, నీటిమీద తేలుతో విశ్రాంతి తీసుకొంటోనో లేదా గట్టుమీద ఎరకలను సర్దుకొంటోనో కనపడతాయి. అవి తిండిపోతులు; చేపలను విశేషంగా మింగుతాయి. నీటికాకుల వలెనే ఇవి కూడా సాముదాయికంగా చేపలను వేటాడుతాయి. కాని నీటికాకులవలె ఇవి చేపల కోసరం నీటిలో మునగవు. ఇవి అనేకం కూడి నీటిపై అర్థవలయాకారంగా ఏర్పడి ఈదుతూ, తమ రెక్కలతో నీటిని గట్టిగా కొడుతూ, చేపల గుంపును లోతులేని స్థలానికి తరుముతాయి. అలా మందగా ఒకచోట చేరిన చేపల మధ్యకు అవి ముక్కులను తెరచుకొని ఈదుకొంటూపోయి, తమ విప్పారిన సంచులలోనికి ఆ చేపలను దేవుతాయి. గూడకొంగలు సునాయాసంగా నీటి నుండి పైకి లేచి మెడను S ఆకారంగా వెనుకకు లాక్కొని ఎగురుతాయి. అవి ఎగురునప్పుడు వాటి రెక్కల యొక్క స్థిరమైన కదలికల వలన ఈలవంటి ధ్వని వస్తుంది. దదునైన రొమ్ముగల దాని శరీరాన్ని మనం చూచినపుడు గాలియోడల క్రింద ఉండే తెప్పలను జ్ఞప్తికి తెస్తాయి. చుక్కల ముక్కు గూడకొంగలు విశేషంగా ఆంధ్రదేశమందు తూర్పు గోదావరి జిల్లాలో గూళ్లు కట్టి గ్రుడ్లను పెడతాయి. గూడకొంగలు కొన్ని మన ద్వీపకల్పంలో మరి కొన్ని చోట్లకూడ గూళ్లు కట్టి గ్రుడ్లు పెడతాయి. ఈ పక్షులన్నీ కలిసి విస్తారమైన ప్రదేశంలో ఎత్తైన చెట్లమీదనో, తాళ్లమీదనో గూళ్లను కడతాయి. గూళ్లు పెద్దవిగానూ, వికారం

గానూ ఉంటాయి; అవి పుల్లలతో కట్టిన వేదికలు. తరచుగా ఒక చెట్టుమీదే చాల గూళ్ళు ఒకదాని కొకటి తగులుతూ వుంటాయి. గూడకొంగ సాధారణంగా మూడు గ్రుడ్లను పెడుతుంది. అవి ప్రారంభంలో సుద్దవలె తెల్లగా వుంటాయి; పొదిగిన కొద్దీ మాసిన గోధుమ రంగులోకి మారతాయి.

ఫలాక్రొకొరాసిడె కుటుంబము (Family PHALACROCORACIDAE) కలికి పిట్టలు, నీటికాకులు ఈ కుటుంబంలోకి వస్తాయి.

కలికిపిట్ట (The Darter—Anhinga Rufa) — పటము 3 — హిందీ: బన్వే. ఇది నల్లని నీటి పక్షి. దీని మెడ మొహమల్ వలె మృదువుగానూ, కపిలవర్ణం కలిగి, సన్నంగా, పొడుగుగా, పామువలెనూ ఉంటుంది. దీనికి సన్నని తల, కొనతేరిన బాకువంటి ముక్కు కలవు. వీపుపై వెండివలె మెరయుచున్న బూడిద రంగు గీతలు, పొడవుగా, తిన్నగా ఉండి చివరి భాగమున వంపు తిరిగిన తోక ఈ పక్షిని అనవాలు పట్టడానికి తోడ్పడే మరికొన్ని లక్షణాలు. ఇవి ఒంటరిగా గాని, చిన్న చిన్న గుంపులుగా గాని బావలలోనూ, గ్రామాలలో ఉండే చెరువులలోనూ, మడుగులలోనూ, నదులలోనూ, ఆయా పరిసరాలలోనూ కనపడతాయి.) (ఒక్కొక్కప్పుడు అవి నదీ ముఖద్వారాలలో కూడా ఉంటాయి. అది దాని పామువంటి తలను, మెడను నీటిపైన ఉంచి, ఆడిస్తూ ఇటూ అటూ తిప్పుతూ నీటిలో సగం వరకు మునిగిగాని లేదా పూర్తిగా మునిగిగాని ఈదుతుంది. చేపలు దాని నిత్యాహారం. నీటిలో మునగడంలో దానికి మంచి ప్రావీణ్యం ఉంది. జలాంతర్గామివలె అది నీట మునిగికూడ సంచరించగలదు. అది నీట మునిగి ఈదుతూ చేపలను తరుముతుంది. అటువంటప్పుడది తన రెక్కలను సగము విప్పుకొని ఈటెగాని ఒడుపుతో దాని తలను, మెడను ముందు వెనుకలకు ఆడిస్తుంది. దాని మెడలోని కసేరుకలలో ఒక ప్రత్యేకమైన ఏర్పాటు ఉంది. దాని మూలమున విల్లునుండి విడచిన బాణంలాగ దాని ముక్కును మెరుపువలె అతివేగంగా ముందుకు విసిరి, బాకువలె మొనదేరిన క్రిందిపుటంతో చేపను గ్రుచ్చి పట్టుకొంటుంది. అప్పుడది దాని పామువంటి మెడను నీటిపైకి తెచ్చి నేర్పుతో దానిని ముందుకు కుదిపి, చేపను గాలిలోకి విసిరి తిరిగి దానిని రెండు పుటములతోను పట్టుకొని ఆ చేపను తలతో ప్రారంభించి మింగుతుంది. ఈ పక్షి దాని తలా, గొంతూ సన్నంగా ఉన్నప్పటికీ చాల పెద్ద చేపలను కూడా అవలీలగా మ్రింగగలదు. ఇట్లు చేపలతో తన ఆకలి

తీర్చుకొని సంతృప్తి పడిన తరువాత ఈ పక్షి ఏదైనా చెట్టు చివరనగాని గుంజ కొననుగాని నిట్టనిలువుగా కూర్చొని దాని రెక్కలను తోకనూ విప్పి తడియార పెట్టుకొంటుంది. బాతు ఎరకలు నీటికి తడవవు. అదేమి చిత్రమో కాని ఈ పక్షి తన జీవితంలో చాల కాలం నీటిలో గడిపేదైనప్పటికీ, దీని ఎరకల కట్టి ఏర్పాటు లేదు. అవి నీటికి తడుస్తాయి. ఈకలలోకి నీరు బాగా చేరుకొంటుంది. అవి బాగా పని చేయాలంటే, ఆ పక్షి వాటిని తరుచుగా ఆరపెట్టుకోవాలి. కలికిపిట్ట కూతలు చి-గి, చి-గి అన్నట్లుగా రెండక్షరాలు గల లోహపు శబ్దాలు. ఇది తరుచుగా నీటికాకులతో కలిసి తిరుగుతోంటుంది. ఎగురుటలో నైతేనేమి, సాధారణ ప్రవర్తనలో నైతేనేమి ఇది నీటి కాకులను పోలి ఉంటుంది. పెద్ద తెల్ల కొంగలు, ఎఱ్ఱకాలి కొంగలువంటి పక్షులతో చేరి కలికి పిట్టలు కూడా గూళ్లు కడతాయి. నీటిలోగాని, నీటి యొడ్డున గాని ఉన్న చెట్లమీద వేదికలాగ వికారమైన గూటిని పుడకలతో కడుతుంది. గ్రుడ్లు - 3 లేక 4 - సుద్ద పూతకలిగి, సన్నంగా, పొడుగ్గా కొద్దిపాటి అకుపచ్చ కలిసిన లేతనీలి రంగులో ఉంటాయి.

చిన్న నీటికాకి (The Little Cormorant — Phalacrocorax Niger)— పటము 4— హిందీ: పాన్‌కొవా లేక ఛోటా గన్‌హిల్. — ఈ పక్షి అడవి కాకికన్న కొంచెం పెద్దది. నిగనిగలాడెడు నలుపురంగు మెడగల బాతువంటి వికారమైన నీటిపక్షి. దీని తోక పొడుగుగాను వంపులేక తిన్నగాను ఉంటుంది. దీని ముక్కు సన్నగాను, తప్పటగాను కొనభాగమున వంగి వాడిగాను ఉంటుంది. దీని గొంతుమీద తెల్లని చిన్న మచ్చ ఉంటుంది; తల వెనుకభాగమున కుచ్చు ఉందా అనిపిస్తుంది.

ఇవి సాధారణంగా గ్రామాలలోని చెరువులలోనూ, బాడవలలోనూ, పెద్ద పెద్ద జల ప్రదేశాలలోనూ ఒంటరిగా గాని, చిన్న చిన్న గుంపులుగా గాని లేదా పెద్ద పెద్ద మందలుగా గాని కనపడతాయి. ఉప్పునీటి మడుగుల లోనూ, నదీ ముఖద్వారాల యొద్దనూ కూడ అవి కనపడవచ్చును. జలాశయాలకు సమీపాన రాళ్లమీదగాని, చేపలు పట్టేవారు పాతిన గుంజలమీద గాని, నీటి మీదకు వ్యాపించియున్న చెట్లకొమ్మల మీద గాని, ఈ పక్షులు కూర్చొని రెక్కలు విప్పుకొని వాటిని ఎండలో ఆరబెట్టుకొంటూ ఉంటాయి. వాటి ముఖ్యాహారం చేపలు. అవి నీటిలో ఈదడంలోనూ, మునగటంలోనూ మిక్కిలి నేర్పుగలవి. అవి నీటిలో మునిగి నీటి అడుగునే చేపలను పడతాయి.

ఒక్కొక్కప్పుడవి గుంపులుగా చేరి చేపల గుంపును తరుముతూ, వాటిని వెంబడించి మునుగుతూ, ఒకదాని నొకటి తోసుకొంటూ, ఒకదాని పైనుండి మరియొకటి కప్పదాటు వేయుచూ ఉద్రేకంతో చేపలను పడతాయి. చేపను ముక్కులో అడ్డుగా పట్టుకొని ఆ పక్షులు నీటిపైకి వస్తాయి. పిమ్మట చురుకుగా కుదిపి చేపను తలతో ప్రారంభించి మ్రింగడాని కనువుగా నిలువుగా తెచ్చుకొని మ్రింగుతాయి. అవి వెంటనే చేపలకోసరం నీటిలో మళ్లీ మునుగుతాయి. మరీ పెద్ద చేపలనుకూడా ఈ పక్షులు ఈలాగే పట్టు కొంటాయి. ఈ నీటికాకుల ఆకలికి అంతులేదనిపిస్తుంది. ఈ చిన్న నీటి కాకులతోపాటు కలిసి మరో రెండు జాతుల నల్లని నీటికాకులు సామాన్యంగా కనపడతాయి. అవి పెద్ద నీటికాకి (The Large Cormorant—P. Carbo), ఇండియన్ షాగ్ (Indian Shag— P. Fuscicollis). పెద్ద నీటి కాకి పెంపుడు బాతంత ఉంటుంది. గ్రుడ్లు పెట్టేకాలంలో దాని తలమీద, మెడమీద నెరసిన వెంట్రుకల రంగుగల ఈకలుంటాయి. దాని తొడలమీద అండా కారపు తెల్లని మచ్చలుంటాయి. పక్షి ఎగిరేటప్పుడు ఈ మచ్చలు స్ఫుటంగా కనపడతాయి. షాగ్ చిన్న నీటికాకి కన్న కొంచెం పెద్దది ; పెద్ద నీటికాకి కన్న కొంచెం చిన్నది. కనుక దీనిని మిగతా రెండింటి నుండి పోల్చు కోవడం కొంత కష్టం. కాని గ్రుడ్లను పెట్టేకాలంలో వీటి కండ్లవెనుక తెల్లని ఈకల కుచ్చులుండటం చేతను, తలమీద, మెడమీద తెల్లని చుక్కలుండటం చేతను ఆ కాలంలో వీటిని సులువుగా గుర్తుపట్టవచ్చును. తరుచుగా అవి పెద్ద తెల్ల కొంగల (Egrets) తోనూ, ఎఱ్ఱకాలి కొంగల (Storks) తోనూ సంఘాలుగా చేరి నీళ్లలోగాని, నీటి ఒడ్డునగాని ఉన్నచెట్లమీద పుడకలతో వేదికలవంటి గూళ్లను కడతాయి. వాటి గ్రుడ్లు— 4 లేక 5—కొద్దిపాటి నీలి కలిసిన లేతాకు పచ్చరంగులో ఉంటాయి. ఈ పక్షుల గ్రుడ్లలో పరిమాణము నందు మాత్రమే భేదముంటుంది.

సైకొనీఫార్మిస్ వర్గము (Order CICONIIFORMES) — ఈ వర్గంలో నాల్గు కుటుంబాలు భారతదేశంలో ఉన్నాయి. అవి ఆర్డియిడె — నారాయణ పక్షులు, తెల్లకొంగలు మొదలైనవి (Ardeidae — Herons, Egrets etc.), సైకొనిడె – ఎఱ్ఱకాలికొంగలు (Ciconiidae—Storks), థ్రెస్కియార్నిథిడె—

నల్లకంకణాలు (Threskiornithidae — Ibises), ఫినీకాప్టెరిడె — రాజ హంసలు (Phoenicopteridae — Flamingos).

(నారాయణ పక్షులు, తెల్లకొంగలు పొడుగైన కాళ్ళుగల పక్షులు. వాటి జంఘికలపై చాల భాగము ఈకలు లేక బోడిగ ఉంటుంది. వాటి కాళ్ల వ్రేళ్లు పొడుగ్గా ఉంటాయి. వ్రేళ్ల మధ్య చర్మం ఉండదు. వాటి మెడలు పొడుగ్గాను, సన్నంగాను ఉంటాయి. ఈ పక్షులు తమ మెడలను అన్ని వైపులకు వంచగలవు. వీటి ముక్కులు బల్లెపు ఆకారంలో కొనతేరి ఉంటాయి.

నారాయణపక్షి (Grey Heron - Ardea Cinerea)- పటము 5— హిందీ : నారి కబూద్, అంజన్. అర్డియిడె కుటుంబానికంతకు విలక్షణమైన ఉదాహరణంగా ఈ పక్షిని తీసుకోవచ్చును. ఇది సన్నంగాను, బోడిగాను ఉండు కాళ్లుగల కొంగను పోలు పక్షి. ఇది బాడవలలో ఉంటుంది. దీని పైభాగం బూడిద రంగుగను, తల, మెడ తెల్లగాను ఉంటాయి. క్రింది భాగం నెరిసిన వెంట్రుకల రంగుగ ఉంటుంది. దీని మెడ పొడుగ్గా, సన్నంగా S ఆకారంలో ఉంటుంది. తల సన్నంగా ఉంటుంది. ముక్కు బలిష్ఠమై బాకువలె మొనతేరి ఉంటుంది. దాని తల వెనుక భాగమున నున్న పొడుగైన నల్లని తురాయి, దాని రొమ్ము భాగమున ఉన్న నల్లని చారలుగల పొడుగైన తెల్లని ఎరకలు, దాని మెడ ముందు భాగమున మధ్యగా క్రిందివైపుకు పోవు స్ఫుటమైన నల్లని చుక్కలగీత ఈ పక్షిని నిర్ధారణచేసే మరికొన్ని గుర్తులు. ఆడుపక్షి కూడ మగపక్షి లాగే ఉంటుంది. కాని ఆడుపక్షికి తురాయి, రొమ్ముపైనున్న ఈకలు అంతగా పెరిగి యుండవు. సాధారణంగా నారాయణ పక్షి మోకాటి లోతుగల నీటిలో ఒంటరిగా కదలకుండ నిలబడి ఉంటుంది. తలను భుజముల మధ్య ముడుచుకొని గాఢనిద్రలో నున్నట్లు కనపడుతుంది. కాని అంతసేపూ అది పూర్తిగా మెలుకువగానే ఉండి, తన ముక్కును విసిరి ఎరను పట్టుకొన డానికి అనువైన దూరములోనికి, చేపలుకాని, కప్పలుగాని వస్తున్నాయే మోనని చూస్తూనే ఉంటుంది. దానికంటికి ఆహారం కనపడగానే అది దాని పొడుగైన మెడను ముందుకుచాచి, దాని ముక్కును ఆహారం పట్టుకోవడానికి అనుకూలమైన స్థితిలో నుంచి ఆయత్త పడుతుంది. అప్పుడు దాని కాహార మయే ఆ జంతువులు స్తంభించిపోతాయి. వెంటనే అది దాని పట్టాకత్తి వంటి ముక్కును మెరపు వేగంతో ముందుకు విసిరి, ఆ దౌర్భాగ్యపు జీవిని

గ్రుచ్చుతుంది లేదా దానిని తన రెండు దవడల మధ్య ఇముడ్చుకొంటుంది. వెంటనే తన మెడను పైకి కుదిపి, పట్టుకొన్న ఆహారాన్ని అనుకూలమైన స్థానంలోనికి తెచ్చి, తలతో ప్రారంభించి మ్రింగివేస్తుంది. ఈ పక్షి తన రెక్కలను గట్టిగానూ, నిబ్బరంగానూ కొడుతూ ఎగురుతుంది. అలా ఎగిరేటప్పుడు దాని మెడను ముడుచుకొని, తలను దాని భుజాల మధ్యకు లాక్కొంటుంది. ఇది నారాయణపక్షి కుటుంబం యొక్క లక్షణం. అది దాని పొడుగైన కాళ్లను కూడదీసికొని వెనుకకు చాచి ఉంచుతుంది. అప్పుడవి తోకను దాటి తోకవెనుక వ్రేలాడుతూంటాయి. అది ఎగిరేటప్పుడే కూస్తుంది. ఉండి, ఉండి బెక బెకలాడుతుంది. ఆ కూత ఏమాత్రం శ్రావ్యంగా ఉండదు. అది పుడకలతో గూటిని వేదికవలె కడుతుంది. ఈ గూటి మధ్య భాగం పల్లంగా ఉంటుంది. దానిలో పచ్చగడ్డి మొదలైన వాటిని అస్తరుగా వినియోగిస్తుంది. నీటి సమీపంలో ఉన్న చెట్లలో ఈ పక్షి గూడు కడుతుంది. మిగతా కొంగజాతి పక్షులు ఎక్కడ గూళ్లు కట్టుకొంటే ఈ పక్షులు కూడా అక్కడ చేరి గూళ్లు కట్టుకొంటాయి. ఈ పక్షులు మూడు మొదలు ఆరువరకు గ్రుడ్లు పెడతాయి. అవి గాఢమైన సముద్రపు ఆకుపచ్చ రంగులో ఉంటాయి. పాములనారిగాడు (Purple Heron — Ardea Purpurea) అనే పక్షి రూపంలోను, అలవాట్లలోను అచ్చంగా నారాయణ పక్షిలాగే ఉంటుంది. కాని దానికంటే కొంచం చిన్నదిగా ఉంటుంది. ఇదికూడా బాడవలలోనే కనబడుతుంది. దీని పైభాగం నీలి లేక ఊదా కలిసిన బూడిద రంగులో ఉంటుంది; తల, మెడ పాటల వర్ణంలో ఉంటాయి; క్రిందిభాగం నలుపు, చెస్నటు రంగులలో ఉంటుంది.

పెద్ద తెల్లకొంగ, మధ్యమ తెల్లకొంగ, చిన్న తెల్లకొంగ - ఈ మూడు జాతుల తెల్ల కొంగలు మనకు సాధారణంగా బాడవలలో కనపడుతూంటాయి. పాములనారిగాడు ఎట్టితావులందు సంచరిస్తుందో ఈ మూడు జాతుల కొంగలుకూడ అట్టి తావులందే నివాస మేర్పరచుకొంటాయి. పెద్ద తెల్ల కొంగ (The Large Egret—Egretta Alba) పరిమాణంలో పాములనారిగాడంత ఉంటుంది. దీని దేహమంతా అచ్చంగా మంచువలె తెల్లగా ఉంటుంది. ఇది సాధారణంగా ఒంటరిగానే సంచరిస్తుంది. దీనికంటె మధ్యమ తెల్లకొంగ (The Median Egret — E. Intermedia) - కొంచెం చిన్నదిగా ఉంటుంది. చిన్న తెల్లకొంగ (The Small Egret—E. Garzetta)

— పటము 6—హిందీ: కర్చియా బగ్లా ఇంకా చిన్నది; పెంపుడు కోడి పెట్టంత ఉంటుంది. లేదా శాంతి కొంగంత ఉంటుంది. గూళ్లు కట్టి గ్రుడ్లు పెట్టే కాలంలో అందమైన ఈకలు సరిగలాగ అన్ని రకాల తెల్లకొంగల వీపులను అలంకరిస్తాయి. ఈ శతాబ్దపు పూర్వభాగంలో, ఐరోపాలోనూ, అమెరికాలోనూ దొరసానుల టోపీలను తయారు చేయడానికి ఈ తెల్ల కొంగల ఎరకలకు మంచి గిరాకీ ఉండేది. ఈ యీకల వ్యాపారం మిక్కిలి లాభదాయకం అవడంచేత ఆ వ్యాపారం కొరకీ పక్షులను కొల్లలుగా చంపేవారు. స్త్రీల ఈ టోపీల ఫేషన్ ఇలా దుర్మార్గానికి దారితీసింది. అందుచేత ప్రపంచంలో చాలచోట్ల ఈ తెల్ల కొంగల జాతి పూర్తిగా నిర్మూలమయే స్థితికి వచ్చింది. ఈ దుస్థితికి గురైన దేశాలలో అడవి పక్షుల ఈకల వ్యాపారాన్ని నిరోధిస్తూ, పక్షుల రక్షణ కొరకొక చట్టాన్ని అమలు పరిచారు. దానికితోడు స్త్రీల ఫేషనులలో కూడా అనుకూలమైన మార్పు వచ్చింది. అందుచేత తెల్లకొంగల జాతి నిర్మూలనం కొంతవరకు అరికట్ట బడింది. శాంతికొంగ (The Cattle Egret — Bubulcus Ibis) – పటము 7 — హిందీ: సూర్లియా బగ్లా లేదా గాయ్ బగ్లా. ఇది తెల్లని పక్షి; చిన్న కొంగను చాలవరకు పోలి ఉంటుంది. గూళ్ళు కట్టి గ్రుడ్లను పెట్టునపుడు కాక ఇతర కాలాల్లో దీని లావైన పసుపు రంగు ముక్కును పట్టి దీనిని చిన్న తెల్లకొంగల నుండి సులభంగా గుర్తు పట్టగలము. చిన్న కొంగ ముక్కు నల్లగా ఉంటుంది. దీని ముక్కు నల్లగా ఉండదు. గూళ్లను కట్టి గ్రుడ్లను పెట్టే కాలములో క్రొత్తగా వచ్చిన ఎరకలవలన దీని తల, మెడ, వీపు బంగారుఛాయలో ఉంటాయి. కనుక శాంతి కొంగను గుర్తుపట్టడంలో పొరపాటు పడటం తటస్థించదు. చిన్న కొంగలు, బాడవులలో సంచరించే ఇతర బంధువులూ లాగ ఈ పక్షి అంతగా నీటిపట్టులపై ఆధారపడదు. తరుచుగా ఇది మేత మేసే పశువులపై వాలి, వాని వెంట ఒంటరిగా తిరుగుతూ ఉంటుంది. అప్పుడప్పుడు శాంతి కొంగలు మందలుగా కలిసి తిరుగుట కూడ కద్దు. శాంతి కొంగల ముఖ్యాహారం నేలమీద ఉండే కీటకాలు. ఈ పక్షులు పశువుల కాళ్ల మధ్యనుండి తిరుగుతూ వాటి ప్రక్కలకు ఎగిరే కీటకాలను ఎగిరి పట్టుకొంటాయి. ఒక్కొక్కప్పుడవి పశువుల వీపుమీద కూర్చొని పరిసరములను మెలకువతో పరికిస్తూంటాయి. పచ్చగడ్డిలో పశువులు ముందుకు నడిచేటప్పుడు పైకెగిరే మిడుతలను, కీటకాలను ఈ పక్షులు

వాటి పొడుగైన మెడలను, కోసైన ముక్కులను ముందుకు తటాలున చాచి పట్టుకొంటాయి. అంతేకాదు. అవి పశువుల వీపులమీద నడుస్తూ, వాటి వీపులమీద, పొట్టలమీద, చెవులమీద రక్తాన్ని పీలుస్తూ ఉండే కీటకాలనూ, మరేమన్నా పరాన్న జీవులుంటే వాటినీ ఏరి తినేస్తాయి. వాటి కిష్టమైన చెట్లమీద శాంతికొంగలు గుంపులుగా చేరి గూళ్లు కడతాయి. కాకులు, గ్రుడ్డి కొక్కురాళ్లు, మరికొన్ని పక్షులతో అవి కలిసి ఒకే చెట్టుపైన తమ తమ గూళ్లు కడతాయి. సాయంకాలం, సూర్యుడస్తమించేటప్పుడు వికర్మ రేఖల లోనో, అడ్డదిడ్డంగానో ఎగురుతూ తమ చెట్లను చేరుకొంటాయి. అవి ఎగిరేటప్పుడు వాటి మెడను వెనుకకు ముడుచుకొని, తలను రెండు భుజముల మధ్య యిరికించుకొంటాయి; వాటి కాళ్లను తోకతో సమానాంతరంగా వెనుకకు చాస్తాయి. మరో పక్షులతో చేరకుండా శాంతికొంగలు ప్రత్యేకం గుమికూడి కాని, గ్రుడ్డి కొక్కిరాలతో గుంపుగా చేరికాని, కలికిపిట్టలు, నీటి కాకులు, తెల్ల కొంగలతో చేరికాని, గూళ్ళు కడతాయి. శాంతి కొంగ గూడు కాకిగూటి వలెనే అల్పంగా, అందవికారంగా పుడకలతో ఏర్పబడి ఉంటుంది. అవి ఎక్కువగా ఆకులున్న చెట్లపై గూళ్లు కడతాయి. ఆ చెట్లు నీటి సమీపంలో ఉండనక్కరలేదు. బాగా సందడిగానున్న పట్టణంలోనో, గ్రామ బజారులోనో ఉన్న చెట్లపై అవి గూళ్లు కట్టుకొంటాయి. గూటిలో సామాన్యంగా 3 మొదలు 5 వరకు గ్రుడ్లుంటాయి. ఆ గ్రుడ్లు వెన్న తీసివేసిన పాలవలె లేత నీలిరంగులో ఉంటాయి.

నారాయణ పక్షి కుటుంబంలో మనకు బాగా తెలిసిన మరోపక్షి గ్రుడ్డి కొక్కురాయి. (Pond Heron or Paddy Bird —Ardeola Grayii) – పటము 8 – హిందీ మాట్లాడే కొన్ని ప్రదేశాల్లో దీనిని 'అంధబగ్లా' అంటారు. ఇది రమారమి పెంపుడు కోడిపెట్టంత ఉంటుంది. ఇది భూమిమీద వాలి ఉన్నప్పుడు పసుపు చారలతో మట్టిరంగులో ఉంటుంది. కాని ఎగురుచున్నపుడు తెల్లని రెక్కలు, తోక అడుగు భాగము మెరుస్తూ ఉంటాయి. గ్రుడ్లను పెట్టే కాలంలో దాని వీపుమీద ఎరుపు కలిసిన బూడిద రంగులో కోమలమైన రోమాలవంటి కుచ్చులు బయల్దేరుతాయి; అప్పుడు దాని తల వెనుకభాగాన పొడుగుపాటి తెల్లని తురాయి కూడా బయల్దేరుతుంది. అందుచేత సాధారణంగా అనాకారిగా కనబడే గ్రుడ్డి కొక్కురాయి ఆ కాలంలో పసందైన పిట్టగా మారుతుంది. గ్రుడ్డి కొక్కురాయి ఆహారం

ముఖ్యంగా కప్పలూ, బురదచేపలూ, పీతలూను. బురదతో కూడిన చెరువుల లోను చెలమలలోను కప్పలు, చేపలు, పీతలూ దొరుకుతాయి. అందుచేత అటువంటిచోట్ల గ్రుడ్డి కొక్కరాయిలు ఒంటిగాగాని రెండేసి, మూడేసి కలిసి గాని మనకు కనపడుతూంటాయి. జన సమ్మర్దంగల పట్టణాలలో ఉండే దొరువులు, దేవాలయాలను చేరియున్న కోనేళ్లు కూడ గ్రుడ్డికొక్కరాళ్లను ఆకర్షిస్తాయి. ఎండి పోతున్న నీటి గుంటలలో దాగి విశ్రమించియున్న కప్పల మూకను తృప్తిగా భక్షించడానికి ఈ పక్షులు అచ్చట మందలుగా చేరుతుంటాయి. చెరువువొడ్డున బురదలోనో, లోతులేని నీటిలోనో, గ్రుడ్డి కొక్కరాయి కదలక, మెదలక తలను భుజముల మధ్యకు లాక్కొని గూనుగిలబడి, నిలబడి ఉంటుంది. అంతసేపూ అది పూర్తిగా మెలకువగానే ఉండి తన పొడుగైన మెడకు, బల్లెపు మొనగల ముక్కుకు అందుబాటులోకి ఏదైనా కప్పగాని, చేపగాని పొరపాటున వస్తుందేమోనని నిరీక్షిస్తూంటుంది. అప్పుడప్పుడది తన కాలిని నీటినుండి పూర్తిగా పైకితీసి, మళ్ళీ మెల్లగా దించుతూ సడీ, చప్పుడు లేకుండా నడుస్తుంది. అలాంటప్పుడది మెడను ముందుకు చాచి, ఆహారాన్ని లటుక్కున పట్టుకొనడానికి సరియైన తూకంలో ముక్కును ఉంచుతుంది. వాటిని కలత పెట్టకుండా ఉంటే గ్రుడ్డి కొక్కరాళ్లు మనలను నమ్మి మచ్చికవుతాయి. నీటి ఒడ్డున గుడ్డలుతుకుతున్న చాకళ్లకు, తమ కుండలను మంచి నీటితో నింపడానికి వచ్చిన అమ్మ లక్కలకు కొన్ని అడుగుల దూరంలోనే ఈ పక్షులు నిశ్చింతగా నిలబడి ఉంటాయి. కాని వాటిని కలతపెడితే అవి కప్పల్లా కఠోరంగా అరుస్తూ నారాయణ పక్షుల విలక్షణమైన శైలిలో మంచులాంటి తెల్లని రెక్కలను నిలకడగా కొట్టుకొంటూ ఎగిరిపోతాయి. సాయంకాలం చీకటి పడేవేళకు అవి తమ నెలవులైన చెట్లమీద గుంపులుగా చేరుతాయి. అవి సాధారణంగా పట్టణాలు, గ్రామాల మధ్యలో ఉన్న పెద్ద చెట్లమీద కాకి గూటివంటి గూళ్లను పుడకలతో కడతాయి. ఈ చెట్లు నీటి ఒడ్డున ఉండవలసిన అవసరంలేదు. అవి ప్రతి సంవత్సరం తమ గూళ్లను ఒకే చెట్టుమీద తెల్ల కొంగ, చింతవాక మొదలైన పక్షులతో మిశ్రమ సంఘాలుగా కూడి కడ తాయి. గ్రుడ్డి కొక్కరాయి తూరికి 3 మొదలు 5 వరకూ గ్రుడ్లు పెడుతుంది. ఆ గ్రుడ్లు లేతాకు పచ్చ కలిసిన నీలిరంగులో ఉంటాయి.

కొంగలు (సైకొనిడె కుటుంబము) స్థూలంగా పెద్ద నారాయణ పక్షులను

పోలి ఉంటాయి. వీటికి పొడుగైన కాళ్లుంటాయి. వీటి జంఘికల పై భాగమున చాలవరకు ఈకలుండక బోడిగా ఉంటాయి. వీటికి పొడుగైన మెడలు, బరువైన ముక్కులు ఉంటాయి. ముక్కులు అదోకుగా ఉండి మొనదేలి ఉంటాయి. కొంగలు ఎగిరేటప్పుడు వాటి మెడలను పొడుగుగా చాచి ఉంచుతాయి. నారాయణ పక్షులట్లుగాక మెడలను కుదించుకొని S ఆకారములో ఉంచుకొంటాయి. కనుక ఎగిరేటప్పుడు కొంగలను, నారాయణ పక్షులను సులువుగా గుర్తింపవచ్చును. కొంగలకు స్వరకండరాలులేవు. కనుక అవి మూగగానే ఉంటాయి. అప్పుడప్పుడవి గొంతుకతో గుర్రు గుర్రుమను శబ్దం చేస్తాయి. గ్రుడ్లు పెట్టే కాలంలో మగవీ, ఆడువీ కూడా వాటి దవడలను ఒకదానిపై ఒకటి కొడుతూ పట పటలాడిస్తాయి. ఈ సైకొనిడె కుటుంబానికి చెందిన పక్షులలో భారతదేశంలో ఎక్కువగా కనపడేది కసవుకొంగ (Painted Stork — Ibis Leucocephalus)— పటము 9 — హిందీ: జన్‌ఘిల్, డోక్, కంకారి. ఇది రాబందంత ఉంటుంది. అది నిలుచున్నపుడు తలతో కలిపి ఒక మీటరు ఎత్తుంటుంది. దీని రెక్కలు తెల్లగా ఉంటాయి. రెక్కల పైభాగమున లేతాకుపచ్చ కలిసిన నలుపు చారలుంటాయి. ఈ చారలు మెరుస్తూ ఉంటాయి. దాని రొమ్ము భాగమున అడ్డంగా ఒక నల్లని పట్టీ ఉంటుంది. దాని తోక దగ్గర, నాజూకైన గులాబీ ఎరుపు రంగు ఈకలుంటాయి. అందుచేతనే ఈ పక్షిని ఆంగ్లంలో పెయింటెడ్ స్టోర్కు అంటారు. దీని ముఖంమీద ఈకలుండవు; దీనిముఖం మైనపు పసుపు రంగులో ఉంటుంది. బరువైన దీని పచ్చని ముక్కు కొన కొంచెంగా వంకర తిరిగి ఉంటుంది. ఈ కసవు కొంగలు చిన్న చిన్న గుంపులుగా గాని లేదా పెద్ద పెద్ద మందలుగా గాని తటాకాలవద్ద, బాడవలవద్ద ఉంటాయి. చేపలు, కప్పలు వాటి ముఖ్యాహారం. మిగతా కొంగలతో కలసి ఈ పక్షులు లోతులేని నీటిలోకాని, బాడవలలోకాని కదలకుండా చేపలను వెతుకుతూ గూనుగిలబడి రోజంతా గడుపుతాయి. అవి నీటిలో ఉండే కీటకాలను, పీతలను, నత్తలను కూడా తింటాయి. లోతులేని నీటిలో ఉన్న ఆహారాన్ని గ్రహించడానికి వీని కొక ప్రత్యేక పద్ధతి ఉంది. కసవు కొంగ మెడను ముందుకు చాచి వంచి, నీటిలో మెల్లగా నడుస్తుంది. దాని ముక్కు పుటములను తెరచి కొంత భాగాన్ని నీటిలో ముంచి ఉంచుతుంది. ఆ ముక్కును అలాగే కదలకుండా ఉంచి తన పాదమును పైకెత్తి

నీటిలోనే ముందు వెనుకలకు ఆడించి, నీటిని కలచి చేపలను తెరచి ఉన్న దవడలలోనికి తరుముతుంది. అలా తన కాలిని నీటిలో ముందు వెనుకలకు ఆడిస్తూ, తరుచుగా ఆవైపున ఉన్న తన రెక్కను కూడా అకస్మాత్తుగా విప్పి దాని నీడను నీటిపై పడేటట్లు చేస్తుంది. అందువలన కూడ దాని ఆహారం అతివేగంగా దాని దవుడల మధ్యకు కదులుతుంది. నీటిలో గాని, నీటి ఒడ్డున గాని ఉన్న చెట్లపై ఈ పక్షులు వ్రాలి స్వేచ్ఛగా కూర్చుండి నిద్రపోతాయి. వరుసగా రెక్కలను గట్టిగా కొట్టుకొంటూ, ఉండి ఉండి రెక్కలను కదల్చకుండా కొంచెం దూరం జారుతూ ఈ పక్షులు ఎగురుతాయి. మిగతా కొంగలలాగే ఇవి కూడా ఎండవేళ గాలిలో ఎత్తుకు ఎగిరి, చాల సేపటి వరకూ అక్కడనే రెక్కలను కదల్చకుండా గాలిలో తేలుతూ లేదా గుండ్రముగా తిరుగుతూ కాలక్షేపం చేస్తాయి. అవి నీటిలోనో, నీటి ఒడ్డునో ఉన్న చెట్టుమీద తమ గూటిని పుడకలతో పెద్ద వేదికలా కడతాయి. గూటి మధ్యభాగం పల్లంగా ఉంటుంది. నీటి మొక్కలను, కొమ్మలను, ఆకులను లోపలి అంచున చేర్చి అస్తరుగా అమరుస్తాయి. ఒకే చెట్టుమీద తరుచుగా 10 మొదలు 20 వరకు ఈ గూళ్లుంటాయి. ఆ చెట్టుపైనే నారాయణ పక్షులు, నీటికాకులు, శాంతికొంగలు మొదలగు పక్షుల గూళ్ళు కూడా కలసి ఉంటాయి. కనవు కొంగ తూరికి 3 మొదలు 5 వరకూ గ్రుడ్లు పెడుతుంది. అవి మాసిన తెలుపు రంగులో ఉంటాయి. వాటిపైన అక్కడక్కడ చుక్కలు, చారలు ఉంటాయి.

తెరుపిముక్కు కొంగ (Openbilled Stork—Anastomus Oscitans) — పటము 10 — హిందీ : గుంగ్లా లేక ఘుగ్గిల్. బహుశా ఇదియే మనకు ఎక్కువ పరిచితమైనది, బహు రాష్ట్రములలో వ్యాప్తి చెందినది కావచ్చును. ఇది మిగుల చిన్న కొంగ. ఇది నిలబడినపుడు తలతో కలిసి ఒక మీటరు లోపు ఎత్తు ఉంటుంది. ఇది తెల్లగాగాని ధూమ్ర వర్ణంలో గాని ఉంటుంది. రెక్కలు నల్లగా ఉంటాయి. దీనిని దూరం నుంచి చూచినపుడు వలసవచ్చే తెల్లకొంగేమో అని పొరపడతాము. ఎరుపు కలిసిన నల్లరంగులో ఉండే దాని చిత్రమైన ముక్కు, ఆర్చివలె వంగిన దాని దవుడలు, దౌడల మధ్య కనపడే సన్నని సందు — ఈ లక్షణాలను బట్టి ఈ పక్షిని పొరపాటు పడకుండా గుర్తు పట్టగలం. బాడవల వద్ద, తటాకాల దగ్గర ఈ పక్షులు రెండేసి, మూడేసి చొప్పున గాని లేదా ఇంకా పెద్ద గుంపులుగా గాని మనకు

కనబడుతూంటాయి. కొంగ కుటుంబానికి సాధారణంగా ఉండే అలవాట్లు, ప్రవర్తన దీనికీ ఉన్నాయి. కాని ఇతర కొంగలకు లేనట్టి చిత్రమైన రూపంగల దీని ముక్కు యొక్క వ్యాపారం గాని, అవశ్యకత గాని ఇప్పటికీ సరిగా అర్థం కావడం లేదు. ముఖ్యంగా దానికి ప్రత్యేకాహారమైన పెద్ద నత్తలను సాధించడానికి అనుకూలంగా ఆ ముక్కు మార్పుచెంది యుండాలి. నత్తగుల్ల అంచును పగులగొట్టి మూతను తెరవడానికి ముక్కు మధ్యనున్న ఖాళీ ఈ పక్షి కుపయోగ పడుతుంది. అప్పుడు గుల్లలోనున్న జంతువు యొక్క మృదువైన దేహాన్ని నీటుగా బైటకులాగి మ్రింగివేస్తుంది. కప్పలు, చేపలు, పీతలు, పెద్ద కీటకాలు, యింకా యితరమైన చిన్న జీవులను కూడ అది తింటుంది. తెఱపి ముక్కు కొంగలు సంఘములుగా చేరి గూళ్లు కట్టి గ్రుడ్లను పెడతాయి. ఇవి తరుచుగా నీటికాకులు, నారాయణ పక్షులు, కంకణములు మొదలైన బాడవ పక్షులతో మిశ్రమ సంఘాలుగా జేరి గూళ్లు కడతాయి. వీటి గూళ్లు మోటుగా ఉంటాయి; వాటిని పుడకలతో గుండ్రంగా వేదికలలాగ కడతాయి. గూటి మధ్యభాగం పల్లంగా ఉంటుంది. గూటి లోపలి భాగమున అస్తరుగా నీటి మొక్కల ఆకులనూ, కాడలనూ అమరుస్తాయి. తరుచుగా చాలా గూళ్లు ఒకే చెట్టుమీద దగ్గర దగ్గరగ ఉంటాయి. గ్రామానికి దగ్గరగా చెరువులో గాని, చెరువు ఒడ్డున గాని ఉన్న చెట్లమీద అవి గూళ్లు కడతాయి. గ్రుడ్లు - 3 మొదలు 4 - మాసిన తెలుపు రంగుగా ఉంటాయి. వాటిపైన చుక్కలు కాని, చారలు కాని ఉండవు.

కొంగలన్నింటిలోకి మిక్కిలి పెద్దది బెగ్గురు కొంగ (**Adjutant Stork —Leptoptilos Dubius**)— పటము 11 – హిందీ : హర్గిలా, గరూర్ లేక ఢెంక్). ఇది నిలబడినపుడు రమారమి 1½ మీటర్ల ఎత్తు ఉంటుంది. పాడు నలుపురంగు, బూడిద రంగు, మాసిన తెలుపు రంగులు గల పెద్ద కొంగ బెగ్గురు కొంగ. దాని ముక్కు పసుపు రంగులో, నలుపలకల గసికను పోలి ఉంటుంది. ఈ ముక్కు బరువుగా ఉంటుంది. రమారమి 30 సెంటీమీటర్ల పొడుగుండి ఈకలు లేక బోడిగా ఉండే ఎఱ్ఱని సంచీ దాని రొమ్ము నుండి వ్రేలాడుతూ ఉంటుంది. ఈ జోలెను చూడగానే అది బెగ్గురు కొంగ అని నిర్ధారణ చేయవచ్చును. ఎండిపోతున్న బాడవలవద్దను, ఊరిబైట మ్యునిసిపల్ పెంటకుప్పల వద్దను ఒంటిగా గాని లేదా చిన్న గుంపులుగా

గాని ఈ కొంగలు మనకు తరుచుగా కనబడతాయి. ఇది పైకీ, క్రిందికీ కాలు ఎత్తివేస్తూ మిలటరీ నడక నడుస్తూ ఆహారాన్ని వెతుకుతూ ఉంటుంది. ఈ మిలిటరీ నడకవలన దానికి మిలిటరీ ఉద్యోగి అను అర్థమునిచ్చే 'ఎడ్జుటాంట్' అనే ఇంగ్లీషు పేరు సార్థకమయింది. దానికిగల ఆ వ్రేలాడు సంచీ దానికెట్టి ప్రయోజనమును సిద్ధింపజేయునో ఇంతవరకు అర్థం కావడం లేదు. అది నాసికా కుహరంతో సంబంధంగల ఒక గాలి సంచీలా కనబడుతోంది. గొంతుతో దానికెట్టి సంబంధం లేదు. ఆహారాన్ని గ్రహించి ఆ సంచిలో అది నిలువచేసికొంటుందని ప్రజలనుకొంటారు. కాని అది నిజం కాదు. బెగ్గురు కొంగ ఉచ్ఛిష్టమూ, కసాయివాడు పారవేసే ప్రేగులాంటి నానా కశ్మలమే కాక తరుచుగా రాబందులతో కలిసి మృతకళేబరాలను కూడా తృప్తిగా తింటుంది. చచ్చిన లేదా ఒడ్డుకు కొట్టుకు వచ్చిన చేపలను, కప్పలను, సరీసృపాలను, ఇతర చిన్న జంతువులను కాక జెట్టి మిడుతల్లాంటి పెద్ద కీటకాలను కూడా అది తింటుంది. అది బరువుగా ఎగురుతుంది. అపుడు చప్పుడు కూడా అవుతుంది. గాలిలోకి లేవడానికి ముందు అది తన రెక్కలను బలంగా కొట్టుకొంటూ కొంతదూరం పరుగెత్త వలసి ఉంటుంది. ఎండవేళ మిగతా కొంగలలాగే దీనికికూడ నిర్మలాకాశంలో ఎత్తుగా పైకిలేచి ఉష్ణ వాయుప్రవాహాలలో వలయాకారంగా ఎగరడం ఎంతో ఇష్టం. విశ్రాంతి సమయంలో ఈ పక్షి ఉండే తీరు పటమందు వెనుక భాగంలో కనపడుతుంది. ముంగాళ్లను ముందుకు చాపి కూర్చొని, తలను భుజముల మధ్యకు లాక్కొని దీనంగా కనపడే దాని ఆకారం నిజంగా నవ్వు పుట్టిస్తుంది! ఉన్నతమైన రాతి శిఖరాలమీద కాని, ఎత్తైన అడవి చెట్లమీద కాని బెగ్గురు కొంగ పుడకలతో బ్రహ్మాండమైన గూడు కడుతుంది. గ్రుడ్లు – 3 మొదలు 4 – తెల్లగా ఉంటాయి. సాధారణంగా అవి మాసిపోయి, కాంతిహీనమై ఉంటాయి.

దీని జ్ఞాతియైన చిన్న బెగ్గురు కొంగ (Lesser Adjutant — L. Javanicus) చెదురు మదురుగా కేరళ రాష్ట్రము, సిలోను మొదలగు పెక్కు ప్రదేశాలలో కనబడుతుంది. ముఖ్యంగా దీని పైభాగం లోహంలాగ నల్లగా మెరుస్తూ ఉంటుంది; క్రింది భాగం తెల్లగా ఉంటుంది. దీనికి రొమ్ము నుండి వ్రేలాడే సంచి మాత్రం ఉండదు.

(థ్రెస్కి అర్నిథిడె కుటుంబం (Family Threskiornithidae) లో

కంకణాలు, చెంచాముక్కు కొంగలూ (తెడ్డుమూతి కొంగలు) ఉన్నాయి.

తెల్ల కంకణం (The white Ibis—Threskiornis Melanocephala) — హిందీ: మూండా, మూండూఖ్ లేక సఫేద్ బాజా. ఇది ఒక పెద్దబాడవ పక్షి; పెద్ద సైజు పెంపుడు కోడిపెట్టంత ఉంటుంది. దాని తల, మెడ నల్లగా ఉంటాయి. వాటిపై ఈకలుండవు; బోడిగా ఉంటాయి. ఈ పక్షి ముక్కు పొడుగ్గా, లావుగా, నల్లగా, క్రిందికి వంగి ఉంటుంది. గూళ్లుకట్టి గ్రుడ్లను పెట్టే కాలమందు దాని భుజాల ఈకలు, రెక్కల ఈకలు బూడిద రంగులో ఉంటాయి; మెడ క్రింద పొడుగుపాటి అందమైన కుచ్చులు కూడ బయల్దేరుతాయి. బాడవలయందూ, చెరువుల ఒడ్డునా ఈ పక్షులు చిన్న చిన్న గుంపులుగా గాని, పెద్ద పెద్ద మందలుగా గాని కనబడుతూంటాయి. 'చెంచా ముక్కులు' కొంగలతోపాటు ఇవికూడా బాగా పచ్చ గడ్డి గల చిత్తడి నేలలలోనూ, వరిమళ్లలోనూ చురుకుగా నడుస్తూ తిండికోసం సగం తెరచి ఉంచిన వాటి శ్రావణం వంటి ముక్కులతో మెత్తని బురదను కెక్కరిస్తాయి. ఇలా లోతులేని నీటిలో ఆహారమును గ్రహించేటప్పుడు తరచుగా తలను అవి నీటిలో పూర్తిగా ముంచుతాయి. ఈ పక్షికి ముఖ్యాహారం నత్తలు, పీతలు, కప్పలు, క్రిములు, కీటకాలున్నూ. అప్పుడప్పుడిది చేపలను కూడా తింటుంది. కలతచెందినపుడూ, నిద్రపోయేటప్పుడూ ఈ పక్షులు స్వేచ్ఛగా చెట్లపైన కూర్చుంటాయి. ఇది బలంగా, సూటిగా ఎగురుతుంది. ఎగిరేటప్పుడది దాని పొడుగైన ముక్కును, మెడను ముందుకు చాచి, కాళ్లను దాని తోక అడుగునుంచి వెనకకు చాచి, ఎగురుతుంది. అది రెక్కలను వరుసగా, బలిష్ఠంగా వేగంగా కొడుతూ, మధ్య మధ్య రెక్కల కదలికను ఆపి, జారుతూ ఎగురుతుంది. చెట్లనుండి ఆహారముండే స్థలాలకు, వాటి నుండి తిరిగి చెట్లమీదకు ఎగిరిపోయేటప్పుడు ఈ పక్షులు సాధారణంగా బాతుల గుంపువలె — V ని బోలు నిర్మాణంలో ఎగురుతాయి; లేదా ఐమూలగా వంపులు తిరిగిన రిబ్బనులవలె ఎగురుతాయి. కొంగలు, చెంచాముక్కులు వలెనే వీటికి కూడా స్వరపేటికలు లేవు. కాని గూళ్లను కట్టి గ్రుడ్లను పెట్టేకాలంలో ఈ పక్షులు విచిత్రమైన ధ్వనులు చేస్తాయి. ఈ ధ్వనులు అంతగా బిగ్గరగా ఉండవు కాని దూరంగా ఉన్న ఈ పక్షుల గుంపునుండి ఈ ధ్వని తరంగాలుగా వచ్చినపుడు అనేకమంది మనుష్యులు కలిసి మాట్లాడినప్పుడు కలిగే సణుగుడులాగ ఉంటుంది.)

తెల్ల కంకణం పుల్లలతో ఒక బల్ల పరుపైన వేదికలా గూడు కడుతుంది. ఆ గూటికి సాధారణంగా అస్తరుండదు. నీటిలోగాని, నీటి ఒడ్డునగాని ఉన్న చెట్లమీద ఈ పక్షి గూటిని కడుతుంది. ఊరిపొలిమేర్లలో కూడ ఇది గూడు కట్టడం కలదు. ఆహారాన్వేషణలో సహవాసులైన పక్షులతోనూ, నీటికాకులు, కలికి పిట్టలతోనూ కలిసి తెల్ల కంకణాలు తరుచుగా గూళ్లు కడతాయి. గ్రుడ్లు — 2 మొదలు 4 — లేత నీలిరంగు కాని లేతాకుపచ్చ గాని కలిసిన తెలుపు రంగులో ఉంటాయి. గ్రుడ్లు పూర్తిగా ఒకే రంగులో ఉంటాయి, లేదా వాటిపై లేతపసుపుఛాయతో కూడిన గోధుమరంగు చుక్కలుంటాయి.

నల్ల కంకణం (The Black Ibis—Pseudibis Papillosa) — పటము 12 — హిందీ : కాలా బాజా లేక కరాన్క్యూల్. ఇది నల్లని పక్షి. కాని ఇది ఆకారంలోనూ, పరిమాణంలోనూ తెల్ల కంకణంలాగే ఉంటుంది. దీని భుజం దగ్గర తెల్లని మచ్చ ప్రస్ఫుటంగా కనబడుతుంది. దీని కాళ్లు ఇటుక-ఎరుపు రంగులో ఉంటాయి. దీని తలమీద ఈకలుండవు; నల్లగా ఉంటుంది. ఆ నల్లని తలమీద ఉబ్బెత్తుగా ప్రకాశవంతమైన ఎరుపు రంగులో త్రిభుజాకారంగల పులిపిరికాయల మాసిక వుంటుంది. ఈ పక్షిని పోల్చుకొనడానికిదొక మంచి గుర్తు. గ్రామాల్లోని పంట భూములకు వెలుపలనున్న మైదానాల్లో ఈ పక్షులు తరుచుగా కనబడతాయి. అవి మూడో నాలుగో చేరి గుంపుగా గాని, చెదురు మదురుగా మూడు మొదలు కొని పది పక్షుల వరకూగల మందగా గాని కనపడతాయి. తెల్ల కంకణం లాగ ఇది తటాకాల మీద, చెరువులమీద అంతగా ఆధారపడదు. తరుచుగా ఈ పక్షి నీటికి చాలా దూరంగానే ఉంటుంది. కీటకాలూ, గింజలూ దీని ముఖ్యాహారం; కాని తొండలు, చిన్న పాములు, జెట్టులు కూడా దానికి ఇష్టమైన ఆహారమే. ఈ పక్షులకు కొన్ని స్థలాలంటే ప్రత్యేకంగా అభిమానం. ఆ స్థలాలలోనే అవి వుంటాయి. ప్రత్యేకంగా కొన్ని చెట్లమీదనే అవి అలవాటుగా పడుకొంటాయి. రెక్కలను క్రమబద్ధంగా ఒక వరుసలో కొన్ని సార్లు కొట్టుకొంటూ, మధ్య మధ్య రెక్కలు కొట్టకుండా జారుతూ V — ని బోలు నిర్మాణంలో ఆ చెట్లను ప్రతీ రాత్రీ చేరుకొంటాయి. ఎగురుతూన్నపు డవి అప్పుడప్పుడు ముక్కుతో రెండు, మూడు స్వరాలు గల అరుపులు అరచినా మొత్తంమీద అవి నిశ్శబ్దంగా ఉండే పక్షులనే చెప్పాలి. వీటి

అరుపులు 'బాపనబాతు' అరుపులను గుర్తుకు తెస్తాయి. నల్ల కంకణాలు మిగతా జాతుల పక్షులతో మిశ్రమ సంఘాలుగా ఏర్పడి గూళ్లు కట్టవు. కాని స్వజాతికి చెందిన పక్షుల రెండు, మూడు గూళ్లు ఒకే చెట్టుమీద ఉండటం కద్దు. నల్ల కంకణం ఒక పెద్ద కప్పులా పుడకలతో గూడు కడుతుంది. దాని లోపల భాగాన ఎండుగడ్డితోనూ, ఆకలతోనూ అస్తరు ఏర్పరుస్తుంది. ఈ గూడు పెద్ద చెట్టుమీద ఎత్తైన భాగంలోనో, నీటికి దూరంగా ఉన్న తాటి చెట్టుమీదనో ఉంటుంది. అప్పుడప్పుడు గ్రద్దలు, రాబందులు కట్టివదలివేసిన పాతగూళ్లను కూడ ఇవి ఉపయోగించుకొంటాయి. దీని గ్రుడ్లు — 2 లేక 4 — కాంతివంతమైన లేతాకుపచ్చ రంగులో ఉంటాయి. వాటిపైన ఏ గుర్తులూ లేక పోవచ్చును లేదా ధూమ్రవర్ణపు చుక్కలూ, చారలూ ఉండవచ్చును.

చెంచాముక్కు కొంగ లేక తెడ్డుమూతి కొంగ (The Spoonbill — Platalea Leucorodia) — పటము 13 — హిందీ: చెంచాబాజా లేక డావిల్. ఇది కంకణానికి మిక్కిలి దగ్గర బంధువే అయినప్పటికీ కంకణానికీ దీనికి ఆకారంలోనూ, ముక్కులోనూ చాల వ్యత్యాసం ఉంది. దీని ముక్కు చాల భాగము నల్లగాను, చివరిభాగము మాత్రము పసుపు పచ్చగాను ఉంటుంది. అంతేకాక అది వెడల్పుగను, తప్పటగను ఉండి కొన భాగము చెంచావలె ఇంకను వెడల్పై ఉంటుంది. ఈ పక్షి పెంపుడు బాతుకంటె పెద్దది. నిలబడినప్పుడు దీని ఎత్తు రమారమి 45 సెంటీ మీటర్లుంటుంది. ఇది మంచు తెలుపు రంగులో ఉంటుంది. దీని కాళ్లు, మెడ పొడుగ్గా ఉంటాయి. గూళ్లు కట్టి గ్రుడ్లు పెట్టే కాలములో దీని మెడవెనుక భాగాన్ని లేతపసిమి వర్ణంగల పొడుగైన పింఛము, మెడ క్రింద పసుపు పచ్చని మచ్చ ఏర్పడతాయి. ఈ పక్షులు ఒంటరిగాగాని, 10 మొదలు 20 వరకూ కలిసి గుంపులుగా గాని మనకు కనపడతాయి. ఒక్కొక్కప్పుడు కొంగలు మొదలైన యితర బాడవ పక్షులతో కూడ కలిసి తిరుగు తూంటాయి. ఈ పక్షులు భారతదేశవాసులే అయినను శీతకాలములో ఇతర దేశాలనుండి కూడా ఈ పక్షులు ఈ దేశం విశేషంగా వలస రావటం మూలాన్ని అవి సంఖ్యలో పెరిగినట్లు కనబడతాయి. చెంచా ముక్కు కొంగలు బాడవలవద్ద, చెరువుల దగ్గర, నదుల ఒడ్డున బురదలోనూ, నదీ ముఖద్వారాల వద్దను తరుచుగా తిరుగాడుతాయి. ఒడ్డున నున్న లోతులేని

నీటిలో ఈ పక్షులు ప్రొద్దుట, సాయంత్రం కూడా మంచి చురుకుగా ఆహారాన్ని సేకరిస్తాయి. మధ్యాహ్నము వేళ ఏ యిసుక దిబ్బ మీదనో అవి విశ్రాంతి తీసికొంటాయి. అవి చెట్లనుండి ఉదయం ఆహారం దొరికే చోట్లకు, అక్కడనుంచి సాయంకాలం చెట్లమీదకు ఏటవాలుగా ఒకే పంక్తిలో ఒకదాని వెనుకనొకటి మెల్లగా, క్రమబద్ధంగా రెక్కలను కొట్టుకొంటూ ఎగురుతూ పోతాయి; లేదా క్రమబద్ధమైన V— ఆకారంలో ఎగురుతాయి. అవి ఎగిరే టప్పుడు వాటి మెడను ముందుకూ కాళ్లను వెనుకకూ చాచి ఉంచుతాయి. చిఱుకప్పలు, కప్పలు, నత్తజాతి జంతువులు, నీటిలో ఉండే కీటకాలు వాటి ఆహారం. అవి కొంత శాకపదార్థాన్నికూడా తింటాయి. ఈ పక్షులు గుంపులు గుంపులుగా చెరువులందు లోతులేని నీటిలో మెడను ముందుకు చాచి, వాటి ముక్కులను అడ్డంగా పెట్టి, కొంచెం తెరచి, నీటి అడుగున ఉన్న బురదను క్రిందిపుటాల కొనలతో త్రవ్వుగోలతో గోకినట్లు గోకుతాయి. ఈ మందలోని పక్షులు దగ్గరగా కూడి, ఒకదాని నొకటి తోసుకొంటూ నీటిలో ఈ విధంగా బురదను గోకుతూ ముందుకు త్వరగా సాగిపోతాయి. బాగా ఆహారం దొరికే చోటులందు అవి ముందుకూ వెనుకకూ ఒక క్రమమైన పద్ధతిలో నడుస్తూ ఆహారాన్ని గ్రహిస్తాయి. ఈ పక్షి అప్పుడప్పుడు గుట్టుమనే శబ్దం మాత్రమే చేస్తుంది. 'చెంచాముక్కు కొంగలు' గుంపులుగా చేరి గూళ్లు కడతాయి; లేదా నారాయణ పక్షులు, కంకణాలు, నీటికాకులు, శాంతికొంగలతో మిశ్రమ సంఘాలుగా చేరి గూళ్లు కట్టవచ్చును. దీని గూడొక పెద్ద పుడకల వేదిక. ఈ గూటిని తరుచుగా అది గ్రామం వెలుపల చెరువులో గాని, లేక చెరువు ఒడ్డున గాని ఉన్న చెట్టుమీద కడుతుంది. గూటిలో, సాధారణంగా 4 గ్రుడ్లు ఉంటాయి. అవి సాధారణంగా మాసిన తెలుపురంగులో ఉంటాయి. ఆ గ్రుడ్ల మీద ఎరుపు కలిసిన ముదురు గోధుమరంగు మచ్చలు కూడ ఉండవచ్చును.

భారతదేశంలో ఫీనికాప్టెరిడె కుటుంబానికి (Family Phoenicopteridae) చెందిన పక్షి ఒక్కటి మాత్రమే ఉంది. అది రాజహంస (Flamingo — Phoenicopterus Roseus) — పటము 14 – హిందీ: బాగ్‌హంస్సు లేక భరాట్‌భరాట్‌బగ్గో. దీనిని సముద్రపు చిలువ అని కూడ కొందరు పిలుస్తారు. అది లేతగులాబి కలిసిన తెలుపు రంగు పక్షి. ఈ పక్షి పెద్ద పెంపుడు బాతంత ఉంటుంది. దీని కాళ్లు పొడుగ్గా లేత ఎరుపు రంగులో ఉంటాయి. ఈ కాళ్లు ఈకలు లేక బోడిగా ఉంటాయి. దీని మెడ పొడుగ్గా

పామువలె ( ᔕ ) వంకర తిరిగి ఉంటుంది. నిలుచున్నపుడది రమారమి 1½ మీటర్ల ఎత్తు వుంటుంది. దీని ముక్కు బరువు కలిగి లేత ఎరుపు రంగులో చిత్రంగా ఉంటుంది. దీని ముక్కులో చివరి సగభాగం క్రిందికి ఒక కోణంలో వంపు తిరిగి ఉంటుంది. బాతుకువలెనే దీని కాలివ్రేళ్ల మధ్యను చర్మం ఉంది. ఈ పక్షుల మంద, ఎగురుచున్నపుడు వాటి రెక్కల ప్రకాశవంతమైన ఎఱ్ఱని ఈకలు, నల్లని అంచులు ఎంతో చూడ ముచ్చటగా ఉంటాయి. అది మరుపురాని దృశ్యం. తటాకాలు, ఉప్పునీటి మడుగులు, నదీ ముఖద్వారాలు — వీటి వద్ద రాజ హంసలు మందలు మందలుగా నివసిస్తాయి. ఇవి భారతదేశంలోనూ, పాకిస్తాన్‌లోనూ, సిలోనులోనూ అక్కడక్కడ ఉన్నాయి. ఈ ప్రదేశాలలో అవి ఒక్క చోటునుండి వేరొక చోటికి వలస పోతూంటాయి. ఇవి చిన్న గుంపులుగా ఉంటాయి. కొన్ని గుంపులు చాలా పెద్దవిగా కూడా ఉంటాయి. పెద్ద గుంపుల్లో కొన్ని వేల పక్షులుంటాయి. లోతులేని నీటిలోకి అవి నడిచివెళ్లి, మెడను క్రిందికి వంచి, తలను పూర్తిగా నీటిలో ముంచి ఆహారాన్ని సంపాదిస్తాయి. దాని ముక్కు బోర్లగిలి ఉండటంచేత దాని కొనతో నీటి అడుగున ఉన్న బురదను పెల్లగిస్తుంది. ఈ స్థితిలో దాని పైదవుడ ఒక గరిటను పోలి ఉంటుంది. అందులోనికి ఒండ్రు చేరుతుంది. ఆ ఒండ్రును అది నాలుకతో నొక్కుతుంది. అపుడు నీరు దువ్వెనవంటి ముక్కు అంచుల ద్వారా పైకిపోయి సూక్ష్మమైన ఆహారపు కణములు ముక్కులో ఉండిపోతాయి. అవసరము వచ్చినపుడు ఈ పక్షులు సునాయాసంగా నీట ఈదగలవు. లోతునీటిలో అవి ఆహారాన్ని సంపాదించేటప్పుడు అట్టడుగున ఉన్న ఆహారాన్ని అందుకొనడానికి బాతులాగ తోకచిగురు మాత్రం నీటిపైన ఉండేటట్లు అవి తల క్రిందుగా నీట మునుగుతాయి. చిన్నచిన్న నత్తలు, కీటకాల లార్వాలు, క్రిములు, బాడవ మొక్కల గింజలు, బురదలో ఉండే సేంద్రియ పదార్థాలు రాజహంసల ఆహారం. రాజహంసలు రెక్కలను వేగంగా కొట్టుకొంటూ పెద్ద బాతుల వలె V — నిర్మాణంలో గాని లేదా అలలు అలలుగా బమూల శ్రేణులలో గాని ఎగురుతాయి. అవి ఎగిరేటప్పుడు వాటి సన్నని మెడలను ముందుకు చాచి ఉంచుతాయి. వాటి ఎఱ్ఱని కాళ్లను తోక అడుగున వెనుకకు చాచి ఉంచుతాయి. సాధారణంగా ఈ పక్షులు నిశ్శబ్దంగా ఉంటాయి. అప్పుడప్పుడవి పెద్ద బాతుల్లాగ శబ్దం చేస్తూంటాయి. ఆహారాన్ని తీసికొనే

టప్పుడు అవి అన్నీ కలిసి రొదచేస్తూ ఉంటాయి. మనకు తెలిసినంతవరకు మనదేశంలో రాజహంసలు గ్రుడ్లు పెట్టే స్థలం "గ్రేటు రాన్ ఆఫ్ కచ్" ఒక్కటేను. అక్టోబరు–మార్చిల మధ్యకాలంలో నీటి పరిస్థితి అనుకూలంగా ఉన్నపుడు రాజహంసలు అక్కడ పెద్ద మందలుగా చేరుతాయి. ఈ పక్షుల సంఖ్యను అంచనా వేసినవారు అవి అరమిలియనుకు పైన ఒక మిలియనుకు లోపు ఉండవచ్చునని తేల్చారు. కచ్‌లో గ్రుడ్లను పెట్టే ఈ ఫ్లెమింగో కాలనీ లేక "ఫ్లెమింగో పట్టణము" బహుశా ప్రపంచంలోని ఫ్లెమింగో కాలనీలలో కెల్ల పెద్దదయి యుండవచ్చును. దీని గూడు ఒక శృంగాకారపు మట్టిదిబ్బ. ఈ గూటిని అది పలుచని బురదతో కడుతుంది. కట్టిన గూడు ఎండలో ఎండి, గట్టిపడుతుంది. దీని సగటు ఎత్తు రమారమీ 30 సెంటీమీటర్లుంటుంది. ఈ దిబ్బ పైభాగాన్ని నొక్కి కొద్దిగా పల్లం చేస్తుంది. అందులో ఒకే ఒక గ్రుడ్డుగాని లేక రెండు గ్రుడ్లుగాని పెడుతుంది. రాజహంస కాళ్లను ముడుచుకొని గ్రుడ్లమీద కూర్చుండి పొదుగుతుంది. కొన్ని పాతపుస్తకాలలో రాజహంస దిబ్బ ప్రక్కను నిలబడి గ్రుడ్లను పొదుగుతుందని వర్ణించారు. కాని అది వాస్తవం కాదు.

ఏన్సరి ఫార్మీస్ వర్గం (Order ANSERIFORMES) లోని పక్షులను వినోదం కొరకు వేటాడుతారు; వాటిని ఆహారంగా కూడా బాగా ఉపయోగిస్తారు. అందుచేత ఇవి ప్రజాదరణకు మిక్కిలి పాత్రమైనాయి. ఈ వర్గంలో హంసలు (Swans), పెద్దబాతులు (Geese), పొట్టి బాతులు (Ducks) చేరుతాయి. చిన్న పావురాలను గువ్వలన్నట్లే చిన్నసైజు పొట్టి బాతులను ఇంగ్లీషులో "టీల్సు" (Teals) అంటారు. పొట్టి బాతులకూ 'టీల్సు'కూ గల తేడా నామ మాత్రమే.

హంసలు విశేష శీతల సంవత్సరాలలో ఉత్తర ధ్రువ ప్రాంతపు యూరపునుండి, ఆసియానుండి లేచి వచ్చే దేశద్రిమ్మరులు. కనుక వాటిని గురించి యిచ్చట ముచ్చటించవలసిన అవసరంలేదు. శీతాకాలంలో మన ప్రాంతానికి కొన్ని పెద్ద బాతులు వస్తాయి. వీటిలో మనకు బాగా తెలిసినది దారలతల పెద్దబాతు (Barheaded Goose — Anser Indicus)

— పటము 15 — హిందీ : హంస్, సవాన్, బిర్వా. ఇది పెంపుడు పెద్ద బాతులలో చిన్నది ఎంత ఉంటుందో రమారమి అంత ఉంటుంది. ఇది ముఖ్యంగా బూడిద, గోధుమ, తెలుపు రంగులు కలిగి ఉంటుంది. తెల్లని తల, తెల్లని మెడ ప్రక్కలు, పసుపు పచ్చని ముక్కు, తల వెనుక భాగాన అడ్డంగా రెండు వెడల్పైన నల్లచారలు — ఈ అంశాలను బట్టి ఈ పక్షిని సులభంగా పోల్చుకోవచ్చును. నదుల మీదా, తటాకాల మీదా, గోధుమచేలల్లోను, కాయ ధాన్యాల పొలాల పరిసరాలలోనూ ఈ పక్షులు మందలు మందలుగా కనిపిస్తాయి. ఇవి 15 మొదలు 20 పక్షులు కలిసి చిన్నగుంపుగనూ, ఒక్కొక్కప్పుడు ఇంకా పెద్ద మందలుగాను పొలాలలో చేరి లేతగోధుమలను, కాయధాన్యాలనూ తింటాయి. మిట్ట మధ్యాహ్నపు ఎండలో నదీసైకత శ్రేణులలో అవి విశ్రాంతి తీసికొంటూ ఉంటాయి. వేటగాళ్ళ బాధపడలేక ఈ పక్షులు సంధ్యాకాలంలోనూ, రాత్రులందూ ఆహారాన్వేషణకు బయల్దేరుతాయి. సూర్యాస్తమయం అయేటప్పటికి యీ పక్షికి చురుకు పుడుతుంది. అప్పుడవి V — నిర్మాణంలోగాని బమూలగా రిబ్బనులలాగగాని మంద వెంబడి మంద ఆహారం దొరికే చోటులకు ఎగురుతూ పోతాయి. అన్ని పెద్ద బాతులవలెనే ఇవికూడా పొలాలలో నడుస్తూ మేస్తాయి ; లేదా లోతులేని నీటిలో తోకలను నిట్టనిలువుగా నీటి పైన ఉంచి, ముందు భాగాన్ని నీటిలో ముంచి, నీటి అడుగున ఉన్న ఆహారాన్ని గ్రహిస్తాయి. శీతాకాలపు పైరుల లేత కొమ్మలు, గింజలు, బాడవ మొక్కల దుంపలు ఈ పక్షుల ముఖ్యాహారం.

ఈ పక్షి ఆంగ్, ఆంగ్ అని వివిధ స్వరాలలో ఇంపుగా కూస్తుంది. మాటొగ్గి పొంచియున్న బోయవాడు పైనుండి ఈ పక్షులు ఎగురుతూ కూసి నపుడు ఎంతైనా సంబరపడతాడు. చారలతల పెద్దబాతు ఎల్లప్పుడూ జాగరూకత కలిగియుండే పక్షి. అందుచేత దీనిని పట్టడం అతి చాక చక్యమూ, విశేష శ్రమలతో కూడిన పని. కాని చిత్రమేమిటంటే, బుద్ధుని అహింసా సిద్ధాంతము అమలులో ఉన్న టిబెట్టు లాంటి దేశాలలో ఈ పక్షులు మానవులకు బాగా అలవాటయి "యాక్" కాపరుల శిబిరాల వద్ద నిశ్చింతగా తిరుగుతాయి.

చారలతల పెద్ద బాతు లదాక్‌లో గూళ్ళుకట్టి గ్రుడ్లు పెడుతుంది. అంత కన్న మనకు దగ్గర ప్రాంతాలలో దీని గూళ్ళు కనపడవు. ఈ పక్షి

ఎత్తైన ప్రదేశాల్లోని సరస్సుల యొడ్డున కోమలమైన మొక్కల్లో పల్లంచేసి, ఆ పల్లానికి లోపలి తట్టున మెత్తని ఈకలతో అస్తరు అమరుస్తుంది. ఆ గూటిలో దాని గ్రుడ్లు — 3 మొదలు 4 — దంతపు తెలుపు రంగులో ఉంటాయి.

సామాన్యంగా వలస వచ్చేమరొక పెద్ద బాతు బూడిదరంగు పెద్ద బాతు (Greylag — Anser Anser) — హిందీ : కాజ్. ఇప్పుడున్న అన్ని పెంపుడు పెద్దబాతులకూ ఇదియే మూల పిత అని భావిస్తారు. ఈ పక్షి పరిమాణంలోనేమి, రూపురేఖలలోనేమి గోధుమరంగు పెంపుడు పెద్ద బాతును పోలి ఉంటుంది. దీని పృష్ఠము బూడిదరంగులోను, ముక్కు మాంసపు ఎరుపు రంగులోను ఉంటాయి. చారలతల పెద్దబాతువలె నదుల వద్దకాక ఈ పక్షి బాడవల వద్దనే ఎక్కువగా కనబడుతుంది.

భారతదేశంలో శీతకాలంలో సామన్యంగా 20 కి పైగా ఉన్న అడవి బాతుల జాతులలోను అయిదారు జాతులు మాత్రమే ఈ దేశంలో నివసించేవి, ఈ దేశంలోనే గ్రుడ్లు పెట్టేవిన్నీ. తక్కినవన్నీ ఇతర దేశాలనుండి ముఖ్యంగా సైబీరియానుండి ఈ దేశానికి వలసవచ్చునవే. భారతదేశపు బాతులలో బాగా వ్యాప్తి చెందినది బూడిదరంగు బొట్టిబాతు (Spotbill or Grey Duck—Anas Poecilorhyncha) — పటము 16 — హిందీ : గర్మపాయ్ గూగ్రాల్, లద్దిమ్. ఇది పెంపుడు బాతంత ఉంటుంది. దీని ఈకలు లేతగోధుమ, ముదురుగోధుమ రంగులలో పొలుసుల మాదిరిగా అమరి ఉంటాయి. తెలుపు, నలుపు ప్రకాశవంతమైన ఆకుపచ్చ - ఈ మూడు రంగులతో కూడిన రెక్కల పట్టీలు ఈ పక్షిని గుర్తు పట్టడానికి ముఖ్యమైన చిహ్నాలు. దాని కాంతివంతమైన నారింజ – ఎరుపు కాళ్లు, పసుపురంగు అగ్రముగల నల్లని ముక్కు, ముక్కు వెనుక నుదుటి కిరువైపుల రెండు నారింజ – ఎరుపు చుక్కలు చూడగానే అది స్పాట్ బిల్ అని పూర్తిగా నిర్ధారణ చేయవచ్చును. అవి జతలు జతలుగానూ, చిన్నచిన్న మందలు గానూ రెల్లు గడ్డిగల లోతులేని బాడవలవద్ద కనపడుతూంటాయి. కాని అవి శీతకాలంలో మనదేశానికి వలసవచ్చే ఇతర జాతులంత ముమ్మరంగా మాత్రం ఉండవు. నీటిలో దేవులాడుతూ పైభాగాన ఆహారం సంపాదించే జాతికిది చెందుతుంది. అది ఇటూ అటూ నడుస్తూ, చిత్తడినేలలోనూ, వరి పొలాలలోనూ, క్రిమికీటకాలను గ్రహిస్తుంది; లేదా లోతులేని నీటిలో

అడుగున ఉన్న బురదను అందుకొనడానికి ముందుభాగాన్ని మునక పెట్టి ; చోద్యంగా తోకను నీటిపైన ఉంచి, అలా తల క్రింద స్థితిలో ఉండడానికి అనువుగా కాళ్లను నీటిలో వెనుకకు తంతూ, ఆహారాన్ని సంపాదిస్తుంది. స్పాట్‌బిల్లుకు శాకాహారమే ముఖ్యాహారము. అది నీటి మొక్కల ప్రకాండాలను, నీటి మొక్కల గింజలను, ధాన్యపు గింజలను తింటుంది. ఇవి కాక నత్తలను, నీటిలో ఉండే కీటకాలను, క్రిములను కూడా తింటుంది. అది బాగా సత్తువతో ఎగిరే పక్షి. అందుచేత దానిని వేటాడటం వేటగాళ్లకు, ఎంతో ఇష్టం. అంతేకాదు, దాని మాంసం చాలా రుచికరమైంది ; కనుక అది కనబడితే దానిని వదలిపెట్టరు. సామన్యంగా ఈ పక్షులు నిశబ్దంగా ఉంటాయి. భయపడినపుడే అవి శబ్దం చేస్తాయి. మగబాతు పిలుపు కర్ణకఠోరంగా ఉంటుంది. ఆడబాతు గట్టిగా క్వేక్ అంటుంది. అనుకూలమైన నీటి వసతులుంటే స్పాట్‌బిల్ సంవత్సరం పొడుగునా గ్రుడ్లు పెడుతుంది. దీని గూడు పచ్చగడ్డితోనూ, కలుపు మొక్కలతోనూ తయారైన ఒక మెత్త. ఈ మెత్తలో మెత్తని ఈకలనుంచి అస్తరు నిర్మించడం కూడా కద్దు. ఈ గూటిని అది చెరువు అంచునో, బాడవ అంచునో పచ్చికలో పైకి కనబడకుండా నిర్మిస్తుంది. గ్రుడ్లు — 7 మొదలు 9, ఒక్కొక్కప్పుడు 12 వరకూ కూడా ఉంటాయి. అవి బూడిదరంగుతో కూడిన పసిమి వర్ణంలోనో లేదా లేత ఆకుపచ్చతో కూడిన తెలుపురంగులోనో ఉంటాయి. వాటిమీద చారలు కాని చుక్కలు కాని ఉండవు.

ఈలవేసే చిన్న చిలువ (The Lesser Whistling Teal — Dendrocygna Javanica) — పటము 17— హిందీ : సీల్హి లేక సీల్‌కాహి. ఇది స్పాట్‌బిల్ కన్నా చిన్నది. కొంచమెచ్చు తగ్గుగా దీని దేహమంతా చెస్‌నట్ రంగులో ఉంటుంది. ఇదే పరిమాణంగల మరో చిలువ ఏదీ ఈ రంగులో ఉండదు కనుక దీనిని సులువుగా గుర్తు పట్టవచ్చును. అది ఎగిరేటప్పుడు కూసే కర్ణకఠోరమైన ఈలకూతను బట్టి కూడా దానిని సులువుగా గుర్తు పట్టవచ్చును. రెల్లు, తేలే మొక్కలుగల చెరువులు, బాడవలు, నీటితో నిండిన వరిపొలాలు—వీటిలో ఈ పక్షులు పది పదిహేను కలిసి గుంపులుగా కనపడతాయి. చుట్టూ చెట్లున్న నీటి పరిసరాలంటే ఈ పక్షులకు ఎంతో ఇష్టం. ఆ చెట్ల కొమ్మలమీద అవి యథేచ్ఛగా కూర్చుంటాయి. దీనికిగల ఈ అలవాటును బట్టియే ఈ పక్షికి కపిల

పటము 17

ఈలవేసే చిన్న సిలువ

(*Dendrocygna javanica*)

పుట 52





పటము 18

పూడి చిలువ

(*Nettapus coromandelianus*)

పేజీ 53

పటము 19

మాల గద్ద

(*Milvus migrans*)

పేజి 56





పటము 20

**బాపనగద్ద (కృష్ణగద్ద)**

(*Haliastur indus*)

పుట 56



పటము 21

జాలడేగ

*(Accipiter badius)*

పే. 55



పటము 22

తెల్లవీపుబోరువ (బంగాళాబోరువ)

(*Gyps bengalensis*)

పేజీ 58



పటము 24

**శాహీన్ భైరవి**

(*Falco peregrinator*)

పేజి 61

వృక్షపుబాతు అను అర్థమువచ్చు "ఫల్వస్ ట్రీ డక్" అనే ఇంగ్లీషు పేరు వచ్చింది. అనావృష్టి పరిస్థితులలో ఈ పక్షులు స్థానికంగా ఒక చోటునుండి వేరొకచోటుకు పోతూఉంటాయి. ఇది నీరసంగా రెక్కలను కొట్టుకొంటూ జకానా మాదిరిగా ఎగురుతుంది. అది ఎగిరేటప్పుడు మాటిమాటికీ సీ-సిక్, సీ-సిక్ అంటూ ఈల వేస్తుంది. దీని కూత కొంతవరకూ పెద్ద కంపజిట్ట (Large Pied Wagtail) కూతవలె ఉంటుంది. ఈ పక్షులు బాగా నడువ గలవు; నీటిలో బాగా మునుగగలవు. వీటి ఆహారం నత్తలు, క్రిములు, కప్పలు, చేపలే కాక లేతచిగుళ్లు, వరి గింజలు కూడాను. ఆకులు, రెల్లు, పచ్చగడ్డి - వీటితో విస్లింగ్ టీల్ నీటియొడ్డున, ముండ్ల మొక్కల నేల మీద, మెత్తవంటి గూడు కట్టుకొంటుంది; లేదా నీటికి దూరాన ఉన్న పెద్ద చెట్ల కాండముల పలవలలో పుడకలతో గూడు కట్టుకొంటుంది. ఇది చెట్ల తొఱ్ఱలలో కూడ గూడు కట్టుకోవచ్చును. ఒక్కొక్కప్పుడు గ్రద్దలూ, కాకులూ కట్టి వదలివేసిన పాతగూళ్లను కూడా ఈ పక్షులు ఉపయోగించు కొంటాయి. గూటిలో 7 మొదలు 12 వరకూ గ్రుడ్లు ఉంటాయి. సాధారణంగా 10 గ్రుడ్లుంటాయి. ఈ పక్షి పెట్టినపుడు గ్రుడ్లు పాలవలె తెల్లగా ఉంటాయి. కాని పొదిగిన కొద్దీ అవి గోధుమ రంగులోకి మారుతాయి.

ఈలవేసే పెద్ద చిలువ (The Large Whistling Teal — D. Bicolor). ఇది కూడా మన దేశంలో ఉండే పక్షే. కాని ఈ పక్షులు కొద్దిగా మాత్రమే ఉన్నాయి. చిన్న చిలువ కన్నా ఇది పరిమాణంలో పెద్ద దగుట వల్లను, దీని తోక యందలిపై ఈకలు చెస్‌నట్ రంగులో ఉండక తెల్లగా ఉండటం వల్లను ఈ పక్షిని చిన్నచిలువ నుండి సులువుగా పోల్చవచ్చును.

ఈ దేశంలో నివాస మేర్పరచుకొన్న అడవి బాతులన్నింటిలోకీ చిన్నది దూది చిలువ (Cotton Teal — Nettapus Coromandelianus) — పటము 18— హిందీ: గిర్జియా, గూర్గూరా, సోనియా. ఇది గ్రామాలలో ఉండే చిన్న కోడిపెట్టంత ఉంటుంది. దీని యీకలలో తెల్లనివే ఎక్కువగా ఉంటాయి. మగబాతుకు దేహపు పైభాగం నల్లగానూ, తల, మెడ, దేహపు క్రింది భాగము తెల్లగానూ ఉంటాయి. దీనికి సన్నపాటి నల్లని కంఠమాలా, రెక్కలకు తెల్లని పట్టీ ఉంటాయి. పక్షి ఎగిరేటప్పుడు ఈ పట్టీ స్పష్టంగా కనబడుతుంది. ఆడుపక్షి లేతగోధుమ రంగులో ఉంటుంది; దీనికి కంఠమాలగాని, రెక్కలపైన పట్టీగాని ఉండవు. గ్రుడ్లుపెట్టే

కాలంలో తప్ప ఇతర కాలాల్లో మగచిలువ ఒక్క రెక్కల పట్టీలో తప్ప మిగతా విషయాల్లో ఆడుచిలువను పూర్తిగా పోలి ఉంటుంది. మన దేశంలో నివాస మేర్పరచుకొన్న పొట్టి బాతులన్నింటిలోనూ దూది చిలువ చిన్నదవటమే కాకుండా, స్పాట్ బిల్ లాగ ఇదికూడా మన దేశంలో విస్తారంగా వ్యాపించి ఉంది. ఇవి 5 మొదలు 15 వరకూ కలిసి గుంపులుగా కనబడతాయి; అప్పుడప్పుడు 50 కి పైగా ఉన్న మందలుకూడా మనకు కనపడతాయి. ఊరి చెరువు, రోడ్డు ప్రక్కన ఉన్న గుంట, నీరు పొరలు తున్న వరిపొలం— ఇటువంటిదేదైనా సరే — అందులో నిలువ నీరు, రెల్లు, తేలెడి మొక్కలు ఉంటే చాలు అక్కడకు దూది చిలువ చేరుతుంది. వాటిని కలవర పెట్టకపోతే అవి బాగా మచ్చికవుతాయి. రోజువారీ పనులు చేసి కొంటూ మనుష్యులు దగ్గరగా ఉన్నప్పటికీ చెరువుల్లో ఈ పక్షులు ఆహారం కోసరం ఈదుతోనే ఉంటాయి. వీటి ఆహారం లేత చిగుళ్లు, గింజలు, కీటకాలు, నత్తలు మొదలైనవి. ఈ పక్షులు వేగంగానూ, చురుకు గానూ ఎగురగలవు. అవి ఎరకలను రాల్చి, ఎగురలేనప్పుడు నీటిలో నిండుగా మునిగి శత్రువుల బారినుండి తప్పించుకో గలవు. ఇవి ఎగిరే టప్పుడు మాత్రము కోడిపెట్టలాగ అరుస్తాయి; మరెప్పుడూ ఏ శబ్దమూ చేయవు. నీటి సమీపంలోనో, నీటిలోనో ఉన్న చెట్టుమ్రానులో 2 మొదలు 10 మీటర్లవరకు ఎత్తున ఉన్న తొఱ్ఱను దూది చిలువ గూడుగా వినియోగించు కొంటుంది. గూటిలో — 6 మొదలు 12 వరకు గ్రుడ్లు — దంతపు తెలుపు రంగులో ఉంటాయి. వాటి మీద చుక్కలుకాని, చారలుకాని వుండవు. రెక్కలు బాగా రాని పసికందులకు తల్లిపక్షి, తండ్రిపక్షి వీపు మీద ఎక్కించుకొని క్రిందికి దింపుతాయని సామాన్యులు విశ్వసిస్తారు; కాని తల్లిదండ్రుల సహాయం అక్కరలేకుండానే వాటంతటవే రెక్కలను తాటించు కొంటూ నేలమీదకు గాని, నీటిమీదకు గాని దిగుతాయి.

ఫాల్కొని ఫార్మిస్ (Order FALCONIFORMES) జంతువులను వేటాడి తిను పక్షుల (Birds of Prey) వర్గంలో రెండు కుటుంబాలున్నాయి. — (1) ఏక్సిపిట్రిడె (Accipitridae) డేగలు, గ్రద్దలు, బోరువలు, సముద్రపు

డేగలు (2) ఫాల్కొనిడె (Falconidae) — భైరవిడేగలు. ఈ రెండు కుటుంబాల మధ్య యిదమిత్థమని హద్దులు నిర్ణయించలేము. ఈ రెండు కుటుంబాల పక్షులకూ మాంసమును చీల్చడానికి అనువుగా బాగా వంపు తిరిగిన కొనగల పొట్టిముక్కు, వంగి బలిష్ఠంగా ఉన్న గోళ్లూ ఉంటాయి. ఏక్సిపిట్రిడె కుటుంబంలోని పక్షులకు వెడల్పైన, గుండ్రని రెక్కలుంటాయి. ఫాల్కొనిడె కుటుంబంలోని పక్షులకు పొడుగైన, సన్నని, కొనదేలిన రెక్కలుంటాయి. అంతేకాదు; గాలిని కోసికొని పోవడానికి అనువుగా వాటి దేహం కదురు ఆకారంలో ఉంటుంది. అందుచేత ఈ పక్షులు మిక్కిలి వేగంతో వాటి యెరను తరిమి పట్టుకోగలవు. ఈ పక్షులలో కొన్ని [ఉదాహరణకు గ్రద్దలు (Kites), బోరువలు (Vultures)] ఉచ్ఛిష్టాన్ని, చచ్చిన జంతువుల కళేబరాలనూ తింటాయి. వీటిలో జాలెడేగ (Shikra), వేష్టము డేగ (Sparrow Hawk) వంటి మరికొన్ని పక్షులు తరుచుగా పక్షులను, జంతువులను వేటాడుతాయి. ఇవి చాటున పొంచి ఉండి ఒక్క సారిగా వాటి ఎరమీదకు దూకుతాయి. ఒక్కొక్కప్పుడు ఎరను కొంత దూరం వరకు తరిమి పట్టుకొంటాయి కూడాను. భైరవిడేగలు (Falcons) వేటాడే పక్షులు; అవి పొంచి యుండవు. అవి వాటి ఎరను అతి వేగంగా వెంట తరిమి పట్టుకొంటాయి. ఒక్కొక్కప్పుడవి తటాలున మెరుపులాగ గాలిలో పైనుండి క్రిందికి దిగి ఎరను తన్నుకుపోతాయి. అందుచేతనే సామాన్యపు డేగలు తమకు ఆహారములైన జంతువులకు కనబడకుండా పొంచి ఉండడానికి అనువుగా చెట్లు దట్టంగా ఉండే ప్రదేశాలలో నివసిస్తాయి. భైరవిడేగలన్ననో చెట్లూ చేమలూ లేని బయలు ప్రదేశాలలో ఉంటాయి.

గాలిలో పక్షులనూ, నేలపై జంతువులనూ వేటాడి వాటిని నాశనంచేసి డేగలూ, గ్రద్దలూ, భైరవిడేగలూ మొత్తంమీద ఎంతైనా కీడు కలుగ చేస్తాయని అంటూంటారు. కాని అలా అనుకోవడం న్యాయంగా కనబడదు. ఈ పక్షులు తినే జంతువులన్నింటినీ ప్రభుత్వాధికారులు మానవునికి కీడు కలుగజేసే జంతువుల జాబితాలో చేర్చారు. అందుచేత ఆ జంతువులకు చట్టబద్ధమైన రక్షణ కల్పించలేదు. ఈ పక్షుల ఆహారమును, వాటి ఆహారపుటలవాట్లను జాగ్రత్తగా పరిశీలిస్తే అవి మనకు కీడుకన్నా మేలే చేస్తున్నాయని బోధపడుతుంది. ఈ జాతి పక్షులు విశేషంగా ఎలుకలు

చిట్టెలుకలు – ఇలాంటి హానికరములైన జంతువుల నెన్నింటినో తిని అవి ప్రకృతిలో విజృంభించకుండా అరికడుతున్నాయి; అందుచేత ఈ పక్షులకు చట్టబద్ధమైన రక్షణ కల్పించాలి.

మాలగద్ద, బాపనగద్ద–పటములు 19, 20 – మనుష్యుల నివాసాలకు సమీపంలో విశేషంగా కనపడతాయి. అచ్చట మానవుడు కల్పించిన కృత్రిమ పరిస్థితులమీద ఈ పక్షులు ఆధారపడి జీవిస్తాయి. మాలగద్ద (The Pariah Kite) గోధుమరంగులో ఉండే పెద్ద పక్షి. దీని తోక చీలి ఉంటుంది. ఈ పక్షి ఎగిరేటప్పుడు ఈ చీలిన తోక స్పష్టంగా కనపడుతుంది. ఈ వర్గానికి చెందిన ఇతర పక్షులకు దీనికిగల వ్యత్యాసం ఇదే. ఈ వ్యత్యాసాన్ని బట్టి దీనిని సులభంగా గుర్తుపట్టగలం. కమేలాలు, చేపల బజారులు, మాంసం బజారులు, మ్యునిసిపల్ పెంటకుప్పలు, డాకులు, హార్బర్లు – ఇలాంటి చోట్ల మాలగద్దలు అసంఖ్యాకంగా చేరి అక్కడ దొరికే ఆహారాన్ని ఏరుకొంటూంటాయి. పట్టణంలోని క్రిక్కిరిసిన బజారులో నేలమీద పాదచారులను, మోటారుకారుల బారును, పైన టెలిఫోను తీగలను తప్పించుకొంటూ చచ్చిన ఎలుకనో, ఉచ్ఛిష్టపు తునకనో మెరుపులాగ తన్నుకు పోతూన్నప్పుడు ఈ గద్దయొక్క సౌలభ్యం, సొగసు చూచి తీరవలసినదే. నిజంగా దాని గమననైపుణ్యం వాయువిమానయాన శాస్త్రంలో మనకొక ప్రత్యక్ష పాఠమే అవుతుంది. వాటి గూళ్లలో చిన్న పిల్లలున్నపుడు వాటిని పోషించడానికవి కోడిపిల్లలను ఎత్తుకు పోవడానికి ఉపక్రమిస్తాయి. అప్పుడు కోళ్లను పెంచేవాళ్లకి పక్షులవలన తీరని నష్టం కలుగుతుంది. ఈ మాలగద్దయొక్క "వీ –విర్ –విర్ –విర్– విర్" అనే ఈలకూత నగరవాసులకు పరిచితమే.

బాపనగద్ద (The Brahminy Kite —Haliastur Indus). హిందీ: బ్రాహ్మణీ చీల్, ధోబియా చీల్, ఖెమ్‌కర్నీ. దీనినే కృష్ణగద్ద, గరుడపక్షి అని కూడా అంటారు. ఇది పరిమాణంలో మాలగద్దంతే ఉంటుంది కాని దానికంటె చాల అందమైన పక్షి. దీని వీపు పైభాగమంతా త్రుప్పువలె ఎఱ్ఱగా ఉంటుంది. దాని తల, పొత్తికడుపు దాకా దాని రొమ్మూ తెల్లగా ఉంటాయి. బాగా పెరగని కృష్ణ గద్దలు చోకలెటు రంగులో ఉంటాయి. అవి మాలగద్దను, పిల్లపీతిరి బోరువను పోలియుంటాయి. కృష్ణగద్ద తోక గుండ్రంగా ఉంటుంది. మాలగద్ద తోక చీలి ఉంటుంది. పీతిరి బోరువది

గసికలాగుంటుంది. కనుక తోకను చూచి కృష్ణగద్దను మాలగద్ద, పీతిరి బోరువలనుండి సులభంగా పోల్చుకోవచ్చును. సముద్రతీరానికి దూరాన ఉండే కృష్ణగద్దలు నదులను, చెరువులను ఆశ్రయించుకొని ఉంటాయి; కాని అవి తరుచుగా సముద్రతీరాన ఉన్న పల్లె గ్రామాలలోను, నావికా శ్రయాలలోను కనపడుతూంటాయి. వర్షాకాలంలో నీరు నిలిచినచోట్ల ఈ పక్షులు చేరుతాయి. ఆకాలంలో జలమయమైన వరిపొలాల దగ్గర కూడా అవి తరుచు కనపడతాయి. కటికవాడు పారేసిన జంతువుల ప్రేగులు మొదలైన కశ్మలాన్ని కూడా కృష్ణగద్దలు తింటాయి. ఇవి మాలగద్దల తోనూ, కాకులతోనూ కలిసి మానవుడు నివసించే ప్రదేశాలలో జొరబడి, అచటి కశ్మలాన్ని తినివేసి, ఆ ప్రదేశాలను శుభ్రపరుస్తుంటాయి. కాని నేల మీద ఆహారంకన్నా నీటిమీది ఆహారాన్ని తీసికోవడం అంటే వాటికెంతో ఇష్టం. అందుచేత ఓడరేవులు, చేపలను పట్టే దొరువులు – ఈ పక్షులకు మిక్కిలి అనువైన ప్రదేశాలు. గ్రామసీమలలో కృష్ణగద్దలు తొండలు, చేపలు, కప్పలు, మెట్ట పీతలు, చిన్న పాములు, కీటకాలు తిని బ్రతుకుతాయి. మాల గద్దలలాగే యివికూడా పర్షం కురవగానే బైటకు వచ్చి తిరిగే ఇసుళ్లను తరిమి పట్టుకొని తింటాయి. కృష్ణగద్ద కూత కఠినంగా గుర్రు పెడుతున్నట్లుగా ఉంటుంది. ఈ కూత పుండు పడిన గొంతుతో గద్ద కూస్తే ఎలా ఉంటుందో అలా ఉంటుంది. ఈ రెండు రకాల గ్రద్దలూ చెట్లలో పెద్ద వేదికలలాంటి గూళ్లను పుడకలతో నిర్మిస్తాయి. కృష్ణగద్ద మాత్రం గూడు కట్టడానికి సామాన్యంగా నీటికి చేరువలో ఉన్న చెట్లనే ఎన్నుకొంటుంది. ఈ పక్షుల గ్రుడ్లు కొద్దిగా బూడిదరంగు లేక ఎరుపుఛాయ కలిసిన తెలుపురంగులో ఉంటాయి. ఆ గ్రుడ్ల పైన లేత ఎరుపు కలిసిన గోధుమరంగు చుక్కలుంటాయి.

జాలెడేగ (Shikra — Accipiter Badius) —పటము 21 —హిందీ: శిక్రా. ఇది చిన్న డేగ; పావురమంత ఉంటుంది. దీని వీపురంగు నీలి కలసిన బూడిద రంగు. క్రింది భాగమున తెలుపుమీద త్రుప్పు గోధుమరంగు అడ్డచారలుంటాయి; తోక మీద నల్లని వెడల్పైన పట్టీలుంటాయి. ఆడుడేగ వీపుభాగం దట్టమైన బూడిద రంగులో ఉంటుంది. ఇది మగదాని కంటే చాలా పెద్దది. పూర్తిగా పెరగని పక్షుల వీపు బూడిదరంగులోనూ, పాటల వర్ణంలోనూ ఉంటుంది; క్రిందిభాగాన అడ్డచారలుండవు. బూడిదరంగులో వెడల్పైన నిడువు మచ్చలుంటాయి. గ్రామాలలో పొలాల సమీపంలో ఉండే

చెట్ల తోపులలోనూ, చిట్టడవులలోనూ ఈ పక్షులు జతలు, జతలుగా కనబడతాయి. జాలెడేగ ఆహారం — జెట్టిమిడుతలు, తొండలు, కప్పలు, ఎలుకలు మొదలైనవి. జాలెడేగ వేటాడడంలో కడునేర్పరి. ఆకులు దట్టంగా ఉన్న చెట్టుమీద దాని ఎరకు కనపడకుండా, నలువైపులా బాగా చూస్తూ ఈ పక్షి నిట్ట నిలువుగా కూర్చుంటుంది. బలికాబోయే జంతువు ప్రమాద స్థితిని గుర్తించేలోగానే, జాలెడేగ దానిమీద అకస్మాత్తుగా పడి వాడియైన గోళ్లలో దాని నిరికించుకొని ఎగిరిపోతుంది; తరువాత దానిని ముక్కలుగా చీల్చి మరీ మింగుతుంది. సైదాపిట్టలు, పొదలలో ఉండే ఎలిసి పిట్టలు, గువ్వ పిట్టలు — ఇలాంటి చిన్న పక్షులను కూడా వాటికేమాత్రం తెలియకుండానే చాటునుండి వాటిపై అది అకస్మాత్తుగా పడి అతివేగంతో విడువకుండా వాటిని తరిమి చంపుతుంది. ముఖ్యంగా పోషింపవలసిన పిల్లలు గూటిలో ఉన్నపుడు జాలెడేగ బందిపోటు దొంగలాగ పెంపుడు కోడిపిల్లల మీదపడి వాటిని ఎత్తుకు పోతుంది. అందుచేత ఈ డేగ కోడి పెంపకందార్ల కెంతయు ఉపద్రవ హేతువే. కర్ణకఠోరంగా ఉండే దాని పిలుపు స్వరాలు చాలవరకు అచ్చంగా నల్ల ఏట్రింత స్వరాలలాగే ఉంటాయి. కాని డేగ స్వరాలు ఏట్రింత స్వరాలకంటె ఎక్కువ స్థాయిలో ఉంటాయి. గ్రుడ్లను పెట్టే కాలంలో ఈ పక్షుల జంటలు గాలిలో మొగ్గలు వేస్తూ, ఒకదాని నొకటి తరుముకొంటూ, ఒకదాని మీదికి ఒకటి దిగుతూ, 'టి - టుయ్' అని జంట స్వరాలలో అరుస్తూ, చాలా గోలచేస్తాయి. జాలెడేగ గ్రామానికి దగ్గరగా ఉండే తోపులో ఆకులు దట్టంగా ఉన్న చెట్టుపైన పుడకలతో కాకిగూడు లాంటి గూటిని కడుతుంది. గూటిలో 3 లేక 4 గ్రుడ్లుంటాయి. అవి నీలి చాయగల తెలుపు రంగులో ఉంటాయి. ఆ గ్రుడ్లమీద కనపడీ కనపడకుండా బూడిదరంగు చుక్కలుండటం కూడా కలదు.

మొత్తం మీద మన దేశంలో అందరికీ బాగా తెలిసిన బోరువ, తెల్లవీపు బోరువ లేక బంగాళా బోరువ (Whitebacked or Bengal Vulture—Gyps Bengalensis) —పటము 22—హిందీ: గిధ్. ఇది నలుపు కలసిన గోధుమరంగు గల బరువైన పక్షి. ఇది మురికిగా, చూడడానికి అసహ్యంగా ఉంటుంది. దీని తల, మెడ ఈకలు లేక బోడిగా ఉంటాయి. అది విశ్రాంతి తీసికొంటునప్పుడే కాక గాలిలో ఎగురుతూన్నప్పుడు కూడ దాని తెల్లని వీపు స్పష్టంగా కనబడుతుంది; దీనిని బట్టి ఈ పక్షిని సులువుగా గుర్తు

పట్టువచ్చును. అంతేకాదు; అది ఎగురుతూ మన నడినెత్తిపైకి వచ్చినపుడు దాని రెక్కల క్రింద అడ్డుగా కనపడే తెల్లని, వెడల్పైన పట్టీయున్నూ, ఆ పట్టీని మధ్యకు రెండుగా చీలుస్తూ కనబడే దాని నల్లని దేహమున్నూ సులువుగా దానిని గుర్తించడానికి తోడవుతాయి. పూర్తిగా పెరుగని పక్షులు గోధుమరంగులో ఉంటాయి కాని వాటి వీపు తెల్లగా ఉండదు. కనుక వాటిని చూచినపుడు మరోజాతికి చెందిన పొడుగు ముక్కు బోరువ (Longbilled Vulture — Gyps Indicus) పక్షులనుకొని తరచుగా పొరపాటు పడుతూంటాము. ఈ రెండు రకాల బోరువలూ సిలోనులో లేవంటే ఆశ్చర్యంగా లేదూ! ఇండియా ద్వీప కల్పంలోని అన్ని ప్రదేశాలలోనూ తెల్లబోరువ కనబడుంది. కాని ఎల్లకాలము పచ్చగా ఉండే చిత్తడి అడవులలో మాత్రం ఈ బోరువ ఉండదు. నేలమీద ఆహారమేమైనా దొరుకుతుందేమోనని వెతుకుతూ గంటల తరబడి నిర్మలాకాశంలో రెక్కలను విప్పి కదల్చకుండా ఈ బోరువలు దర్జాగా విహరిస్తాయి. కశ్మలాన్ని తొలగిస్తూ పాకీ పనిచేసి బోరువలు మానవునికి ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. అవి సూక్ష్మదృష్టి గలవి. కాని వాటికి ఘ్రాణశక్తి మాత్రము చాల తక్కువ; లేదనియే చెప్పవచ్చును. ఆకాశంలో ఒక్క బోరువైనా కనపడకపోగా ఒక జంతువు మృతకళేబరం చుట్టూ అనతి కాలంలో అవి మందగా చేరాయంటే అది ఆశ్చర్యం కాదూ? ఈ మంద ఒక ఎద్దునో లేక అలాంటి మరో పెద్ద జంతువునో అతివేగంగా, పూర్తిగా తినివెయ్యడం కూడా అద్భుతమైన విషయమే. అవి జంతువును కాజేసేటప్పుడు ఒకదాని నొకటి తోసుకొంటూ, ఒకదానితో ఒకటి పోరాడుతూ, కీచు కీచుమంటూ, అందు ప్రతీది తనే ముందుగా తినడానికి ప్రయత్నించడమూ లేదా ఒక మాంసపు ముద్దను పట్టుకొని రెక్కలను విప్పుకొని ఇటొక పక్షి అటొక పక్షి సాగదీసి లాక్కోవడానికి ప్రయత్నించడమూ— ఇలా ఆ జంతువు కివి చేసే ఉత్తర క్రియలు భయానకంగా ఉంటాయి. గ్రామ పరిసరాల్లో ఉండే పెద్ద చెట్ల పైగాని లేదా రోడ్లకిరు ప్రక్కలా ఉండే పెద్ద చెట్లపైగాని ఈ బోరువ ఆకులతో ఉన్న కొమ్మలతోనూ, పుడకలతోనూ విశాలమైన వేదికల వంటి గూళ్లను కడుతుంది. గూటిలో ఒకే ఒక గ్రుడ్డు పెడుతుంది. ఆ గ్రుడ్డు తెల్లగా ఉంటుంది. దాని పై ఎరుపు ఛాయతో కూడిన గోధుమ రంగు చుక్కలు కూడా ఉండవచ్చును.

ఈ ద్వీపకల్పంలో, పొడి ప్రదేశాలలో తఱచుగా మరొక చిన్న బోరువ కనపడుతుంది. ఇది తెల్లబోరువ లేక పీతిరిగద్ద (White or Scavenger (Vulture — Neophron Percnopterus) దీనిని ఆంగ్లంలో 'ఫారోస్ చికెన్' (Pharaoh's Chicken) అనికూడా అంటారు. దీనిని హిందీలో సఫేద్ గిధ్ లేక గోబర్ గిధ్ అంటారు. — పటము 23. ఇది మాసిన తెలుపు రంగు గల గద్దలాంటి పక్షి. దీని రెక్కలలో ఉండే పెద్ద ఈకలు నల్లగా ఉంటాయి. తలమీద ఈకలుండవు; తల, ముక్కు లేత పసుపు రంగులో ఉంటాయి. పూర్తిగా పెరగని పక్షులు గోధుమ రంగులో ఉంటాయి. ఎగిరేటప్పుడు గద్దనుండి తెల్లబోరువను సులువుగా గుర్తు పట్టగలం; ఎట్లన తెల్ల బోరువ తోక గసిక లాగుంటుంది; చీలి యుండదు. మనుష్యులు నివసించే పరిసరాల్లో — అవి పట్టణాలు, గ్రామాలు, దేశద్రిమ్మరుల తాత్కాలికమైన మకాములు, ఏవైనా కానివ్వండి — ఆకాశంలో మిక్కిలి ఎత్తున, రెక్కలాడించకుండా, సొగసుగా ఎగురుతూ క్రిందను నేలమీద ఆహారాన్ని అన్వేషిస్తూ ఈ తెల్లబోరువలు రెండేసి, మూడేసి కలిసి మనకు కనపడతాయి. నేలమీద ఉన్నప్పుడది కాలు ఎత్తివేస్తూ బాతులాగ వికారంగా నడుస్తూ ఆహారాన్ని వెతుక్కొంటుంది. ఇది పాకీపని చేసి గ్రామస్థులకు బాగా ఉపయోగ పడుతుంది. శుచి, శుభ్రతలకు అలవాటు పడని కొన్ని గ్రామాలలో గ్రామీణులందరూ చెంబులు పట్టుకొని వారి గుడిసెల సమీపంలోనే పొదల చాటున బాహ్యానికి కూర్చుంటారు. ఈ పక్షి ఆ ప్రదేశాలను శుభ్రపరచి ఘనమైన సేవ చేస్తుంది. ఉచ్ఛిష్టము, పనికి మాలిన పదార్థాలే కాకుండా మానవ మలాన్ని కూడా ఈ పక్షి దివ్యంగా భక్షిస్తుంది. చెన్నపట్టణం వద్ద ఉన్న తిరుక్కలికుంద్రంలోని హిందూ దేవాలయానికి ఈజాతి పక్షులే కీర్తి ప్రతిష్టలు తీసుకువచ్చాయి. అక్కడకు పురాణ దంపతులు ఈ పక్షుల రూపంలో కాశీనుండి ప్రతిదినమూ ఒక నిర్ణీతమైన సమయానికి వచ్చి ఆ గుడిలో ఉండే పూజారులిచ్చే ప్రసాదాన్ని స్వీకరిస్తారని ఒక గాథ ప్రచారంలో ఉంది. దీనిని అమాయకులు విశ్వసిస్తారు. దీని గూడు అసహ్యంగా పుడకల ప్రోగువలె ఉంటుంది. దానిలోపల గుడ్డపీలికలు, సస్తనుల చర్మపు ముక్కలు, వెంట్రుకలు, పనికి మాలిన చెత్త మొదలైనవి అస్తరుగా ఉంటాయి. ఈ పక్షి ఏదైనా శిథిల భవనం యొక్క వెలుపలియంచునగాని, కొండపైన రాతి అంచున గాని



పటము 25

ఎఱుముండిడేగ (తూరాంతి)

(*Falco chicquera*)

పేజి 62



పటము 26

నల్ల కౌజు

(*Francolinus francolinus*)

పుట 63

పటము 27

**బూడిదరంగు కౌజు (తితువ)**

(*Francolinus pondicerianus*)

పేజి 65





పటము 28

నల్లబోర యెలిసె

(*Coturnix coromandelica*)

పేజి 66



పటము 30

బూడిదరంగు అడవికోడి

(*Gallus sonneratii*)

పేజీ 68



పటము 31

నెమలి

*(Pavo cristatus)*

పేజి 70



పటము 32
సారస కొంగ
(*Grus antigone*)
పేజీ 72

గూడు కడుతుంది. ఒక్కొక్కప్పుడది గూటిని చెట్టుమీద కాండపు పలవలో కూడు కడుతుంది. అది సాధారణంగా రెండు గ్రుడ్లు పెడుతుంది. అవి నమ్మలేనంతగా అందంగా ఉంటాయి. అవి తెలుపుకీ లేత ఇటుక ఎరుపుకీ మధ్యరంగులో ఉంటాయి. వాటిపైన ఎరుపు కలిసిన గోధుమ రంగులో గాని, నలుపురంగులోగాని మచ్చలుంటాయి.

మొనతేలిన రెక్కలు గల డేగకు మంచి ఉదాహరణము శాహీన్ భైరవి (Shaheen Falcon — Falco Peregrinator) — పటము 24 — హిందీ: శాహీన్. ఇది విశాల భుజాలు గల బలిష్ఠమైన పక్షి. ఇది అడవి కాకంత ఉంటుంది. బాగా పెరిగిన పక్షుల వీపుభాగం బలపం రంగులో ఉంటుంది. తల నల్లగా ఉంటుంది. దవడ మీద ప్రస్ఫుటమైన చారలు ఉంటాయి. ఈ పక్షి అడుగు భాగం గులాబీ ఛాయగల తెలుపు రంగులోనో లేదా త్రుప్పు ఎరుపు రంగులోనో ఉంటుంది. వీటిలో కొన్నింటికి పొత్తి కడుపునుండి క్రింది భాగానికి నల్లని పట్టీలుంటాయి. ఆడుపక్షీ, మగపక్షీ రూపంలో ఒక లాగే ఉంటాయి. కాని ఆడుది మగదాని కంటె పెద్దది. శాహీన్ భైరవి పక్షులు ఒంటిగా గాని, జతలుగా గాని కొండ ప్రదేశాలలో కనబడతాయి. అవి కొండ శిఖరాలనుండి గాని, కొండచరియల నుండి గాని కనిపెడుతూ ఉండి తమ ఎరను దోచుకొంటాయి. స్థానికంగా ఉండే ఈ భైరవి కాక దేశాటనంచేసే మరో భైరవి (Peregrine Falcon) ఉంది. అది ఉత్తరదేశాల నుండి మన ప్రాంతానికి శీతకాలంలో వస్తుంది. శాహీన్ భైరవి ఆహారం ముఖ్యంగా పావురాలూ, రామచిలుకలూ, అదే పరిమాణంలో ఉండే మరి కొన్ని ఇతర పక్షులూను. శాహీన్ అతివేగంగా ఎగురుతుంది. మొనదేలిన రెక్కలను వేగంగా కొన్నిసార్లు కొట్టి బ్రహ్మాండమైన వేగంతో క్రిందికి జారుతుంది. అది గాలిలో ఎగురుతున్న తన బలిపక్షులను మధ్యలోనే కొట్టి తన గోళ్లలో ఇరికించుకొని, ఏ కొండ శిఖరంమీదకో ఎత్తుకుపోయి, అచట ఈకలు పీకివేసి, ముక్కలు చేసికొని మరీ మ్రింగుతుంది. గ్రుడ్లను పెట్టే కాలంలో ఈ పక్షి జంటలు ఒకదానితో ఒకటి గాలిలో అద్భుతంగా ఆడు కొంటాయి. ఒకదానిపై కొకటి బాణంలాగ దూసుకుపోతో, ఒకదాని పక్కను మరొకటి వంగుతో వలయాకారంగా ఎగురుతో అవి గూడు కట్టే కొండచుట్టూ ప్రదక్షిణాలు చేస్తాయి. ఎవరికీ అందుబాటుగా ఉండని కొండశిఖరం అంచున ఇది గూడుకట్టి అందు మూడు, నాలుగు గ్రుడ్లు

పెడుతుంది. అవి ఇటుక – ఎరుపు రంగులో ఉంటాయి. వాటిపైన ఎరుపు కలిసిన గోధుమ రంగు మచ్చలుంటాయి. ఈ పక్షులను అల్లరి పెట్టకపోతే అవి సంవత్సరాల తరబడి ఒకే ప్రదేశంలో గూళ్లు కట్టుకొంటాయి; వాటి సంతానం కూడా ఆ ప్రదేశాలనే గూళ్లు కట్టుకోవడానికి ఉపయోగిస్తాయి.

తిరుముండిడేగ (Redheaded Merlin – Falco Chicquera) లేక తూరూంతి — పటము 25 — ఇది మొనదేలిన రెక్కగల అందమైన చిన్న భైరవిడేగ. దీని పైభాగం నీలి కలిసిన బూడిద రంగులోను, అడుగు భాగం తెల్లగాను ఉంటుంది. క్రింది భాగాల పైన లేత నలుపు రంగు అడ్డ చారలు దగ్గరదగ్గరగా ఉంటాయి. స్పష్టమైన చెస్‌నట్ రంగు తల, మెడకు వెనుక భాగము, ప్రతి కంటిక్రింద ముందు భాగాన్ని అదే రంగులో మీసాలవంటి నిలువు చారలు ఈ పక్షిని పోల్చుకొనడానికి అనువైన గుర్తులు. అది ఎగిరేటప్పుడు దాని తోకకున్న సన్నని తెల్లయంచు, ఆ తోక పైభాగాన ఉన్న వెడల్పైన నల్లని పట్టీ కనబడతాయి. ఈ లక్షణాలు కూడా ఉన్నాయా లేవా అని పరిశీలించాలి. పంట పొలాల సమీపంలో ఈ పక్షులు జతలు, జతలుగా మనకు తరుచు కనపడతాయి. అవి ఏదైనా దిబ్బమీదో లేదా కొండ శిఖరంపైనో కూర్చొని ఉంటాయి. లేదా కంచెలకు మించిన ఎత్తులో అవి వేగంగా ఎగురుతూ, వాటి కాహారమైన చిన్న పక్షులనూ, ఎలుకలనూ, చిట్టెలుకలనూ, తొండలనూ, పెద్ద కీటకాలనూ అన్వేషిస్తాయి. పగలంతా దాగి యుండి చీకటి పడేవేళకు బయటికి వచ్చే గబ్బిలాల మీదికివి బ్రహ్మాండమైన వేగంతో ఎగిరి వాటిపై పడి పట్టుకొంటాయి. తఱచుగా మగదీ, ఆడుదీ కలిసి యుక్తితో తమ ఎరను సంపాదిస్తాయి. ఒక పక్షి గాలిలో క్రిందికి దిగి ఎరను అటకాయిస్తే, రెండవ పక్షి దానిని తరిమికొట్టి క్రింద పడేస్తుంది. తరువాత రెండు పక్షులూ అవి దోచుకొన్న దానిని పంచుకు తింటాయి. ఈ పక్షులలో మగదాని కన్న ఆడుది పరిమాణంలో కొంచము పెద్దదిగా ఉంటుంది. వేటగాళ్లు ఆడు తిరుముంతిని పెంచి, దానికి పాలపిట్టలను, కొండె పిట్టలను, మైన గోరలను, కౌజుపిట్టలను వేటాడడం నేర్పుతారు. ఈ పక్షి బలిపిట్టలను తరిమేటప్పుడు వేష్టము డేగలాగ (Sparrow Hawk) రెక్కలను అవిచ్ఛిన్నంగా కొట్టుకొంటూ బాణంలాగ మహావేగంతో దూసుకుపోతుంది. ఇది హెచ్చుస్థాయిలో కీచుమని అరుస్తుంది. గ్రుడ్లు పెట్టే

కాలంలో ఈ చిన్న భైరవులు విశేషంగా ధైర్యసాహసాలు, క్రూరత్వము కూడా ప్రదర్శిస్తాయి. ఆ కాలంలో వాటి గూళ్లు ఉండే చెట్ల పరిసరాలలోకి కాకులు, గద్దలవంటి పెద్ద పక్షులేవైనా పొరపాటున వస్తే వాటిని భైరవి డేగలు ఎదుర్కొని తరిమికొడతాయి. భైరవిడేగ ఆకులు బాగా ఉన్న చెట్టు పైభాగంలో ఆకులను ఆచ్ఛాదనంగా చేసి పుడకలతో వేదిక వంటి గూడు కడుతుంది. గూటిలో 3 లేక 4 గుడ్లు ఉంటాయి. అవి కొంచము ఎరుపు కలిసిన తెలుపు రంగులో ఉంటాయి. వాటిపైన దట్టంగా ఎరుపు కలిసిన గోధుమరంగు మచ్చలుంటాయి.

గల్లీఫార్మిసు వర్గము (Order GALLIFORMES). మన ప్రాంతంలో ఈ వర్గానికి చెందిన ఫేసియానిడె కుటుంబం (Family Phasianidae) ముఖ్యమైనది. ఈ కుటుంబంలోని పక్షులు 'వేట పక్షులు' (Game Birds) అనగా వేటలో పట్టుబడు పక్షులు. ఈ కుటుంబంలో జముడు పక్షులు (Pheasants), అడవి కోళ్లు (Jungle Fowls), కౌజులు (Partridges), గోగిర యెలిసెలు లేక కోలంకి పిట్టలు (Quails) ఉన్నాయి. ఇవి అన్నీ ప్రధానంగా గింజలను తినే పక్షులు. వీటి ముక్కులు తగుమాత్రం పెద్దవిగానూ, బలిష్ఠంగానూ ఉంటాయి; రెక్కలు సువృత్తాకారంగానూ, కాళ్లు బలంగానూ, పొట్టిగానూ ఉంటాయి. కొన్ని పక్షుల కాళ్లు తగుమాత్రం పొడుగ్గా ఉంటాయి. అనేక జాతులలో మగ పక్షుల కాళ్లకు ఆరెబొట్టెలుంటాయి. ఈ పక్షుల గోళ్లు మొద్దుబారి, బలిష్ఠములై ఉంటాయి. ఇట్టిగోళ్లు వాటికి నేలను గీరి ఆహారం సంపాదించటానికి అనుకూలములు.

నల్లకౌజు (The Black Partridge — Francolinus Francolinus) — పటము 26 - హిందీ: కాలాతీతర్. ఇది అందరికీ ఎక్కువగా పరిచితమైన 'తీతువ' (Grey Partr idge) అంత ఉంటుంది. ఈ పక్షి బొద్దుగా ఉంటుంది; దీనితోక మొద్దుబారి ఉంటుంది. ఇది వేట పక్షి. ఇది మొత్తం మీద కాఫీనలుపు రంగులో ఉంటుంది; దేహంమీద తెల్లనివి, పచ్చనివి చుక్కలూ, చారలూ ఉంటాయి. పుంజుకి నిగనిగలాడే తెల్లని మచ్చలు గల బుగ్గలూ చెస్నట్ రంగు కంఠమాలా ఉంటాయి. ఈ లక్షణాలను పట్టి ఈ పుంజును

సులభంగా పోల్చవచ్చును. పెట్టె పుంజుకన్నా తక్కువ ఛాయలో ఉంటుంది. దేహంమీద తెల్లనివి, నల్లనివి చుక్కలుంటాయి. దాని కంఠం వెనుక వైపున చెస్నట్ రంగు మచ్చ ఉంటుంది. ఉత్తర భారతదేశంలోను, అస్సాంలోను ఈ అందమైన కౌజు పిట్టలు ఒంటిగా గాని, జతలుగా గాని పొదలూ, ఈతచెట్లూ, పొడుగుపాటి పచ్చగడ్డీ, సమృద్ధిగా నీరుగల అడవులలోనూ, నదీ ప్రాంతాలలోనూ కనబడతాయి. చెరకు పొలాలూ, జొన్నచేలూ, టీ తోటలూ అంటే కూడా ఈ పక్షులకెంతో ఇష్టం. ఉదయం, సాయంత్రం తినడానికివి పంటపొలాల్లో ప్రవేశిస్తాయి. పొలం గట్లమీదకూడ ఈ పక్షులు గింజలు ఏరుకొంటూ కనబడతాయి. ఇలా తిరుగుతున్నపుడు ఈ పక్షి తన మొండి తోకను జంబుకోడి (Moorhen) లాగ కొంతమట్టుకు పైకెత్తి ఉంచుతుంది. తోకనిలా నిక్కపొడవడం మనకు సాధారణంగా బూడిద రంగు కౌజులో (Grey Partridge)— కనబడదు. అవి అతివేగంగా పరుగెత్తగలవు. శత్రువుల నుండి తప్పించుకు పారిపోవడానికవి తఱచుగా వాటి పిక్కబలం మీదనే ఆధారపడతాయి. కాని వేటగాళ్లు డప్పులు వాయించినా లేదా వాటిమీద ఎవరైనా అకస్మాత్తుగా దాడిచేసినా అవి ఎగిరిపోతాయి. అవి రెక్కలనుకొట్టి చప్పుడు చేస్తూ, బలంగానూ, సూటిగానూ ఎగురుతాయి. అవి సాధారణంగా రెండువందల మీటర్లకు మించి ఏకధాటిని ఎగరలేవు. నేలనుండి 3 మొదలు 5 మీటర్ల ఎత్తుకు మించి కూడా అవి ఎగురవు. ఈ పక్షి ధాన్యపు గింజలూ, గడ్డీ - కలుపు మొక్కల విత్తనాలూ, లేతచిగుళ్ళూ తింటుంది. చెదపురుగులూ, ఇతర కీటకాలూ అంటే కూడా దానికి ఇష్టమే. పుంజు "చిక్... చీక్ - చీక్ - కెర్ఎకేక్" అంటూ ఉత్సాహంగా, రింగు మంటూ, హెచ్చుస్థాయిలో కూస్తుంది. శ్రావ్యత - కాఠిన్యత మిళితమై విలక్షణంగా ఉండే ఈ కూత ఆ పక్షి నుండి కాక మరెచ్చట నుండియో వచ్చినట్లు కూడ వినబడుతుంది. ఆ అరుపుకు "సుభాన్ - తేరీ-కుదరత్", "లహసున్ - ప్యాజ్ - అదరక్" అనిన్నీ ఇంకా కొన్ని మార్పులతోను విన్నవాళ్లు వారి మానసిక స్థితినిపట్టి, ఆ సమయంలో వారి మనోభావాన్ని పట్టి రూపకల్పన చేశారు! నల్ల కౌజు బీడు భూములందూ, గడ్డిదుబ్బుల దగ్గరా నేలమీద పల్లంచేసి, దానిలో పచ్చగడ్డిని అస్తరుగా వేస్తుంది. ఇదే దాని గూడు. గూటిలో 6 మొదలు 8 వరకూ గ్రుడ్లుంటాయి. అవి ఆలివు గోధుమ నుండి చోకలెటు గోధుమ వరకు అనేక ఛాయలలో ఉంటాయి.

బూడిదరంగు కౌజు లేక తీతువ (Grey Partridge — Francolinus Pondicerianus) — పటము 27 — హిందీ: తీతర్ లేక సఫేద్ తీతర్. పరిమాణంలో ఇది పెంపుడు కోడిలో సగం ఉంటుంది; నల్ల కౌజులాగే బొద్దుగా ఉంటుంది. దాని తోకలాగే దీనిది కూడా పొట్టిగా మొద్దుబారి ఉంటుంది. ఇది మొత్తంమీద బూడిద - గోధుమ రంగులో ఉంటుంది. దీని శరీరం మీద నల్లనివీ, పచ్చనివీ క్రిములవంటి ఆకారంలో చారలుంటాయి. తోకమీద చెస్నటు రంగు చారలుంటాయి. దీని కంఠ భాగము ఎరుపు కలిసిన గోధుమరంగులో ఉంటుంది. దానిని చుట్టి ఒక అసంపూర్ణమైన వలయరేఖ ఉంటుంది. పుంజు పెట్టకన్నా బొద్దుగా ఉంటుంది. పుంజు కాళ్లకు ప్రతి దానికి మొనదేరిన ఆరెబొట్టె ఉంటుంది. బూడిదరంగు కౌజు పచ్చగడ్డి, ముండ్లతుప్పలు గల ప్రదేశాలలో ఉంటుంది. గ్రామాల పొలిమేరలోనూ, సేద్యపుపొలాల యొద్దనూ ఈ పక్షి సామాన్యంగా కనబడుతుంది. పల్లెసీమలలో మనకు వినపడే పక్షి కూతలన్నింటిలోనూ రింగుమనే దీని ఉల్లాసపు కూత మనకు సుపరిచితమే. గ్రుడ్లు పెట్టేకాలంలో జతగూడేటప్పుడు తప్ప, మిగతా కాలాలలో అవి 4 మొదలు 6 వరకూ కలిసి నిట్టనిలువుగా హాయిలుగా పరుగెత్తుతూ, ఆహారం కోసరం నేలనూ, పేడకుప్పలనూ కాళ్లతో గీరుతూ ఉంటాయి. గింజలు, చిన్న పళ్లు, కీటకాలూ ఈ కౌజుకి ఆహారం. చెదపురుగులు, జంతువుల మలంలో ఉండే కీటకాల లార్వాలంటే కూడా దీనికి చాలా ఇష్టం. శత్రు భయం కలిగినపుడు ఈ పక్షులు గుంపు విడిపోయి, త్వరగా పరుగెత్తుకొని పారిపోయి తుదకు ఒంటరిగానో, రెండేసి కలిసో చిక్కని పొదలలో దూరి దాక్కొంటాయి. అవి సాధారణంగా ఎగరడానికి కిష్టపడవు. కాని విధిలేనపుడవి రెక్కలుకొట్టి చప్పుడు చేసికొంటూ తలోమూలకూ ఎగిరిపోతాయి. అట్లు రమారమీ ఒక వంద మీటర్లు దూరంగా పోయి, మళ్లీ నేలమీద వ్రాలి, వెంటనే పరుగెత్తుకు పోతాయి. ముళ్ల చెట్లపైని అవి రాత్రులందు నిద్ర పోతాయి. పుంజు రింగుమంటూ నిర్లక్ష్యంగా, హెచ్చుస్థాయిలో, 'కతీతర్, కతీతర్' లేదా 'పతీలా, పతీలా, పతీలా' అంటూ కూస్తుంది. ఇలా ఈ కూతను ఆపి, ఆపి మళ్లీ మళ్లీ కూస్తుంది; అంతకంతకూ ఈ కూత స్థాయి హెచ్చుతుంది. చిన్నకౌజులను సులభంగా మచ్చిక చేయవచ్చును. పెంపుడు కౌజులు వాటి యజమానిని కుక్కలాగ వెంబడిస్తాయి; అతని ఆజ్ఞను పాటించి

అరుస్తాయి; పిలిచినపుడు దూరము నుండి వస్తాయి. పుంజులను పందెం కోసరం ఉపయోగిస్తారు కనుక వాటి విలువ హెచ్చుగా ఉంటుంది. సెలవు దినాలలోనూ, పండుగ రోజులలోనూ, ఈ దేశంలోని కొన్ని ప్రాంతాలలో కౌజుపందేలు ఏర్పాటు చేస్తారు. ఈ పందేలంటే గ్రామీణులకెంతైనా మోజు. ఈ పందేలలో పెద్ద మొత్తాలను ఒడ్డి గెలుచుకోవడం, ఓడిపోవడం కూడా ఉంటుంది. చాలా పోటీలలో గెలిచిన కౌజులకు పెద్ద ధరలు వస్తాయి. బూడిద రంగు కౌజు గూడు అతి సామాన్యంగా ఉంటుంది. అది పచ్చిక ప్రదేశాలలో ఉండే ముళ్లపొదలను రక్షణగాచేసి వాటికి క్రిందుగా నేలమీద పల్లంచేసి, దాని లోపల చుట్టూ పచ్చగడ్డి అస్తరుంచుతుంది. ఇది దాని గూడు. వాటిలో 4 మొదలు 8 వరకూ గ్రుడ్లుంటాయి. అవి గోధుమచాయ మీగడ రంగులో ఉంటాయి. దానిపైన చుక్కలు కాని, చారలుకాని ఏవీ ఉండవు.

నల్లబోరయెలిసె (The Blackbreasted or Rain Quail—Coturnix Coromandelica)—పటము 28—హిందీ: చనక్, చైనా బటేర్. ఈ పక్షి పరిమాణంలో బూడిదరంగు కౌజులో సగముంటుంది. దానినొక ప్రక్కనుండి చూస్తే అది ఒక చిన్న కౌజులా కనపడుతుంది. దీని ఈకలు లేతపసుపు కలిసిన గోధుమ రంగులో ఉంటాయి. పైభాగాన అడ్డదిడ్డంగా నల్లని మచ్చలుంటాయి. పుంజు రొమ్ములో పైభాగము, పొత్తికడుపు మధ్యభాగము నల్లగా ఉంటాయి. కంఠ భాగమున తెల్లనివి, నల్లనివి చారలుంటాయి. పెట్టకు నల్లని రొమ్ముకాని, గొంతుమీద తెలుపు, నలుపు చారలుగాని ఉండవు.

గోగిరయెలిసె లేక బూడిదరంగు యెలిసె (The Common or Grey Quail — C. Coturnix). ఇది కొంచెము పెద్ద పక్షి. ఈ జాతి పక్షులు ఉత్తర దేశాలనుండి మన దేశానికి ముఖ్యంగా శీతకాలంలో వస్తాయి. ఈ జాతి పక్షులలో పుంజు గొంతుమీద నల్లని లంగరు గుర్తు ఉంటుంది; రొమ్ము కాని పొట్టకాని నల్లగా ఉండవు. పెట్ట అచ్చంగా నల్లబోరయెలిసెలాగే ఉంటుంది కాని దానికన్న పెద్దది. ఈ పక్షి మన చేతిలో ఉన్నపుడు ప్రధానమైన ఈకల వెలుపలి యంచులందు లేతపసుపు చారలు గోధుమచారలు స్పష్టంగా మనకు కనబడతాయి. నల్లబోరయెలిసెకి చారలుండవు. ఈ వ్యత్యాసాన్ని బట్టే దీనిని నల్లబోరయెలిసెనుండి గుర్తింపగలం. ఈ రెండు జాతుల పక్షులకూ ఒకేవిధమైన అలవాట్లుంటాయి. యెలిసెలు నేలమీద నివసించే పక్షులు. అవి వాటి కాలమంతా పచ్చిక బీడులందూ, పంట పొలాలందూ దాగియుంటూ

గడుపుతాయి. అవి వడిగా పరుగెత్తగలవు. అత్యవసరమైతే తప్ప అవి సాధారణంగా ఎగురడాని కిష్టపడవు. వాటిని ఎగురగొట్టినపుడవి రెక్కలను బుర్రుమని శబ్దం చేస్తూ, మృదువుగా ఈలకూత కూస్తూ ఎగిరిపోతాయి. కాని అవి నూరుమీటర్లు మాత్రమే పచ్చగడ్డిపైనా పంట పొలాలమీదా కింది వాటుగానే ఎగిరి, నేలపై వ్రాలి ఏ చాటునో నక్కుతాయి. ఎగిరేటప్పుడవి రెక్కలను అతివేగంగా కంపింపచేస్తూ, త్వరగానూ, సూటిగానూ ఎగురుతాయి. అవి చాలవరకు గింజలను, గడ్డిమొక్కల విత్తనాలను, కలుపుమొక్కల విత్తనాలను మాత్రమే తింటాయి. అప్పుడప్పుడు చెదపురుగులను, అటువంటి మెత్తని కీటకాలను కూడా తింటూంటాయి. నల్లబోరయెలిసె 'విచ్ – విచ్ – విచ్ – విచ్' అంటూ జంట కూతలు శ్రావ్యంగా కూస్తుంది. గ్రుడ్లు పెట్టే కాలంలో ముఖ్యంగా ఉదయమూ, సాయంకాలమున్ను మబ్బుపట్టినపుడు ఉండి, ఉండి రోజంతాను, రాత్రులందును కూస్తోనే ఉంటుంది. దీని కూత బూడిదరంగు యెలిసె కూతకంటె భిన్నమైనది. బూడిదరంగు యెలిసెకూత బిగ్గరగా ఉంటుంది. దీని కూతలో ఒక దీర్ఘస్వరమూ, వెనువెంటనే రెండు హ్రస్వ స్వరాలూ ఉంటాయి. ఈ కూత 'ఎ లిక్విడ్ వెట్ – మి – లిప్స్' అన్నట్టుగా ఉంటుంది. ఈ రెండు జాతుల యెలిసెలూ కూడ నేలమీద పల్లం చేసి, ఆ పల్లానికి చుట్టూ పచ్చగడ్డి పేర్చి, ఆ గూటిలో గ్రుడ్లు పెడతాయి. ఈ గూళ్లనవి ఎవరికీ కనపడకుండా పెరిగిన పచ్చగడ్డి మధ్యనో పైరు మొక్కల మధ్యనో నిర్మిస్తాయి. గూటిలో 6 మొదలు 8 గ్రుడ్లుంటాయి. అవి పసుపు చాయగల మీగడరంగులో ఉంటాయి. వాటిమీద గోధుమరంగులో పలుచాయలలో మచ్చలుంటాయి. ఈ రెండు జాతుల యెలిసెల గ్రుడ్లూ, పరిమాణంలో తప్ప మిగతా విషయాలలో ఒక్కలాగే ఉంటాయి.

అడవి పొదయెలిసె (Jungle Bush Quail — Perdicula Asiatica)– పటము 29 – హిందీ: లొవ్వా. ఇది పరిమాణంలోనూ, రూపు రేఖలలోనూ తక్కిన యెలిసెల్లాగే ఉంటుంది. పుంజు ఉపరి భాగం ఎరుపు – పసుపు – గోధుమల మిశ్రవర్ణంలో ఉంటుంది. దానిమీద నల్లనివీ, లేత పసుపువీ చారలూ, చుక్కలూ ఉంటాయి; అధో భాగం తెల్లగా ఉంటుంది; అచ్చట దట్టంగా నల్ల చారలు ఉంటాయి. పెట్ట క్రింది భాగాలు లేత గులాబీ రంగులో ఉంటాయి. మగపక్షికీ, ఆడు పక్షికీ కూడా నుదుటి నుండి వెనుకగా మెడ రెండు వైపులకూ క్రిందికి లేతపసుపు – చెస్నటు రంగుల

చార ఉంటుంది. కంఠంపై కాంతిమంతమైన చెస్నటు రంగు మచ్చ ఉంటుంది. అచ్చంగా ఈ పక్షిలాగే ఉండే రాతిపొదయెలిసె (Rock Bush Quail — Perdicula Argoondah) అను మరో జాతి పక్షి ఈ పక్షితో కలిసి తిరుగుతోంటుంది. అందుచేత ఈ రెండు పక్షులలో ఏది ఏదో పోల్చుకోవడం కొంచెం కష్టం. రాతిపొద యెలిసెలలో పుంజుకి గొంతుమీద ఉండే మచ్చ చెస్నటురంగులో కాక వెలవెలపోతున్న ఇటుక ఎరుపు రంగులో ఉంటుంది. పెట్టకన్నసో గొంతుమచ్చ ఉండనే ఉండదు. అడవిపొదయెలిసె ఆకులను రాల్చే చెట్లున్న అడవులలోనూ, పచ్చగడ్డి, తుప్పలూ ఉండి, పొడిగా ఉండే అడవులలోనూ ఉంటుంది. ఈ పక్షులు 5 మొదలు 20 దాకా కలిసి గుంపులుగా నివసిస్తాయి. అవి రాత్రులు నిద్ర పోయేటప్పుడునూ, పగటివేళ కలవర పడినప్పుడును ఏ పొదలోనో పచ్చగడ్డి దుబ్బులోనో కట్టకట్టుకొని దూరి ముఖాలు బయటికి పెట్టుకొని ఉంటాయి. శత్రులెవరైనా సమీపిస్తే ఆ పక్షులన్నీ ఒక్కసారిగా బుర్రుమని రెక్కలు చప్పుడు చేస్తూ నలుదిశలకూ ఎగిరిపోతాయి. అలా కొంత దూరం పోయి, తిరిగీ క్రింద వ్రాలి, దాక్కొంటాయి. పిమ్మట వీ-వీ-వీ అని మృదువైన ఈలకూతలు కూసుకొంటూ వెంటనే మళ్ళీ ఒకచోట గుమికూడతాయి. ఈ పక్షులు ప్రతి దినం ఉదయం సాయంత్రం కూడా ఒకదాని వెనుక ఒకటిగా ఒకే వరుసలో ఎప్పుడును ఒకే బాటలో నీరు త్రాగడానికి గుంటల వద్దకు పోతుంటాయి. వీటికి గింజలూ, గడ్డిమొక్కల యొక్క, కలుపు మొక్కల యొక్క బీజాలూ, చిగుళ్ళూ ముఖ్యమైన ఆహారం. చెద పురుగులనూ ఇంకా మరి కొన్ని కీటకాలను కూడా అవి తింటాయి. గ్రుడ్లు పెట్టే కాలంలో మగ పక్షులు కయ్యానికి కాలు దువ్వుతాయి. అప్పుడవి కర్ణకఠోరంగా అరుస్తూ పెంటికై పోటీపడే పుంజులను సవాలు చేస్తాయి. ఈ పక్షి చిట్టడవులలో గడ్డి దుబ్బుల యడుగున నేలమీద పల్లంచేసి, ఆ పల్లానికి లోపల నలువైపులా గడ్డి పరుస్తుంది. ఇదియే దాని గూడు. గూటిలో 4 మొదలు 8 వరకూ గ్రుడ్లుంటాయి. అవి మీగడ తెలుపు రంగులో ఉంటాయి. వాటిమీద చారలు గాని, మచ్చలు గాని ఏవీ ఉండవు. నల్ల బోరయెలిసె గ్రుడ్లకీ, దీని గ్రుడ్లకీ ఏవిధమైన పోలికాలేదు.

బూడిదరంగు అడవి కోడి (Grey Junglefowl — Gallus Sonneratii)— పటము 30 — హిందీ : జంగ్లీ మూర్గీ. ఈ జాతి పుంజూ, పెట్టా రమా

రమీ పెంపుడు కోడి పుంజూ, పెట్టా అంత ఉంటాయి. అడవి కోడిపుంజు మొత్తంమీద బూడిద రంగు చారలుగల పక్షి. దీని తోక నిగనిగ లాడుతూ నల్లగా కొడవలిలాగుంటుంది. పెట్ట పైభాగం గోధుమ రంగు లోనూ, క్రింది భాగం చాలావరకు తెలుపు రంగులోనూ ఉంటాయి. ఈ తెల్లని భాగంమీద పొలుసుల వంటి నల్లని గుర్తులుంటాయి. చిన్న చిన్న గుట్టలూ, వెదురుపొదలూ ఉండే అడవిలోనూ, అక్షింతల మొక్కల పొద లుండే అడవి ప్రదేశాలలోనూ, కొంతకాలం పెంచి వదలివేసిన తోటలలోనూ ఈ పక్షులు ఒకటొకటిగాని, జతలు జతలుగా గాని, చిన్న చిన్న గుంపులుగా గాని కనబడతాయి. మన ద్వీపకల్పంలో పడమటి వైపున ఉన్న ప్రాంతాలలో మాత్రమే ఈ పక్షి కనిపిస్తుంది. వెదురు పొదలు, కర్వీపొదలు వెన్నువేసి నపుడు వాటి బీజాలను తినడానికి ఆ ప్రాంతాల్లో ఈ పక్షులు అసంఖ్యాకంగా చేరుకొంటాయి. ఈ బూడిదరంగు అడవికోడీ, ఎఱ్ఱని అడవికోడీ కూడా పిరికి పక్షులే. ఏమాత్రం సడి అయినా బెదురుతాయి. ఉదయం, సాయంకాలం కూడా అవి బయలుగా ఉండే ప్రదేశాలకు వచ్చి ఆహారం కోసరం నేలను గీరుతాయి. సాధారణంగా అవి తమ రక్షణ స్థానాలనుండి దూరంగా పోవు. ప్రమాదాన్ని ఏమాత్రం శంకించినా అవి మెడ ముందుకు చాచి, తోకను వ్రేల వేసి వాటి రక్షణ స్థలాల్లోకి అతివేగంగా గునగుని నడుచుకొంటూ పోతాయి. వాటి యాహారం గంజలూ, చిగుళ్లూ, తేంటానా, రేగు – ఇలాంటి మొక్కల పళ్ళూను. గాలికి రాలిపోయిన మఱ్ఱిపళ్లంటే వాటికెంతో ఇష్టం. కీటకాలనూ, కీటకాల లార్వాలనూ కూడా అవి తింటాయి. బూడిదరంగు అడవికోడి పుంజు 'కూక్ – కయా – కయా – కుక్' అని కూస్తుంది. ఈ కూత కడపటి భాగం తక్కువ స్వరంలో క్యాకున్ – క్యాకున్ అన్నట్లుగా ఉంటుంది. ఈ కడపటి కూతను అది మెల్లగా, మృదువుగా సమీపంలో ఉన్న వాళ్లకు మాత్రమే వినపడేటట్లుగా అనేక పర్యాయాలు వినిపిస్తుంది. అది అలా కూసే టప్పుడు ఏదైన ఎత్తైన దిబ్బనో, పడిపోయిన చెట్టు బోదెనో ఎక్కి మరీ కూస్తుంది. కూయడానికి పూర్వం పెద్ద చప్పుడయేటట్లు రెక్కలను ప్రక్కలకు కొడుతుంది. ఈ కూతను విని వినగానే ఆ చుట్టు ప్రక్కలనున్న మిగతా పుంజులన్నీ జవాబుగా కూస్తాయి.

అడవి పుంజు ఒక్క పెట్టతోనే తృప్తి పొందుతుందా లేక మిగతా వేట పక్షులలాగ పెక్కు పెట్టలను చేరదీస్తుందో అనే విషయం ఇంకా పూర్తిగా

తెలియదు. ఈ పక్షి తుప్పలలో నేలపై పల్లం చేసి, ఆ పల్లానికి లోపలి ప్రక్కను ఎండుటాకులను అస్తరుగా అమరుస్తుంది. ఈ గూటిలో 4 మొదలు 7 వరకూ గ్రుడ్లుంటాయి. ఆ గ్రుడ్లు లేత పసుపు రంగులో ఉంటాయి. చూడడానికవి పెంపుడు కోడి గ్రుడ్లలాగే ఉంటాయి.

ఎఱ్ఱని అడవి కోడి (Red Junglefowl – G. Gallus). ఇది మన పెంపుడు కోళ్లన్నిటికీ జాతి పిత. ఇది ముఖ్యంగా హిమాలయ ప్రాంతాల లోనూ, వాటికి దక్షిణంగా మధ్య ప్రదేశపు ప్రాచ్యభాగము వరకూ గల కొండలమీదా, గుగ్గిలం మొక్కలుండే చోట్లన్నిటిలోను ఉంటుంది. పుంజూ, పెట్టా కూడా బెంటమ్ జాతికి చెందిన పెంపుడు కోళ్లను ఎక్కువగా పోలి ఉంటాయి. పుంజు కూతకూడ పెంపుడు కోడి పుంజు కూతలాగే ఉంటుంది.

నెమిలి (Common Peafowl — Pavo Cristatus)— పటము 31 — హిందీ: మోర్ లేక మయూర్. భారత ద్వీపకల్పంలో నెముడు కుటుంబం లోని పక్షులలోకెల్ల నెమిలి మిక్కిలి అందమైన పక్షి. ఈ మధ్యనే అది మన జాతీయ పక్షిగా ఎన్నికైంది కూడాను.

ఇది అందరికీ బాగా పరిచితమైనదే. అందుచేత దీనిని అంతగా వర్ణించ నవసరం లేదు. కాని దీనిని గురించి అందరికీ సామాన్యంగా తెలియని ఒక విషయం ఉంది. నెమిలి కన్నులతో మిక్కిలి రమణీయంగా పుంజు వెనుక భాగాన జీరాడే దాని పింఛాన్ని దాని తోక అనుకొంటారు. కాని నిజంగా అది దాని తోక కాదు. అది తోకను కప్పడానికి విపరీతంగా పెరిగిన ఈకల పుంజమే. పుంజుకూ, పెట్టకూ కూడ తలమీద తురాయి ఉంటుంది; కాని పుంజుకుండే పింఛము పెట్టకు లేదు. పెట్ట శరీరం గోధుమ రంగులో ఉంటుంది. దాని శరీరంమీద చుక్కలుంటాయి. మెడ దిగువ భాగం ఆకుపచ్చగా నిగనిగలాడుతూ ఉంటుంది. నెమిళ్లు గుంపులు, గుంపులుగా సంచరిస్తాయి. ఈ గుంపులలో పుంజులూ, పెట్టలూ కూడా ఉంటాయి. నెమిళ్లు ఆకులను రాల్చే మొక్కలుండే బయళ్లలోనూ, చిన్న కొండలను చేరియుండే అడవులలోనూ కనిపిస్తాయి. కొన్ని ఋతువులలో పుంజులూ, పెట్టలూ విడిపోతాయి. ఈ పక్షులు ఆహారం కోసరం ఉదయం సాయంత్రం కూడా చెట్లను నఱికి తీసివేసిన అడవి ప్రదేశాలకూ, పొలాలకూ వస్తాయి. నెమిళ్లను చంపడం శాస్త్ర సమ్మతం కాదనే అభిప్రాయంతో గుజరాతు లోను, రాజస్థానులోను వాటికి రక్షణ కల్పించారు. ఆ ప్రదేశాల్లో అవి

చాలవరకు పెంపుడు పక్షులలాగే నిర్భయంగా సంచరిస్తాయి. అందుచేత ఆ ప్రదేశాలలో ఉండే నెమిళ్లను మాత్రమే చూచినవారికి అడవి నెమిళ్లకుండే విపరీతమైన జాగరూకత, జిత్తులు, రక్షణోపాయాలను గూర్చి అంతగా తెలియదు. అడవులలో ఉండే నెమిళ్లకు ఎప్పటికప్పుడు వేటగాళ్ల భయం, క్రూర జంతువుల భయం ఉండటంచేత, ఆ నెమిళ్లలో పై లక్షణాలు మనకు వ్యక్తమౌతాయి. ఈ పక్షులకు గల దృష్టి శ్రవణములు అద్భుతములు. కనుక ఆకస్మాత్తుగా ఏవీ వాటిపై పడి పట్టుకోవడం సాధారణంగా సంభవించదు. ఏ కొంచం అనుమానం కలిగినా అవి దగ్గరలో ఉన్న ఏ తుప్పలలోకో జారుకుంటాయి. కాని వాటిపై అకస్మాత్తుగా దాడి చేసినపుడు లేదా పొదలనుండి వాటిని పైకి తరిమినపుడు అవి శ్రమతో రెక్కలను కొట్టుకొంటూ, చప్పుడు చేస్తూ నిట్టనిలువుగా పైకి తారాజువ్వలవలె ఎగురుతాయి. వాటికి పింఛభారం ఉన్నప్పటికీ అవి తగినంత వేగాన్ని పుంజుకొని సునాయాసంగా ఎగిరి పోతాయి. రాత్రులందని ఎత్తైన చెట్లమీద నిద్రపోతాయి. తెల్లవారుఝామున పుంజులు 'మే — ఆ' అనే అసహ్యకరమైన కూతలతో అడవిని ప్రతిధ్వనింప చేస్తాయి. ఇట్టి వికారపు కూత వాటి సుందరమైన రూపానికి పూర్తిగా విరుద్ధంగా ఉంటుంది. వీటి ఆహారం ముఖ్యంగా గింజలూ, దుంపలూ, చిగుళ్లూను. కాని అవి సర్వ భక్షకాలు. అవి కీటకాలను, తొండలనే కాక చిన్న పాములను కూడా ఇష్టంగా తింటాయి. వీటికి రక్షణ కల్పించిన గ్రామాల్లో నెమిళ్లు సేద్యగాళ్ల పొలాలోకి నిర్భయంగా ప్రవేశించి, కొత్తగా నాటిన వేరుశెనగకు, తృణధాన్యపు పంటలకు ఎంతో నష్టం కలుగచేస్తాయి. నెమిలి నేలమీద పల్లంచేసి దాని లోపలి ప్రక్కను పుడకలు, ఆకులు అస్తరుగా పేరుస్తుంది. ఇదియే దాని గూడు. ఇతరులకు కనబడ కుండా ఉండుటకై ఈ గూటిని అది తుప్పలలో నిర్మిస్తుంది. గూటిలో 3 మొదలు 5 వరకూ గ్రుడ్లుంటాయి. అవి మీగడ తెలుపు రంగులోగాని పాల కాఫీ రంగులోగాని ఉంటాయి.

(భారత ఉపఖండంలో గ్రూయిఫార్మిస్ వర్గ (Order GRUIFORMES) మందు చాలా కుటుంబాలున్నాయి. వీటిలో గ్రూయిడె (Gruidae) —

కొంగలు (Cranes), రల్లిడె (Rallidae) — వెన్నముద్ద కోళ్లు (Rails) ఓటిడిడె (Otididae) — బట్టమేర పక్షులు (Bustards) ముఖ్యమైన కుటుంబాలు.

సారసకొంగ (Saras Crane — Grus Antigone)— పటము 32 — హిందీ: సారస్. ఇది కొంగలలో ప్రధానమైనది. ఇది బూడిదరంగు పక్షి; బోరువంత పెద్దది; మనిషంత ఎత్తుంటుంది. దీని కాళ్లు ఎఱ్ఱగా ఉంటాయి. కాళ్లమీద ఈకలుండవు. దీని తల, తలకు దగ్గరగా ఉన్న మెడ పై భాగమూ ఎఱ్ఱగా ఉంటాయి; ఈకలు లేక బోడిగా కూడా ఉంటాయి. ప్రత్యేకంగా ఒక ఋతువులో సారస కొంగలు సేద్యపు పొలాలలోనూ, బాడవలలోనూ ఒకటి రెండు పిల్లలనుకూడా వెంటబెట్టుకొని, జతలు జతలుగా నడుస్తూ కనిపిస్తాయి. సాధారణంగా ఇవి గుంపులుగా కూడవు. కాని అరుదుగా శతాధికమైన పక్షుల మందలు కూడ కనబడుతూంటాయి. అవి జీవితమంతా జతగూడి ఉంటాయి. వాటి వైవాహిక అనుబంధాన్ని మిక్కిలి పవిత్రమైన దానినిగా పౌరాణిక జానపద గాథలలో చిత్రించారు. గ్రామీణులు సారస కొంగల నేమాత్రమూ బాధ పెట్టరు. అందుచే అవి అన్నిచోట్లా బాగా మచ్చికవుతాయి. మన దేశానికి వలసవచ్చే ఈ కొంగల చుట్టాలు మాత్రం వీటికి పూర్తిగా విరుద్ధంగా ఉంటాయి. రుచ్యమైన వాటి మాంసం కోసరం వాటిని అత్యాశతో వేటాడుతారు. అందుచేత అవి మిక్కిలి జాగరూకతతోను, మెలకువతోను ఉంటాయి. సారస కొంగలు భూమిని వదలి పైకి లేచేటప్పుడు బరువుగానూ, కొంత ప్రయాసతోనూ లేస్తాయి. కాని అవి కొంతదూరం పైకి వెళ్ళేసరికి, వేగం పుంజుకొని దార్ఢ్యతతో ఎగురుతాయి. ఎగిరేటప్పుడవి వాటి పెద్ద రెక్కలను క్రమబద్ధంగా కొడుతూ, మెడను ముందుకు, కాళ్లను వెనుకకు చాచి ఎగురుతాయి. నేలమీద ఉన్నపుడూ, ఎగిరేటప్పుడూ కూడా అవి ఖంగుమంటూ, దూరానికి వినపడేటట్లు, బాకాలాగ కూస్తాయి. ముఖ్యంగా గ్రుడ్లను పెట్టే కాలం లోనూ, అప్పుడప్పుడు ఇతర కాలాల్లోను కూడా సారస దంపతులు రెక్కలు విప్పుకొని గాలిలో దుముకుతో, త్రుళ్లి త్రుళ్లిపడుతో ఒకదాని ముందొకటి దండం పెట్టేలాగ వంగుతో తమాషాగా నృత్యం చేస్తాయి. గింజలూ, దుంపలూ, చిగుళ్ళూ ఇంకా ఇతర శాక పదార్థాలూ వీటి ఆహారం. కీటకాలనూ, నత్తలనూ, కప్పలనూ, సరీసృపాలనూ, అప్పుడప్పుడు చేపలను

పటము 33

తెల్లబోర నీటికోడి

(*Amaurornis phoenicurus*)

పు. 73





పటము 34

నేలబోలి కోడి (ఊదా జంబుకోడి)

(*Porphyrio porphyrio*)

పుట 75

పటము 35

ఘూక్‌వార్ బట్టమేకపక్షి

(*Choriotis nigriceps*)

పుట 76





పటము 36

కంచురెక్కల జకానా

(*Metopidius indicus*)

పుట 78

పటము 37

ఎఱ్ఱకంఠ ఎన్నుపిట్టలు

(*Vanellus indicus*)

పుట 50





పటము 38

**ఉల్లంకి**

(*Tringa hypoleucos*)

పేజి 81

పటము 39

## కంఠమాలగల చిన్నప్లోవరు

*(Charadrius dubius)*

పుట 82





పటము 40

రాతికాతేడు (గాసుల్‌వట్ల ప్లోవరు)

(*Burhinus oedicnemus*)

పేజీ 54

పటము 41

గోధుమరంగుతల గాయరాకి

(*Larus brunnicephalus*)

పేజీ ౧౫





పటము 42

మీసాల పెద్ద (రేవపిట్ట)

**(*Chlidonias hybrida*)**

పేజి 87



పటము 44

**పచ్చ పావురము**

(***Treron phoenicoptera***)

పుట 90

పటము 45

గుడి పావురము

(*Columba livia*)

[illegible] 92





పటము 46

చుక్కలగువ్వ (పుటంసెట్టి పిట్ట) (పై చిత్రం)

(*Streptopelia chinensis*)

ఎఱ్ఱగువ్వ (క్రింది చిత్రం)

(*Streptopelia tranquebarica*)

పేజీ 92 & 93



పటము 17

గులాబి కంఠమాలగల చిలుక

(*Psittacula krameri*)

పేజీ 91



పటము 48

కోకిల

(*Eudynamys scolopacea*)

పేజీ 96

కూడా సారసకొంగలు తింటాయి. విచ్చలవిడిగా అవి పొలాలలో సంచరి స్తాయి కనుక కొత్తగా నాటిన వేరుసెనగకు, తృణధాన్యపు పంటలకు అవి విశేష నష్టం కలుగచేస్తాయి. నీటితో నిండిన వరిపొలం మధ్యనో, ఏపుగా పచ్చగడ్డి పెరిగి గట్టునో, బాడవ మధ్యనున్న ఏ చిన్నలంకలోనో, నేలపై జమ్ము, రెల్లు, పచ్చగడ్డి ఇత్యాది పదార్థాలతో సారసకొంగ పెద్ద గూడు కడుతుంది. గూటిలో సాధారణంగా 2 గ్రుడ్లుంటాయి. అవిలేత ఆకుపచ్చగా గాని, లేతగూలాబీ రంగులోగాని ఉంటాయి. ఈ గుడ్లుమీద గోధుమరంగువి కాని, ఊదారంగువి గాని మచ్చలు, చుక్కలు ఉంటాయి.)

మరో రెండు బూడిదరంగు కొంగలు శీతాకాలంలో భారత ఉప ఖండానికి వలస వస్తాయి. ఈ రెండింటిలో చిన్నది వాడకొరక (Demoiselle — Anthropoides Virgo) — హిందీ : కర్కరా లేక కూంజ్. దీని తలమీద ఈకలూ, మెరిసే తెల్లని చెవి - కుచ్చులూ ఉంటాయి. దీని మెడా, రొమ్మూ నల్లగా ఉంటాయి. ఈ లక్షణాలను బట్టి దీనిని సులభంగా పోల్చుకోవచ్చును. రెండవది కూలంగు కొంగ (Common Crane — Grus Grus). దీని తల బోడి తల; నల్లగా ఉంటుంది. మెడ వెనుక భాగాన అడ్డంగా విలక్షణమైన ఎఱ్ఱని మచ్చ ఉంటుంది.

వెన్నముద్దకోళ్లు (Family Rallidae) ఇవి జంకుతూ, నక్కుతూ చిత్తడి భూములలో సంచరించే చిన్న పక్షులు. వీటిలో కొద్దిపాటి పెద్ద పక్షులుకూడా ఉంటాయి. వీటికి మొద్దు బారిన తోక, గుండ్రని రెక్కలు, పొడుగైన కాళ్లు ఉంటాయి. కాళ్లమీద కాలివ్రేళ్ల మీద ఈకలుండవు. ఈ కుటుంబంలో మనకు బాగా పరిచితమైన పక్షి తెల్లబొర నీటి కోడి (Whitebreasted Waterhen — Amaurornis Phoenicurus) — పటము 33 — హిందీ : జల్ మూర్గి లేక డౌక్. ఇది బలపపు రంగు పక్షి. తోక మొద్దుబారి ఉంటుంది. కాళ్లమీద ఈకలుండవు. ఇది చిత్తడి నేలలలో సంచరిస్తుంది. ఈ నీటి కోడి బూడిదరంగు కౌజంత ఉంటుంది. దీని ముఖం, రొమ్మూ తెల్లగా ఉంటాయి. ఎత్తి పెట్టుకొని ఉన్న దీని తోక క్రింది భాగం కాంతిమంతమైన త్రుప్పు – ఎరుపు రంగులో ఉంటుంది. తెల్లబొర నీటి కోడి నీటి సామీప్యాన్ని వదలి ఉండలేదు. గ్రామాలలో ఉండే కొలనులను, బాడవలను, అంటిపెట్టుకొని యున్న రెల్లు దుబ్బుల లోనో, తుప్పలలోనో, లేదా వాటి సమీపంలోనో ఈ పక్షులు ఒంటిగాగాని,

జతలుగా గాని కనబడతాయి. వర్షాకాలంలో పల్లాలలో నీరు చేరినపుడు రోడ్ల కిరుప్రక్కలా ఉన్న కంచెలలో గాని, గడ్డి దుబ్బులలో గాని ఇవి కనపడతాయి. అతిమెలుకువతో నలుప్రక్కలను కనిపెట్టుచు విహరించే టప్పుడూ, పొదల్లో నక్కడానికి దూరేటప్పుడూ అది దాని మొండితోకను తరుచుగా పైకి కదిలిస్తూ తోక అడుగున ఉన్న ఎఱ్ఱ మచ్చను ప్రకటిస్తూంటుంది. అది చాలా పిరికి పక్షి; ఎవరూ దానిని పరిశీలనగా చూడడాని కిష్టపడదు; ప్రమాదాన్ని ఏమాత్రం శంకించినా ఎందులోనో దూరి మాయమవుతుంది. కాని దానిని ఎవరూ అల్లరిపెట్టక పోయినట్లయితే, నమ్మకం కుదిరి, తోటలలోనూ, పసిరిక బయళ్లమీదా, కంచెలలోనూ నిర్భయంగా, సొగసుగా విహరిస్తుంది. కీటకాలూ, నత్తలూ, క్రిములూ, బీజాలూ ఇంకా ఇతర శాకపదార్థాలూ ఈ నీటికోడి ఆహారం. ఇవి గ్రుడ్లు పెట్టేకాలం వర్షాకాలము. అంతవరకూ ఈ పక్షి నిశ్శబ్దంగానే ఉంటుంది; కూత కూయదు. ఆ కాలంలో పుంజులు ఎక్కువగా కయ్యానికి కాలు దువ్వుతూ ఎంతో సందడి చేస్తాయి. అప్పుడవి బాగా ఆకులున్న పొదపైకి పాకులాడుతూ ఎక్కి గండు పిల్లుల్లాగ అరుస్తాయి. దీని కూత పక్షి కూతలా ఉండదు. ఈ కూత ప్రారంభంలో అలిసిపోయిన వాని మూలుగులాగ, పంది గుఱ్ఱులాగా, కప్పకూతలాగా, 'ఆహా! నేను కాగా ఇంత పని చేశా' నని గర్వించి నవ్వుతున్నట్లూ – లోహంలాగ ఖంగు మంటూ 'కుర్ – క్వవాక్ – క్వాక్, కుర్ – క్వాక్ – క్వాక్ –' అంటూ భల్లూకము బాధపడుతున్నట్లు – ఉంటుంది. తుదకు 'కూక్, కూక్ – కూక్' అని ఏక రీతిగా చాలాసేపు కూసి పూర్తి చేస్తుంది. ఈ కూత కంసాలి పిట్ట కూతను పోలి ఉంటుంది. కాని దీని కూత కంసాలి పిట్ట కూతకంటె హెచ్చుస్థాయిలోనూ త్వరితగతిలోనూ ఉంటుంది. ఈ కూతలను దూరం నుండి విన్నపుడు ఆధునికతకు చిహ్నంగా అన్ని పల్లెటూళ్లలోను వెలసిన ఆయిల్ ఇంజిన్‌తో నడిపే పిండిమర చప్పుడేమో నని పొరపడడానికి కూడా సావకాశం ఉంది. ఈ పక్షి తడవకు 15 నిమిషాల పర్యంతమూ అదే పనిగా కూస్తుంది. మధ్య మధ్య విరామం తీసికొంటూ ఇది పగలంతాను రాత్రంతాను కూస్తూనే ఉంటుంది. నీటికోడి గూడు లోతులేని గిన్నెవంటి ఆకారంలో ఉంటుంది. నేలమీద మొక్కలు బాగా అల్లుకు పెరిగిన చోటనో, నీటికి ఒకటి రెండు మీటర్ల ఎత్తున ఏ

దట్టమైన పొదలోనో ఈ పక్షి తన గూటిని పుడకలతోనూ, లతలతోనూ నిర్మిస్తుంది. గూటిలో 6 లేక 7 గ్రుడ్లుంటాయి. అవి మీగడ తెలుపు రంగులో గాని, లేత గులాబీ ఛాయకల తెలుపు రంగులో గాని ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమ రంగు చారలూ మచ్చలూ ఉంటాయి.

ఊదా జంబుకోడి, నేలబోలికోడి (Purple Moorhen — Porphyrio Porphyrio) — పటము 34 - హిందీ: కైమ్, రిమ్ లేక కలిమ్. వెన్నుముద్ద కోళ్ల కుటుంబంలోని ఈ పక్షి అందమైనదే కాని కొంచెం మోటుగా ఉంటుంది. ఇది ఊదా ఛాయగల నీలిరంగు పక్షి. పరిమాణంలో ఇది రమారమీ పెంపుడు కోడంత ఉంటుంది. దీని కాళ్లు పొడుగు. వాటిమీద ఈకలుండవు. కాళ్లు, కాలివ్రేళ్లూ ఎఱ్ఱగా ఉంటాయి. దీని ముక్కు పొట్టి; ఎఱ్ఱగా, బరువుగా ఉంటుంది. ఈ ముక్కు వెనుక నుదురు భాగము ఎఱ్ఱగా, బోడిగా ఉంటుంది. దాని మొండితోకకు దిగువున తెల్లని మచ్చ ఉంటుంది. ఈ పక్షి అడుగువేసినపుడల్లా దాని తోకను పైకెత్తుతూంటుంది. అలా అది తోకను ఎత్తినపుడు, దాని దిగువనున్న తెల్లని మచ్చ స్పష్టంగా ప్రకటితమవుతుంది. పై జెప్పిన లక్షణాలన్నీ నేలబోలి కోడిని పోల్చుకోడానికి ముఖ్యంగా పనికివస్తాయి. రెల్లు మడులలో ఈ పక్షులు గుంపులు గుంపులుగా కనపడతాయి. అక్కడ ఆ పక్షులు ఆహారం కోసరం కాలు ఎత్తివేస్తూ ఒయ్యారంగా నడుస్తూ రెల్లు గడ్డిలో నక్కుతూ కాలక్షేపం చేస్తాయి. అప్పుడప్పుడవి కాండముల మీదకు ఒకదాని వెనుక ఒకటి వికారంగా పాకులాడుతూ ఎక్కుతాయి. నీటిలో తేలే మొక్కల మీదా, తామరాకుల మీదా అవి తచ్చాడుతాయి. అలాంటప్పుడవి తరుచుగా వాటి తోకలను పైకెత్తుచూ వెన్నుముద్ద కోళ్ల కుటుంబ లక్షణాన్ని ప్రదర్శిస్తాయి. వాటిని అల్లరిపెడితే ఏ రెల్లుమడిలోకో, ఏ పొదలోకో దూరి అవి అక్కడ నక్కుతాయి. తగినంత అవసరం వస్తే కాని అవి ఎగరడానికిష్టపడవు. ఎగరడమన్నది వాటికి శ్రమతో కూడుకొన్న పనిలా కనిపిస్తుంది. వికారమైన ఎఱ్ఱని కాళ్లను వెనకాల వ్రేలాడవేస్తూ ఈ పక్షి బలహీనంగా ఎగురుతుంది. కాని ఒకసారి గాలిలోనికి లేచి ఎగరడం ప్రారంభిస్తే అది అతివేగంగా ప్రయాణం చెయ్యగలదు. వరి చిగుళ్లు, బాడవ మొక్కల చిగుళ్లు వాటి ముఖ్యాహారం. వాస్తవానికి అవి తినే గింజలవలన కలిగే నష్టంకన్నా, వాటి పెద్ద పాదాలతో మొక్కలను మట్టి వేయ్యడంచేత

స్థానికంగా వరిపంటలకు ఎక్కువ నష్టం కలుగుతుంది. కీటకాలనూ, నత్తలనూ కూడా అవి తింటాయి. ఈ పక్షుల కూతలు గుడ్లగూబలు, కోళ్లు, బాతుల యొక్క కూతల్లాగా పలురకాలుగా ఉంటాయి. ఈ కర్ణకఠోరమైన స్వరాలు ఈ పక్షులు నివసించే రెల్లుమడులనుండి రోజులో అన్ని వేళలా, అందు ముఖ్యంగా మబ్బుగా ఉన్నపుడు వినవస్తాయి. గ్రుడ్లను పెట్టే ఋతువులలో ఈ పక్షులు ఎక్కువగా సందడి చేస్తాయి. నీటి మొక్కలను ముక్కుతో పట్టుకొని, పుంజు తన పెంటి కెదురుగా గర్వంగా నిలబడి నృత్యం చేస్తూ, బిగ్గరగా కూస్తూ, దాని ప్రేమ భావాన్ని వ్యక్తం చేస్తుంది. ఛాందసులైన వేటగాళ్లు ఊహా జంబుకోడిని వేట పక్షిగా పరిగణించరు. కాని గ్రామీణులకు దీని మాంసం అంటే ఎంతో ఇష్టం. అందుకని స్థానికంగా గ్రామాలలో ఈ పక్షులను హెచ్చుగా చంపుతారు. ఊహా జంబుకోడి నీటితో నిండిన రెల్లు మడులలో నీటి మొక్కల నొక దాపగా చేసి అందుపైని రెల్లు ఆకులతో గాని, వరి ఆకులతో గాని ఒక పెద్ద మెత్తవంటి గూటిని అల్లుతుంది. గూటిలో 3 మొదలు 7 వరకూ గ్రుడ్లుంటాయి. అవి మీగడ తెలుపునుండి నారింజవరకు అనేక ఛాయలలో ఉంటాయి. వాటి పైన ఎరుపు కలిసిన గోధుమ రంగుగల మచ్చలూ, చుక్కలూ ఉంటాయి.

తూక్‌దార్ బట్టమేర పక్షి (The Great Indian Bustard — Choriotis Nigriceps) — పటము 35 — హిందీ : తూక్‌దార్ లేక హూక్‌నా : మన బట్టమేర పక్షు (Family Otididae) లన్నిటిలోకి ఇది చాలా ముఖ్యమైనది. ఇది నేలమీద ఉండే పెద్ద పక్షి. ఈ పక్షి బోరువంత ఉంటుంది. తలతో కలిపి దీనిఎత్తు సుమారు ఒక మీటరుంటుంది. దీని బరువు 15 కిలోగ్రాముల వరకూ ఉంటుంది. చూడడానికిది చిన్న నిప్పుకోడియేమో అనిపిస్తుంది. దీని దేహం క్షితిజ సమానాంతరంగా ఉండి బోడిగా ఉండే దాని బలిష్ఠమైన కాళ్లకు సమకోణంలో ఉంటుంది. ఇది దీని ప్రత్యేక లక్షణం. దీని పైవైపు ఈకలు ముదర పసుపురంగులో ఉంటాయి. ఈ రంగుమీద పురుగులను బోలు నల్లని చారలుంటాయి. ఈ పక్షి అడుగువైపు ఈకలు తెల్లగా ఉంటాయి. దీని రొమ్ము క్రిందిభాగాన కంఠాభరణం వంటి వెడల్పైన అడ్డు చార ఉంటుంది. దాని తెల్లని మెడ, నల్లని తల, అది ఎగిరేటప్పుడు రెక్కల కొనల సమీపంలో బాగా కనపడే తెల్లని పెద్దమచ్చ — ఇవికూడ మనలను బాగా ఆకర్షిస్తాయి. ఆడుపక్షి మగపక్షికన్న చిన్నది. తుక్‌దార్ ఒంటిగా

ఇక్కడొకటీ, అక్కడొకటీ కనపడుతుంది. అప్పుడప్పుడవి రెండూ మూడూ కలిసి అక్కడక్కడా కనపడటం కూడా కద్దు. కాని 25 మొదలు 30 పక్షులవరకూ ఉన్న గుంపులు అక్కడక్కడ కనపడ్డట్లు గతంలో గుర్తించిన రికార్డులున్నాయి. ఎడారి లక్షణాలుగల మైదానాలూ, మధ్య మధ్య తుప్పలూ, పంటపొలాలూ కల పచ్చికబయళ్లూ ఈ పక్షుల విహార స్థానాలు. ఇది మిక్కిలి పిరికి పక్షి. ఎల్లప్పుడూ మెలకువతో ఉంటుంది. ఈ పక్షికి దగ్గరగా వెళ్లాలంటే ఏ ఎడ్లబండీలోనో, ఒంటెమీదనో లేదా దాని చాటునో వెనకాలే వెళ్ళాలి. కాని ఎదురుపడుతే లాభం లేదు. కాని పక్షులను దొంగిలించేవారి జీపులను మాత్రం ఈ తెలివిమాలిన పక్షులు అనుమానించవు. అందుచే ఈ దొంగలకవి పట్టుబడిపోతాయి. ఈ పక్షులను చంపకూడదని శాసించే చట్టమున్నప్పటికీ, పాపము ఇటీవల ఈ జాతి నశింపయేటంత వరకూ వచ్చింది. బట్టమేర పక్షి గాలిలోకి మొదట బరువుగా లేస్తుంది. కాని గాలిలోకి లేచిన వెంటనే రెక్కలను బలంగానూ, క్రమ బద్ధంగానూ కొట్టుకొంటూ ఎగురుతుంది. అది భూమినుండి అట్టే ఎత్తుకు ఎగురకపోయినా పెక్కు కిలోమీటర్ల దూరం ఏకాఏకిని ఎగురగలదు. బెట్టిమిడుతలూ, మిడుతలూ, పెంకుపురుగులూ, గింజలూ, పంట మొక్కల చిగుళ్లూ దాని ఆహారం. బల్లులనూ, చిన్న పాములనూ, జెఱ్ఱులనూ కూడా అది తింటుంది. అది భయపడినప్పుడు 'హూక్' అని కుక్క మొరిగినట్లో, ఎద్దు రంకె వేసినట్లో బిగ్గరగా కూస్తుంది. ప్రతి పుంజుకి పెక్కు పెంటెలుంటాయి. దాని జనానాకు ఎదురుగా అది టర్కీపుంజులాగ గర్వంగా అడుగులు వేస్తూ తన సొగసును ప్రదర్శిస్తుంది. దాని అడుగులకు తగ్గట్టుగా మూలుగు లాంటి కూతకూడా కూస్తుంది. హెచ్చుగా తుప్పలుండే ప్రదేశంలో ఏదైనా ఒక పొద మొదట పల్లంచేసి అందులో అది ఒకటిగాని, రెండుగాని గ్రుడ్లు పెడుతుంది. గ్రుడ్లు లేత ఆకుపచ్చ రంగులోగాని, ఆలివు గోధుమరంగులో గాని ఉంటాయి. వాటిపైన ముదురు గోధుమరంగు మచ్చలుంటాయి.

ఖేరాడ్రి ఫార్మిస్ వర్గము (Order CHARADRIIFORMES) : ఈ వర్గము చాల పెద్దది. ఈ వర్గాన్ని పలురకాల నీటి పక్షులు, నీటి ప్రక్కల నివసించే

పక్షులు కల 13 కుటుంబాల కలగూరగంప అని చెప్పవచ్చును. ఇందులో భారత ఉపఖండం నివాసంగా కల పక్షులేకాక ఇతర చోట్లనుండి ఈ ఉపఖండానికి వలసవచ్చేవిన్ని ఉన్నాయి. ఆ కుటుంబంలో ఒకటైన జకానిడె–జకానాస్ లేక లిల్లీట్రాటర్స్ (Jacanidae — Jacanas or Lilytrotters) లో రెండు జాతులున్నాయి. అందొకటి కంచురెక్కల జకానా (Bronzewinged Jacana — Metopidius Indicus)— పటము 36 — ఇది బాడవలలో నివసించే పొడుగైన కాళ్లుగల పక్షి. ఇది పరిమాణంలో బూడిదరంగు కౌజంత ఉంటుంది. రూపంలో నేలబోలికోడిని పోలి ఉంటుంది. దీని తల, మెడ, రొమ్ము నిగనిగలాడుతూ నల్లగా ఉంటాయి. దీని వీపూ, రెక్కలూ ఆకుపచ్చ కలిసిన కంచురంగులో ఉంటాయి; మొండిగా ఉండే దీని తోక చెస్నటు ఎరుపురంగులో ఉంటుంది. దాని కంటి వెనుకభాగము మెడ వరకూ గల వెడల్పైన తెల్లచార స్ఫుటంగా ఉంటుంది. ఈ పక్షి అంతా పూర్తిగా కనపడక మరుగుపడియున్నా, తల కనపడుతూంటే ఈ తెల్ల చారనుపట్టి దానిని మనం సులువుగా గుర్తించవచ్చును. బాగుగా పెరగని పక్షులు ముఖ్యంగా తెలుపు, ఎరుపు కలిసిన గోధుమ, గోధుమరంగులలో ఉంటాయి. జకానాల కన్నింటికి మిక్కిలి పొడుగైన, సాలీడు కాళ్లవంటి కాలివ్రేళ్లు ఉంటాయి. మొక్కలచే కప్పబడ్డ చెరువులు, బాడవులలో ఇవి తిరుగాడ్డానికీ కాలివ్రేళ్లు మిక్కిలి అనుగుణ్యంగా ఉంటాయి. పొడుగ్గా వ్యాపించిన వ్రేళ్లు ఆ పక్షి యొక్క భారాన్ని ఆకుమీద అన్నివైపులా సమానంగా పంచుతాయి. అంతేకాదు. ఈ పక్షులు తమ ఆహారాన్ని వెతుక్కొంటూ తేలుతున్న ఒక ఆకుమీద నుండి మరోదాని మీదకు మెల్లగా అడుగులు వేయడానికి కూడా ఆ వ్రేళ్లు ఉపయోగపడతాయి. నీటిలో ఉండే కీటకాలూ, నత్తలూ, నీటిమొక్కల బీజాలూ, వేళ్లూ, ఇతర శాకపదార్థాలూ ఈ పక్షుల ఆహారం. వాటికి కీడు తలపెట్టకపోతే ఈ పక్షులు మచ్చికపడి, నిర్భయంగా ఉంటాయి. గుంపుగా కబుర్లాడుకొంటూ వచ్చి, కడవలతో నీరు నింపుకొంటూన్న అమ్మలక్కలకూ లేదా అదేపనిగా బండమీద బట్టలు ఉతుకుతున్న చాకలికీ మిక్కిలి దగ్గరగానే చెరువులో ఈ పక్షులు నిర్భయంగా సంచరించడం మనం తరుచుగా చూస్తూనే ఉంటాము. జకానాలన్నీ నీటిలో మునుగగలవు. అవసరం వస్తే అవి ఈదగలవు కూడాను. కాని అవి బలంగా ఎగురలేవు; అవి రెక్కలను వేగంగా కొట్టుకొంటూ, మెడను

ముందుకు చాచి, ఆటంకకరమైన వాటి పాదాలను, వికారంగా వెనుక వ్రేలాడవేసి, బలహీనంగా, మెల్లగా ఎగురుతాయి. కంచు రెక్కల జకానా "సీక్ - సీక్ - సీక్ - - - -" అని బూరాలా కీచు కంఠంతో కూస్తుంది. గ్రుడ్లను పెట్టేకాలంలో ఈ పక్షులు జగడానికి సిద్ధమన్నట్లు ఎక్కువగా గోలచేస్తూ కూస్తాయి. అవి అప్పుడప్పుడు పందిలాగ పరుషంగా ఘుర్ఘురించటం కూడా కలదు.

భారతదేశవాసియైన మరో జకానా జెముడుతోక జకానా (Pheasant - tailed Jacana — Hydrophasianus Chirurgus) కంచు రెక్కల జకానా అలవాట్లే దీనికీ ఉన్నాయి. అది ఎటువంటి చోట్లలో ఉంటుందో ఇదీ అటువంటి చోట్లలోనే ఉంటుంది. ఈ రెండు జాతులూ కలిసి తరుచుగా ఒకే కొలనులో కూడా కనపడతాయి. దీనికుండే ప్రస్ఫుటమైన తెలుపూ, చోకలేటు వర్ణములు, కొడవలి ఆకారంలో మొనదేరియుండే జెముడు పక్షి తోకా, ఈ జెముడుతోక జకానాను సులభంగా గుర్తించడానికి తోడ్పడతాయి.

జకానాల రెండు జాతులలోను కూడ పెంటి (ఆడుపక్షి) బహు భర్తృక అనగా పెక్కు పుంజులతో జతగూడేది. అది ఒక పుంజుతో జతగూడి, గ్రుడ్లనిడి, వాటిని పొదగడం, పిల్లలను పెంచడం — ఈ బాధ్యతలను పూర్తిగా భర్తకు వదలిపెట్టి మరియొక పుంజుతో పోతుంది. ఈ విధముగా అది ఒక పుంజు తరువాత మరియొక పుంజుతో జతగూడుతుంది. దీని గూడు చిన్నదిగా ఇరుకుగా ఉంటుంది. ఈ పక్షి దానిని తేలుచున్న బుడగతామరాకులపై లతాప్రతానములను చుట్టపెట్టి కడుతుంది. కంచు రెక్కల జకానా సాధారణంగా 4 గ్రుడ్లు పెడుతుంది. అవి కంచువంటి గోధుమ రంగులో అందంగా ఉంటాయి. వాటిమీద వలయల్లికలో అస్తవ్యస్తంగా వంకర టింకరగా నల్లని గీతలుంటాయి. జెముడుతోక జకానా గ్రుడ్లు లేత ఆకుపచ్చ కలిసిన కంచు రంగులోనో, ఎరుపు కలిసిన గోధుమ రంగులోనో నిగనిగలాడుతూ ఉంటాయి. అందుపై ఏవిధమైన చుక్కలు గాని, చారలు గాని ఉండవు.

ఛేరాడ్రిడె కుటుంబం (Family Charadridae) లో ప్లోవరులు (Plovers), ఉల్లంకులు (Sandpipers) మొదలైనవి గలవు. వీటిలో చాల జాతులు మన దేశంలోనే నివాస మేర్పరచుకొన్నాయి. తక్కిన జాతులు ప్రధానంగా ఉత్తర దేశాలనుండి మన దేశానికి శీతకాలంలో వస్తాయి. ఎట్టి

కండ వెన్నప చిలువ (The Redwattled Lapwing—Vanellus Indicus)— పటము 37 - హిందీ: టిటీరి లేక టిటూరి: ఇది మన దేశవాసులైన ప్లోవరులన్నింటిలోకీ ఎక్కువ పరిచితమైనది. ఇది బూడిదరంగు కౌజంత ఉంటుంది. ఇది పైవైపున కంచు — గోధుమ రంగులోను, అడుగువైపున తెల్లగాను ఉంటుంది; రొమ్మూ, తలా, మెడా నల్లగా ఉంటాయి. దీని ప్రతి కంటికీ ముందు భాగాన ఎఱ్ఱని కండ ఉంటుంది. వెడల్పైన తెల్లని పట్టీ ఒకటి ప్రతి కంటికీ వెనుకనుండి బయల్దేరి, మెడప్రక్కల నుండి దిగి అడుగు భాగమున నున్న తెలుపును కలుసుకొంటుంది. ఈ పక్షులు జతలు జతలుగా గాని లేదా మూడు నాలుగు కలిసి కాని బయళ్లలోనూ, దున్నిన పొలాల లోనూ, పచ్చిక బీళ్లలోనూ సంచరిస్తాయి. వీటికి దగ్గరగా ఏ చెరువో, నీటి గుంటో ఉండి చెమ్మగా ఉండే ప్రదేశమయితే ఈ పక్షులకు మరీ ఇష్టం. అవి వాటి ముక్కులను నేలవైపు నిట్రంగా పెట్టుకొని, స్వల్పదూరాలు పరుగెత్తుతూ, తినుబండారాలను ఏరుకొంటూ కాలక్షేపం చేస్తాయి. ఈ విధంగా ఆహారాన్ని ఏరుకోవటం ప్లోవర్లన్నింటికి సహజ లక్షణం. అవి రాత్రింబవళ్లు చురుకు గాను, మెలకువగాను ఉంటాయి. మానవుడు కాని, మాంసాహారియైన ఏ జంతువు కాని ఈ పక్షుల రాజ్యంలోకి జొరపడినట్లయితే అవి భీతిగొని, ఒక్క పెట్టున అరుస్తూ గోలచేస్తాయి. ఈ పిట్ట కూత అందరికీ పరిచితమే— 'డిడ్ యి డు యిట్? — పిటీ టు డు యిట్' — (Did-Ye-Do-It? Or Pity-To-Do-It) అన్నట్లుగా ఉంటుంది. దాని కూతలో ఒకప్పుడు ప్రశాంతత, ఒకప్పుడు ఉద్రేకమూ, ప్రస్ఫుట మవుతుంటాయి. అది సమయాన్నిబట్టి ఉంటుంది. అది ఒకటి, రెండుసార్లు కూసి ఊరుకో వచ్చును. లేదా అదేపనిగా తిరిగి, తిరిగి కూయవచ్చును. దాని గూటికి గానీ, పిల్లలకు గానీ ఎవరైనా హాని తలపెట్టుతున్నారని అనుమానం తగిలితే తల్లిపక్షి, తండ్రిపక్షి కూడా ఆవేశంతో పిచ్చిగా అరుస్తూ, గూటికి సమీపంలో గూటి చుట్టూ నడినెత్తిన ఎగురుతాయి. అంతే కాదు. అవి పదే పదే శత్రువు మీదికి కొట్టవచ్చినట్లు అకస్మాత్తుగా దిగుతూంటాయి. వాటి ఆహారం కీటకాలు, కీటకాల లార్వాలు, నత్తలూను. సాధారణ పరిస్థితులలో అది వేగంగా ఎగురదు. రెక్కలనది సావధానంగా కొట్టుకొంటూ నెమ్మదిగా ఎగురుతుంది. అలా ఎగిరి కొంచెం దూరం పోయి నేలమీద వ్రాలుతుంది; నెలమీద వ్రాలీ వ్రాలడంతో కొన్ని అడుగులదూరం పరుగెడుతుంది. ఎఱ్ఱ

కంఠ వెన్నప చిలువ యొక్క గూడు నేలమీద చేసిన ఒక పల్లము లేక గుంట మాత్రమే. దానిలో అస్తరుకూడ ఏమీ ఉండదు. కాని ఒక్కొక్కప్పుడు ఆ గూటిలోపలి యంచున గులకరాళ్లను పేరుస్తుంది. గ్రామాలలో ఉండే ఎండిపోయిన చెరువులూ, సాగులేక ఎండిన పొలాలూ ఈ పక్షుల గూళ్ల కనువైన స్థలాలు. కాంక్రీటు వేసిన బంగాళా పై కప్పులు, ఎల్లపుడూ రైళ్లు నడుస్తూ ఉండే ఇనుప పట్టాలకు మధ్యనున్న కంకర, ఇలాంటి అసాధారణమైన స్థలాలలో కూడా వీటి గూళ్లున్న రిపోర్టులు కలవు. గూటిలో సాధారణంగా 3 లేక 4 గ్రుడ్లుంటాయి. అవి లేత గోధుమరంగులో ఉంటాయి. వాటిపై నల్లని మచ్చలుంటాయి. ఈ గ్రుడ్లూ, ఈ గ్రుడ్లనుండి వచ్చిన పిల్లలూ వాటి ఆవరణ యొక్క రంగులోనే ఉంటాయి. కనుక అవి శత్రువులకు కనబడవు. ఈ విధంగా అవి ఆత్మరక్షణమును కలిగి యున్నాయి. మనమా ప్రాంతాన్ని పరిశీలిస్తున్నా అవి మన కంటబడవు. ప్రకృతిలో దాగురింత (Camouflage) కిది యొక మంచి ఉదాహరణము.

ఉల్లంకి (The Common Sandpiper — Tringa Hypoleucos) — పటము 38—ఒక ప్రత్యేకమైన పెద్ద గణానికి చెందిన పక్షులలో ఇది ఒకటి. ఈ గణంలోని పక్షులకు ఈకలులేని కాళ్లూ, సన్నని ముక్కూ ఉంటాయి. ఇవి చిత్తడి నేలలలోనూ, నీరుండే ప్రదేశాలలోనూ నివసిస్తాయి. ఈ రకం పక్షులనన్నింటినీ "స్నిప్పెట్సు" (Snippets) అంటారు. ఉల్లంకి రమారమీ పురిడి పిట్టంత ఉంటుంది. దీని పైభాగం ఆలివు గోధుమరంగులోను క్రింది భాగం తెలుపులోను ఉంటుంది. రొమ్ము భాగం రెండు ప్రక్కలూ లేత నలుపురంగులో ఉంటాయి. మెడ ముందు భాగంమీద కొన్ని నల్లని చారలుంటాయి. అది ఎగిరేటప్పుడు గోధుమరంగులో ఉండే దాని పిరుదులు, తోక, రెక్కలమీద ఉండే తెల్లని చార స్పష్టంగా కనపడతాయి. తోకలో ఉండే తెల్లని పై ఈకలు మాత్రం కనబడవు. అడవి ఉల్లంకికి పై లక్షణాలుండవు. కావున సామాన్య ఉల్లంకిని గుర్తించడంలో మనం పొరపాటు పడడానికి సావకాశం లేదు. ఈ ఉల్లంకి మనదేశానికి అన్ని పక్షులకన్నా ముందుగా వలసవచ్చి అన్నిటికంటె ఆఖరున ఈ దేశం వదలి, గ్రుడ్లు పెట్టడానికి ఉత్తరదేశాలకు పోతుంది. ఇది గ్రుడ్లుపెట్టే స్థలాలలో మనకు మరీ దగ్గరగానున్నవి కాశ్మీరమూ, గర్వాలూ. వీటిలో గ్రుడ్లు పెట్టనివి కొన్ని మన మైదానాల్లో సంవత్సరమంతా ఉండిపోతాయి. అడవి

ఉల్లంకుల్లాగ, ఈ జాతి ఉల్లంకులు మందలుగా కూడవు. నీటి అంచున నిర్విరామంగా ఈ పక్షులు ఒకటొకటిగా సునాయాసంగా పరుగెత్తడం మనం సాధారణంగా చూస్తూంటాము. అలా పరుగెత్తేటప్పుడది తోక దగ్గర ఉన్న దేహభాగాన్ని తెగ ఆడిస్తుంది; అంతేకాకుండా దాని తలనూ, మెడనూ ఉండి ఉండి ముందుకూ వెనుకకూ ఊపుతుంది. దానిని కలవరపెడితే రెక్కలను వంచకుండా, వేగంగా కొట్టుకొంటూ, టీ — టీ — టీ అని కీచుగా అరుస్తూ నీటి ఉపరితలానికి దగ్గరగా పైన ఎగిరిపోతుంది. అది కులాసాగా ఉన్నపుడు వీయిట్, వీయిట్ అని సాగదీసుకొంటూ అనేక పర్యాయములు పిల్లనగ్రోవి స్వరంలో చక్కగా పాడుతుంది. ఇవి మేతకై రోజుల తరబడి ఒకే ప్రదేశానికి పోతాయి. అన్ని జాతుల ఉల్లంకులకు కీటకాలు, క్రిములు, చిన్న నత్తలు మొదలగునవే ఆహారం. ఈ పక్షులు వాటి ఆహారాన్ని నీటిఅంచునే ఏరుకొంటాయి. ఏటి గట్టున గులకరాళ్లలో గాని, సెలయేటిలోని చిన్నలంకలో కాని ఈ పక్షి పల్లం చేసి దానిలోపలి యంచున చుట్టూ ఆకులు పేర్చి గూడు నిర్మిస్తుంది. గూటిలో సామాన్యంగా 4 గ్రుడ్లుంటాయి. గ్రుడ్లు లేత పసుపురంగులో కాని, శిలా వర్ణంలో కాని ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు మచ్చలు, చుక్కలు ఉంటాయి.

అడవి ఉల్లంకి లేక పొదల ఉల్లంకి (The Wood or Spotted Sandpiper — Tringa Glareola) : సైబీరియా వంటి ఉత్తరంలో ఉన్న దూర దేశాలనుండి మన దేశానికి శీతకాలంలో వలసవచ్చే పక్షులలో ఇదికూడా ఒకటి. ఇది మందలుగా సంచరించే పక్షి. ఇది ఎగిరేటప్పుడు కనపడే తెల్లని పిఱ్ఱలు, తెల్లని తోక, "ఛిప్ - ఛిప్ - ఛిప్ - ఛిప్ -" అనే దాని కీచుకూత ఈ పక్షిని సులభంగా గుర్తుపట్టడానికి తోడ్పడతాయి.

కంఠమాలగల చిన్న ప్లోవరు (The Little Ringed Plover—Charadrius Dubius) — పటము 39— హిందీ : జిటియా లేక మెర్వా : ఈ పక్షి ఎలిసెకన్నా కొంచెం చిన్నది. ప్లోవరు గణానికి పక్షిని నమూనాగా సూచింపవచ్చును. దీని శరీరపు పై భాగం ఇసుక రంగులోను, క్రింది భాగం తెలుపు రంగులోనూ ఉంటాయి. దీని తల లావుగానూ, గుండ్రంగానూ ఉంటుంది. కాళ్లు సన్నగా ఉంటాయి. వాటిపైన ఈకలుండవు. దీని ముక్కు పావురం ముక్కువలె పొట్టిగాను, వలంగాను ఉంటుంది. దీని

నుదురు తెల్లగా ఉంటుంది. తల ముందుభాగం, చెవులమీద ఈకలూ, కళ్ళ చుట్టూరా ఉన్న భాగం నల్లగా ఉంటాయి; క్రింది భాగాన ఉన్న తెలుపునూ, వీపుమీద ఉన్న బూడిదరంగునూ వేరుచేస్తూ మెడచుట్టూ నల్లని చార ఉంటుంది. ఎగిరేటప్పుడు కనపడే రెక్కలమీద తెల్ల పట్టీ దీనికి లేక పోవడంచేత అచ్చంగా ఇలాగే కనపడే కెంటిష్ ప్లోవరు (Kentish Plover — C. Alexandrinus) నుండి దీనిని సులువుగా గుర్తుపట్టగలము. తడిగా ఉండే చెరువుల అంచులందూ, ఏటిగట్టుల మీదా, నదీ ముఖద్వారాలలో ఉండే బురద మైదానాలలోను ఈ పక్షులు జతలు జతలుగా గాని, చిన్న చిన్న గుంపులుగా గాని కనబడతాయి. త్వరత్వరగా చిన్న అడుగులు వేసికొంటూ నేలమీద అవి ఉండి ఉండి పరుగెత్తుతాయి. ఇలా పరుగెత్తుతూ మంచి రుచిగల వస్తువు ముక్కలు దొరికినపుడు, వాటిని ఏరుకొనడానికి మధ్య మధ్యను తటాలున ఆగుతూంటాయి. ప్లోవరులన్నీ స్వాభావికంగా ఆహారాన్ని ఏరుకొనే పద్ధతిలోనే ఈ పక్షులున్నూ చిత్రంగా నిటారుగా దిగుతూ ఆహారాన్ని ఏరుకొంటాయి. అవి ఒక చిత్రమైన పద్ధతిలో మెత్తని బురదలో ఉన్న ఆహారాన్ని గ్రహిస్తాయి. ఈ పక్షులు తమ కాలివేళ్లను అతి త్వరగా కదలిస్తూ, మద్దెల వాయించినట్లు బురదను బజాయిస్తూ, కలుగులలోనూ, సందులలోనూ దాగిఉన్న కీటకాలను, చిన్న పీతలను బైటకు లాగుతాయి. ఈ జంతువులే వాటి ఆహారం. అవి వాటి సామాన్య పరిసరాలలో ఉన్నపుడు వాటి రంగు వాటి ఆవరణం యొక్క రంగుతో అద్భుతంగా మేళవిస్తుంది. అందుచేత ఈ పక్షులు కదలకుండా ఉన్నప్పుడు వాటిని గుర్తించడం కష్టమవుతుంది. ఈ చిన్న ప్లోవరులు చెదిరి అక్కడా అక్కడా మేస్తున్నప్పటికి, ఏ మాత్రం అలజడి కలిగినా వాటిలో ఒక్క పక్షి బెదిరి ఎగిరిపోతే మిగతావి కూడా అధిక వేగంతో అన్నీ ఒకేసారి ప్రక్కలకు తిరుగుతూ ఎగిరిపోతాయి. ఎగిరేటప్పుడు వాటి క్రింది భాగాన ఉన్న తెలుపు ఉండి ఉండి మెరుస్తూ కనబడుతుంది. వాటికొనదేరిన రెక్కలనవి వడిగా కొట్టడంచేత అవి అతివేగంగా ఎగురుతాయి కాని నేలకు నాలుగైదు మీటర్ల ఎత్తుకన్న ఎక్కువ ఎత్తున సాధారణంగా అవి ఎగరవు. గూటిలో సరిగా నాలుగే గ్రుడ్లుంటాయి. ఏటిమడిలో ఆరిన ఇసుక తిన్నెలమీద ఉండే గులకరాలనడుమ ఈ పక్షి గ్రుడ్లను పెడుతుంది. సామాన్యంగా ప్లోవరుల గ్రుడ్లు ఎలా ఉంటాయో అలాగే ఈ గ్రుడ్లుకూడ గసిక తల్లాగ ఉంటాయి.

అవి లేత పసుపు, ఆకుపచ్చ లేక గోధుమ రంగులలో వివిధ ఛాయలలో ఉంటాయి. గ్రుడ్లుమీద దట్టమైన గోధుమరంగువి గాని, ఊదారంగువి గాని వంకరటింకర చారలు, చుక్కలు ఉంటాయి. వాటి పరిసరాలతో ఆ గ్రుడ్లు చక్కగా మేళవించి ఉంటాయి. అందుచేత దూరం నుండి అవి ఉండే స్థానాన్ని గుర్తుపెట్టుకొన్నా, దగ్గరకు వచ్చేటప్పటికి ఆ గ్రుడ్లు వెంటనే కనపడవు.

బర్హినిడె కుటుంబము (The Family Burhinidae) : ఈ కుటుంబంలో ప్రధానమైన పక్షి రాతికాలేడు (Stone Curlew) లేక గాగుల్ కళ్ల ప్లోవరు (Goggle - eyed Plover — Burhinus Oedicnemus) — పటము 40 — హిందీ : కర్వ్యానక్ లేక బర్సిరి. ఇది గోధుమరంగు చారలుగల ప్లోవరువంటి పక్షి; ఇది నేలమీద సంచరించే పక్షి; బూడిద రంగు కౌజు కంటె కొంచెము పెద్దది; కాళ్లుకూడ పొడుగు. తల లావుగానూ గుండ్రం గానూ ఉంటుంది. దీని కాళ్లమీద ఈకలుండవు. అవి పసుపు పచ్చగా ఉంటాయి. వీటికి "దళసరి మోకాళ్లు" ఉంటాయి. దీని కళ్లు 'గాగుల్' కళ్లు. అవి పసుపుపచ్చగా, పెద్దవిగా ఉంటాయి. ఈ పక్షి ఎగిరేటప్పుడు రెక్కకు పైభాగమున సన్నని రెండు తెల్లచారలూ, దాని నల్లని ప్రైమరీ ఈకల కొనలందు వెడల్పైన తెల్లని మచ్చ కనబడతాయి. ఇవి ఆ పక్షిని పోల్చుకోవడానికి ప్రధానమైన గుర్తులు. తుప్పలూ, పొదలూ గల బయళ్లు, దున్నిన భూములూ, సాగు చేయని పొలాలూ, నదీ గర్భములయందు అక్కడక్కడ ఉండే గులకరాల తిన్నెలూ — రాతికాలేడు తరచు సంచరించే ప్రదేశాలు. ఆకులనురాల్చే వృక్షాలుగల అడవులలోనూ, గ్రామాలకు దగ్గరగా ఉండి నీడనిచ్చే మామిడిచెట్లు గల తోటలలోనూ ఈ పక్షులు అప్పుడప్పుడు కనబడతాయి. ఇవి జతలు, జతలుగా గాని, నాలుగైదు కలిసి గుంపులు, గుంపులుగా గాని తిరుగుతాయి. వీటివి పెద్ద కళ్లు. అవి కనుచీకటి వేళలందు, రాత్రులందు సంచరించే పక్షులని సూచిస్తాయి. పగటి వేళ అది చురుగ్గా ఉండదు. శత్రు భీతి కలిగినా, బెదిరినా అది గునగున లాడుతూ చిన్న అడుగులు వేసికొంటూ మెడను శరీరంతో సమానంగా పొడుగ్గా చాచి, తలను వ్రేలవేసి వేగంగా నడుచుకొంటూ పోతుంది. తరువాత అది ఒక పొదవద్దనో లేదా ఒక పెద్దరాతి వద్దనో నక్కి కూర్చుంటుంది. శరీరాన్ని నేలకు అణచి పెట్టుకొని, మెడను ముందుకు చాచి, నేలకు

అన్చి, శత్రువు యొక్క కదలికను రెప్పవేయకుండా చూస్తూ ఉంటుంది. ఈ స్థితిలో దాని రంగు, ఆకారము పరిసరములతో చక్కగా కలిసి పోవడం మూలాన దగ్గరగా ఉండి చూచినా ఆ పక్షి కనబడదు. దాని ఆహారం ప్రధానంగా కీటకాలు, క్రిములు, నత్తలు, చిన్నచిన్న సరీసృపాలు మొదలైనవి. వీటితో పాటు అది కొంత ఇసుకనుకూడ మ్రింగుతుంది. సందె చీకటిలోనూ, అరుణోదయ కాలంలోనూ, వెన్నెల రాత్రులందునా సామాన్యంగా మనకు రాతికాలేడు కూత వినబడుతుంది. "పిక్, పిక్, పిక్, పిక్ . . . . పిక్ — విక్, పిక్ — " "విక్, పిక్ — విక్ (రెండవమాట మీద ఒత్తు ఉంటుంది) అంటూ రాతికాలేడు కఠినంగానూ, స్పష్టంగానూ ఈల వేసినట్లు కూస్తుంది. ఈ కూతలను చాలామంది తరుచుగా వింటున్నప్పటికీ అవి ఈజాతి పక్షుల కూతలని కొద్దిమంది మాత్రమే గుర్తుపట్టగలరు. అది ఏ పొద మొదటనో ఏ గడ్డిదుబ్బు దగ్గరనో, ఎండిపోయిన నదిలోని యిసుక తిన్నెల మీదనో, మామిడి తోటలోనో, తుప్పలుండే మైదానంలోనో గీకి పల్లం చేసి ఆ పల్లమును గూడుగా ఉపయోగిస్తుంది. సామాన్యంగా గూటిలో 2 గ్రుడ్లుంటాయి. అవి లేతపసుపు మొదలు ఆలివు ఆకుపచ్చ వరకూ అనేక ఛాయలలో ఉంటాయి. వాటి పైన గోధుమ రంగువి కాని, నీలారుణపు రంగువు కాని స్ఫుటమైన మచ్చలుంటాయి. వీటి ఆవరణం రంగూ ఒకేలాగే ఉండటంచేత ఈ గ్రుడ్లు సులభంగా కనబడవు.

లారిడె కుటుంబం (The Family Laridae): లోకి గొరుకాకులు (Gulls), ఉర్నులు (Terns) వస్తాయి. సముద్రతీరం మన కెక్కువగా ఉండటంచేత మన దేశంలో నివాసమేర్పరుచుకొన్నవైతేనేమి, వలసవచ్చేవి అయితేనేమి మొత్తంమీద ఈ కుటుంబానికి చెందినవి అనేక పక్షులున్నాయి. బాహ్యరూపంలో గొరుకాకులకూ, ఉర్నులకూ తేడా ఉంది. గొరుకాకులు ఉర్నులకంటె బలిష్టంగా ఉంటాయి; గొరుకాకుల రెక్కలు ఉర్ను రెక్కల కంటె ఎక్కువ వెడల్పుగా ఉంటాయి కాని అంతగా మొనదేరి ఉండవు.

గోధుమరంగు తల గొరుకాకి (Brownheaded Gull — Larus Brunnicephalus) — పటము 41 — హిందీ: ధోమ్రా: ఈ జాతి గొరుకాకి మనకు సామాన్యంగా కనపడుతుంది. అడవి కాకికన్నా ఇది కొంచం పెద్దది. దీని పైభాగం బూడిద రంగులోను, క్రింది భాగం తెల్లగాను ఉంటాయి. వేసవి కాలంలో దీని తల కాఫీవంటి దట్టమైన గోధుమ రంగులో

ఉంటుంది. అది మన దేశంలో ఉన్నపుడు అనగా శీతకాలంలో దాని తల బూడిదరంగు కలసిన తెలుపురంగులో ఉంటుంది. ఒక్కొక్కప్పుడు దాని చెవి వెనుక అర్ధచంద్రాకారపు నల్లని మార్కు కూడా ఉంటుంది. తరుచుగా మనం నల్లని తల గల గౌరుకాకి (L. Ridibundus) ని కూడా చూస్తు ఉంటాము. ఇది గోధుమరంగు తల గల గౌరుకాకి కన్న కొంచం చిన్నది. గోధుమరంగు తల గల గౌరుకాకికి నల్లని మొదటి ప్రైమరీ క్విల్ (ఈక) కొనవద్ద స్ఫుటమైన తెలని మచ్చ లేక "దర్పణము" ఉంటుంది; నల్లని తల గల జాతిలో మొదటి రెక్క క్విల్ (ఈక) తెల్లగా ఉంటుంది. దాని అంచులూ, కొనా నల్లగా ఉంటాయి. రెండు జాతుల పక్షుల పిల్లలకు తెల్లని తోక దాని కొనను నల్లని పట్టీ ఉంటుంది. ఈ రెండు జాతుల గౌరు కాకులూ కలసి సముద్ర తీరాన కనపడతాయి. సాధారణంగా సముద్ర తీరానికి దూరాన ఇవి కనపడవు. సెప్టెంబరు — అక్టోబరు నెలలో శీత కాలం మన సముద్ర తీరాలలోనూ, దేశం లోపల తటాకాలలోనూ గడపడానికి ఈ గౌరు కాకులు భారతదేశం వస్తాయి. ఏప్రిల్ నెలాఖరికి వీటిలో చాలా పక్షులు తిరిగీ వెళ్లిపోతాయి. నావికాశ్రయాలు, నౌకానిర్మాణ స్థానాలు, పల్లె వాళ్లుండే సముద్రతీర గ్రామాలు — ఈ ప్రదేశాల్లో ఈ పక్షులు తరుచుగా సంచరిస్తాయి. ఇవి లంగరు వేసిన ఓడలచుట్టూ ఎగురుతూంటాయి; వంట శాలల నుండి సముద్రంలోకి పారవేసే పనికిరాని మాంసపు తునకలు, ప్రేగులు, చెత్త మొదలైన పదార్థాల కోసరం అవి వెళ్లే ఓడలనూ, వచ్చే ఓడలనూ వెంబడిస్తూ ఉంటాయి. ఈ పదార్థాలు ఈ పక్షుల ముఖ్యాహారం. చేపలను పట్టే పడవలనుండి పైకి గిరాటువేసే చచ్చిన చేపలుకూడా వీటికి ఆహారమే. ఈ చేపల కోసరం గౌరు కాకులు పాకీగద్దలతోనూ, కృష్ణగద్దల తోనూ కూడా పోటీ పడవలసి వస్తుంది. నీటిపై తేలుతున్న ఆహారంమీద ఈ పక్షులు అకస్మాత్తుగా పడి ముక్కులతో తన్నుకుపోతాయి. తరుచుగా అవి నీటితలం మీద వ్రాలి బాతులలాగ పిల్లకెరటాల మీద సునాయాసంగా స్వారీ చేస్తాయి. తీరంనుండి దేశం లోపలి భాగాలకు వచ్చినపుడవి కీటకాలనూ, లార్వాలనూ, శాక పదార్థాలనూ తింటాయి. గోధుమరంగు తల గల గౌరుకాకి బిగ్గరగా గద్గద స్వరంతో చాల రకాలుగా కూస్తుంది. మాలకాకి లాగ 'కీయా' అంటూ జగడగొండిగా అరచే దీని అరుపు మనం సర్వసాధారణంగా వింటాము.

భారత సరిహద్దులలో మిక్కిలి ఉన్నత ప్రదేశంలో ఉన్న లడక్ తటాకాలలో మాత్రమే గౌరుకాకులు గ్రుడ్లు పెడతాయి. బురద ప్రదేశాలలో గడ్డితో ఏర్పడి, సగం తేలుచున్న చిన్న దీవులలో నీటి మొక్కలను దగ్గరగా చేర్చి మెత్తలుగాచేసి ఈ మెత్తలమీద గౌరుకాకులు గ్రుడ్లను పెడతాయి. గూటిలో రెండు, మూడు గ్రుడ్లుంటాయి. ఈ గ్రుడ్లు లేతాకు పచ్చనుండి మీగడ పసుపుదాకా పలుఛాయలలో ఉంటాయి. వాటిమీద నల్లని లేదా ఎరుపు కలిసిన గోధుమరంగులో పెద్ద పెద్ద మచ్చలూ, చుక్కలూ, గీతలూ ఉంటాయి.

మీసాలఔర్ను (The Indian Whiskered Tern – Chlidonias Hybrida) — పటము 42 — హిందీ: జెహరీ, కుర్రీ (అన్ని ఔర్నులూ); ఔర్నులకు ఇది మంచి ఉదాహరణము. ఇది సన్నగానూ అందంగా వెండి లాగ మెరుస్తూనూ ఉంటుంది. ఈ ఔర్ను రమారమి పావురా అంత ఉంటుంది; కాని పావురాకన్నా చాలా సన్నంగా ఉంటుంది. ఇది 'బాడువ ఔర్నులు' అనే రకం పక్షులకు చెందుతుంది. ఈ రకం ఔర్నులకు తోక కొంచెంగా మాత్రమే చీలి ఉంటుంది. దీని ముక్కు ఎఱ్ఱగా గాని లేదా నలుపు కలిసిన ఎరుపురంగులో గాని ఉంటుంది. అది ఎగరకుండా రెక్కలను ముడుచుకొని విరామంలో ఉన్నపుడు దాని రెక్కల కొనలు దాని తోకను మించి పొడుచుకు వస్తాయి. వేసవి కాలంలో, అనగా గ్రుడ్లు పెట్టేకాలంలో, మగపక్షులకు, ఆడుపక్షులకు కూడ తలమీద నల్లని ఈకల టోపీ తయారవుతుంది. వాటి కడుపుమీద కూడా నల్లరంగు స్ఫుటంగా తయారవుతుంది. బాడవలలోనూ, నీటితో మునిగిన వరి పొలాలలోనూ, నదీ ముఖద్వారాల వద్దనున్న బురద చప్టాలమీదా మీసాల ఔర్నులు వాటి పొడుగైన సన్నని రెక్కలమీద ముందుకూ వెనుకకూ సొగసుగా ఎగురుతూ కనబడతాయి. అవి అలా ఎగిరేటప్పుడు వాని ముక్కు, కళ్లు ఏకాగ్రతతో క్రింది వైపుకుంచి అడుగున ఉన్న నీటిని లేదా బురదను ఆహారం కోసరం చక్కగా పరిశీలిస్తూ ఉంటుంది. ఈ పక్షి ఉండి ఉండి అకస్మాత్తుగా ఇసుక పీతనో, కీటకాన్నో, చిరుకప్పనో, చిన్న చేపనో తన్నుకుపోతుంది. సముద్రంలో చేపలను పట్టి తెస్తున్న పడవలతో ఈ పక్షులు ఎగురుతూ పల్లెవాళ్లు సముద్రంలోకి విసిరి వేసిన జంతువులను, జంతు భాగాలను తన్నుకుపోతాయి. కాళ్లవ్రేళ్ల మధ్య చర్మం ఉన్నప్పటికీ,

అవి ఈద గలిగినప్పటికీ టెర్న్లు, గౌరుకాకులలాగ నీటిమీద సాధారణంగా వ్రాలవు. చాలసేపు అవి గాలిలో ఎగురుతూనూ, అప్పుడప్పుడు ఒడ్డున వాటి విచిత్రమైన పొట్టి కాళ్లమీద నిలబడి విశ్రాంతి తీసికొంటూను కాల క్షేపం చేస్తాయి. అది ఎగిరే టప్పుడు "క్రిక్, క్రిక్" అంటూ కఠోరంగా కూస్తుంది. దూరం నుండి వింటే దీని కూత కసాయిపిట్ట కూతను జ్ఞప్తికి తెస్తుంది.

రివర్ టెర్న్ (River Tern — Sterna Aurantia). మనకు సాధారణంగా కనపడే టెర్న్లలో ఇది మరియొకటి. ఇది బావవలకన్నా నదులను ఎక్కువగా ఆశ్రయించు కొని ఉంటుంది. దీని ఛాయకూడా బూడిద రంగు కలిసిన తెలుపే. దీని తలమీద గోధుమరంగు మచ్చగల ఒక టోపీ ఉంటుంది. కాని ఇది మీసాల టెర్న్ టోపికన్న కొంచెం పెద్దదిగా ఉంటుంది. దీనిముక్కు పసుపు పచ్చగా ఉంటుంది; తోక మీసాల టెర్న్ తోకకన్నా పొడుగుగానూ, వానకోయిల తోకలాగ బాగా చీలిన్నీ ఉంటుంది. గుడ్లను పెట్టేకాలంలో దాని గోధుమరంగు టోపీ కారు నలుపురంగులోకి మారిపోతుంది. కాని పక్షి అడుగు భాగం మాత్రం తెల్లగానే ఉండి పోతుంది.

మీసాల టెర్న్ కాశ్మీరుతో సహా ఉత్తర భారతంలో గ్రుడ్లను పెడు తుంది. అది తటాకాలలోనూ, బావవలలోనూ పెనవేసుకొన్న సింగారా మొదలగు నీటిమొక్కల మీద జమ్మూ, రెల్లూ కాడలతో ఒక గుండ్రని మెత్త చేసి అందు గ్రుడ్లు పెడుతుంది. గూటిలో రెండు, మూడు గ్రుడ్లుంటాయి. అవి లేత ఆకుపచ్చ మొదలు లేత నీలం, యింకా లేత గోధుమరంగు వరకూ పలురకముల ఛాయలలో ఉంటాయి. వాటిపైన దట్టమైన గోధుమరంగు లేక ఊదా కలిసిన గోధుమ రంగులో మచ్చలూ, చారలూ ఉంటాయి.

కొలంబిఫార్మిస్ వర్గము (Order COLUMBIFORMES): — మన ప్రాంతంలో ఈ వర్గమునకు చెందినవి రెండు కుటుంబాలున్నాయి. అందొకటి టీరోక్లిడె కుటుంబము (Family Pteroclidae) జొంపాలంక (Sandgrouse) ఈ కుటుంబానికి చెందిన పక్షి. రెండవది కొలంబిడె కుటుంబము (Family olumbidae). పావురములు (Pigeons), గువ్వలు (Doves) ఈ

కుటుంబానికి చెందిన పక్షులు. ఈ రెండు కుటుంబాలలోను వేటాడుటకు పనికివచ్చే పక్షులూ, ఆహారంగా వినియోగపడే పక్షులూ — పలు జాతులున్నాయి. నీటిని త్రాగే పద్ధతిలో ఈ పక్షులకొక ప్రత్యేకత ఉంది. పెంపుడు కోడిపెట్టవలె ఈ పక్షులు ముక్కును నీటిలో ఉంచి పీల్చి, తలను పైకెత్తి మింగవు. గుఱ్ఱంలాగ అవి ముక్కును నీటముంచియుంచియే అవిచ్ఛిన్నంగా త్రాగుతాయి. జొంపాలంకలు స్థూలదృష్టికి పావురాలలాగ కనపడతాయి. వీటికి నిర్మలమైన గోధుమరంగు ఈకలుంటాయి. వీటిలో చాల జాతులకు పొట్టి మెడలూ, చాలా పొట్టి కాళ్లు, అదోకుగా ఉండే తోక ఉంటాయి. తోకలోని మధ్య ఈకలు పొడుగుగాను చివరను సూదిగాను ఉంటాయి. ఒక మాదిరి ఎడారి బయళ్లలోను, దున్ని వదలిపెట్టిన పొలాల్లోను అవి మందలు మందలుగా నివసిస్తాయి. తరుచుగా ఈ మందలు పెద్దవిగా కూడా ఉంటాయి. వాటికొక చిత్రమైన అలవాటు ఉన్నది. అవి ప్రతిరోజూ ఖచ్చితంగా ఒకేవేళలో నీటిని త్రాగడానికి వాటికి బాగా నచ్చిన ప్రత్యేకమైన జలాశయాలకు మందలుగా కలిసి పోతూంటాయి. జొంపాలంక (The Common Sandgrouse — Pterocles Exustus) —- పటము 43 — హిందీ : ఖట్ తీతర్. ఈ పక్షి పావురంకన్నా కొంచెం చిన్నది. దీని దేహపుఛాయ లేతపసుపు కలిసిన ఇసుకరంగు ; తోక మొన సూదిగా ఉంటుంది. రొమ్ముమీద అడ్డంగా సన్నని, నల్లని పట్టీ ఉంటుంది. దీని పొట్ట గోధుమరంగు కలిసిన నలుపురంగులో ఉంటుంది. దవుడలూ, గడ్డమూ, గొంతూ మాసిన పసుపు రంగులో ఉంటాయి. గడ్డం తప్ప ఆడు పక్షి శరీరమంతటా చుక్కలూ, చారలూ, పట్టీలూ ఉంటాయి. ఆడుదానికి కూడా రొమ్ముకి అడ్డంగా నల్లని పట్టీ ఉంటుంది. అది నడినెత్తిని ఎగిరేటప్పుడు కనబడే కొనదేలిన రెక్కలూ, తోకా, అవి అప్పుడు కూసే ప్రత్యేకమైన రెండు స్వరాలు గల కూతా — వీటినిబట్టి దానిని స్పష్టంగా గుర్తింపవచ్చును. డజను, అంతకు పైగాను ఈ పక్షులు కలిసి గుంపులుగా సేద్యం చేయని భూములలో సంచరిస్తాయి. మొత్తంమీద వాని రంగు అది తరుచుగా తిరిగే మొక్కా మోడూ లేని వట్టి నేలరంగుతో బాగా మేళవించిపోయి ఈ పక్షి కూర్చున్నపుడు కనపడనే కనపడదు. తరుచు నీటికి చాలా దూరంలో ఉన్నప్పటికీ దాహం తీర్చుకోవడానికి అవి గుంపులుగా ప్రొద్దుటు, సాయంకాలం నలుమూలల నుండీ వాటికి నచ్చిన బాడవకో, చెరువుకో ఒక

నిర్ణీతమైన వేళకు వస్తాయి. అవి నీటిని త్రాగే స్థలాలకు వెళ్లేటప్పుడూ, వచ్చేటప్పుడూ వాటిని తుపాకీతో వేటాడటం వేటగాళ్లకు ఎంతైనా వేడుకగా ఉంటుంది. అవి బలంగానూ, మిక్కిలి వేగంగానూ ఎగురుతాయి. ఈ పక్షులు నడినెత్తి మీదనుండి ఎగిరి వెళ్లేటప్పుడు కుట్ - రో అని చెవులను చొచ్చుకు పోయే విలక్షణమైన కూత స్పష్టంగా వినబడుతుంది. అవి యింకా మన చూపు మేరకు రాకుండానే తరుచుగా వాటి కూత వినబడుతుంది. జొంపా లంక ఆహారం గడ్డివిత్తులు, కలుపు మొక్కల విత్తులు, ధాన్యపు గింజలు, నేలమీద చేరిన కాండాలూను. వీటితోపాటు కొంత ఇసుకను కూడా అది మింగుతుంది. ఈ పక్షులు వట్టి నేలమీద గ్రుడ్లను పెడతాయి. ఒక్కొక్కప్పుడు నేలమీద పల్లంచేసి దానిలో ఏ అస్తరూ లేకుండానే గ్రుడ్లను పెడతాయి. సాధారణంగా అవి తూరికి 3 గ్రుడ్లు పెడతాయి. గ్రుడ్లు పాలిపోయిన బూడిద రంగులోనో, లేత పసిమి రాతి రంగులోనో ఉంటాయి. వాటిమీద గోధుమరంగు చుక్కలూ, మచ్చలూ చాలా ఉంటాయి. వీటి పిల్లల దేహం మీద రక్షక వర్ణంగల నూగుంటుంది. గ్రుడ్లనుండి బయటకు రాగానే అవి అటూ ఇటూ పరుగెత్త గలవు. తండ్రి పక్షి దాహం త్రాగడానికి నీటిలోనికి నడిచినపుడు దాని పొట్టమీద ఉన్న ఈకలను నీటితో బాగుగా తడిపి, పిమ్మట పిల్లల దగ్గరకు వచ్చి పిల్లల కా నీటిని కుడుపుతుంది.

పొట్టి బాతుకీ, చిలువకీ లేనట్లే పావురాలకీ, గువ్వలకీ నిజంగా ఏమీ తేడా లేదు; పావురాలు పెద్ద గువ్వలు. గువ్వలు చిన్న పావురాలు. కేవలం ఫలాహారులైన పావురాలున్నాయి. పచ్చ పావురములు (Green Pigeons) ఈ రకానికి చెందుతాయి. వీనిని హిందీలో హరియల్ అంటారు. పచ్చపావురము (The Common Green Pigeon — Treron Phoenicoptera) — పటము 44. ఇది పొట్టిగా, బలముగా పెంపుడు నీలి పావురమంత ఉంటుంది. దీని దేహం పసుపు, ఆలివ్ — ఆకుపచ్చ, బూడిద రంగుల కలయికలో ఉంటుంది. దీని పక్ష - భుజాలమీద నీలి - ఎరుపురంగులో ఒక మచ్చ ఉంటుంది. — ఈ మచ్చ ఆడు పక్షిలో అంత స్ఫుటంగా ఉండదు. దాని నల్లని రెక్కలమీద అడ్డంగా పసుపురంగు పట్టీ ఉంటుంది. దీని కాళ్లు ఎఱ్ఱగా ఉండక పసుపురంగులో ఉంటాయి. పసుపురంగు కాళ్లుండటం ఈ జాతికి ప్రత్యేకత. భారతదేశపు మిగతా పచ్చపావురాల కాళ్లు ఎఱ్ఱగా ఉంటాయి. ఇవి చిట్టడవులలోను, సాంద్రారణ్యములలోను కూడ మందలు

మందలుగా కనపడతాయి. పట్టణాల పరిసరాలలోను, గ్రామాల పరిసరాలలోను కూడా ఇవి ఉంటాయి. ఫలవృక్షాలుంటే నగరాలలో ఉండే తోటలలో కూడా ఈ పక్షులు ప్రవేశిస్తాయి. అవి మందలుగా కేవలం చెట్లమీదనే నివసిస్తాయి. అవి ఎప్పుడోకాని భూమి మీదకు దిగవు. పండ్లున్న రెమ్మల పైకి ఈ పక్షులు నేర్పుగా ఎగబ్రాకుతాయి. తరుచుగా అవి రెమ్మలను పట్టుకొని తలక్రిందుగా వ్రేలాడి ముందుకూగి, వాటి కందు బాటులోనికి వచ్చిన మఱ్ఱి పండ్లను, రావి పండ్లను తెంపుతాయి. అపాయం కలుగుతుందని శంకించినపుడు అవి కదలకుండా, మెదలకుండా స్తంభించిపోతాయి. వాటిచుట్టూ ఉండే ఆకుల ఆకుపచ్చ రంగుతో వాటి ఈకల రంగు చక్కగా కలిసిపోవడంచేత అవి పెద్ద పక్షులయినప్పటికీ అవి ఏ మాత్రం కనపడనే కనపడవు. ఇక్కడ ఒక పక్షి, అక్కడ ఒక పక్షి కదిలాయంటే మాత్రం అవి బయల్పడిపోతాయి. తుపాకీని పేల్చినపుడు పండ్లతో నిండియున్న పెద్ద మఱ్ఱిచెట్టు నుండి ఎన్నో పావురాలు రెక్కలు కొట్టుకొంటూ ఎగిరిపోవడం చూస్తే మనం దిగ్భ్రమ చెందుతాము. పగలంతా ఈ పక్షులు ఫలవృక్షాల కోసరం తిరుగుతూ కాలక్షేపం చేస్తాయి. అవి వెక్కసంగా పండ్లు మెక్కిన పిదప ఎత్తైన కొమ్మలమీద విశ్రాంతి తీసికొని మళ్లీ గొంతు కమోయా తింటూ ఉంటాయి. సూర్యోదయ, సూర్యాస్తమయ కాలాల్లో అవి ఈకలను వదులుచేసి, శరీరాన్ని బొద్దుగా చేసికొని ఆకులులేని చెట్లమీద ఆతపస్నానం చేస్తూ ఉంటాయి. అవి రెక్కలను కొట్టుకొనేటప్పుడు ఒక చిత్రమైన లోహశబ్దమవుతుంది. అలా రెక్కలను కొట్టుకొంటూ అవి వేగంగా బలంగా, సూటిగా ఎగురుతాయి. ఈ పచ్చపావురాలు కేవలం పండ్లను మాత్రమే తిని బ్రతుకుతాయి. మఱ్ఱి, రావి మొదలగు ఫైకసు వంశానికి చెందిన జాతుల చెట్ల పండ్లనే అవి ఎక్కువగా తింటాయి. వాటి ఈల కూతలు మృదువుగా, మనోహరంగా, ఇంపుగా ఉంటాయి. అవి ఆరోహణ అవరోహణలలో కూసేటప్పుడు ఆ కంఠం చిత్రంగా మానవ కంఠమా అని పిస్తూంది. అది ఆకులు నిండుగా ఉన్న ఒక మోస్తరు పెద్ద చెట్టుపైని అందరికీ కనపడేటట్లుగా గాక చాటుగా గూడు కడుతుంది. గువ్వలాగే ఈ పక్షికూడా పుడకలతో ఒక వేదికను తయారుచేస్తుంది. అదే దాని గూడు. తూరికి రెండేసి గ్రుడ్లు పెట్టడం పావురపు కుటుంబానికి ప్రత్యేక లక్షణం. ఈ గ్రుడ్లు తెల్లగా నిగనిగ లాడుతూ ఉంటాయి.

గుడి పావురము (The Blue Rock Pigeon — Columba Livia)— పటము 45 – హిందీ : కబూతర్:— ఇది ప్రసిద్ధమైన పక్షి. పలక రంగులో ఉంటుంది. దీని మెడ, రొమ్ము పైభాగం లోహపు నిగనిగతో ఆకుపచ్చ, నీలారుణ, నీలి- ఎరుపురంగులలో ఉంటాయి. రెక్కలమీద రెండు నల్లని పట్టీలు, తోక చివర అడ్డంగా ఒక వెడల్పైన పట్టీ ఉంటాయి. కాకులు, పిచ్చుకలు లాగ మనకు బాగా తెలిసిన పక్షులలో ఇది కూడా చేరుతుంది. మనం చూచే చిత్ర విచిత్రమైన రకరకాల పెంపుడు పావురాలన్నీ అడవి పావురాల సంతానం. ఈ అడవి పావురం కొండలూ, గుట్టలూ ఉండే బయలు ప్రదేశాలలో నివసిస్తుంది. దట్టమైన అడవులలోకి పోదు. చాలా చోట్ల ఈ అడవి పావురం పెంపుడు పావురంతో సంకరం చెంది క్షీణదశకు వచ్చి, మానవుని ఆశ్రయించి ఆహారం సంపాదించుకొంటోంది. భారత దేశంలో చాలవరకు ప్రతీ పట్టణంలోనూ పావురాలు మందలుగా నివాసాలు ఏర్పాటు చేసికొని ఉన్నాయి. క్రిక్కిరిసిన బజారులలో ఉండే సందడికీ, చెవులు పగిలే ధ్వనులకూ ఈ పక్షులు బాగా అలవాటు పడి, బాగ మెక్కి, సోమరి జీవితం గడుపుతూ భవనాల మీదా లోపలా గూళ్లు కట్టి, గ్రుడ్లు పెడతాయి. గిడ్డంగులూ, కర్మాగారాలూ, మసీదులూ, రైలుస్టేషనులూ మొదలైన స్థలాలలో ముఖ్యంగా అవి నివాస మేర్పరచుకొని, ఆ స్థలాలను వాటి మలంతో మురికిచేసి, ఎంతైనా రోత పుట్టిస్తాయి. పాతపడిన నూతి గోడల కన్నాలలోనూ, పాడుపడిన భవనాలలోనూ, కొండలమీద ఉండే పురాతనపు కోటలలోనూ, బండరాళ్ల సందులందూ అడవి పావురాల మందలు నివాస మేర్పరచుకొని కొత్తగా నాటిన లేదా కోసిన పంటలోని తృణ ధాన్యాలనూ, కాయ ధాన్యాలనూ, వేరుసెనగనూ ఏరుకొనడానికి ఎగిరివెళ్లి వస్తూ ఉంటాయి. వీటి కూతలు అందరికీ బాగా తెలుసు. గుటర్ - గూ - గూ, గుటర్ - గూ - గూ అంటూ మగపావురం గొంతును ఉబ్బించి గంభీరంగా కూస్తుంది. ఇలా కూస్తూ అది తన పెంటి ముందు వంగి మెల్లగానూ, గుండ్రంగానూ పదే పదే తిరుగుతుంది. అది దాని గూటిని పుడకలతోనూ, ఎండు గడ్డితోనూ నిర్మిస్తుంది. కుటుంబ పద్ధతి ననుసరించి అది రెండే రెండు గ్రుడ్లు పెడుతుంది. అవి చారలుకాని, చుక్కలుకాని లేక తెల్లగా ఉంటాయి.

చుక్కల గువ్వ లేక పుట్టంసెట్టి పిట్ట (The Spotted Dove —

Streptopelia Chinensis) — పటము 46 (పై చిత్రరువు) - హిందీ: చిత్రోకా ఫాక్తా లేక పెర్కి: ఇది పరిమాణంలో మైనకీ, పావురాకీ మధ్యగా ఉంటుంది. ఇది సన్నని చిన్న పావురం. ఈ పక్షి పై భాగాలు కొంచెం ఎరుపు కలిసిన గోధుమరంగు, బూడిద రంగులలో ఉంటాయి. వాటిపైన స్ఫుటమైన తెల్లని మచ్చలుంటాయి. దాని మెడ వెనుకవైపు చదరంగపు బల్లవలె నల్లగా ఉండి, అందుపైని తెల్లని మచ్చలుంటాయి. చెట్లు బాగా ఉండి, నీరు బాగా లభించే సేద్య ప్రదేశాలలో ఈ పక్షులు జంటలుగా గాని, చిన్న చిన్న గుంపులుగా గాని మనకు కనపడతాయి. దుమ్ముతో నిండిన మార్గాలలోనూ, వరి మొదలైనవి కోసిన తరువాత పొలాలలో మిగిలిన దుబ్బులలోనూ, ఇంకా ఇతర చోట్లలోనూ ఉండే గింజలను ఏరుకొని తింటాయి. వాటిని కలవరపెట్టకపోతే ఈ పక్షులు బాగా మచ్చికై తోటలలో ప్రవేశిస్తాయి. అవి బంగాళా వరండాలలో సహితం వాసాలమీద గూళ్లను కడతాయి. లోపల ఉండేవాళ్లు వెలుపలికీ, లోపలికీ పోతున్నా అవి ఆందోళన చెందవు. ఈ పక్షి "క్రూ - క్రూక్ - క్రూక్ - క్రూ ...... క్రూ - క్రూ-క్రూ" అంటూ కొంత దుఃఖకరంగా ఉన్నప్పటికీ, చెవికింపుగా ఆగి, ఆగి తరుచుగా మళ్లీ మళ్లీ కూస్తుంది. ఈ క్రూల సంఖ్య 3 మొదలు 6 వరకూ మారుతుంది. దీని గూడు మామూలు రకంగానే ఉంటుంది. అది ఒక పొదలోనో లేదా బంగాళా అంచుననో లేక చూరులోనో సన్నని పుల్లలతో బలహీనమైన మెత్తను నిర్మిస్తుంది. ఇదే దాని గూడు. గూటిలో కుటుంబాచారము ననుసరించి రెండు తెల్లని గ్రుడ్లు పెడుతుంది.

ఎఱ్ఱ గువ్వ (The Red Turtle Dove — Streptopelia Tranquebariea) - పటము 46 (క్రింది చిత్రరువు) — హిందీ: సెరోతి ఫాక్తా, గిర్వి ఫాక్తా లేక ఇత్వా: వీటిలో మగది (చిత్రరువులో చూపబడినది) ప్రకాశమైన గులాబీ, ఇటుక – ఎరుపుల మిశ్రవర్ణంలో ఉంటుంది. ఆడుది అలా కాక లేత గోధుమ, బూడిద రంగులలో ఉంటుంది. ఈ ఆడుది వాగుడు గువ్వ (హిందీ: ధోర్ ఫాక్తా)ను పోలి ఉంటుంది; కాని అంతకన్నా చిన్నది. ఎఱ్ఱ గువ్వ చిన్న గుంపులుగా సేద్యపు బయళ్లలోనూ ఎడారిలో ఉండే ప్రదేశాల లోను ఉంటుంది. ఇవి మనకు తరుచుగా కనపడుతున్నప్పటికీ మన ప్రాంతాలలో తతిమ్మా గువ్వలంత ఎక్కువగా ఉండవు. మిగతా గువ్వ జాతుల లాగ ఇవి మానవునితో తరుచుగా కలిసి మెలసి తిరగవు. దాని కూత "గ్రూ-

గుర్—గూ, (గూ-గుర్- గూ'' అంటూ కొంచెం కరకుగా, దొర్లుతున్నట్లుగా ఉంటుంది. ఇలా అది ఆగి, ఆగి తొందరగా కూస్తుంది. అన్ని గువ్వల మాదిరి గానే ఇదికూడా వేదికలాగ గూడు కడుతుంది. ఈ గూటిని అది భూమికి 3 మొదలు 6 మీటర్లవరకు ఎత్తున ఉన్న చెట్టు కొమ్మమీద పుడకలతో ఒక మెత్త లాగ నిర్మిస్తుంది. గూటిలో సాధారణంగా రెండు తెల్లని గ్రుడ్లుంటాయి. గూటి వెలుతులనుండి ఈ గ్రుడ్లు మనం క్రింది నిలబడి చూస్తే కనపడతాయి.

సిట్టాసిఫార్మిస్ వర్గం (Order PSITTACIFORMES) - ఈ వర్గంలో సిట్టాసిడె — చిలుకలు (Psittacidae - Parrots) అనే ఒక్క కుటుంబం మాత్రమే ఉంది. ఈ పక్షులకు పొట్టిగా, లావుగా, బలిష్ఠంగా వంగి ఉన్న ముక్కులూ, పొట్టికాళ్లు, కొమ్మలను ఎక్కడాని కుపయోగపడే జైగోడాక్టిల్ (Zygodactyl) పాదాలు - అంటే రెండు వ్రేళ్లు ముందుకూ రెండు వ్రేళ్లు వెనుకకూ ఉండే పాదాలూ - ఉంటాయి. ఇవి వాటి ప్రత్యేక లక్షణాలు. ఈ పక్షులన్నీ ప్రధానంగా ఆకుపచ్చని ఈకలు కలిగి అలంకారంగా ఉంటాయి. కాని అవి పంటలనూ, పండ్ల తోటలనూ విశేషంగా నాశనం చేస్తాయి. కనుక ఆర్థికంగా చూస్తే వాటికే ఒక్క మంచి లక్షణం కనపడదు. గులాబీ కంఠ మాల గల చిలుక (Roseringed Parakeet — Psittacula Krameri)_ పటము 47 — హిందీ: తోతా లేక లైబార్ తోతా:- ఇది మైన గోరకన్నా కొంచెం పెద్దదిగా ఉంటుంది. దీని తోక పొడుగుగా మొనదేలి ఉంటుంది. ఇది ఆకుపచ్చని చిలుక. దీనికి పొట్టిగా, లావుగా ఉండి బాగా వంపు తిరిగిన విలక్షణమైన ముక్కూ, నలుపూ—గులాబీ ఎరుపుల మిశ్రవర్ణం గల కంఠ మాల ఉంటాయి. ఆడు చిలుకకు కంఠమాల ఉండదన్న మాటకాని అది అన్నివిధాలా మగదాని లాగే ఉంటుంది. కాకి, పిచ్చుకా, మైనగోరా, పావురాలలాగే గులాబీ కంఠమాల గల చిలుక కూడా మనకు సామాన్యంగా పరిచితమైన పక్షులలో ఒకటి. అవి సమృద్ధిగా ఆహారం దొరికే సేద్యపు పొలాల లోకీ, పట్టణ ప్రాంతాలలోకీ మందలు, మందలుగా అల్లరి మూకల్లాగ ప్రవేశించి పండిన పంటలనూ, పరిపక్వానికి వచ్చిన పండ్లనూ కొరికి తిని, తిన్న దానికంటే ఎక్కువగా పాడుచేసి - ఇలా అపరిమితంగా ధ్వంసం చేస్తూ —

వ్యవసాయదారునికీ, ఫలవృక్షాలను పెంచేవాడికీ నిజంగా కంటకంగా తయారవుతున్నాయి. రోడ్డు ప్రక్కనున్న రైల్వే స్టేషనులలో రవాణాకు సిద్ధముగా ఉన్న ధాన్యపు బస్తాలను, వేరుసెనగ సంచులను పట్టుకొని వ్రేలాడుతూ, నెమ్మదిగా వాటిని కొరికి లోపల ఉన్న సరుకును తింటూ ఉండటం మనం తఱచుగా చూస్తూనే ఉంటాం. చుట్టూ ఉన్న గ్రామ ప్రాంతాలను కొల్లగొట్టిన తర్వాత ప్రతీ సాయంత్రం చాలా దూరాల నుండి, సందడిగా ఉండే నగరావరణలలో ఉన్న తోటలలోకి, అన్నీ కలిసి నిద్రపోవడానికి రామ చిలుకలు, పటాలం తరువాత పటాలం, గోలచేస్తూ ఎగురుతూ వస్తాయి. అవి ఎగిరేటప్పుడూ, ఎగరకుండా విశ్రాంతి తీసికొంటున్నప్పుడూ కూడ "కీయక్, కీయక్, కీయక్" అని కీచుగా కఠోరంగా కూయడం మనం తరుచుగా వింటోనే ఉంటాం. ఈ జాతిచిలుకా, రాయ్ తోతా లేక హీరామన్ తోతా అనబడే పెద్ద చిలుకకూడా జనప్రియములైన పంజరపు పక్షులు. వీటిని మచ్చికచేసి వీటిచే చిన్న చిన్న మాటలూ, వాక్యాలూ పలికించవచ్చును. అవి వాటిని పదే పదే అస్పష్టంగా పలుకుతూంటాయి. బల్లమీద నిలపెట్టిన చిన్న ఫిరంగీని దట్టించడం, పేల్చడం మొదలైన కొన్ని వింత పనులను వాటికి నేర్పవచ్చును. అవి తూరికి 4 మొదలు 6 వరకూ గ్రుడ్లు పెడతాయి. గ్రుడ్లు స్వచ్ఛమైన తెలుపురంగులో కొంచెం గుండ్రవాటుగా ఉంటాయి. చెట్ల బోదెలలో కంసాలి పిట్టలు, వడ్రంగి పిట్టలు చేసిన తొర్రలలోనూ, పర్వత బిలములలోనూ, గోడకన్నాలలోనూ అవి గ్రుడ్లను పెడతాయి. తరుచుగా ఈ పక్షులు చాల జతలు సంఘంగా కూడి గూళ్లను ఏర్పాటు చేసికొంటాయి. పెద్ద చిలుక (The Indian or Alexandrine Parakeet — Pittacula Eupatria). ఇది చాల పెద్ద చిలుక. దీనికి మిగుల పెద్దదైన ముక్కు ఉంటుంది. మగపక్షి భుజంమీద స్ఫుటమైన రక్తపింగళ వర్ణపు మచ్చ ఉంటుంది. ఆడుదానికి ఈ మచ్చ, నలుపూ-గులాబీ కంఠమాల ఉండవు. ఇది సాధారణంగా అడవులలోనే తప్ప పట్టణ ప్రాంతాలలో కనపడదు. ఈ రెండు జాతుల చిలుకల పిల్లలను పక్షుల నమ్మే అంగళ్లకు అమ్మ తెస్తారు.

కుకులిఫార్మిస్ వర్గం (Order CUCULIFORMES) : ఈ వర్గంలో కోవెలలను (Cuckoos) చేర్చారు. ఇవి ప్రపంచమంతా వ్యాపించి ఉన్నాయి. పాత ప్రపంచంలోని చాలా జాతుల కోవెలలకు 'పరభృతము' లని చెడ్డ పేరు వచ్చింది. ఏలన కోవెలలు ఇతర పక్షుల గూళ్లలో గ్రుడ్లు పెట్టి, పిమ్మట వాటిని పొదగడం, పిల్లలను పోషించడం పూచీ పెంపుడు పక్షులకు వదలివేస్తాయి. పరభృతములైన కోవెలలో యూరోపియన్ కోవెల (Cuculus Canorus) ప్రసిద్ధమైనది. ఇది కాశ్మీరంలోకీ, పశ్చిమ హిమాలయాలలోకీ వ్యాపిస్తుంది. దీని సంతతి ఒకటి అస్సాంలో నివాసం చేసికొన్నది. ఇది వలసపోదు. కాని మన ఉపఖండంలో అందరికీ బాగా తెలిసిన ఈ రకం కోవెలలో కోకిల (Koel — Eudynamys Scolopacea) — పటము 48 — హిందీ : కోయెల్ లేక కోకిలా మంచి ఉదాహరణము. ఇది రమారమీ కాకి అంత ఉంటుంది. కాని కోకిల కాకికన్నా సన్నంగా ఉంటుంది. దీని తోక కాకి తోకకన్నా పొడుగు. మగదాని దేహమంతా లోహంలాగ నిగ నిగలాడుతూ నల్లగా ఉంటుంది. దానికి విలక్షణమైన పసుపు కలిసిన ఆకుపచ్చ రంగు ముక్కూ, కెంపువన్నె లేక రక్తపు మెరుపు కళ్లు ఉంటాయి. ఆడుది గోధుమ రంగులో ఉంటుంది. దానిమీద తెల్లని చుక్కలూ, పట్టీలూ ఉంటాయి. అది వాస్తవంగా తోటలలోనూ, తోపులలోనూ సంచరించే సామాన్యమైన పక్షి అయినప్పటికీ, దాని రూపం కన్నా దాని కంఠాన్నిబట్టి కోకిలను గుర్తిస్తాము. అది ఎప్పుడూ చెట్లమీదే ఉంటుంది. నేలకు దిగదు. శీతకాలమంతా అది మౌనం వహిస్తుంది. కనుక అది వలస పోయిందనుకొని దానిని తరుచుగా మరచిపోతారు. కాని వసంతంలో అది గ్రుడ్లు పెట్టేకాలంలో దాని కంఠం విడుతుంది. అప్పుడది చాలా సందడి చేస్తుంది. వేసవి కాలంలో పగలంతాను, రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు కూడాను బిగ్గరగా కీచుగొంతుకతో ఆరోహణలో కూసే కూవూ – కూవూ – కూవూ అనే మగ కోకిల కూతలతో పల్లెటూరి ప్రాంతాలు ప్రతిధ్వనిస్తూ ఉంటాయి. ఈ కూతలు 'కూవూ' అంటూ తక్కువ స్థాయిలో ప్రారంభమయి తరువాత దాని వెంబడిని క్రమంగా వచ్చే ప్రతీ కూతా ఒక దానికన్నా ఒకటి హెచ్చుస్థాయిలో ఉండి, తుదకు ఏడెనిమిది కూతలయేటప్పటికి తీవ్రతమమైన స్థాయిని అందుకొని,, ఉన్నట్టుండి ఆగిపోతుంది. ఆ పక్షి వెంటనే ఆ కూతలను మళ్లీ ప్రారంభించి

పటము 49

**జెముడు కాకి**

(*Centropus sinensis*)

పేజీ 97





పటము 50

**చుక్కల పయిడిగంటి**

(*Athene brama*)

పేజీ 99



పటము 51

**కొమ్ముల గుడ్లగూబ**

(*Bubo bubo*)

పేజీ 100



పటము 52

**ఆసకప్రెరగాడు**

(*Caprimulgus asiaticus*)

పేజి 102

పటము 53

పాతకపక్షి (క్రింది చిత్రం)

(*Apus affinis*)

పేజి 103





పటము 54
చిన్న నీలి బుచ్చిగాడు
*(Alcedo atthis)*
పేజీ 104



పటము ౫౫

నీళ్లబుచ్చిగాడు

(*Ceryle rudis*)

పుట 106



పటము 56

**చిన్న పసిరిక పిట్ట**

*(Merops orientalis)*

పేజీ 107



పటము 57

పాలపిట్ట

(*Coracias benghalensis*)

పేజీ 109



పటము ౫౮

కొండెపిట్ట (కూకుడుపిట్ట : అన్నాపిట్ట)

(*Upupa epops*)

పటము 59

**బట్టచుప్పనాతి**

(*Anthracoceros coronatus*)

పేజీ 111





పటము 60

**కంసాలిపిట్ట**

*(Megalaima haemacephala)*

పేజి 113



పటము 61

వడ్రంగిపిట్ట

(చిన్న చిరుత: మాసుటిఱు పక్షి)

(*Picoides mahrattensis*)

పే. 114



పటము 62

**పొన్నంగి**

***(Pitta brachyura)***

పేజీ 116



పటము 63

చండోళి

(*Galerida cristata*)

పేజీ 118



పటము 64

**అంబలి పోలిగాడు**

(*Eremopterix grisea*)

పేజి 119

ఇలా అంతులేకుండా కూస్తుంది. కోకిల 'పాట'ను హిందీ భాషలో శృంగార కావ్యాలలోనూ, కీర్తనలలోనూ ఘనంగా ప్రస్తావించారు. తక్కువ మోతాదులలో అది నిజంగా వినసొంపుగా ఉంటుంది. అది విధీ విరామం లేకుండా ఇలా మళ్లీ మళ్లీ కూస్తూ ఉంటే విసుగు, ఉద్రేకం, బాధకూడా కలుగుతాయి. అందుచేతనే దీనిని "బ్రెయిన్ ఫీవర్ బర్డు" అని పొరబడటం కద్దు. కాని వాస్తవానికి 'బ్రెయిన్ ఫీవర్ బర్డు' అనేది కుట్టి పిట్ట (Hawk — Cuckoo) లేక 'పపీహా' కాని కోకిల మాత్రం కాదు. ఆడుకోకిల కూయదు. అది వేగంగా చెట్టునుండి చెట్టుకు ఎగిరేటప్పుడూ, కొమ్మనుండి కొమ్మకు గెంతేటప్పుడూ కీచుగా "కిక్ – కిక్ – కిక్" అంటుంది. మర్రిపళ్లు, రావిపళ్లు, రకరకాల చెర్రీలు, గొంగళీ పురుగులు – ఇవి కోకిలల ఆహారం. కోకిల పిల్లలను సామాన్యంగా పెంచే ఇంటికాకి, అడవికాకి గ్రుడ్లను ఏ ఋతువులో పెడతాయో, ఆ ఋతువులోనే కోకిలలుకూడా గ్రుడ్లు పెడతాయి. మిగతా పరభృతములైన కోవెలలులాగే కోకిలకూడా స్వయంగా గూడు కట్టుకోదు. కోకిల, కాకుల గూళ్లల్లో గ్రుడ్లను పెడుతుంది. ఆ గ్రుడ్లను పొదగడం, పిల్లలను పెంచడం పెంపుడు పక్షులైన కాకులకే వదలి పెడుతుంది. కోకిల తన గ్రుడ్లనన్నిటిని ఒకే కాకి గూటిలో పెట్టదు. పలు గూళ్లకు సర్దుతుంది. కోకిల గ్రుడ్లు వెలవెలపోతున్న బూడిద - ఆకుపచ్చ రంగులో ఉంటాయి. గ్రుడ్లమీద ఎరుపు కలిసిన గోధుమరంగు చుక్కలు మచ్చలు ఉంటాయి. అవి కాకుల గ్రుడ్లను చాలవరకు పోలి ఉంటాయి కాని పరిమాణంలో కొంచెము చిన్నవి.

**జెముడు కాకి** (Crow - Pheasant or Coucal Centropus Sinensis)— పటము 49 – హిందీ : మహోకా లేక కూకా : పరభృతములు కాని కోవెలల కిది ఉదాహరణము. అంటే ఇవి గూళ్లు కట్టుకొంటాయి. ఇతర పక్షులమీద ఆధారపడక, వాటి కుటుంబ వ్యవహారాలను స్వయంగా చూచుకొంటాయి. జెముడు కాకి సుమారు అడవి కాకి అంత ఉంటుంది. అది వికారంగా ఉన్నప్పటికీ, రంగులతో వింతగొల్పుతూ వుంటుంది. దీని దేహం నిగనిగలాడుతూ నల్లగా ఉంటుంది. రెక్కలు చెస్నటు రంగులో ఉంటాయి. దాని తోక పొడుగుగాను, వెడల్పుగాను, క్రమాళి వృద్ధిలో నల్లగాను ఉంటుంది. పొదలు, చిన్నచెట్లు, పొడుగుపాటి పచ్చగడ్డి పంట భూములూ ఉన్న ప్రదేశాలలో ఈ పక్షి నివసిస్తుంది. మానవులు నివసించే స్థలాల పరి

సరాలలో ఇది తరుచుగా కనపడుతుంది; స్వేచ్ఛగా తోటలలో దూరుతుంది. ఇది ఎక్కువగా నేలమీదనే ఉంటుంది. ఇది కావాలని నేలమీద తుప్పల లోనూ, పొదలలోనూ ఆహారాన్ని వెతుకుకొంటూ, తోకను నేలమీద ఈడ్చు కొంటూ, దాగి ఉన్న పురుగులను పైకి రప్పించడానికి రెక్కలను విప్పి, వెంటనే ముడిచి చప్పుడు చేస్తూ, నడుస్తుంది. ఆహారాన్వేషణలో ఇది తుప్ప లలో ఎగబ్రాకుతూనూ, కొమ్మనుండి కొమ్మకు లాఘవంగా గెంతుతూను ఉంటుంది. 'ఊక్' అనే దీని కూత గంభీరంగా ప్రతిధ్వనిస్తుంది. ముఖ్యంగా ఎండా కాలంలో ఈ కూత ఉండి ఉండి చాలా దూరం వినపడుతుంది. శ్రావ్యంగా 'కూప్ - కూప్ - కూప్ - కూప్' అని పదే పదే వేగంగా కూడా ఈ పక్షి కూస్తుంది. సెకనుకు రెండు మూడు 'కూప్' ల చొప్పున ఆరేడు మొదలు ఇరవై సార్లవరకూ అది ఆగి, ఆగి కూస్తుంది. తక్షణం దూరంగా ఉన్న మరో జెముడు కాకి ఈ కూతను అందుకొని, అవి రెండూ కలసి కొంతసేపు యుగళ గీతం ఆలాపిస్తాయి. కప్ప కూతలవంటి కరుకైన మిశ్రమ ధ్వనులను కూడా అది చేస్తుంది. గ్రుడ్లు పెట్టే ఋతువులలో మగ పక్షి తన పెంటి ముందు తన తోకను వీపుమీదకు వచ్చేటట్లు చోద్యంగా ఎత్తి పెట్టుకొని, రెక్కలను క్రిందికి వ్రేలవేసి, గర్వంగా అడుగులు వేస్తూ, తన పెంటిని ఆకర్షిస్తుంది. జెముడు కాకి దుర్బలంగా, ప్రయాసపడి ఎగురుతుంది. అది అతి స్వల్ప దూరాలు మాత్రమే ఎగురగలదు. మిడతలు, ఇతరములైన పెద్ద కీటకాలు, లార్వాలు, పొలాలలో ఉండే చిట్టెలుకలు, తొండలు, చిన్న పాములు మొదలైనవి ఈ పక్షికి ఆహారం. చిన్న పక్షుల గ్రుడ్లనూ, పసి పిల్లలనూ ఈ పక్షి విశేషంగా నాశనం చేస్తుంది. నేలమీదా, తుప్పల లోనూ అది వాటికోసరం ఒక క్రమపద్ధతిలో వేటాడుతుంది. జెముడు కాకి మాంసం శ్వాస రోగాలకు చాలా మంచిదని నాటువైద్యులు గొప్పగా చెబు తారు. జెముడు కాకి పరభృతములు కాని కోవెల రకానికి చెందుతుంది. ఇది కోకిలలాగ తన సంతానాన్ని ఇతర పక్షుల కప్పగించదు. అదే పోషించుకొంటుంది. ఒక ముళ్లచెట్టు క్రింది భాగంలో పుడకలతోనూ, ఆకులతోనూ గోళాకారంలో వికారమైన పెద్ద గూటిని ఈ పక్షి కడుతుంది. దీనిలోనికి ఒక ప్రక్కనుండి మార్గముంటుంది. గూటిలో మూడు నాలుగు గ్రుడ్లుంటాయి. అవి సుద్దలాగ తెల్లగా ఉంటాయి. వాటిమీద చుక్కలు గాని, చారలు గాని ఏవి ఉండవు.

స్ట్రిగిఫార్మిస్ వర్గం — గుడ్లగూబలు (Order STRIGIFORMES — Owls): ఈ వర్గంలో, టైటొనినె — గాదెగుడ్లగూబ (Tytoninae —Barn Owl), స్ట్రిగిడె - నిజమైన గుడ్లగూబలు (Strigidae — True Owls) అను రెండు కుటుంబాలున్నాయి. మనకు బాగా తెలిసిన గాదె గుడ్లగూబ (Tyto Alba) లాగ ఈ మొదటి కుటుంబంలో ఉన్న గుడ్లగూబలన్నింటికీ కోతిముఖం వంటి నొక్కులు పడ్డ ముఖం ఉంటుంది. గాదె గుడ్లగూబ ప్రపంచమంత టనూ కనబడుతుంది. నిజమైన గుడ్లగూబలకు గుండ్రని పెద్ద తలలూ, సూటిగా ముందువైపు రెప్ప వేయకుండా చూచే గుండ్రని పెద్ద కళ్ళూ ఉంటాయి. కొన్ని జాతులకు కళ్ల పై భాగమున నిక్కబొడుచుటకు వీలైన కొమ్ములవంటి ఈక - కుచ్చులుంటాయి. చుక్కల పయిడిగంటి (Spotted Owlet — Athene Brama) - పటము 50 - హిందీ: ఖూస్టియా లేక చూఘత్. ఇది మనకు బాగా తెలిసిన జాతి. పయిడిగంటి సుమారు మైన గోరంత ఉంటుంది కాని దానికన్న బొద్దుగా ఉంటుంది. ఇది బూడిదచాయ గల గోధుమరంగు పొట్టి గుడ్లగూబ. దీని దేహంమీద తెల్లని మచ్చలుం టాయి. దీనికి గుండ్రంగా ఉండే పెద్ద తలా, సూటిగా ముందు వైపుకు రెప్ప వేయకుండా చూచే కళ్ళూ ఉంటాయి. మైదానాలలోను, గుట్టలుండే సీమల లోను ఇది తరచుగా సంచరిస్తుంది. సాధారణంగా మానవ నివాసస్థలాలలో ఇవి బాగా అలవాటు పడి తిరుగుతాయి. పురాతనమైన మామిడి, మర్రి మొదలైన చెట్ల తొర్రలలోను, బీటలలోను ఒకటి రెండు జతల పయిడిగంటులు తరచుగా నివాస మేర్పరచుకొని ఉంటాయి. ఎవరైనా కాండమును కొట్టి చప్పుడు చేస్తే చాలు, ఆ తట్టిన దెవరని తెలిసికోవడానికి వచ్చిన ఒక చిన్న ముఖం బిలద్వారం వద్ద కనుపిస్తుంది; లేదా మాటున వున్న కొమ్మ మీద దగ్గరగా చేరి కూర్చున్న పయిడిగంటుల జత చెదిరి ఎగిరిపోతుంది. ఈ పక్షులు దగ్గరగా ఉన్న మరో కొమ్మపైకి తొందరగా ఎగిరిపోయి, తల ముందుకు వెనుకకూ బఫూన్‌లాగ ఆడిస్తూ, అప్పుడప్పుడు తలను పూర్తిగా గుండ్రంగా త్రిప్పి వాటి ఏకాంతానికి భంగం కలిగించిన వారిని తదేక దృష్టితో పరికిస్తాయి. ఇవి పగటివేళ దాగియుండి, సందె చీకటివేళ బయటికి వస్తాయి. అవి సాధారణంగా సంధ్య వెలుగులోను, రాత్రులందును సంచరిస్తాయి. దడిలో నిలువుగా పాతిన కొయ్యలమీదా, టెలిగ్రాఫ్ తీగల మీదా, కనుచీకటిలో అవి కూర్చొని నేలమీద ప్రాకుతున్న పెంకుపురుగుల

మీదా, మిడుతల మీదా అకస్మాత్తుగా పడి పట్టుకొంటూండడము, లేక ఒక అనుకూల స్థలం నుండి మరో అనుకూల స్థలానికి చప్పుడు కాకుండా ఎగరడము మనం తరచుగా చూస్తూ ఉంటాం. వర్షంతో తడిసిన నేలనుండి పైకి వచ్చిన ఇసుళ్లమీదకో, వీధి దీపం చుట్టూచేరిన పెంకుపురుగుల మీదకో గుడ్లగూబ అకస్మాత్తుగా ఎగిరివెళ్లి వాటిని పట్టుకొంటుంది. ఆ కీటకాలను తన గోళ్లతో గట్టిగా పట్టుకొని, తాను కూర్చున్న స్థానానికి తిరిగివచ్చి, రామచిలుకలాగ పాదాన్ని ముక్కువద్దకు తెచ్చుకొని పురుగులను ముక్కలు ముక్కలుగా చీల్చి తింటుంది. నేలపై ప్రాకుచున్న దాని ఆహారాన్ని కనిపెట్టడానికది డేగలాగ పైన ఎగురుతూ తిరుగుతుంది. ప్రధానంగా పెంకుపురుగులు, ఇంకా కొన్ని కీటకాలు దాని ఆహారం. కాని తొండలనూ, చిట్టెలుక పిల్లలనూకూడా అది తింటుంది. పయిడిగంటులు అరుస్తూ సందడి చేస్తాయి. అవి కిచకిచమంటూ, పోట్లాడుకొంటున్నట్లూ, వాటిలో అవి నవ్వుకొంటున్నట్లూ కూస్తాయి. తరుచుగా రెండు పక్షులు చేరి ఒక దాని స్వరంతో మరొకదాని స్వరం పొసగకుండా కూడా కూస్తాయి. భవనాల గోడ సందులలోనూ, కన్నాలలోను ఆ భవనాలు పాడుపడినవైనా సరే లేక వాటిలో మనుష్యులున్నా సరే — ఈ పక్షులు కొంచెంగా పచ్చగడ్డీ, ఈకలూ ఉంచి వాటిపైన మూడు నాలుగు గ్రుడ్లు పెడతాయి. అవి వర్తులమైన అండాకారంలో తెల్లగా ఉంటాయి.

కొమ్ముల గుడ్లగూబ (The Great Horned Owl — Bubo Bubo)— పటము 51 - హిందీ: ఘూ ఘూ - మనకు బాగా తెలిసిన మరియొక గుడ్లగూబ. ఇది సుమారు గద్దంత ఉంటుంది. కాని దానికన్నా దృఢంగా ఉంటుంది. ఇది బరువైన, ముదురు గోధుమరంగుగల పెద్ద గుడ్లగూబ. దానిపైన గోధుమరంగు కలిసిన పసుపు పచ్చనివి, నల్లనివి చారలు, చుక్కలు ఉంటాయి. దాని తలమీద కొమ్ముల్లాగ రెండు చెవి కుచ్చులు స్ఫుటంగా కవపడతాయి. దీనిని చూచి ఇది గోధుమరంగు చేపల గుడ్లగూబ (Brown Fish Owl—Bubo Zeylonensis) అని తరుచుగా పొరపడతారు. కాని కొమ్ముల గుడ్లగూబకు ఎరుపు - గోధుమరంగు తక్కువగనూ, పసిమి - గోధుమరంగు ఎక్కువగనూ ఉంటుంది. చేపల గుడ్లగూబ కాళ్లు, పైన ఈకలు లేక బోడిగా ఉంటాయి. కాని కొమ్ముల గుడ్లగూబ కాళ్లమీద పూర్తిగా ఈకలుంటాయి. నేలమీద పొద మరుగునగాని, లేదా కొండ చరియ

లేక ఏటిగట్టున నీడగా ఉండి ముందుకు పొడుచుకు వచ్చిన రాతిమీద గాని ఈ పక్షి పగలంతా విశ్రాంతి తీసికొంటూ కాలక్షేపం చేస్తుంది. చేపల గుడ్లగూబ పూర్తిగా సంధ్యా కాలంలోనూ, రాత్రులందే సంచరిస్తుంది. కాని ఇది పగటి వేళకూడా తరుచు తిరగడం మనం చూస్తాం. పగటి పూట అవి ఉన్న ఏకాంత స్థలమునుండి సాయంకాలం అయేటప్పటికి 'బ్యూ-బో' అంటూ గంభీరంగా ప్రతి ధ్వనించేటట్లు కూస్తూ ఈ పక్షులు బయటికి వస్తాయి. ఈ కూత అంత బిగ్గరైన దేమీకాదు ; కాని దానికి దూరంగా దూసు కొనిపోయే గుణం ఉంది. ఇలా అవి బయటికి వచ్చి, ఏదైన పెద్ద బండరాతి మీదో, ఏదైనా ఎత్తైన స్థలంలోనో కూర్చుని, అక్కడ నుండి దూరంలో వాటికి అలవాటైన స్థలాలకు ఆహారాన్ని వేటాడడానికై సునాయసంగా ఎగిరిపోతాయి. మామూలు కూతలే కాక వాటితోపాటు ఉద్రేకం ప్రకటిస్తూ భయంకరమైన గురకలు, బుసలు – పలురకాల ధ్వనులు అవి చేస్తూ ఉంటాయి. కొమ్ముల గుడ్లగూబ ఆహారం చిన్న చిన్న సస్తనులు, పక్షులు, తొండలవంటి సరీసృపాలూను. ఇవికాక పెద్ద కీటకాలను, చేపలను, పీతలను కూడా అది తింటుంది. సేద్య ప్రదేశాలలో అది హెచ్చుగా ఎలుకలనూ, చిట్టెలుకలనూ తింటుంది. మానవునికి విశేష నష్టాన్ని కలుగ చేసే ఈ రకమైన జంతువులు వృద్ధి పొందకుండా అరికడుతూ, ఈ పక్షులు మానవుని ఆర్థికాభివృద్ధి కెంతైనా తోడ్పడుతున్నాయి. అందుచేత ఈ పక్షులకు కచ్చితమైన రక్షణ కలుగచేయడం ఎంతైన అవసరం. ఇవి గూళ్లను కట్టవు. ఇవి స్వతహాగా ఏర్పడిన మట్టి గుట్టలమీదా, గోడలకుండే గూళ్లలోనూ, కొండలమీద పైకి పొడుచుకు వచ్చిన రాతిమీదా వట్టి నేల పైనే మూడు నాలుగు గ్రుడ్లు పెడతాయి. అన్ని గుడ్లగూబల గ్రుడ్లలాగే ఇవికూడా కొంచెం వర్తులమైన అండాకారంలో ఉంటాయి. అవి మీగడ తెలుపురంగులో ఉంటాయి.

కేప్రిమల్గిఫార్మిస్ వర్గం (Order CAPRIMULGIFORMES) : భారత ఉప ఖండంలోని ఈ వర్గానికి చెందిన రెండు కుటుంబాలలోను మనకు ముఖ్యంగా

సంబంధించినది ఆసకప్పెరగాళ్ల (Nightjars) ది అనగా కేప్రిమల్గిడె (Caprimulgidae) కుటుంబం. ఆసకప్పెరగాళ్లను 'గోట్ సక్కర్సు' (Goat-suckers) అని పిలుస్తారు. ఇవి సంధ్యవేళలందూ, రాత్రులందూ సంచరించే పక్షులు. గుడ్లగూబల కున్నట్లే వీటికిని మృదువైన రంగు ఈకలు దాగి ఉంటాయి. వీటి కాళ్లు పొట్టివి, బలహీనమైనవి. సంధ్య చీకటిలో ఎగురుచున్న కీటకాలను పట్టుకోవడానికి వీలుగా వీటికి మిగుల వెడల్పైన నోళ్లుంటాయి. నోటి వద్దనుండి పైకి పొడుచుకొని వచ్చిన ముళ్లవంటి బిరుసైన వాటి ఈకలుకూడా కీటకాలను బాగా పట్టుకోవడానికి ఉపకరిస్తాయి. ఆసకప్పెరగాళ్లలో చాల జాతులున్నాయి. అందు బాగా వ్యాప్తిచెంది, మనకు బాగా పరిచితమైనది ఆసకప్పెరగాడు (Indian Nightjar — Caprimulgus Asiaticus) — పటము 52 — హిందీ : ఛిపక్ లేక దబ్ చిరి. ఈ పక్షినే గుండుములపుగాడని, కప్పపిట్ట అని కూడ అంటారు. ఇది సుమారుమైనగోరంత ఉంటుంది; బూడిదరంగు, గోధుమరంగు, లేతపసుపురంగు, ఎరుపు కలిసిన పసుపురంగుల మృదువైన ఈకలుంటాయి. దాని శరీరం మీద చుక్కలూ, నల్లని చారలూ ఉంటాయి. దీని దేహవర్ణం ఆవరణవర్ణంతో చక్కగా సమ్మిశ్రమై ఈ పక్షి దాని శత్రువులకు సులభంగా కనపడదు. అది ఎగిరేటప్పుడు దాని రెక్కలమీద ఉన్న తెల్లటి మచ్చలు ప్రస్ఫుటంగా కనపడతాయి. తుప్పలుండే ప్రదేశాలలో పగటివేళ ఒంటరిగా ఈ పక్షి నేలమీద నక్కి ఉంటుంది. సంధ్యా సమయమున గాలిలో ఎగిరే కీటకాలను డేగలాగ వేటాడుతుంది. లేదా మట్టిరోడ్ల మీద కూర్చొని ఉంటుంది. పెంకు పురుగులూ, శలభాలూ — ఇలాంటి కీటకాలే దీని ఆహారం. అవి గాలిలో ఎగిరేటప్పుడు వాటిని ఈ పక్షి దాని వెడల్పైన నోటిని తెరచి పట్టుకొని తింటుంది. ఆసకప్పెరగాళ్లు నిశ్శబ్దంగా, చిత్రంగా శలభాలలాగ ఇటూ అటూ ఎగురుతాయి. ఆహారాన్ని వెంట తరిమేటప్పుడూ, అడ్డంకులను తప్పించుకోవలసి వచ్చినపుడూ అవి వలయాకారంలో ఎగురుతూ, రెక్కలను కొట్టుకొంటూ, గాలిలో తేలుతూ అతిలాఘవంతో చిత్రంగా ప్రక్కలకు తిరుగగలవు, చుట్టిరాగలవు. అవి రోడ్లపై కూర్చుండినపుడు ఎదురుగా వస్తూన్న మోటారు కారు శికోదీపాల వెలుగులో వాటి కళ్లు కెంపులులాగ మెరిసి పోతూ ఉంటాయి. మోటారుకారు ఇక వాటిమీదనుండి పోతుందేమో అన్నంతవరకూ ఉండి, రవంతలో నిపుణంగా తప్పించు

కొంటాయి. ఈ జాతి పక్షుల కూత "చక్- చక్- చక్- చక్-ర్-ర్-ర్" అంటూ, గడ్డకట్టిన కొలనులో రాతిని దొర్లిస్తే ఎలా శబ్దం అవుతుందో అలా ఉంటుంది. చీకటిపడిన తరువాత రాత్రంతా అది నేలమీదనో చెట్టు మొద్దు మీదనో, మంటి దిబ్బమీదనో కూర్చొని ఇలా కూస్తుంది. తరుచుగా రెండు పక్షులు ఒకదాని కొకటి కొంత దూరంలో ఉండి ఒకదాని కొకటి జవాబు ఇస్తూన్నట్లుగా చాల సేపటివరకూ జతగా కూస్తూ ఉంటాయి. గ్రుడ్లను పెట్టేకాలంలో ముఖ్యంగా వెన్నెల రాత్రులలో ఈ పక్షులు చాలా సందడి చేస్తాయి. ఇవి గూళ్లను కట్టవు; అవి పొదలుండే చిట్టడవులలో వట్టి నేల మీదనే సాధారణంగా రెండు గ్రుడ్లు పెడతాయి. ఈ అండాలు పొడుగ్గా స్థూపాకారంలో ఉంటాయి. ఈ గ్రుడ్లు లేత గులాబీ, దట్టమైన ఎరుపు–పసుపు చాయలలో ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగువి, ఊదారంగువి మచ్చలుంటాయి.

ఎపొడిఫార్మిస్ వర్గం (Order APODIFORMES):- ఈ వర్గంలో చాతక పక్షులను (Swifts) చేర్చారు. ఈ పక్షులు సన్నంగా, కోసుగా ఉంటాయి. వీటి రెక్కలు సన్నంగా, పొడుగ్గా, ధనురాకారంలో ఉంటాయి. ముఖ్యంగా ఈ రెక్కలు దానికి అతివేగంగా ఎగరడానికి తగియున్నాయి. ఈ పక్షులు పగలంతా ఎగురుతూనే చీకటి ఈగలు, మత్కుణములు (నల్లులు), పెంకు పురుగులు మొదలైన కీటకాలను వేటాడి వాటిని తింటూ కాలక్షేపం చేస్తాయి. ఈ వేటకు వాటి పెద్ద నోళ్లు బాగా ఉపకరిస్తాయి. వీటి కాళ్లు మిగుల పొట్టివి. కాలివేళ్లు నాలుగూ ముందువైపుకే తిరిగి ఉంటాయి. అందుచేత ఈ పక్షులు వానకోయిలల (Swallows) లాగ టెలిగ్రాఫు తీగల వంటి ఆధారాలపై కూర్చోవడానికి వీలుండదు. సూదుల్లా వాడిగా ఉండి వంపు తిరిగిన గోళ్లతో అవి నిట్టనిలువుగా గాని, ఏటవాలుగా గాని ఉండే తలాలను పట్టుకొని వ్రేలాడగలవు. ఎపొడిడె- నిజమైన చాతక పక్షులు- (Apodidae — True Swifts) కుటుంబంలో మనకు బాగా పరిచితమైనది మన చాతకపక్షి. (House Swift — Apus Affinis)- పటము 53 (క్రింది చిత్రం) - హిందీ: బబిలా లేక బటాసి. ఇది పిచ్చుకకన్న కొంచెం చిన్నది. ఈ పక్షి పొగనలుపు రంగులో ఉంటుంది; గొంతు తెల్లన; తోక పొట్టిగా,

చతురస్రాకారంలో ఉంటుంది; చివరి భాగం తెల్లగా ఉంటుంది. రెక్కలు పొడుగ్గా, సన్నంగా చివర మొనదేరి ఉంటాయి. ఈ పక్షులు పురాతనపు కోటలు, పాడుపడిన మసీదులు, భవనముల సమీపంలోనే కాకుండా మనుష్యులు నివసిస్తున్న ఇండ్లను కూడా ఆశ్రయించుకొని ఉంటాయి. ఈ పక్షులు గుంపులుగా చేరి పగలంతా చిన్న రెక్కపురుగులను వేటాడుతూ, ఉల్లాసంగా కీచు కీచుమంటూ అరుస్తూ ఎగరడం మనం చూస్తూనే ఉంటాం. వాటి రెక్కలు పొడుగ్గా, కోసుగా ఉండటంచేత చాతక పక్షులు దాదాపు విరామం లేకుండానే అతివేగంగా ఎగుర గలుగుతున్నాయి. సాయం సమయాల్లో చుట్టూరా గుండ్రంగా తిరుగుతూ లేదా బంతిలాగ మరీ పైకెగురుతూ, కీచు కీచుమంటూ ఆనందంగా కూస్తూ ఉండే చాతకపక్షుల అల్లరి మూకలను మనం తరుచుగా చూస్తూనే ఉంటాం. ఇలా అవి ఆనంద జీవితం గడుపుతాయి. జన సమ్మర్దంగా ఉన్న బజారుల మధ్యలోకూడా ఈ పక్షులు గోడ మూలలలోనూ, భవనాలలో కప్పులమీదా, ఆర్చిలకిందా, ద్వారముల క్రిందా ఈ పక్షులు గూళ్లు కట్టి గుత్తులు గుత్తులుగా ఆదరా బాదరా అంటిస్తాయి. ఈ గూళ్లు గుండ్రంగా అందవికారమైన గిన్నెలలా గుంటాయి. అవి పూర్తిగా ఎండుగడ్డి, ఈకలు మొదలైన వాటిని ఒకదానితో నొకటి అతికించి గూళ్లు నిర్మిస్తాయి. గూటికీ గోడకూ మధ్య ఉన్న సందే గూటిలోకి ప్రవేశ మార్గంగా ఉపయోగిస్తుంది. గ్రుడ్లు 2 మొదలు 4 వరకూ ఉంటాయి. అవి స్వచ్ఛమైన తెలుపురంగులో దీర్ఘాండాకృతిలో ఉంటాయి. ఈ గూటి సముదాయాలు లేక 'గ్రామాలు' (Village) పాడు పడకుండా ఉంటే ఆ గూళ్లనే ఈ పక్షులు సంవత్సరాల తరబడి ఉపయోగిస్తాయి. ఈ విధంగా ఆ స్థలాలు పరంపరా గతాలవుతుంటాయి.

కొరాసీ ఫార్మిస్ వర్గం (Order CORACIIFORMES) ఈ వర్గంలో ఆల్సీడినిడె - లకుముకి పిట్టలు (Alcedinidae — Kingfishers), మిరొపిడె- పసిరిక పిట్టలు (Miropidae — Bee - eaters), కొరసీడె - పాలపిట్టలు (Coraciidae — Rollers), బ్యూసెరొటిడె - చుప్పనాతులు (Bucerotidae — Hornbills) అను కుటుంబాలున్నాయి.

చిన్న నీలి బుచ్చిగాడు (The Small Blue Kingfisher-Alcedo Atthis)—

పటము 54 – హిందీ : ఛోటా కిల్కిలా లేక షరీఫన్ : ఇది పిచ్చుకకన్న కొంచెం పెద్దది. ఇది నీలి, ఆకుపచ్చ రంగులు కలిగి విలక్షణంగానూ, చురుకుగానూ ఉండే చిన్న లకుముకి. దీని క్రింది భాగాలు గాఢమైన త్రుప్పు రంగులో ఉంటాయి. దీని తోక మొద్దుబారి పొట్టిగా ఉంటుంది; ముక్కు పొడుగ్గా సూటిగా, మొనదేరి ఉంటుంది. సెలయేళ్లు, చెరువులు, నీటి దొరువులు – వీటి దగ్గర క్రిందుగా నీళ్లమీదకు వ్యాపించియున్న చెట్టు కొమ్మ మీద ఒంటరిగా కూర్చుండి గాని, నీటిమీద క్రిందుగా ఎగురుతూ గాని మనకీ పక్షి తరుచుగా కనిపిస్తుంది. రాళ్లు బాగా ఉండే సముద్ర తీరాలకు కూడా అప్పుడప్పుడీ లకుముకి సాహసించి వెడుతుంది.

నీటిమీద క్రిందుగా ఉన్న కొమ్మపైన ఈ పక్షి కూర్చున్నప్పుడు దాని తలను పైకి క్రిందికీ, ఈ ప్రక్కకూ ఆ ప్రక్కకూ తరుచుగా ఆడిస్తూంటుంది. మెల్లగా 'కిక్' అని శబ్దం చేస్తూ ఆ శబ్దానికి అనుగుణ్యంగా అది దాని మొండి తోకను పైకి లటుక్కున ఎగురవేస్తూంటుంది. అలా కొమ్మమీద కూర్చున్నంతసేపూ అది ఏదైనా చేపగాని, చిరుకప్పగాని, నీటితలానికి దగ్గరగా వస్తూందేమోనని క్రిందనున్న నీటిని బాగా పరిశీలిస్తూ ఉంటుంది. ఆహారం కనబడీ కనబడటంతోనే ముక్కును ముందు పెట్టుకొని నీరు చెదిరేటట్లు అది ఆయాహారం పైపడి, నీటి అడుగుకుపోయి, వెంటనే దానిని అడ్డుగా దవుడల మధ్య పట్టుకొని, మళ్లీ పైకివచ్చి, దగ్గరగానున్న కొమ్మమీదికి చటున ఎగిరివెళ్లి, ఆ దొరికిన జంతువును చితకకొట్టి చంపి మ్రింగివేస్తూంది. అప్పుడప్పుడు ఇదికూడా నీళ్ల బుచ్చిగాడు (Pied Kingfisher) లాగ వింతగా నీటిమీద ఒక్కచోట ఎగురుతూ, ఆహారం కనపడగానే వెంటనే నీటిలో పడి దానిని పట్టుకొని బయటకు వస్తుంది. ఈ పక్షి చెరువుపై ఒక మూలనుండి మరో మూలకు నీటి తలంమీద మహా వేగంతో ఎగిరేటప్పుడు ఛిఛీ – ఛిఛీ అంటూ కీచుగా కూస్తుంది. చిన్న చేపలను, చిరుకప్పలనే కాకుండా నీటిలో ఉండే పెంకు పురుగులను, వాటి లార్వాలను, ఇంకా నీటిలో ఉండే కొన్ని పురుగులను కూడా అది తింటుంది. సెలయేళ్లూ, చెరువులూ, మడుగులూ – వీటి మట్టిగట్లు ఈ పక్షులు గూళ్లను నిర్మించడానికి అనువైన స్థలాలు. ఈ గట్లలో అది ఒక మీటరు పైగా అడ్డుగా ఒక సొరంగాన్ని త్రవ్వుతుంది. ఈ సొరంగం చివర గ్రుడ్లను పెట్టడానికొక వెడల్పైన గదిని నిర్మిస్తుంది. ఈ గదిలో అస్తరేమీ ఉండదు.

కాని ఈ పక్షి చేప ఎముకలనూ, పెంకుపురుగుల రెక్కలనూ కక్కి అందులో ఉంచుతుంది. ఆ గదిలో ఈ పదార్థాలు దుర్వాసన వేస్తూ ఉంటాయి. ఈ పక్షి సాధారణంగా 5 మొదలు 7 వరకూ గ్రుడ్లను పెడు తుంది. ఇవి తెల్లగా వర్తులాండాకారంలో మెరిసిపోతూ ఉంటాయి.

లకుముకి లేక బుచ్చిగాడు (Whitebreasted Kingfisher —Halcyon Smyrnensis) ఇది మనకింకా బాగా తెలిసిన నీలిబుచ్చిగాడు. చాల జాతుల లకుముకులవలె ఇది దాని ఆహారం కోసరం నీటిమీద ఎక్కువగా ఆధారపడదు. ఏలన ఇది చాలవరకూ దాని ఆహారాన్ని మార్చేసుకొంది. ఈ బుచ్చిగాడు నేలమీద ఉండే కీటకాలనే ముఖ్యంగా తింటుంది. ఇది సుమారు మైనగోరంత ఉంటుంది. దీని దేహం పైభాగం వైడూర్యపు నీలిరంగుతో నిగ నిగలాడుతూ ఉంటుంది. దీని తలా, మెడా, క్రింది భాగాలూ చోకలేటు - గోధుమరంగులో ఉంటాయి. ప్రస్ఫుటంగా కనపడే తెల్లని రొమ్మూ, పొడుగ్గా, బరువుగా, సూదిగా, ఎఱ్ఱగా ఉండే దాని ముక్కూ చూచి ఈ పక్షిని నిర్ధారణగా గుర్తుపట్టవచ్చును. అది ఎగిరేటప్పుడు దాని నల్లని రెక్కలమీద తెల్లని పెద్ద మచ్చ స్పష్టంగా కనబడుతుంది.

నీళ్లబుచ్చిగాడు (Pied Kingfisher — Ceryle Rudis) - పటము 55 - హిందీ: కొర్యాలా కిల్కిలా లేక కరోనా: ఈ పక్షిని మనం సులభంగా మరువలేము. ఇది పరిమాణంలో మైనగోరకూ, పావురాకూ మధ్యగా ఉంటుంది. దీని ఈకలు నలుపూ - తెలుపూ ఛాయలో చుక్కలూ, పట్టీలూ కలిగి ఉంటాయి. దీనికి విలక్షణమైన లావుపాటి, బాకువంటి లకుముకి ముక్కుంటుంది. మగపక్షి, ఆడుపక్షి (చిత్రంలో చూడవచ్చును) లాగే ఉంటుంది. కాని మగదానికి మధ్యను కొంచెంగా తెగిన ఒక కంఠమాల కాక రమారమీ సంపూర్ణమైన రెండు నల్లని కంఠమాలలుంటాయి. అవి నదులు బాడవలు, గ్రామాలలో ఉండే చెరువులు, నదీ ముఖద్వారాలు — వీటివద్ద ఒక కొయ్యమీదనో రాతిమీదనో ఒంటరిగా గాని జతలుగా గాని కూర్చొని తోకను పైకి నిగడతంతూ, క్రిందకూ, పైకీ, ప్రక్కలకూ ఉండి ఉండి తలను పంకిస్తూ ఉంటాయి. అది ఎగిరేటప్పుడు కూసే దాని చిఱ్ఱిక్—చిఱ్ఱిక్ అనే కూతలను ఒక్కసారి వింటే వాటిని ఎన్నటికీ మరవజాలము. నీళ్ల బుచ్చిగాడు చేపలను చాలా వింతగా ఒక ప్రత్యేకమైన పద్ధతిలో వేటాడు తుంది. నీటిమీద ఎగురుతూ, చిన్న చేప ఏదైనా నీటి తలానికి దగ్గరగా

వస్తుందేమోనని అది అవిచ్ఛిన్నంగా తదేక దృష్టితో క్రిందికి చూస్తూ ఉంటుంది. చేప కనపడీ కనపడటంతో అది ఎగరకుండా తక్షణం ఆగి పోతుంది. అప్పుడది తలను క్రిందకు వంచి, తోకమీద నిలబడిందా అన్నట్లుగా శరీరాన్ని నిట్టనిలువుగా ఉంచి రెక్కలను త్వరగా కొడుతూ అదే స్థలంలో గాలిలో వ్రేలాడుతూ ఎరను పట్టుకోవడానికి ముక్కును సిద్ధం చేస్తుంది. ఈ పక్షి పట్టుకొని పోవడానికి అనుకూలమైన లోతుకు చేప రాగానే అది రెక్కలు ముడిచికొని 6 లేక 8 మీటర్ల ఎత్తునుండి రివ్వున పిడుగులాగ నీటిలో పడి పూర్తిగా నీటి అడుగుకుపోయి, చేపను అడ్డుగా ముక్కుతో పట్టుకొని, వెంటనే పైకి వస్తుంది. నీటిని దులిపివేయడానికి శరీరాన్ని ఒక్కసారి ఝూడించి, దగ్గరగా ఉన్న కొమ్మ దగ్గరకు ఎగిరివెళ్లి దానిపై కూర్చొని, గింజు కొంటున్న చేపను చావబాది, దానిని ముక్కులోకి అనుకూలంగా తెచ్చుకొని, తలతో ప్రారంభించి మ్రింగివేస్తుంది. దీని ఆహారం ప్రధానంగా చేపలు. కాని చిరుకప్పలనూ, కప్పలనూ, నీటిలో ఉండే పురుగులనూ కూడా అది తింటుంది. మట్టి గట్టులోపల అడ్డుగా త్రవ్విన సొరంగం చివర ఉంటుంది దీని గూడు. దీని గూటిలో అస్తరుండదు. కాని అది కక్కిన, దుర్వాసన వేస్తున్న, చేప ఎముకలు ఆ గూటినిండా ఉంటాయి. గూటిలో అయిదారు గ్రుడ్లుంటాయి. అవి వర్తులాండాకారంలో స్వచ్ఛమైన తెలుపురంగులో నిగనిగలాడుతూ ఉంటాయి.

హిమాలయ నీళ్ల బుచ్చిగాడు (The Himalayan Pied Kingfisher - Ceryle Lugubris): ఇది మామూలు నీళ్ల బుచ్చిగాడికన్న చాల పెద్దది. దీనికి కుచ్చుకటి ప్రధానంగా ఉంటుంది. ఇవి హిమాలయ పర్వతాలమీద సుమారు 800 మీటర్లు ఎత్తున ఉంటాయి.

చిన్న పసిరిక పిట్ట (The Small Green Bee-eater—Merops Orientalis) —పటము 56- హిందీ : పత్రింగా- ఇది సన్నని ఆకుపచ్చని పక్షి. ఈ పక్షి సుమారు పిచ్చుకంత ఉంటుంది. దాని తలా, మెడా ఎరుపు కలిసిన గోధుమ చాయలో ఉంటాయి. దానితోక ఈకలలో నడిమి జత తక్కిన వాటికన్నా పొడుగ్గా పెరిగి, మొద్దుబారిన సూదులను పోలి ఉంటాయి. దాని సన్నని, పొడుగైన, వంపుతిరిగిన ముక్కూ, దాని గొంతుమీద స్ఫుటంగా కనపడే నల్లని 'కంఠాభరణమూ' ఈ పక్షిని పోల్చుకోవటానికి మరికొన్ని గుర్తులు. విశాలమైన బయలు ప్రదేశాలలో ఈ పక్షులు జతలు

జతలుగా గాని, విడిమందలుగా గాని కనబడతాయి. సేద్యపు పొలములు, చెట్లు నరికివేసిన అరణ్య ప్రదేశములు, పశువులు మేసే బీళ్ళూ అంటే వీటి కెంతో ఇష్టం. ఈ పక్షులు మందలు మందలుగా టెలిగ్రాఫ్ తీగలమీదా, కంచెకమ్మీల మీదా, పొదలమీదా కూర్చుంటాయి. అక్కడనుండి గాలిలో సొగసుగా ఎగురుతూ, రెక్కల పురుగులమీదకు దాడిచేసి, కీటకాలను పట్టుకోగానే రెక్కలను విప్పియుంచి కదల్చకుండా ఎగురుతూ, అవి తిరిగి యథాస్థానానికి వచ్చి వాల్తాయి. అచట గింజుకొంటున్న పురుగును కొట్టి, బాది, చంపి మరీ మ్రింగుతాయి. అవి ఎగిరేటప్పుడు ఇంపుగా, గల గల మనే "టిట్, టిట్" లేక "ట్రీ-ట్రీ-ట్రీ" అనే కూతను తరుచుగా కూస్తాయి. సూర్యాస్తమయ సమయానికి అవి బాగా ఆకులలముకొన్న చెట్లమీదకు నిద్ర పోవడానికి చేరతాయి. నిద్రపోవడానికి ముందు అవి చాల సందడి, గోల చేస్తాయి. ఈ పక్షుల మందంతా కలిసి, ఉండి ఉండి ఏ కారణం లేకుండానే, అవి నిద్రపోయే చెట్టుచుట్టూ ఎగురుతూ చివరకు క్రమంగా దాని మీద వాల్తాయి. ఈకలను వదులుచేసి, శరీరాన్ని బొద్దుగా చేసికొని, తలను రెక్కలో దోపుకొని, చిన్న గుంపుగా అవి ఒక దానికొకటి దగ్గరగా చేరి, కొమ్మ పొడుగునా కూర్చుండి, నిద్రపోతాయి. మిగతా పక్షులలాగ కాక ఇవి ఆలస్యంగా నిద్రనుండి లేస్తాయి. సూర్యుడు బాగా పైకి వస్తేనేగాని అవి సంచారానికి బయల్దేరవు. తూనీగలు, ఇతరములైన రెక్కలుగల ఈగలు వీటికి ఆహారం. అప్పుడప్పుడు పసిరిక పిట్టలు తేనెను సేకరించు పరిశ్రమలో పెంచబడుచున్న తేనెటీగలను నాశనం చేసి ఆ పరిశ్రమకు ఎంతైనా నష్టం కలిగిస్తాయి. ఈ పక్షులు గుంపులుగా చేరి గూళ్ళను నిర్మించుకొంటాయి. ఇసుకనేలలోనూ త్రవ్వి మట్టిని తొలగించిన ప్రక్కలందును ఒక మీటరుకు పైగా పొడుగుండేలాగున, అడ్డుగా సొరంగాలు చేస్తాయి. — ఏటవాలుగా ఉన్న నేలలో సొరంగాలను వాలుగా చేస్తాయి. ఈ సొరంగం చివర గ్రుడ్లు పెట్టడానికొక గదిని ఏర్పాటు చేస్తాయి. ఈ గదిలో అస్తరేమీ ఉండదు. గదిలో 5 మొదలు 7 వరకూ గ్రుడ్లుంటాయి. అవి తెల్లగానూ, వర్తులాండా కారంలోనూ ఉంటాయి.

నీలితోక పసిరిక పిట్ట (Bluetailed Bee-eater—Merops Philippinus): ఇది చిన్న పసిరిక పిట్టకు దగ్గర చుట్టము; పరిమాణంలో పెద్దది. దీని కన్నుగుండా పోయే నల్లని చార, చెస్నటురంగు గొంతు, నీలితోక -

వీటిని బట్టి ఈ పక్షిని సులభంగా పోల్చుకోవచ్చును. ఇది అరు బయలు ప్రదేశాలలోను, ముఖ్యంగా చెరువుల దగ్గర, బాడవల దగ్గర ఇది కన పడుతుంది. కాలాన్ని అనుసరించి ఇది ఒక చోటునుండి మరియొక చోటునకు పోతూంటూంది. కాని అది స్థానికంగా ఈ వలస చలనాలు ఎందుకు చేస్తుందో ఇంకా సరిగా బోధపడటంలేదు.

కొరాసిడే కుటుంబా (Family Coraciidae) నికి పాలపిట్ట (Indian Roller or Blue Jay—Coracias Benghalensis) — పటము 57 - హిందీ: నీల్ కంఠ్ లేక సబ్జక్ చెందుతుంది. వింతగా ఆక్సుఫర్డ్ - కేంబ్రిడ్జి నీలి రంగుల పక్షి ఇది; సుమారు పావురమంత ఉంటుంది. దీని తల పెద్దది; ముక్కు బరువైనది. రొమ్ము ఎరుపు కలిసిన గోధుమరంగులో ఉంటుంది. పొత్తికడుపూ, తోక క్రింది భాగమూ వెలవెల పోతున్న నీలిరంగులో ఉంటాయి. దాని రెక్కలకుండే లేత, ముదురు నీలిరంగులు అది ఎగిరేటప్పుడు ప్రకాశవంతంగా పట్టీలుగా కనపడతాయి. సేద్య భూములు గల బయలు ప్రదేశాలలోనే పాలపిట్ట ముఖ్యంగా నివసిస్తుంది. అంతే కాని దట్టమైన అడవు లలో అది ఉండదు. నరకి వేయగా మిగిలిన చెట్టు మొద్దుమీదను, టెలిగ్రాఫ్ తీగలమీదను దీనిని తరుచుగా చూడవచ్చును. అటువంటి ప్రదేశంలో కూర్చొని పాలపిట్ట నలుమూలలా పరికిస్తుంది. అటువంటి ఉన్నత స్థలంనుండి చూస్తూ అప్పుడప్పుడు అది కీటకాన్ని పట్టుకొనడానికి రివ్వున నేలమీదకు దిగుతుంది. ఇలా పురుగును పట్టుకొని తిరిగీ అదే ఆధారానికి కాని లేదా తాపీగా ఎగురుతూ దగ్గరగా ఉన్న మరో ఆధారం వద్దకుగాని పోయి, ఆ కీటకాన్ని బాది చంపి మ్రింగివేస్తుంది. కీచురాళ్లు, మిడుతలు, పెంకు పురుగులు మొదలైన కీటకాలు దాని ఆహారం. పంటలను నాశనం చేసే యిటువంటి కీటకాలను నాశనం చేసి, పాలపిట్ట సేద్యానికి ఎంతైనా సేవ చేస్తుంది. అప్పుడప్పుడు తొండలను, చిట్టెలుకలను, కప్పలను కూడా అది తింటుంది. పాలపిట్ట గద్గదమైన కంఠంతో అనేక రకాలుగా కూస్తూంది. ముఖ్యంగా మగపిట్ట గాలిలో ఎగురుతూ పెంటిముందు ప్రకటించు కొనేటప్పుడు చాలా సందడి చేస్తుంది. మగ పిట్ట గాలిలో చోద్యంగా మొగ్గలు వేస్తుంది — అసహ్యాకరంగా కూస్తూ, కూతకు అనుగుణ్యంగా తారాజువ్వలాగ గాలిలో పైకెగిరి, పల్టీలుకొట్టి, ముక్కు ముందుకు పెట్టి రివ్వున క్రిందికి వచ్చి, ప్రక్కలకు దొర్లి-ఇలా ఆడంబరంగా ప్రవర్తిస్తుంద. అది ఇలా ఎగిరేటప్పుడు

దాని ఈకలు ఎండలో మెరిసిపోతూ ఉంటాయి. చెట్టు తొఱ్ఱలో గడ్డి, ఈకలు, చెత్త చేర్చి గూటిని నిర్మిస్తుంది. గూటిలో నాలుగైదు గ్రుడ్లుంటాయి. అవి స్వచ్ఛమైన తెలుపురంగులో గోళాలకు దగ్గరైన అండాకారంలో ఉంటాయి.

కాశ్మీరు పాలపిట్ట (Kashmir Roller - Coracias Garrulus) మన ద్వీపకల్పంలో ఉన్న పాలపిట్ట బంధుజాతికి చెందినదే. ఇది కాశ్మీరములో ఉంటుంది. సెప్టెంబరు – అక్టోబరు మాసాలలో ఇది సింధు, కచ్, సౌరాష్ట్ర, ఉత్తర గుజరాతుల మీదుగా ఆఫ్రికా ఖండానికి వలసపోతుంది. అది ఎగిరేటప్పుడు ఒకేరీతి నీలి – నలుపు రంగులలో కనబడే రెక్క యీకలనుబట్టి ఈ పక్షిని సులభంగా గుర్తు పట్టవచ్చును. (57 పటములో విడిగా చిత్రించిన రెక్క యీకలను చూడుడు.) రొమ్ముతోపాటు ఈ పక్షి క్రింది భాగమంతా లేత నీలిరంగులో ఉంటుంది.

ఉపుపిడె కుటుంబము (Family Upupidae) మన దేశంలో ఈ కుటుంబానికి ఒకే ఒక ప్రతినిధి ఉంది. అది కొండె పిట్ట (Hoopoe — Upupa Epops — పటము 58 – హిందీ: హూధూద్). దీనినే కూకుడు గువ్వ, అన్నాపిట్ట అని కూడ పిలుస్తారు. ఈ పక్షి జింకరంగు కలిగి ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. దీని వీపుమీదా, రెక్కలమీదా, తోకమీదా నల్లని, తెల్లని, జీబ్రా చారలుంటాయి. దీని తలమీదా గుండ్రని, విసనకఱ్ఱలాంటి శిఖ ఉంటుంది. అది ఈ శిఖను ముడుచుకోగలదు. తిరిగివిస్తరింప జేయకలదు. దీని ముక్కు పొడుగ్గా, సన్నగా, కొంచెం వంగి ఉంటుంది. ఈ గుర్తులను బట్టి ఈ పక్షిని సులువుగా పోల్చుకోవచ్చును. ఈ పక్షి సుమారు మైనగోరంత ఉంటుంది. కొండెపిట్టలు జతలు జతలుగా గాని, లేదా చిన్న చిన్న గుంపులుగా గాని సంచరిస్తాయి. పచ్చిక బయళ్లూ, తోటలూ, తోపులూ, గ్రామ సమీపాల్లోని చిట్టడవులూ అంటే ఈ పక్షికి చాలా ఇష్టం. పట్టణాల, గ్రామాల పొలిమేరలలో ఈ పక్షులు తరచుగా కనపడతాయి. ఈ పక్షులు నేలపైన వాటి పొట్టికాళ్లతో నడుస్తాయి; పరుగెత్తుతాయి కూడాను. పురిడిపిట్ట (Quail) లాగ ఇది ఊగుతూ నడుస్తుంది. ఇలా నడిచేటప్పుడది ముక్కును పట్టుకారులాగ సగం తెరుచుకొని నేలను రాలిన ఆకులను చురుకుగా శోధిస్తుంటుంది. అది ముక్కుతో నేలను తవ్వేటప్పుడు దాని శిఖను తల వెనుకకు లాక్కుంటుంది. అప్పుడా శిఖ, దాని

లోని ఈకలు మొనదేలి ఉండటంచేత చూడడానికి ఒక పిక్కాసు (Pick-axe) లాగ ఉంటుంది. భయం, తత్తరపాటు కలిగినపుడది దాని శిఖను విసన కర్రలాగ విప్పుతుంది. ఈ పక్షి పైకి క్రిందికి డోలాయమానంగా కొంత దూరం ఎగిరివెళ్లి అక్కడ మళ్లీ వ్రాలుతుంది. అలా వాలిన వెంటనే అది దాని శిఖను పైకెత్తుతుంది. అది "హూ - పో" లేదా "హూ - పో - పో" అంటూ మృదువుగానూ, శ్రావ్యంగానూ, పదే పదే కూస్తుంది. ఇలా ఉండి ఉండి తరుచుగా 10 నిమిషాలవరకూ కూస్తూనే ఉంటుంది. కూసేటప్పుడు అది దాని ముక్కు రొమ్ముకు అంటి పెట్టుకొనేటట్లుగా, దాని తలను వంచి వ్రేలాడవేస్తుంది. ఒక్కొక్కప్పుడు కూత కూతకూ మొరుగుతున్నట్లు తలను ముందుకు ఎగరవేస్తూ, శిఖను ఎత్తి దించుతూ ఉంటుంది. ఈ హూ - పో పిలుపు కూత లేకాక దీనికి పలురకాల కరుకైన 'కా - కా' లూ, బడాయి నవ్వులూ కూడా ఉంటాయి. వ్యవసాయదారునికి హానిచేసే కీటకాలూ, కీటకాల లార్వాలూ, కోశస్థాలూ కొండెపిట్ట ఆహారం. కనుక ఈ పక్షులు మానవునికి చాల ఉపయోగకారులు. గోడకున్న కన్నంలోనూ, ఇంటి కప్పులోనూ, ఇంటిచూరులోనూ, చెట్లతొర్రలలోను ఇది వికారమైన గూటిని నిర్మిస్తుంది. దానిలో రోతపుట్టే గుడ్డ ముక్కలను, వెంట్రుకలను, ఎండు గడ్డిని, చెత్తా చెదారాన్ని ఉంచుతుంది. దీని గూడు దుర్గంధానికి పేరు పొందింది. గూటిలో అయిదారు గ్రుడ్లు పెడుతుంది. అవి తెల్లగా ఉంటాయి. కాని పొదిగిన కొలదీ మాసిపోయి, వివర్ణమైపోతాయి.

ఈ వర్గంలోని ఆఖరి కుటుంబం బ్యూసెరొటిడె — చుప్పనాతులు (Family Bucerotidae — Hornbills). ఇవి పండ్లను తిని చెట్లమీద నివసించే పెద్ద పక్షులు. వీటికి విలక్షణమైన పెద్ద ముక్కులుంటాయి.

బట్టచుప్పనాతి (Malabar Pied Hornbill-Anthracoceros Coronatus) పటము 59 —హిందీ : ధన్‌చరి. ఈ కుటుంబానికి చక్కని ఉదాహరణం. ఇది మాలగద్దకన్న కొంచం పెద్దది; ముఖ్యంగా నలుపూ, తెలుపూ రంగులలో ఉంటుంది. పొడుగ్గానూ, వెడల్పుగానూ ఉన్న దాని నల్లని తోకలోని వెలుపలి ఈకలు మాత్రం పూర్తిగా తెల్లగా ఉంటాయి. పసుపూ, నలుపూ రంగులలో కొమ్ములాగున్న బరువైన ముక్కూ దానిమీద బల్లపరుపైన ప్రక్కలు కలిగి, మొనదేరిన త్రాణము ఈ పక్షికున్న వింతలక్షణం. చాల వరకు దీనిలాగే ఉండే పెద్ద చుప్పనాతి (Large Pied Hornbill—A. Mala-

baricus) కి దీనికి ఈ ముక్కే తేడా. పెద్ద చుప్పనాతి తోక వెలుపలి ఈకలు నల్లగా ఉంటాయి ; వాటి కొనలు మాత్రం తెల్లగా ఉంటాయి. అదీ కాకుండా పెద్ద చుప్పనాతి నాశికాత్రాణము యొక్క ప్రక్కలు బల్లపరుపుగా నుండక, ఉబ్బెత్తుగా ఉంటాయి. ఇది ఉత్తరాన కూమన్ నుండి అస్సాం వరకూ ఎక్కువగా సంచరిస్తుంది. మలబారు జాతి చుప్పనాతులలో ఆడుదాని కంటి చుట్టూ ఉన్న ఈకలు లేని చర్మభాగం తెల్లగా ఉంటుంది. ఈ జాతిలో ఆడు పక్షికీ మగపక్షికీ ఇదే తేడా.)

అన్ని చుప్పనాతులకూ ఇంచుమించు ఒకే రకమైన అలవాట్లుంటాయి. అక్కడక్కడా మర్రి, రావి మొదలైన అత్తిజాతి వృక్షాలున్న ప్రదేశాలలో అవి సాధారణంగా నివసిస్తాయి. ఏలన ఈ వృక్షాల ఫలాలు వీటికి ముఖ్యాహారం. అప్పుడప్పుడూ అవి తొండలనూ, ఎలుక జాతి జంతువులనూ, పక్షుల పిల్లలనూ కూడా తింటుంటాయి. ఈ పక్షులు గుంపులు గుంపులుగా ఉంటాయి. చెట్టునుండి చెట్టుకి ఈ గుంపులు 'నాయకుని అనుసరించు' అను పద్ధతిలో సూటిగా కాక పైకీ క్రిందికీ ఎగురుతూ సందడి చేసికొంటూపోతాయి. ఇలా ఎగిరేటప్పుడవి కొన్నిసార్లు రెక్కలను కొట్టి వెంటనే రెక్కలను కొట్టకుండా రెక్కలలోని ప్రైమరీ ఈకలను పైకెత్తి గాలిలో క్రిందికి కొద్దిగా జారుతాయి. ఈ పక్షులన్నింటికీ పలురకాల గద్గదమైన బొబ్బలూ, అరుపులూ, కీచుకీచులూ ఉంటాయి. వీటి సంతాన పోషణపుటలవాట్లు అద్వితీయంగా ఉంటాయి. ఆడు పక్షిని చెట్టుతొర్రలో ఉంచి, మగపక్షి దాని రెట్టలను సున్నంగానూ, ముక్కును తాపీగానూ ఉపయోగించి, ఒక చిన్న సందు మాత్రం ఉంచి, గోడకట్టి ఆ తొర్రను మూసేస్తుంది. గ్రుడ్లను పొదగడం పూర్తి అయేవరకు ఆడుపక్షికి మగపక్షి ఆహారం పెడుతుంది. గ్రుడ్ల నుండి పిల్లలు బైటకు వచ్చిన తరువాత మగపక్షి ఆ గోడను బ్రద్దలుకొట్టి ఆడుపక్షిని విడుదల చేస్తుంది. అప్పటినుండీ రెండు పక్షులూ కలిసి శ్రమపడి పిల్లలను పోషిస్తాయి. ఈ కుటుంబంలోని చాల పక్షులలాగే, చుప్పనాతికూడ మార్చి–జూనుల మధ్య అనగా వర్షకాలం ప్రారంభించక మునుపే గూళ్ళను నిర్మిస్తాయి. గూటిలో 2 లేక 4 గ్రుడ్లుంటాయి. పెట్టిన వెంటనే అవి తెల్లగా ఉంటాయి. కాని పొదిగేకాలంలో అవి మురికైపోతాయి.

పిసిఫార్మిస్ వర్గం (Order PICIFORMES): - ఈ వర్గంలో కేపిటోనిడె - కంసాలి పిట్టలు (Capitonidae — Barbets), పిసిడె — వడ్రంగి పిట్టలు (Picidae — Woodpeckers) అను కుటుంబాలున్నాయి. కంసాలి పిట్టలు చాలావరకు ప్రకాశమైన రంగులో ఉంటాయి కాని అవి పొట్టిగా, మోటుగా ఉంటాయి. ఇవి పళ్లు తింటూ చెట్లమీద నివసించే పక్షులు. వీటి ముక్కులు పెద్దవిగా, బరువుగా ఉంటాయి. వీటి ముక్కుల పీఠ భాగాన చుట్టూ బిరుసైన ముండ్లవంటి ఈకలుంటాయి.

కంసాలిపిట్ట లేక ఎరుపు రొమ్ము కంసాలిపిట్ట (Coppersmith or Crimsonbreasted Barbet — Megalaima Haemacephala) — పటము 60 - హిందీ : ఛోటా బసంతా. దీనినే కమ్మరిపిట్ట అని కూడా పిలుస్తారు. ఇది కేపిటోనిడె కుటుంబానికి చక్కని ఉదాహరణం. ఇది పిచ్చుక కన్న కొంచెం పెద్దదిగానూ, పొట్టిగానూ ఉంటుంది. ఇది బరువైన ముక్కు గల ఆకు పచ్చని పక్షి. దీని రొమ్మూ, నుదురూ ఎఱ్ఱగానూ, గొంతు పసుపుపచ్చ గనూ ఉంటాయి. క్రింది భాగాలు లేత పసుపురంగుగా ఉండి వాటిపైన ఆకు పచ్చని చారలుంటాయి. ఈ పక్షి ఎగిరేటప్పుడు మొండిగా ఉన్న దాని పొట్టి తోక త్రిభుజాకారంగా కనబడుతుంది. దీని ముఖ్యాహారాన్ని సర ఫరా చేసే మఱ్ఱి, రావివంటి అత్తిజాతి పెద్ద ఫల వృక్షాలుంటే చాలు కంసాలి పిట్టలు ఊరి వెలుపల ఉన్న అడవిలోనైనాసరే, సందడిగా ఉన్న నగర మధ్యంలోనైనా సరే, హాయిగా జీవిస్తాయి. ఆ చెట్లమీద ఉండే మైనగోరలు, పికిలిపిట్టలు, పచ్చపావురాలు, చుప్పనాతులు మొదలైన ఫల భక్షకాలతో కలిసి ఒక్కొక్కప్పుడు అధిక సంఖ్యలలో ఈ కంసాలిపిట్టలు విందారగిస్తూంటాయి. అవి చెట్టుకొమ్మ నుండి గాలిలో కెగిరి వికృతంగా దాడిచేస్తూ శలభాలనూ, ఇసుళ్లనూ పట్టుకొని భక్షిస్తాయి. అవి ఎల్లప్పుడూ చెట్లమీదనే ఉంటాయి ; క్రిందికి దిగవు. టూక్ - టూక్ - టూక్ అంటూ బిగ్గరగా ఉండే వీటి కూతలు విసుగు పుట్టిస్తాయి. కంసాలిపిట్ట రోజంతా ఆపకుండా రెండేసి సెకనుల కొకసారి ఈ కూత కూస్తోనే ఉంటుంది. ఈ కూతను మనవాళ్లు దూరాన కంసాలి దాగలి మీద సుత్తితో కొట్టినప్పుడు పుట్టే శబ్దంతో సరిగ్గా పోల్చారు. గ్రామసీమలలో మనకు వినవచ్చే పక్షుల కంఠ ధ్వనులలోకెల్ల కంసాలిపిట్ట కూత మనకు బాగా పరిచితమైనది. ఈ కూతలను కూసేటప్పుడది తలను ప్రక్కలకు తాటిస్తుంది. అందువలన దీని

కూత చిత్రంగా అది యున్నచోటునుండి కాక వేరొక స్థలంనుండి వస్తున్నట్లు వినపడుతుంది. ములగవంటి చెట్లలో శిథిలమవుతున్న మెత్తని దారువుగల కొమ్మలను తగు మాత్రం ఎత్తులో కంసాలిపిట్టలు దొలిచి కన్నాలుచేసి వాటిలో గ్రుడ్లను పెడతాయి. గూటిలో అస్తరుండదు. గూటిలో సాధారణంగా 3 గ్రుడ్లుంటాయి. అవి కాంతి విహీనమైన తెలుపురంగులో ఉంటాయి. వాటి మీద చుక్కలు కాని గీతలు కాని ఉండవు.

బాగా వ్యాప్తి చెందిన మరొక కంసాలి పిట్ట ఉంది. అది ఆకుపచ్చగా రక్షక వర్ణంలో ఉండటం చేత అడవులలో తరుచుగా దాని కూత వినపడుతుంది కాని అది కనబడదు. దానిని పెద్ద ఆకుపచ్చ కంసాలిపిట్ట (Large Green Barbet — M. Zeylanica) అంటారు. ఇది సుమారు మైనగోరంత ఉండే ఆకుపచ్చని పక్షి. దీని తలా, మెడా లేత గోధుమరంగులో ఉంటాయి. దీని కళ్లచుట్టూ ఈకలు లేని చర్మంమీద నారింజరంగు మచ్చ ఉంటుంది. ఇది "కుట్రూ, కుట్రూ" అంటూ గట్టిగా కూస్తూన్నపుడు అడవి అంతా దీని కూతతో ప్రతిధ్వనిస్తుంది.

(భారత ఉపఖండంలో వడ్రంగి పిట్టలు బాగా వ్యాప్తి చెందియున్నాయి. మానులను దొలిచే పెంకు పురుగుల లార్వాలనూ, చెట్లకు హానిచేసే ఇతర కీటకాలనూ భక్షించి ఈ జాతి పక్షులు అడవులకెంతో మేలు చేస్తూన్నాయి. వాటికి ప్రత్యేకమైన ఉలివంటి ముక్కు, ముక్కును మించి ముందుకు విసరడానికనువైన కొనను ముండ్లు గలిగినట్టి క్రిమివంటి నాలుక కలవు. వీటి సహాయంతో అవి మానుల రంధ్రాలలోనూ, కీటక కోశాలుండే సొరంగాల లోనూ ఉన్న పురుగులను బైటకు లాగుతాయి.

వడ్రంగి పిట్ట (Mahratta Woodpecker — Picoides Mahrattensis)- పటము 61 - హిందీ : కట్ ఫోరా (అన్ని వడ్రంగి పిట్టలు): దీనినే 'చిన్న చిరుత' అని 'మాను ఓటు పక్షి' అనికూడా పిలుస్తారు. వడ్రంగి పిట్ట లలో కెల్ల ఇది మనకు ఎక్కువగా తెలిసిన పక్షి. ఇది పిగిలిపిట్టంత చిన్న పిట్ట. దీని ముక్కు పొడుగ్గా, లావుగా, కొనదేరి ఉంటుంది. దీని తోక బిరుసుగా గసిగలాగుంటుంది. పైవైపున్న ఈకలకు నలుపూ, తెలుపూ చుక్కలుంటాయి. ఈ పక్షి నుదురు గోధుమ కలిసిన పసుపురంగులోనూ, శిఖరక్తవర్ణంలోనూ ఉంటాయి. దాని క్రింది భాగాలు తెల్లగా ఉంటాయి. రొమ్ము మీదా, పార్శ్వముల మీదా గోధుమరంగు చారలూ, పొత్తి కడుపు

మీదా, తోక క్రిందా రక్తవర్ణపు మచ్చా ఉంటాయి. ఆడుపక్షి నడినెత్తికి మాత్రం రక్తవర్ణం ఉండదు. ఆకులు రాల్చే చెట్లుగల అరణ్యాలలోనూ, మామిడి తోపులలోనే గాక, తుప్పలూ, పొట్టి చెట్లూగల నిర్జల ప్రదేశాలలో కూడా మహారాష్ట్ర వడ్రంగిపిట్ట తరుచుగా సంచరిస్తుంది. ఈ పక్షులు సాధారణంగా జతలు జతలుగా ఒక చెట్టుమ్రాను నుండి మరియొక చెట్టు మ్రానునకు ఎగిరి వెడుతుంటాయి. ఈ పక్షి మ్రానుకు బాగా క్రింది భాగాన మొదట వ్రాలి, గున గునలాడుతూ, తిన్నగా గాని, మెలికలు మెలికలుగా గాని అంచెలు అంచెలుగా పైకెక్కుతూ మధ్య మధ్య ఆగి, బెరడును తట్టుతూ, దాగియున్న కీటకాలకై కాండపు కన్నాల్లోకి తొంగి చూస్తూ ఉంటుంది. అది దాని బిరుసైన, కొనదేలిన తోకను కాండమునకు అదిమి పెట్టి దానిని త్రిపాదిలో ఒక పాదంగా ఆధారం చేసికొంటుంది. ఈ పక్షి ఆహారం కీటకాల లార్వాలూ, చీమలూను. అది కొనను ముళ్లుగల నాలుకను చాచి, దానిని మ్రానుపైనున్న బీటలలోకి, కన్నాలలోకి జొన్పి అచ్చటనున్న కీటకాలను, వాటి లార్వాలను దానికి అంటించుకొని వాటిని మ్రింగివేస్తుంది. ఈ పక్షి సాధారణంగా 'క్లిక్, క్లిక్' అని గాని 'కిక్ - ర్ - ర్ - ర్' అని గాని తీక్ష్ణంగా కూస్తుంది. అన్ని వడ్రంగి పిట్టలలాగే ఇది కూడా త్వరగానూ, సూటిగా కాక పైకి క్రిందికీ ఎగురుతూనూ పోతుంది. అలా ఎగిరేటప్పుడు వరుసగా రెక్కలను కొడుతూ, మధ్య మధ్య రెక్కలను కదల్చకుండా ఆపుతూ పోతుంది. భూమికి తగు మాత్రం ఎత్తులో, కొమ్మలను వాటి ముక్కులతో దొలిచి, రంధ్రాలు చేసి, ఆ రంధ్రాలను ఈ పక్షులు గూళ్లుగా ఉపయోగించుకొంటాయి. కొమ్మ క్షితిజ సమానాంతరముగా ఉంటే, వర్షపు నీరు లోపలికి రాకుండా, గూటిలోనికి మార్గం కొమ్మ అడుగు భాగాన ఉండేట్లా ఈ పక్షి ఏర్పరుస్తుంది. దీని గూటి బొరియలో అస్తరేమీ ఉండదు. గూటిలో 3 గ్రుడ్లుంటాయి. అవి గుండ్రంగాను తెల్లగా నిగ నిగ మెరుస్తూను ఉంటాయి.)

బంగారు వీపు వడ్రంగి పిట్ట (Goldenbacked Woodpecker — Dinopium Benghalense): ఈ జాతి కూడా మన ద్వీపకల్పంలో సామన్యంగా కనపడే జాతే. ఇది మహారాష్ట్ర వడ్రంగి పిట్టకన్నా పెద్దది. దీని పైభాగం బంగారు పసిమీ, నలుపూ ఛాయలలో ఉంటుంది; క్రింది భాగం మాసిన పసుపు కలిసిన తెలుపురంగులో ఉంటుంది. అందుపైని నల్లని చారలు

కూడా ఉంటాయి. మగపక్షికి శిఖతోపాటు తల అంతా ఎర్రగా ఉంటుంది. ఆడుపక్షిలో తల పూర్తిగా కాక కొంతవరకు మాత్రమే ఎర్రగా ఉంటుంది. ఈ జాతి వడ్రంగి పిట్టలు కూడ గ్రామాలలో తోపులలోనూ, తోటలలోనూ, చిట్టడవులలోనూ ఉంటాయి.

పెస్సరిఫార్మిస్ వర్గం (Order PASSERIFORMES) : భారత దేశంలో ఉండే పక్షిజాతుల మొత్తం సంఖ్యలో రమారమీ మూడవవంతు ఈ వర్గానికి చెందుతాయి. జనసామాన్యం ఈ పక్షులను కూర్చొనే పక్షులు లేక పాటపాడు పక్షులని వ్యవహరిస్తుంది. బాహ్యదృష్టికి విరుద్ధ లక్షణాలు గల పెక్కులు కుటుంబాలు ఈ వర్గంలో చేరతాయి. కాని ఈ పక్షుల నిర్మాణంలో కాలికీ, పాదానికీ చెందిన స్నాయువులు, కపాలము, అంగుడు, పక్షులలో స్వరాన్ని పుట్టించే అవయవమైన 'సిరింక్స్' అనగా శ్వాసనాళపు క్రింది చివరిభాగం నిర్దిష్టంగా కనబడతాయి. ఈ వర్గానికి చెందిన కొన్ని ముఖ్యమైన కుటుంబాలూ, వాటిలో మనకు బాగా పరిచయమైన కొన్ని పక్షులను గురించి ఇక్కడ తెలిసికొందాం.

పిట్టిడె కుటుంబం—పొన్నంగులు (Family Pittidae – Pittas) : వీటిని 'ఏన్టు థ్రష్‌లు' (Ant Thrushes) అనికూడా అంటారు. ఇవి నేలమీద సంచరించే పక్షులు; కాంతిమంతములైన రంగులతో ప్రకాశిస్తుంటాయి. కీటకాలూ, కీటకాల లార్వాలూ వీటి ఆహారం. ఈ ఆహారం కొరకు తడిమట్టినీ, కుళ్లుచున్న గడ్డినీ వాటి బలిష్ఠమైన ముక్కులతో పెల్లగిస్తూ అడవులలో నేలమీద ఈ పక్షులు నివసిస్తాయి. ఈ పక్షులకు బలిష్ఠములైన పొడుగుపాటి కాళ్లున్నాయి. ఈ కాళ్లతో అవి థ్రష్‌లలాగ దుముకుతూ నడుస్తాయి. అవి కలవరపెడితే తప్ప సాధారణంగా ఎగురవు. ఒకవేళ అవి ఎగిరినా స్వల్ప దూరం మాత్రమే ఎగురుతాయి. అయితే చాల దూరం వలసపోయే జాతులుకూడ కొన్ని ఈ కుటుంబంలో లేకపోలేదు.

పొన్నంగి (Indian Pitta—Pitta Brachyura)— పటము 62 – హిందీ : నౌరంగ్ : ఇది గోరువంక అంత ఉంటుంది. దీని తోక పొట్టితోక. ఇది ఆకుపచ్చ, నీలి, ఎరుపు కలిసిన పసుపు, నలుపు, తెలుపు –

చిత్రాతి చిత్రములైన రంగులలో ఆడంబరంగా ఉంటుంది. దీని పొత్తి కడుపు, తోక క్రింది భాగము ఎఱ్ఱగా ఉంటాయి. అది ఎగిరేపట్పుడు రెక్కల కొనను తెల్లని, గుండ్రటి మచ్చ సుస్పష్టంగా మెరుస్తూంటుంది. కాలువలు, కొండ చరియలు, కీకారణ్యములు అంటే దీనికెంతో ఇష్టం. జననివాసాలకు దగ్గరగానూ, దూరంగానూ కూడా ఇవి కనపడతాయి. ఇది నేలమీదనే సంచరించు పక్షి అయినప్పటికీ రాత్రులందు చెట్లపై నిద్రపోతుంది. త్రష్ వలెనే ఇది నేలమీద పొడుగుపాటి గంతులువేస్తూ ముందుకు పోతుంది. అలా గెంతేటప్పుడు అది ఎండుటాకులను తిరగవేస్తుంది. లేదా వాటిని ప్రక్కలకు లాగి పారవేసి ఆహారం కోసరం ముక్కుతో నేలను త్రవ్వుతుంది. దాని పొటితోకనది పైకీ క్రిందికీ కావాలని మెల్లగా ఆడిస్తూంటుంది. దానిని బెదిరిస్తే ఈ పక్షి క్రిందుగా నున్న చెట్టుకొమ్మ మీదకు ఎగిరి వెళ్లి బెదురు తగ్గగానే నేలమీదకు దిగి, తిరిగి ఆహారాన్వేషణలో పడిపోతుంది. ఇది సామాన్యంగా కూసే కూత 'పిట్ - ట్యూ' అనే స్పష్టమైన జంట ఈల. ఈ కూతను అది ముఖ్యంగా తెల్లవారుజామున, సందెచీకటి వేళలందే కాక, ఆకాశము మేఘావృతమైనపుడు కూడ కూస్తుంది. ఈ కూతను అది నేలపై నుండి కాని, కొమ్మపై నుండి కాని 10 సెకనులకు 3 - 4 కూతల చొప్పున సారెకు అయిదు నిమిషాలకు పైగా ఒక్క బిగిని అలా కూస్తూనే ఉంటుంది. ఈ పక్షి కూసేటప్పుడు నిట్టనిలువుగా నిలబడి, నీళ్లు మ్రింగేదానిలాగ తలను వెనుకకు నెట్టి మరీ కూస్తుంది. తరచుగా మూడు నాలుగు పక్షులు పలువైపులనుండి ఒకదాని కొకటి జవాబుగా కూస్తో ఉంటాయి. పొన్నంగి పిట్ట దాని గూటిని గోళాకారంలో సన్నని రెమ్మలు, పచ్చగడ్డి, వేళ్లు, ఎండుటాకులు మొదలైన వాటితో నిర్మిస్తుంది. ఆ గూటి ప్రక్కను గుండ్రంగా ప్రవేశ మార్గం ఉంటుంది. అది దాని గూటిని పొట్టి చెట్టు పలపలో కడుతుంది. అప్పుడప్పుడు ఏదైన పొదక్రింద నేలమీద కూడా గూడు కట్టడం కలదు. గూటిలో 4 మొదలు 6 వరకూ గ్రుడ్లు నిగనిగలాడుతూ చైనా తెలుపులో ఉంటాయి. వాటిమీద మాసిన నీలారుణ వర్ణంలో చుక్కలు, మచ్చలు, వెంట్రుకవాసి రేఖలూ ఉంటాయి.

అలాడిడె కుటుంబం — భరతపిటలు (Family Alaudidae - Larks): ఇవి తరచుగా సంఘాలుగా గూడి, నేలపై సంచరించే చిన్న పక్షులు. వీటి ఈకలు గోధుమ, బూడిద, ఇసుక, నలుపు, తెలుపు - రంగుల కలయికలో

ఉంటాయి. కనుక ఈ పక్షులు వాటి ఆవరణంతో కలిసిపోయి ఉండటం చేత నిదానంగా చూస్తేతప్ప, కనపడవు. కొన్ని జాతులకు శిఖలుంటాయి. ఇవి చెట్లూచేమాలేని ఆరుబయళ్లలోనూ, పసిరిక నేలల్లోనూ నివసిస్తాయి. కొన్నిరకాలు వలసపోతాయి; తక్కినవి ఎల్లప్పుడూ స్థానికంగా ఉండేవే. భరత పిట్టలు చాలవరకు గాలిలో తేల్తూ హాయిగా పాడుతాయి.

చందోళి (The Crested Lark — Galerida Cristata)— పటము 63— హిందీ: చందూల్: ఈ పక్షి పిచ్చుకకన్న కొంచెం పెద్దది. దీని తలమీద నిట్టనిలువుగా, కొనదేలిన శిఖ స్పష్టంగా కనపడుతుంది. ఈ శిఖను బట్టి ఈ పక్షిని సులభంగా గుర్తింపవచ్చును. ఈ పక్షి పైభాగం బూడిద, గోధుమ రంగులలో ఉంటుంది; లేత నలుపు చారలుకూడా ఉంటాయి; క్రింది భాగం ఇసుకరంగులో ఉంటుంది. రొమ్ముమీద గోధుమరంగు చారలుంటాయి. వీటిని విడివడిన జతలుగాగాని, నాలుగైదు కలసియున్న కుటుంబపు పార్టీలుగా గాని సాధారణంగా చూస్తూంటాం. ఇవి నిర్జల క్షేత్రాలలో ఆహారాన్ని వెతుక్కొంటూ, పరుగెత్తుతూ ఉంటాయి. పచ్చగడ్డి, కలుపుమొక్కల గింజలు, చిన్న పెంకుపురుగులు, ఇతర కీటకాలూ చందోళి ఆహారం. అప్పుడప్పుడీ పక్షి ఏ మట్టి పెల్లనో, రాతినో ఎక్కి శ్రావ్యంగా మనసు ద్రవించేటట్లు ఈల కూతలు కూస్తుంది. అది సామాన్యంగా 'టీయూర్' అంటూ మనకు హాయి కలిగేటట్లు కూస్తుంది. గ్రుడ్లను పెట్టే కాలంలో మగపక్షి గాలిలో పైకి కొన్ని మీటర్ల ఎత్తుకుపోయి, కొంత మేరలో నిర్లక్ష్యంగా ఎగురుతూ, సాధువుగా కూస్తుంది. తాపీగా రెక్కలను కొట్టుకొంటూ చిన్నపాటను హాయిగా పాడి, పిమ్మట రెక్కలను చాపి వాటిని కొద్దిగా ప్రకంపింపచేస్తూ ఏరాతి మీదకో, మంటిపెల్ల మీదకో దిగిపోతుంది. ఉల్లాసంగా, ఓర్పుతో పాడే భరద్వాజ పక్షి (Skylark) మధురగీతి లాగుండదు చందోళీ పాట. చందోళీ పాట భరద్వాజ పక్షి పాటంత సొగసుగాను, దీర్ఘంగాను ఉండక పోయినప్పటికీ దానిని పంజరంలో పెట్టి పెంచుతారు. అది పంజరపు పిట్టగా పేరు పొందింది. అది చెఱలో బాగా పెరుగుతుంది. అది గడ్డిపోచలతో, ఒక లోతైన గిన్నెలాగ గూడు కడుతుంది. దానిలో తల వెంట్రుకలను, అటువంటి సన్నని పదార్థాలను అస్తరుగా ఉంచుతుంది. బయలు ప్రదేశంలో నేలమీద ఏ గడ్డిదుబ్బు మొదట్లోనో లేదా మట్టిపెల్ల చాటునో ఈ గూటిని నిర్మిస్తుంది. గూటిలో మూడు నాలుగు గ్రుడ్లుంటాయి.

అవి పసుపు కలిసిన తెలుపు రంగులో కాంతి విహీనంగా ఉంటాయి. వాటి మీద ఊదారంగు మచ్చలు, గోధుమరంగు మచ్చలు ఉంటాయి.

చందోళికన్న చిన్నవి, ఎరుపు కలిసిన గోధుమ రంగువి, శిఖగలవి మరో రెండు భరత పిట్టలు భారత ద్వీపకల్పంలో విరివిగా కనపడతాయి. అవి సైక్సు క్రెస్టెడ్ లార్కు (Sykes's Crested Lark — Galerida Deva) మలబారు క్రెస్టెడ్ లార్కు (Malabar Crested Lark—G. Malabarica) అనునవి. సైక్సు క్రెస్టెడ్ లార్కుకు రొమ్ముమీద కొన్ని సన్నని చారలుంటాయి. మలబారు క్రెస్టెడ్ లార్కుకు రొమ్ముమీద పెక్కులు వెడల్పైన చారలుంటాయి.

అంబలి జోరిగాడు (The Ashycrowned or Blackbellied Finch-Lark—Eremopterix Grisea) — పటము 64 - హిందీ: దియొరా, దూరి లేక జోత్రాలీ: ఇది జీనువాయి లేక తూటిపిట్ట (Finch) వంటి పొట్టి పక్షి; పిచ్చుక కన్న చిన్నది. మగ పక్షికి పైభాగం ఇసుక చాయలోనూ, క్రింది భాగం నల్లగానూ ఉంటాయి. దాని తల బూడిదరంగులో ఉంటుంది. దాని దవుడలు స్ఫుటంగా తెల్లగా ఉంటాయి. ఆడుపక్షి శరీరమంతా ఇసుక రంగులో ఉంటుంది. అంబలి జోరిగాడు అక్కడక్కడ జతలు జతలుగా గాని చిన్న గుంపులుగా గాని సేద్యపు మైదానాలలోనూ, బంజరు భూములలోనూ కూడా కనపడుతుంది. దీని శరీరచ్ఛాయ అది ఉండే నేలతో అద్భుతంగా మేళవిస్తుంది. అందుచే ఈ పక్షి సులభంగా కంటికి కనపడదు. వీటి ఆహారమైన గడ్డిగింజలూ, ధాన్యాలూ, కీటకాలూ మొదలైనవాటిని నేలపై వెతుక్కొంటూ ఈ పక్షులు ఆగి ఆగి, యిటూ అటూ ప్రక్కలకు తిరుగుతూ, అడుగులు వేసుకొంటూ పోతాయి. ఇది వరుసగా రెక్కలను కొట్టుకొంటూ మధ్య మధ్య కొంచెంసేపు రెక్కలను కదల్చకుండా నిలిపి ఉంచుతూ గాలిలో ఎగురుతుంది. మగపక్షి చాల మనోహరంగా చిన్న పాటను సాగతీసి కొంటూ పాడుతుంది. పెంటిని ఆకర్షించడానికి అది గాలిలో వేడుకగా విన్యాసాలు చేసేటప్పుడేకాక, నేలమీద నున్నపుడు కూడ పాడుతుంది. అంబలి జోరిగాడు రెక్కలు కొట్టుకొంటూ 30 మీటర్లకు పైగా ఆకాశంలోకి నిట్టనిలువుగా శరవేగంతో పోతుంది; తరువాత రెక్కలను ప్రక్కలకు లాక్కొని ముక్కును క్రిందికి పెట్టి నిట్రటంగా కొంత దూరం క్రిందికి దిగుతుంది. మళ్లీ వెంటనే ఆ ఉద్వేగాన్ని వినియోగించుకొంటూనే వెనక్కు

మళ్లీ, ఆకాశం వైపు ముఖం పెట్టి కొన్నిమార్లు త్వరత్వరగా రెక్కలను కొట్టి, మళ్లీ రెక్కలను మూసివేసి మరికొన్ని మీటర్లు పైకి దూసుకు పోతుంది. అలా తరంగ శిఖరాన్ని చేరుకొన్న తరువాత రివ్వుమని వెనక్కి తిరిగి, మళ్లీ ముక్కుతో సూటిగా క్రిందికి దిగుతుంది. ఈ విధంగా అది క్రమక్రమంగా ఆరోహావరోహణలు సాగిస్తూ, చూచేవాళ్లు విస్మయం పొందేటట్లు భూమిమీదకు గభీలుమని దిగుతూ రాతిమీదనో, మట్టి పెల్ల మీదనో వ్రాలుతుంది. అది అలా క్రిందికి దిగుతున్నపుడల్లా మధురగీతిని ఆలాపిస్తోనే ఉంటుంది. ఈ పక్షి ఇలా ఎగురుతో, పాడుతో కాలక్షేపం చేస్తుంది. అది గాలిలో మంచి అభినివేశంతోనూ, త్రాణతోనూ అమితంగా జరిపే విన్యాసాలు చూచేవారికి ద్విగుణీకృతమైన విభ్రాంతిని కలుగ చేస్తాయి. ఈ చిన్న భరతపిట్ట బయలు ప్రదేశంలో ఏదైనా మట్టి పెల్ల చాటునో, చిన్న పొదచాటునో నేలమీద మూకుడులాగ పల్లంచేసి చిన్న గూటిని నిర్మిస్తుంది. దానిలో పచ్చగడ్డి, వెంట్రుకలు, ఈకలు ఉంచి అస్తరు ఏర్పరుస్తుంది. తరచుగా అది ఈ గూటి చుట్టూ గులకరాళ్లతో ఒక చిన్న గోడకూడ నిర్మిస్తుంది. గూటిలో రెండు మూడు గ్రుడ్లుంటాయి. అవి లేత పసుపు లేక బూడిద తెలుపురంగుల కలయికలో ఉంటాయి. వాటిమీద బూడిదరంగు మచ్చలు, లవండరు రంగు చుక్కలు ఉంటాయి.

హిరండినిడె కుటుంబం (Family Hirundinidae): వానకోవెలలు (Swallows), మార్టినులు (Martins), ఈ కుటుంబంలోకి వస్తాయి. ఇవి గుంపులుగా జీవించే పక్షులు. బాహ్యదృష్టి కవి చాతక పక్షులలా (Swifts) గుంటాయి. అవి నోరు తెరచుకొని ఎగురుతూ, ఎదురుగా వచ్చుచున్న కీట కాలను వేటాడి పట్టుకొంటూ వాటి కాలంలో విశేష భాగం వెళ్లపుచ్చు తూంటాయి. వీటి రెక్కలు పొడుగ్గా కొనదేరి ఉంటాయి. కాని అవి చాతక పక్షుల రెక్కలకన్నా వెడల్పై, వంపు తగ్గి ఉంటాయి. చాల జాతులలో తోక బాగా చీలి ఉంటుంది. అవి చురుకుగానూ, సొగసుగానూ ఎగురు తాయి. కొన్ని జాతులు మన సరిహద్దులలోనే నివసిస్తూ ఉండి గ్రుడ్లు పెడతాయి. మరి కొన్ని పాతే ఆర్కిటిక్ ప్రాంతం నుండి మనదేశానికి వలస వచ్చి గ్రుడ్లు పెడతాయి.

ఎఱ్ఱ పిఱ్ఱల వానకోవెల (Redrumped Swallow—Hirundo Daurica) — పటము 65 — హిందీ: మస్జిద్ అబాబీల్: మనదేశపు వానకోవెల

పటము 65

ఎఱ్ఱపిట్టల వానకోవెల

(*Hirundo daurica*)

పు. 120





పటము 66

**పెద్ద కిఱితిగాడు (కసాయిపిట్ట)**

**(*Lanius excubitor*)**

పేజీ 122

పటము 67

**నల్లతల పంగాపండుపిట్ట**

(*Oriolus xanthornus*)

పేజి 128





పటము 68

నల్ల ఏట్రింత

(*Dicrurus adsimilis*)

పేజీ 125



పటము 69

మైనగోర

(*Acridotheres tristis*)

పేజి 127



పటము 70

బట్టమైన

(*Sturnus contra*)

పేజీ 128

పటము 71

కాకి

(*Corvus splendens*)

పుట 129





పటము 72

**గోకరాయి**

(*Dendrocitta vagabunda*)

పేజీ 131

పటము 78

పెద్ద ఫ్లేమ్ పిట్ట

(*Pericrocotus flammeus*)

పుట 132





పటము 71

**అయోరా**

(*Aegithina tiphia*)

పేజి 134

పటము 75

పచ్చపిట్ట

*(Chloropsis cochinchinensis jerdoni)*

పే. 185





పటము 76
ఎఱ్ఱమీసాల పిగిలిపిట్ట
(*Pycnonotus jocosus*)
పేజి 136



పటము 78

తెల్లచుక్కల తోకపిగిలిపిట్ట

(*Rhipidura albogularis*)

పేజీ 139



పటము 79

దేవలోకపుతోకపిగిలిపిట్ట

(*Terpsiphone paradisi*)

పుట 140



పటము 80

పచ్చకంటి సైదాపిట్ట

(*Chrysomma sinensis*)

పేజీ 142

జాతులలో మనకు బాగా పరిచితమైన వాటిలో ఇది యొకటి. ఇది సుమారు పిచ్చుకంత ఉంటుంది. తోక బాగా చీలి ఉంటుంది. దీని పై భాగం నిగనిగలాడే దట్టమైన నీలి - నలుపురంగులో ఉంటుంది. క్రిందిభాగం ఎరుపు–గోధుమ చాయగల తెలుపురంగులో ఉంటుంది. దానిమీద చక్కని ముదురు గోధుమరంగు చారలుంటాయి. దాని మెడ వెనుక చెస్నటు రంగు అర్ధమాలా, ఎగిరేటప్పుడు స్పష్టంగా కనబడే చెస్నటురంగు పిట్టలూ ఈ పక్షిని పోల్చుకోవడానికి మంచి గుర్తులు. భారతదేశ వాసియైన పైపక్షి జాతితోపాటు వలసవచ్చిన వానకోవెలలు కూడ, విశేష సంఖ్యలో మన భూభాగంమీద శీతాకాలం గడుపుతాయి. మైళ్ళకొలదీ వ్యాపించియున్న టెలిగ్రాఫ్ తీగలమీద ఈ పక్షులు వేలకొలదీ వరుసగా ఒకదాని ప్రక్క నొకటి కూర్చొని యుండగా మనం తరచు చూస్తూ ఉంటాం. ఈ వలస పక్షులకు అడుగుభాగాన ఉండే చారలు ఎక్కువ వెడల్పుగా ఉంటాయి; పిట్టలు మిక్కిలి లేత ఎరుపురంగులో ఉంటాయి. వలసపోని జాతికీ వలస పోయే జాతికీ ఇదే తేడా. గాలిలో మిక్కిలి ఎత్తుగాగాని లేదా ఇది నేలకు మిగుల దగ్గరగా గాని విసురుగా ఎగురుతూ, వానకోవెలలు చీకటి ఈగలనూ, మిగతా రెక్కలుగల కీటకాలనూ వేటాడుతూ రోజులో చాలా భాగం గడుపుతాయి. గ్రుడ్లను పెట్టే కాలంలో తప్ప, ఇతరకాలాల్లో చాతక పక్షులతోనూ, మార్టినులతోనూ పెద్ద మందలుగాకలిసి సంచరిస్తూ వేటాడుతూండటం మనం తరచుగా చూస్తూనే ఉంటాము. ఇవి రెల్లుమడులలోనూ, చెరకుతోటల లోనూ అసంఖ్యాకంగా చేరి నిద్రపోతాయి. ఆ మొక్కలు నీళ్లలో నిలబడి ఉంటే వాటికి మరీ మంచిది. అవి త్వరత్వరగా రెక్కలను కొట్టి వేగంగా కొంత ఎత్తు ఎగిరి, పిమ్మట రెక్కలను కొట్టడం మాని గాలిలో జారడం చూస్తూంటే ఎంతో ముచ్చటగా ఉంటుంది. గాలిలో దొరికే ఎరను పట్టుకోవడంలో ప్రక్కలకు తిరగడాని కైతేనేమి, మెలికలు తిరగడాని కైతేనేమి లోతుగా చీలియున్న దాని తోక ఎంతైనా ఉపకరిస్తుంది. గ్రుడ్లను పెట్టే కాలంలో కీచు కీచుమంటూ అవి పాడే పాట ఉత్సాహజనకంగా ఉంటుంది. ఎఱ్ఱపిట్టల వానకోవెల దాని గూటిని రిటార్టు రూపంలో బురదతో కడుతుంది. గూటిలోకి పోవడానికి సన్నని నాళాకారవు మార్గం ఉంటుంది. రాతిగుహా, మనుష్యులు నివసిస్తున్న ఇల్లు, రోడ్డు ప్రక్కనున్న మదుం — వీటిలో కప్పుకు అది గూటిని అంటిస్తుంది. బల్బు ఆకారంలో ఉండే దాని గ్రుడ్ల

గదిలో అది మెత్తదనం కోసరం ఈకల నుంచుతుంది. గూటిలో స్వచ్ఛమైన తెలుపురంగు కల గ్రుడ్లు మూడో, నాలుగో ఉంటాయి.

సామాన్యమైన వానకోవెల (The Common Swallow—H. Rustica). ఇది వలసవచ్చిన యూరోపియను. దీనిని శీతాకాలంలో ఎఱ్ఱపిట్టల వాన కోవెలతో కలిసియుండటం తరచుగా చూస్తాం. దీని పైభాగం నిగనిగ లాడుతూ ఉక్కులాగ నీలిగానో, లేదా ఊదాతో కలిసిన నీలిరంగులోనో ఉంటుంది; క్రింది భాగం వెలవెల పోతున్న గులాబీ తెలుపురంగులో ఉంటుంది. దీని నుదురూ, గొంతూ చెస్నటు వర్ణంలో ఉంటాయి. దాని గొంతుమీద చుట్టూ నిగనిగలాడే నల్లని రొమ్ముదార ఉంటుంది. ఈ పక్షికి కూడా లోతుగా చీలిన తోక ఉంటుంది.)

(లానీడె కుటుంబం (Family Laniidae): కిరితిగాళ్లు (Shrikes) ఈ కుటుంబానికి చెందుతాయి. వీటిని కసాయిపిట్టలు (Butcher Birds) అని కూడా పిలుస్తారు. కసాయిపిట్టలు పరిమాణంలో పిగిలిపిట్టలకు మైనగోరలకు మధ్యగా ఉంటాయి. వీటికి పెద్ద తలలు, బలిష్ఠముల్తై, కొనను వంగియున్న ముక్కులు, పదునైన గోళ్లూ ఉంటాయి. చూడడానికవి పూర్తిగా చిన్న డేగల్లాగ ఉంటాయి. తోక పోను పోను వెడల్పుగా ఉంటుంది. మగపిట్ట, ఆడుపిట్ట ఒక్కలాగే ఉంటాయి. అవి ఎక్కువగా జంతువులను చంపి, అందులో అప్పటికప్పుడు తిన గలిగినన్ని తిని, తక్కినవాటిని ముళ్లకు గ్రుచ్చి తీరికగా తినడానికై, నిలువ చేస్తాయి. ఈ జాతి పక్షులన్నింటిలోనూ ఈ అలవాటుండటంచేత వీటిని 'కసాయి పిట్టలు' అంటారు.

పెద్ద కిరితిగాడు (Grey Shrike-Lanius Excubitor) – పటము 66 – హిందీ: సఫేద్ లటోరా: మన దేశంలోని మిగతా కిరితిగాళ్ల అన్నిటిలోకి ఇది పెద్దది. ఇది సుమారు మైనగోరంత ఉంటుంది. ఇది వెండిలా మెరిసే బూడిదరంగులో ఉంటుంది. తోక పొడుగ్గా తెలుపూ – నలుపూలో ఉంటుంది. దాని ముక్కు దగ్గరనుండి వెనుకకు కన్ను గుండా ఒక నల్లని పట్టీ పోతుంది. ఈ పక్షి ఎగిరేటప్పుడు దాని నల్లని రెక్కలమీద నున్నమచ్చ, 'అద్దం'లా స్ఫుటంగా మెరుస్తుంది. దాని పెద్ద తలనూ, వంగిన బరువైన ముక్కునూ చూస్తే డేగలాగ ఈ పక్షి భయంకరంగా కనబడుతుంది. నిర్జల ప్రదేశాలలో ఈ పక్షి ఒంటరిగా సంచరిస్తూంటుంది. ఇది ఏదో ఒక ముండ్ల పొదమీద కూర్చొని, నలువైపులా ఎర కోసరం పరిశీలిస్తూ, అప్పుడప్పుడు

నేలమీదకు దూకి ఎరను ఎత్తుకుపోతుంది. మ్రింగడానికి ముందు ఎరను కాళ్ల క్రింద నొక్కిపెట్టి, వంగి పదునుగా ఉన్న దాని ముక్కుతో దానిని ముక్కలు ముక్కలుగా చీలుస్తుంది. ప్రతి పక్షికీ ఆహారాన్వేషణకై ప్రత్యేక స్థలం ఉంటుంది. అది ప్రతి రోజూ అక్కడికి పోతూంటుంది. మరే పక్షినీ అక్కడకు రానీయదు. జెట్టిమిడుతలూ, కీచురాళ్లు, ఇంకా కొన్ని పెద్ద కీటకాలే కాక, తొండలూ, చిట్టెలుకలూ, పక్షుల పిల్లలూ, దుర్బలమైన పక్షులు కూడా దీని ఆహారమే. అప్పుడప్పుడు ఇది తనకంటె పెద్ద పక్షులను కూడ తింటుంది. దీని కూతలు సాధారణంగా కఠినంగానూ, అసహ్యకరంగానూ ఉంటాయి. కాని గూళ్లను కట్టే ఋతువులో మాత్రం గల గలమంటూ మనోహరంగా చిన్న పాట పాడుతుంది. ఈ పక్షి కూతలు అనేకమైన ఇతర జాతుల పక్షుల కూతలతో కలిసిపోతాయి. ఇతర పక్షుల కూతలను ఇది అంత బాగా అనుకరించగలదు. దీని గూడొక లోతుపాటి గిన్నెవలె ఉంటుంది. కిరితిగాడీ గూటిని నేలకు తగు మాత్రం ఎత్తున ఒక పొదలో ముండ్లు గల రెమ్మలతో కట్టి, దానిలో మెత్తగా ఉండడానికి గుడ్డ పీలికలు, ఊలు, ఈకలు మొదలైనవి అస్తరుగా ఉంచుతుంది. గూటిలో 3 మొదలు 6 వరకూ గ్రుడ్లుంటాయి. అవి సాధాణంగా ఆకుపచ్చ దనంగల తెలుపులో ఉంటాయి. వాటిమీద ఊదాతో కూడిన గోధుమరంగులో దగ్గర దగ్గరగ మచ్చలూ, చుక్కలూ ఉంటాయి.)

చిన్న కిరితిగాడు (Rufousbacked Shrike—L. Schach). మన దేశంలో మరికొన్ని కిరితిగాళ్లున్నాయి. వాటిలో మనకు మిక్కిలి పరిచితమైనది చిన్న కిరితిగాడు. ఇది పరిమాణంలో పెద్ద కిరితిగాడికన్న కొంచెం చిన్నది. దీని వీపు దిగువ భాగం, పిఱ్ఱలూ ఎఱ్ఱని బూడిదరంగులో నిగ నిగలాడుతూ ఉంటాయి. ఈ పక్షి క్రింది భాగాలు కూడా అదే రంగులో పూత పూసినట్లుంటాయి. పొడి నేలలు దానికంతగా కిట్టవు. చెట్లు దట్టంగా ఉండే నేలలు, చెమ్మ నేలలు అంటే దానికిష్టం.

ఓరి ఓలిడె కుటుంబం – వంగపండు పిట్టలు (Family Oriolidae – Orioles). ఈ కుటుంబంలో మనకు బాగా తెలిసిన పక్షి నల్ల తల వంగ పండుపిట్ట (Blackheaded Oriole - Oriolus Xanthornus) – పటము 67 – హిందీ : పీలక్ : ఇది సుమారు మైనగోరంత ఉంటుంది. ఇది నిగ నిగలాడుతూ బంగారపు పసుపుచాయలో ఉంటుంది. ఇది చెట్లమీద నివసించే

పక్షి. దీని తల, గొంతు, రొమ్ము పైభాగం కారు నలుపురంగులోను, రెక్కలు, తోక సాదా నలుపురంగులోను ఉంటాయి. తళతళలాడే గులాబీ రంగు ముక్కు, రక్తవర్ణపు కళ్లూ దీనికి గల మరికొన్ని స్పష్టమైన లక్షణాలు. ఆడుపక్షికి తల వెలవెలపోతున్న నలుపురంగులో ఉంటుంది. పిల్లపక్షుల నుదురు పసుపు పచ్చగా ఉంటుంది; వాటి తలమీద లేత పసుపు చారలుంటాయి. దట్టంగా చెట్లున్న ప్రదేశాలలో ఈ పక్షి ఒంటరిగా కనబడుతుంది. ఏ కాంతాన్ని అభిలషించే స్వభావం కల దయినప్పటికీ గ్రామాల చుట్టుపట్లనూ, గ్రామాలలోనూ, నగరాలలో మధ్య ప్రాంతాల లోను కూడా, ఆకులు దట్టంగా ఉన్న తోటలలో ఇది స్వేచ్ఛగా ప్రవేశించి, బంగారపు మెరుపుతీగలాగ ఆకుల మధ్యనుండి చిత్రంగా దూసుకుపోతూ, ఎగురుతుంది. అది తరచుగా కూసే 'చీయా' లేదా 'క్వాక్' అనే కూత స్వరాలూ, శ్రావ్యమైన 'పీలో' లేదా 'పీలోలో' అనే పిల్లన గ్రోవి వంటి ఈలలూ గ్రామీణ ప్రాంతాలలో తరచుగా వినవస్తూ, పక్షి పరిశీలకులకు హృదయాహ్లాదాన్ని కలుగచేస్తాయి. మర్రి, రావి, లాంటానా మొదలగు వృక్షాల పండ్లు దాని ముఖ్యాహారం. పలురకాల కీటకాలను కూడా ఇది తింటుంది. తళతళలాడే ఎఱ్ఱ బాడిద పువ్వులూ, బూరుగు పువ్వులూ — వీటి లోని మకరందాన్ని ఈ పక్షులు ఆయా ఋతువులలో జుర్రుతాయి. వంగ పండుపిట్ట దారువుల నారపోచలతో లోతైన గిన్నెలవంటి అందమైన గూళ్లను అల్లుతుంది. ఈ పోచలను ఒక దానితో ఒకటి అతకడానికి సాలెపట్లను విశేషంగా ఉపయోగిస్తుంది. ఈ పక్షి దాని గూటిని నేలకు 4 మొదలు 10 మీటర్లవరకు ఎత్తున, వెలుపలకు వ్యాపించిన కొమ్మ కొసనున్న రెమ్మల పలవలలో ఉయ్యాలలాగ వ్రేలాడ కడుతుంది. గూటిలో రెండు మూడు గ్రుడ్లుంటాయి. అవి లేతగులాబీ ఛాయగల తెలుపురంగులో ఉంటాయి. వాటిమీద నల్లనివి గాని, ఎరుపు కలిసిన గోధుమరంగువి గాని చుక్క లుంటాయి. కాకులు మొదలైన కొల్లకొట్టే పక్షులబారి పడకుండా ఉండటానికి, సాహసం గల నల్ల ఏట్రింత గూడు కట్టిన చెట్టుమీదనే ఇదికూడా గూడు కడుతుంది.

కొండ వంగపండు పిట్ట (Golden Oriole — Oriolus Oriolus) : ఇది నల్లతల వంగపండు పిట్టలతో కలిసి తరచుగా కనబడే, ఈ కుటుంబానికి చెందిన మరి యొక పక్షి. ఇది పరిమాణంలో నల్లతల వంగపండు పిట్టంతే

ఉంటుంది. అలాగే నిగనిగలాడుతూ పసుపు పచ్చగాకూడా ఉంటుంది. కాని దీని తల నల్లగా ఉండదు; దానికి బదులు ఈ పక్షికి కంటిగుండా పోయే నల్లని చార యొకటి ఉంటుంది. కాశ్మీరములోనూ, హిమాలయాల క్రింది ప్రాంతాలలోనూ కొండ వంగపండు పిట్టలు విస్తారంగా సంతానోత్పత్తి చేస్తుంటాయి. మన దేశంలోని మిగతా ప్రదేశాలలో ముఖ్యంగా ఇది శీతాకాలంలో మాత్రమే కనబడుతుంది.)

(డ్రిక్రూరిడె కుటుంబం - ఏట్రింతలు (Family Dicruridae — Drongos): ఈ కుటుంబంలోని పక్షులు సన్నగా ఉంటాయి; చెట్లమీద నివసిస్తాయి. పరిమాణంలో ఇవి పిగిలి పిట్టలకూ, మైనగోరలకూ మధ్యగా ఉంటాయి. వీటిలో చాలా పక్షులకు నిగనిగలాడుతూ నల్లగా ఉండే ఈకలుంటాయి; తోకలు పొడుగుగా ఉండి లోతుగా చీలి ఉంటాయి. లేదా తోకలోని వెలుపలి ఈకల కొనలు పైకి వంపుతిరిగి ఉంటాయి. లేదా ఆ ఈకలలోని నడిమి కాడలు మాత్రం తోకను మించి పెరిగి, కొనలు తెప్పగా మారి 'బ్యాటులు' లాగ కనబడతాయి.

నల్ల ఏట్రింత (Black Drongo — Dicrurus Adsimilis) — పటము 68 — హిందీ: బూజంగా లేక కొత్వాల్. దీనినే 'పసల పోలుగాడు' అని కూడా అంటారు. ఇది సన్నని చురుకైన పక్షి. నిగనిగలాడే కారు నలుపు రంగులో ఉంటుంది. ఇది పిగిలిపిట్టంత ఉంటుంది. దీని తోక పొడుగుగా ఉండి, లోతుగా చీలి ఉంటుంది. గ్రామీణ ప్రాంతాలలోని బయళ్లలోనూ, సేద్యపు భూముల పరిసరములలోను, కంచె కొయ్యలమీదా, పొదలమీదా, టెలిగ్రాపు తీగలమీదా ఈ పక్షి కూర్చొని ఉండగా మనం తరచు చూస్తూ ఉంటాం. అలా కూర్చొని, నలువైపులా పరిశీలిస్తూ రివ్వున క్రిందికి దిగి, నేలమీద ఉన్న ఏ మిడుతమీదకో దుముకుతుంది. ఆ మిడుతను అక్కడి కక్కడే ఫైసలా చేస్తుంది. లేదా దానిని అది కూర్చునే స్థలానికి తీసుకొని పోయి, కాలి క్రింద నొక్కిపెట్టి, వంగి వాడిగా ఉన్న దాని ముక్కుతో తుత్తినియలు చేసి, మ్రింగుతుంది. అది తోక పిగిలిపిట్టలాగ శలభాలనూ, తూనీగలనూ, ఇసుళ్లనూ గాలిలో పట్టుకొంటుంది. ఏట్రింతలు, సిగ్గూ బిడియం లేని ఓడ దొంగల్లాగ, ఇతర పక్షులను — తరచుగా వీటికన్న పెద్దవాటిని — మిక్కిలి వేగంగా పట్టుదలతో తరిమి అవి న్యాయంగా ఆర్జించుకొన్న ఎరను వదలిపెట్టేదాకా బెదరిస్తాయి. తరచుగా ఈ పక్షులు

మేతమేస్తున్న పశువుల వీపులమీద సార్వీచేస్తూ, ఆ పశువులు పసిరికలో నడుస్తున్నప్పుడు పసిరికనుండి పైకి లేచిన కీటకాలను ఎగిరివెళ్లి పట్టుకొంటాయి. అడవులూ, గడ్డీ తగులడుతున్నపుడు పారిపోతున్న కీటకాలను చిత్రవధ చేయడానికచట చాలా ఏట్రింతలు గుమిగూడుతాయి. పంటలకు కీడుచేసే అనేక కీటకాలను అవి నాశనం చేస్తున్నాయి. ఈ విధంగా అవి వ్యవసాయదారునికి ఎంతో మేలు చేస్తున్నాయి. ఇవి కఠినంగా చీవాట్లు పెడుతున్నట్లు, హుంకరిస్తున్నట్లు పలురకాలుగా కూస్తాయి. వీటి కూతలలో కొన్ని జాలెడేగ కూతలను పోలి ఉంటాయి. గ్రుడ్లను పెట్టే కాలంలో ముఖ్యంగా ఈ పక్షులు సందడి చేస్తాయి. అవి సన్నని పుడకలనూ, గడ్డి పోచలనూ, సాలెపట్టులతో బంధించి అడుగున వెలితిగా ఉండే గిన్నె వంటి గూడును కడతాయి. సేద్యపు భూముల మధ్యన ఎత్తైన చెట్టుకొమ్మ చివరి భాగమందున్న పలవలో, అక్కడనుండి చూస్తే చుట్టుపట్లు బాగా కనపడే చోట, ఆ గూటినవి నిర్మిస్తాయి. గూటిలో 3 మొదలు 5 వరకూ తెల్లని గ్రుడ్లుంటాయి. వాటిమీద గోధుమరంగు కలిసిన ఎరుపురంగు చుక్కలుంటాయి. గద్దలూ, కాకులవంటి పెద్ద పక్షులను కూడా అవి గూళ్లు కట్టుకొన్న చెట్టు దగ్గరకువస్తే ఏట్రింతలు ధైర్యంతో వాటిని ఎదిరించి, తరిమివేసి వాటి గూళ్లను రక్షించుకొంటాయి. ఈ విధంగా ఏట్రింతల రక్షణంలో అవి గూళ్లు కట్టుకొన్న చెట్లపైనే, గువ్వలూ, వంగపండు పిల్లలవంటి సాధువులైన పక్షులుకూడా వాటి గూళ్లను కట్టుకొంటాయి.

మరో రెండు ఏట్రింతలను గురించి కూడ ఇక్కడ చెప్పవలసిన అవసరం ఉంది. వాటిలో ఒకటి బూడిదరంగు ఏట్రింత (Ashy -- D. Leucophaeus) రెండవది తెల్లపొట్ట ఏట్రింత (Whitebellied — Caerulescens). మొదటిది బలపపు నలుపురంగులో ఉంటుంది. దీని కళ్లు కెంపులులాగ ఎఱ్ఱగా ఉంటాయి. ఇది బయలు ప్రదేశాలలో ఉండక అడవులలో ఉంటుంది. దీనికన్నా తెల్లపొట్ట ఏట్రింత కొంచెం చిన్నది. దీని పైభాగం నిగనిగలాడుతూ నీలిమందు రంగు చాయగల బూడిద రంగులో ఉంటుంది; పొట్ట తెల్లగా ఉంటుంది. ఆకులను రాల్చే చెట్లుండే ప్రదేశాలలోనూ, ముఖ్యంగా వెదురు పొదలు బాగా ఉన్న అడవులలో కూడా ఈ పక్షులుంటాయి.

స్టర్నిడె కుటుంబం — స్టార్లింగులు, మైనాలు (Family Sturnidae —

**Starlings and Mynas)** : ఈ కుటుంబానికి నమూనాగా మైనగోర (Common Myna — Acridotheres Tristis) - పటము 69 - హిందీ : దేశీ మైనాను తీసికొనవచ్చును. ఇది పరిమాణంలో పిగిలి పిట్టకూ, పావురాయికీ మధ్యగా ఉంటుంది. దీని పొడుగు సుమారు 23 సెంటీమీటర్లు. ఇది ఉల్లాసంగానూ, నీటుగానూ ఉండే గోధుమరంగు పక్షి. దీని తల నల్లగా ఉంటుంది ; కాళ్లూ, ముక్కూ నిగనిగలాడే పసుపురంగులో ఉంటాయి. దీని కంటి చుట్టూ ఈకలు లేని పసుపు పచ్చని చర్మం ఉంటుంది. అది ఎగిరేటప్పుడు రెక్కలమీద ఒక పెద్ద తెల్లని మచ్చ స్ఫుటంగా కనపడు తుంది. పిచ్చుక, కాకి, పావురాయితో పాటు మైనగోరకూడా మానవుడు నివసించే తావులందు — మానవుడు నివసించే యిల్లైనా సరే లేదా జన సమ్మర్దంగా ఉన్న బజారైనా సరే — సంచరించడానికి అలవాటు పడింది. దానికి కలుపు గోలుతనము మెండు. అది సర్వభక్షకి. ఈ రెండు లక్షణాలు దాని కుండబట్టే మైనగోర మానవునితో సహజీవనం చేస్తూ తన పొట్టను పోషించుకో గలుగుతోంది. ఒకటి కాని రెండుకాని జతల మైనగోరలు ఏదైనా ఒక ఇంటిని గాని లేదా ఇంటి ఆవరణను గాని నివాసంగా చేసికొని ఉండి, ఆ జాతికి చెందిన మరో పక్షి అక్కడ చేరకుండా బలంగా పోట్లాడు తాయి. కాని ఆహార సముపార్జనకై విశేష సంఖ్యలో మైనగోరలు ఒక చోట కలిసి ఐకమత్యంతో కొత్తగా నీరు పెట్టిన పచ్చిక బయలులోని వాన పాములనో, లేదా వర్షంతో తడిసిన నేలనుండి బయటకు వచ్చిన ఇసుళ్లనో, మఱ్ఱి, రావి మొదలగు చెట్లపళ్లనో తింటూంటాయి. ఈ పక్షులు సామాన్యంగా మేస్తున్న పశువులను అనుసరించిపోతూ ఆ జంతువుల పాదాలవలన కలత చెంది పైకెగిరే కీచురాళ్లనూ, మిడుతలనూ లేదా పొలం దున్నేటప్పుడు నాగలిని అనుసరించిపోతూ నేలనుండి బైటకు వచ్చిన క్రిములనూ పట్టుకొని తింటాయి. పారిపోతున్న ఎరను ప్రక్కలకు గెంతో లేదా గాలిలోకి ఎగిరో పట్టుకొంటాయి. మైనగోరలు చిలుకలతోనూ, కాకులతోనూ కలిసి చెట్లమీద గుంపులుగా నిద్రపోతాయి. మైనగోర పలురకాలుగా కూస్తుంది. రేడియో — రేడియో - రేడియో అంటూ గట్టిగా చివాట్లు పెడుతున్నట్లుండే కూత అందరికీ బాగా తెలిసిందే. మిట్టమధ్యాహ్నం బాగా ఎండ కాస్తున్నప్పుడు, నీడలో విశ్రాంతి తీసికొంటూ, మగమైనగోర దాని పెంటివైపుకు తలను ఊపుతూ అనేక స్వరాలలో "కీక్ - కీక్ - కీక్, కోక్ - కోక్ - కోక్,

చర్ - చర్'' మొదలైన పలురకాల కూతలు కూస్తుంది. కాగితం, ఎండు గడ్డి, చెత్తా చెదారం - ఇలాంటి పదార్థాలను చెట్టు తొర్రలోకో, గోడకుండే కన్నంలోకో, ఇంట్లో మనుష్యులున్నా లేకపోయినా ఇంటి చూరులోకో కుక్కి, మైనగోర గూటిని నిర్మిస్తుంది. గూటిలో నాలుగైదు అందమైన నిగ నిగలాడే నీలిరంగు గ్రుడ్లుంటాయి. వాటిమీద ఎట్టి చారలు గాని, చుక్కలు గాని ఉండవు.

బ్యాంకు మైన (Bank Myna — A. Ginginanus). ఇది చాలవరకు సామాన్యపు మైనగోరలాగే ఉంటుంది కాని దాని కన్నా చిన్నది. ఈ మైనలు పశ్చిమ పాకిస్తాన్‌లోనూ, ఇండియాలో ఉత్తర, వాయవ్య భాగాలైన గుజరాత్, రాజస్తాన్ మొదలైన ప్రదేశాల్లోనూ విశేషంగా ఉంటాయి. ఇవి ముఖ్యంగా రైల్వేస్టేషనులను ఆశ్రయించుకొని ఉంటాయి. ఇవి గోధుమ రంగులో ఉండక వెలవెలపోతున్న నీలి కలిసిన బూడిదరంగులో ఉంటాయి. వీటి కంటిచుట్టూ ఉండే ఈకలు లేని చర్మం పసుపు పచ్చగా నుండక ఇటుక ఎరుపురంగులో ఉంటుంది.

బట్టమైన (Pied Myna — Sturnus Contra) — పటము 70 — హిందీ: అబ్లక్‌మైనా లేక సిరోలి మైనా. ఇది ఉత్తర భారతంలోనూ, తూర్పు భారతంలోనూ సామాన్యంగా నివసించే మరొక మైన. దేశీ మైన గోరకన్న ఇది కొంచెం చిన్నది. ఇది నలుపురంగు, తెలుపురంగు గల సొగసైన పక్షి. దీని కంటి చుట్టూ ఈకలు లేని, నారింజరంగు చర్మం ఉంటుంది. దీని ముక్కు గాఢమైన నారింజ-పసుపురంగులో ఉంటుంది. గ్రామాలలోనూ, సేద్యపు భూములలోనూ, వాటి పరిసరాల్లోనూ ఈ పక్షులు మందలు మందలుగా తిరుగుతూంటాయి. మిడుతలను వేటాడడానికై తోటల లోకీ, ఆవరణలలోకి వానపాములను త్రవ్వితియ్యడానికై నీరు పెట్టిన పసరిక బయళ్లలోకీ, నిద్ర పోవడానికి విశేషంగా ఆకులున్న పెద్ద చెట్లమీదకూ ఈ మైన ప్రవేశించినప్పటికీ, అది దాని అవసరాల కోసరం మనుష్యుని మీద అంతగా ఆధారపడదు. నివాస భవనాలలో గూళ్లు కట్టదు. దీని బంధువగు సామాన్యమైన మైనగోరవలె ఇది సర్వభక్షకియున్నూ కాదు. ఇది కీటకాలనూ, ఫలాలనూ విశేషంగా భక్షిస్తుంది. మిగతా పదార్థాలను ఎప్పుడోకాని తినదు. ఈ మైన తరచుగా మిగతా మైనలతో కలిసి గుంపులుగా కూడి పట్టణాలయందు, ఆ పట్టణాల వెలుపల ఉన్న పెంటకుప్పలయందు

లభించే ఆహారాన్ని తింటుంది. లేదా గ్రామాలలోని చెరువుల ప్రక్కనున్న తడి పసిరిక బయళ్లలో మేసే పశువుల ననుసరించి పోతూంటుంది. ఇది శ్రావ్యంగా హెచ్చుస్థాయి స్వరాలలో పలురకాలుగా కూస్తుంది. ఆ స్వరాలలో కొన్ని అంబలి జోరిగాడు ఎగురుతున్నపుడు పాడే పాటలాగ ఉంటాయి. బట్టమైన గూటికీ మిగతా మైనల గూళ్లకూ చాలా తేడా ఉంది. ఇది పుడకలు, ఆకులు, గడ్డీ, చెత్తా చేర్చి గోళాకృతిలో అసహ్యకరమైన ఒక పెద్ద గూడు కడుతుంది. ఈ గూటిని అది గ్రామం దగ్గర లేదా పంటపొలాల వద్ద ఉండే మామిడివంటి చెట్లపైని, వెలుపలకు వంగిన కొమ్మలమీద నిర్మిస్తుంది. ఒకే చెట్టుమీద మూడు నాలుగు గూళ్లుండటం కూడా కద్దు. గూటిలో నాలుగైదు గ్రుడ్లు ఉంటాయి. అవి నిగనిగలాడు నీలిరంగులో ఉంటాయి. వాటిమీద చారలు కాని, చుక్కలు కాని ఏవీ ఉండవు.

గులాబీ స్టార్లింగు (Rosy Pastor or Rosecoloured Starling-Sturnus Roseus): దీనిని చూచి బట్ట మైనని పొరపాటు పడకూడదు. శీతకాలంలో ఈ పక్షులు భారతదేశానికి మందలు మందలుగా వస్తాయి. ఇది నలుపు, గులాబీ ఎరుపురంగులలో ఉంటుంది - బట్ట మైనకున్న తెలుపు రంగు దీనికుండదు. కాని ఇది బట్ట మైన అంతే ఉంటుంది. రంగులో ఈ తేడాతప్ప మిగతా విషయాల్లో ఈ కుటుంబంలోని మైనల పోలిక దీనికి బాగా ఉంది. పండిన జొన్న చేలలోను, ఎఱ్ఱని, పెద్ద పువ్వులుగల బాడిద చెట్లమీదను, బూరుగ చెట్లమీదనూ - ఈ గులాబీ స్టార్లింగులు మందలు, మందలుగా మనకు కనబడతాయి.

(కార్విడె కుటుంబం - కాకులు (Family Corvidae — Crows). ఈ కుటుంబం అందరికీ తెలిసినదే. కనుక దీనినిగూర్చి పరిచయం చేయనవసరం లేదు. నగరవాసులు కానిండు, గ్రామవాసులు కానిండు ప్రతివారికీ కాకి స్వరూపం, దాని అల్లరి పనులూ కరతలామలకమే.

కాకి (House Crow — Corvus Splendens) — పటము 71 — హిందీ: కౌవ్వా లేక దేశి కౌవ్వా. ఇది దాని నాటు చుట్టమైన మాలకాకి కన్నా చిన్నది. దీని మెడ బూడిదరంగులో ఉంటుంది. దీనికీ మాలకాకికీ ఇంతే తేడా. భారతదేశపు పక్షులన్నిటిలోను అందరికీ బాగా తెలిసిన పక్షి కాకి. ప్రధానంగా ఇది పట్టణాలలో నివసిస్తుంది. ఇది మానవుని ఆశ్రయించు కొని, ఆహారం కోసరం తప్పకుండా అతనిమీద ఆధారపడుతుంది. తెలివి

తేటలూ, నిర్భయత్వం — వీటితోపాటు ప్రమాదాన్ని పసికట్టి దానిని తప్పించుకొనే సహజాతం కాకికుండటం వలన, అది ఎన్ని పాపపు పనులు చేస్తున్నా జీవితంలో అద్భుతంగా నెగ్గుకొస్తోంది. ఆహార విషయంలో కాకికి పనికిరాని పదార్థమే లేదు — చచ్చిన ఎలుక, వంటింట్లోంచి పైకి పారవేసిన చెత్త, పల్లెవాని బుట్టలోంచి అది గోల పెడుతున్నా ఎత్తుకొచ్చిన చేపలు, మనం చూస్తూండగానే మన కంచంలోంచి ఎత్తుకుపోయిన గ్రుడ్డు లేదా రొట్టెముక్క — వీటిలో ఏదైనా దానికిష్టమే. పాకీవాడు వీధులను ఊడ్చి, ఏ విధంగా శుభ్రం చేస్తాడో, అలాగే కాకికూడా ఉచ్ఛిష్టాన్ని తినేసి గ్రామాన్ని శుభ్రపరుస్తుంది. అందుచేత కాకిది దొంగిలించే స్వభావం అయినప్పటికీ దానిని మనం కొంతవరకు సహింప గలుగుతున్నాం. కాని అందంగా ఉండి, చక్కగా పాడే సాత్వికమైన పక్షులను విధీవిరామం లేకుండా ఇది నాశనం చేస్తుంది. అందుచేత కాకులు తోటలలోకి రావడం ఎంతమాత్రం వాంఛనీయం కాదు. నారాయణ పక్షుల గూళ్లకు కాకుల బెడద చెప్పనలవి కాదు. వాటి గూళ్లున్న స్థలాల్లో కాకుల మూకలు చేరతాయి. మనుష్యులు రావడంచేత బెదిరి నారాయణ పక్షులు గూళ్లను వదలిపెట్టినపుడు, కాకులు ఆ గూళ్లమీద వ్రాలి వాటిలోని గ్రుడ్లను ఎత్తుకొని పోతాయి లేదా నిస్సహాయులైన పసికందులను అతిక్రూరంగా ఛిన్నాభిన్నం చేసేస్తాయి. జెట్టిమిడుతలూ మొదలైన హానికరములైన కీటకాలు కుప్పతెప్పలుగా వృద్ధి పొందినపుడు వాటిని కాకులు నాశనం చేసినప్పటికీ, అవి పక్వానికి వస్తున్న గోధుమ, మొక్కజొన్న వంటి పంటలమీద కూడా దాడి చేస్తాయి; తోటల్లో ఫలాలకి కూడా అవి విశేష నష్టం కలుగచేస్తాయి. కాకులవల్ల మనదేశం యొక్క ఆర్థిక వ్యవస్థ దెబ్బతింటుందా, లేదా అంటే తేల్చిచెప్పడం కష్టమే. కాకి మధ్య పల్లంగా ఉండే ఒక వేదికవంటి వికృతమైన గూటిని పుడకలతో కడుతుంది. దానిలో పీచూ, ఊనెలూ మొదలైన వాటితో అస్తరు ఏర్పాటు చేస్తుంది. సామాన్యంగా ఈ గూటిని అది 3 మొదలు 8 మీటర్ల ఎత్తులో చెట్ల కొమ్మలమీద నిర్మిస్తుంది. గూటిలో నాలుగైదు గ్రుడ్లుంటాయి. అవి నీలి కలిసిన లేతాకు పచ్చరంగులో ఉంటాయి వాటిపైని గోధుమ రంగు మచ్చలూ, చారలూ ఉంటాయి. ఈ గ్రుడ్లు కోకిల గ్రుడ్లను బాగా పోలి ఉంటాయి. అందుకే అది దాని గ్రుడ్లను పొదగడానికీ తరువాత పిల్లలను పోషించడానికి దాని గ్రుడ్లను కాకుల గూళ్లలో పెడుతుంది.

మాలకాకి (Jungle Crow — C. Macrorhynchos) కాకికన్నా పెద్దది. దీని శరీరమంతా నిగనిగలాడుతూ కారు నలుపుగా ఉంటుంది. మాలకాకి ముక్కు కాకిముక్కు కన్నా బరువు. ఇది కాకికన్నా గట్టిగాను, బొంగురుగాను 'కా' అంటూ కూస్తుంది. సాధారణంగా ఇది పట్టణాలకూ, నగరాలకూ దూరంగా గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తుంది. అది తరుచుగా మానవ నివాసాలకు వెలుపల - మానవుని నిర్లక్ష్యంచేత అశుభ్రంగా ఉండే పల్లెలు, పశువుల పెరళ్లూ మొదలైన స్థలాలలో - సంచరిస్తూ ఆహారాన్ని సంపాదించుకొంటుంది.)

గోకురాయి (Tree Pie — Dendrocitta Vagabunda) - పటము 72 - హిందీ. మహాలట్. ఇది కాకికి చుట్టమే. కాని దానికంటె మిగుల అందమైన పక్షి. పరిమాణంలో ఇది మైనగోరంత ఉంటుంది. కాని దీని తోక 30 సెంటీమీటర్ల వరకు పొడుగ్గా ఉంటుంది. ఇది చెస్నటు - గోధుమ రంగు పక్షి. దీని తల, మెడ నల్లగా ఉంటాయి. అవి ఎగిరేటప్పుడు మిక్కిలి పొడుగైన దాని తోక ఈకల కొనలందలి నలుపురంగు, రెక్కలపై ఈకల బూడిదరంగు స్పష్టంగా కనబడతాయి. చెట్లు తక్కువగా ఉండే చిట్టడవుల లోను, అడవులందలి బయళ్లలోను గోకురాళ్లు కనబడుతూంటాయి. దీనికి కలుపుగోలుతనం ఎక్కువ. కనుక అవి కుటుంబాలుగా బయల్దేరుతాయి. ఈ పక్షులన్నీ కలిసి "కె - కె - కె, కె, కె" అంటూ బొంగురు గొంతు కలతో కర్ణకఠోరంగా సంభాషణలు కొనసాగిస్తాయి. ఒక చెట్టునుండి మరి యొక చెట్టునకి పక్షులు నాయకుని అనుసరించే పద్ధతిలో ఒకదాని వెనుక నొకటి వేగంగా ఎగురుకొంటూ పోతాయి. అలా ఎగిరేటప్పుడవి రెక్కలను చప్పుడుచేస్తూ వేగంగా కొట్టి, వెంటనే అవి, రెక్కలు, తోక బాగా విప్పి యుంచి గాలిలో ముందుకు మెల్లగా జారుతూ పోతాయి. ఈ పక్షులు గొంతుతో చేసే స్వరాలు కర్ణకఠోరంగా ఉంటాయి. అయితే అవి పలు రకాల మిక్కిలి శ్రావ్యమైన కూతలు కూడా కూస్తాయి. ఇలా కూసేటప్పుడవి సామాన్యంగా 'బాబ్ - ఓ - లింక్' లేదా 'కోకిలా' అంటూ తరుచుగా పదేపదే కూస్తాయి. ఇలా కూసేటప్పుడీ పక్షి పూర్తిగా వీపును విల్లువలె వంచి, తలను క్రిందికి దించి, తోకను క్రిందికి అణచిపెట్టి మరీ కూస్తుంది. సాధారణంగా గుడ్లను పెట్టే కాలంలో మగపక్షి ఇలా దాని పెంటి ఎదుట హాస్యకరంగా నటిస్తుంది. గోకురాళ్లు, పళ్లు తినే ఇతర పక్షులతో కలిసి, బాగా

పండిన పళ్లను గొంతుమోయ తినడానికి మఱ్ఱి చెట్లమీద, రావి చెట్లమీద ఉంటాయి. వీటి చుట్టాలైన కాకుల్లాగే, గోకురాళ్లు కూడ సర్వభక్షకాలు. ఒక్కొక్కప్పుడవి క్రుళ్లిన మాంసాన్ని తినడానికి కూడా సిద్ధపడతాయి. ఫలాలేకాక అవి సామాన్యంగా కీటకాలనూ, ఆకు పురుగులనూ, తొండలనూ, పక్షుల పసికందులనూ, ఎలుక పిల్లలనూ, చిట్టెలుకలనూ కూడా తింటాయి. ఇవి పసిగట్టుకొని చిన్న పక్షుల గూళ్లను వేటాడుతూ, వాటి గ్రుడ్లనూ, పసికందులనూ నాశనం చేస్తాయి.

ఇది కాకిలాగే గూటిని ముండ్ల పుడకలతో నిర్మిస్తుంది కాని దీని గూడు కాకి గూడుకన్నా లోతుగా ఉంటుంది. గూటికి అస్తరుగా లేత కొమ్మలను, పిల్లవేళ్లను ఉపయోగిస్తుంది. అది దట్టంగా ఆకులున్న చెట్టుపైన ఈ గూటిని ఎవరికీ కనపడని చోట నిర్మిస్తుంది. గూటిలో నాలుగైదు గ్రుడ్లుంటాయి. ఈ గ్రుడ్లు పలురకాల చిహ్నాలతో పలురకాల రంగులలో ఉంటాయి. సర్వ సామాన్యంగా అవి లేత సామను తెలుపురంగులో ఉంటాయి. వాటిపైని కాంతిమంతమైన ఎరుపు కలిసిన గోధుమరంగు చుక్కలూ, చారలూ ఉంటాయి.

(కేంపెఫాగిడె కుటుంబం (Family Campephagidae). కోవెల - కిరితిగాళ్లు, ఛషమ్ జిట్టలు ఈ కుటుంబంలోకి వస్తాయి. ఈ కుటుంబంలోని పక్షులలో కొన్ని చిన్నవి. కొన్ని మరీ అంత చిన్నవి కావు, మరీ అంత పెద్దవి కావు. ఇవన్నీ వృక్షవాసులే. ఇవి గుంపులు గుంపులుగా కూడి సహజీవనం చేస్తాయి. ఇవి కీటకాలనే ముఖ్యంగా భక్షిస్తాయి. ఛషమ్ జిట్టలన్నీ మంచి రంగులలో ప్రకాశిస్తూ ఉంటాయి.

ఎఱ్ఱ ఛషమ్ జిట్ట (Scarlet Minivet—Pericrocotus Flammeus)– పటము 73 – హిందీ: పహారి బూలాల్ ఛషమ్. ఈ పక్షి పిగిలిపిట్టకన్న కొంచెం చిన్నది. వయసు వచ్చిన మగపిట్ట పైభాగం నిగనిగలాడే కారు నలుపురంగులో ఉంటుంది; క్రింది భాగం నారింజ – ఎరుపు నుండి 'రక్తపు ఎరుపు' వరకూ అనేక ఛాయలలో ఉంటుంది. ఆడుపక్షి, పిన్న వయసులో ఉండే మగపక్షి కూడ పైభాగాన బూడిదరంగు, ఆలివ్ – పసుపురంగు, క్రింది భాగాన పసుపురంగు, నల్లని రెక్కలమీద రెండు పసుపురంగు చారలు కలిగి ఉంటాయి. దట్టంగా ఆకులుండు చెట్లపై భాగంలో ఇవి అయిదారేసి గుంపులు, గుంపులుగాచేరి ఉంటాయి. శీత

కాలంలో ఈ పక్షులు సంఖ్యలో ముప్పైకి మించి గుంపులు, గుంపులుగా చేరి ఉంటాయి. తరచుగా వీటిలో బాగా వయసువచ్చిన మగవన్నీ ఒక గుంపులోనూ, ఆడువీ, పిన్న వయసు మగవీ కలిసి ఒక గుంపులోనూ ఉంటాయి. అవి దట్టంగా ఆకులుగల చెట్టు పైభాగంలో ఉండి, ఆకుల మధ్యనుండి విరామం లేకుండా తుళ్ళున ఎగురుతూ, దాక్కొని ఉన్న కీట కాలను కాళ్ళతో పట్టివెయ్యడానికి చిన్న కొమ్మల ముందు రెక్కలను కొట్టు కొంటూ విహరిస్తూ చెట్టునుండి చెట్టుకి ఒక దాని వెనుక ఒకటి పోతూ ఉంటాయి. దట్టమైన ఆకుపచ్చని ఆకుల ముందు సూర్యుని కాంతిలో మగ పక్షుల రక్తవర్ణపుటీకలు ప్రకాశిస్తూంటే - నిజంగా ఆ దృశ్యం కన్నుల పండువే. సాలీడులూ, కీటకాలూ, కీటకాల లార్వాలూ ఈ పక్షుల ఆహారం. అవి వీటిని ఆకులమీద నుండీ, మొగ్గలమీద నుండైనా ఏరుకొంటాయి లేదా తోక పిగిలి పిట్టలాగ గాలిలో నుండైనా పట్టుకొంటాయి. ఈ పక్షులు గుంపులుగా ఎగురుతున్నపుడవి కూసే 'వీ - ట్వీట్' లేదా 'విరిరి, విరిరి' మొదలైన కూతలు శ్రావ్యంగా, వినసొంపుగా ఉంటాయి. అన్ని రకాల ఛషమ్ జిట్టలు వేళ్ళను, నార పోచలను, సాలె పట్టులతో బంధించి, అట్టే లోతులేని గిన్నెలవంటి గూళ్ళనుకట్టి, వాటి వెలుపలి భాగాన్ని నాచు, లైకెనులు, సాలెపురుగుల గుడ్ల సంచులు మొదలగువానితో అలంకరిస్తాయి. ఈ గూళ్ళనవి భూమికి 3 మొదలు 15 మీటర్లవరకు ఎత్తున ఒక పంగలోనో లేదా కొమ్మ యొక్క పైతలం మీదనో కడతాయి. గూటిలో 2 మొదలు 4 వరకూ లేత ఆకుపచ్చని గ్రుడ్లుంటాయి. వాటిపైన దట్టమైన గోధుమ రంగువి, లవండరు రంగువి చుక్కలూ, మచ్చలూ ఉంటాయి.

చిన్న ఛషమ్ జిట్ట (Little Minivet—P. Cinnamomeus). ఇది ఎఱ్ఱ ఛషమ్ జిట్టకన్న చిన్నది; దానికంటె సన్నంగా కూడా ఉంటుంది. ఇది భారతదేశంలోనూ, పాకిస్థాన్‌లోనూ విరివిగా కనపడే మరొక ఛషమ్‌జిట్ట. బాగా వయసు వచ్చిన మగ పక్షి ముఖ్యంగా నలుపు, బూడిద రంగు, నారింజ - ఎరుపు రంగులలో ఉంటుంది. ఆడు పక్షికీ, పిన్న వయసులో ఉన్న మగపక్షికీ తల నల్లగా ఉండదు; వాటి క్రింది భాగాలు ఎఱ్ఱగా ఉండవు. పసుపు పచ్చగా ఉంటాయి; బాగా వయసు వచ్చిన మగపక్షి పిఱ్ఱలమీద ఉండే ఎరుపు మచ్చ మాత్రం అన్నింటికీ ఉంటుంది. చిన్న ఛషమ్‌ను తరచుగా తోటలలోనూ, పొడిగా ఉండే చిట్టడవులలోనూ

చూస్తూంటాం. ఎట్టి ఛషమ్‌కు మాత్రం దట్టంగా చెట్లుండే అడవి ప్రదేశాలే ఎక్కువ ఇష్టం.

ఐరీనిడె కుటుంబం (Family Irenidae) పడమటి కనుమల దక్షిణ భాగంలో ఉండే సదా హరితారణ్యాలలోనూ, తూర్పు హిమాలయాలలోనూ నివసించే సొగసైన నీలిపిట్టలనీ కుటుంబంలో చేర్చారు. ఈ కుటుంబంలోని అయోరా, క్లోరోప్సెసు లేక ఆకు పిట్టలు చాలాచోట్ల కనబడతాయి. ఈ ఆకు పిట్టలను జన బాహుళ్యం 'ఆకుపచ్చ పిగిలి పిట్టల'ని కూడా అంటారు.

అయోరా (The Common Iora — Aegithina Tiphia) - పటము 74 — హిందీ: షౌబీగీ: ఇది సుమారు పిచ్చుకంత ఉంటుంది. ఇది నిగనిగ లాడే కారు నలుపురంగులోను, ప్రకాశమైన పసుపు పచ్చరంగులోను ఉంటుంది. దీని రెక్కలమీద రెండు తెల్లని అడ్డ పట్టీలుంటాయి. ఇది మగది. సాధారణంగా దీని పెంటి దీని వెంటనంటి ఉంటుంది. ఇది ఎక్కువగా ఆకు పచ్చ కలిసిన పసుపురంగులో ఉంటుంది. దీని రెక్కలమీద కూడా తెల్లని పట్టీలుంటాయి. గ్రుడ్లు పెట్టని కాలంలో ఈకల విషయంలో మగది ఆడు దాన్ని చాలవరకు పోలి ఉంటుంది. కాని మగదాని తోక మాత్రం నల్లగానే ఉంటుంది. అయోరా ఎల్లపుడు చెట్లమీదనే ఉంటూ కీటకాలను తింటుంది. గ్రామాలకు వెలుపల ఉండే తోటలలోనూ, తోపులలోనూ, చిట్టడవులలోనూ సంచరిస్తుంది. ఇవి జతలు, జతలుగా కలిసి తిరుగుతూ ఆకుల మధ్యనుండే కీటకాలనూ, ఆకుపురుగులనూ వేటాడుతాయి. రెమ్మనుండి రెమ్మకు గెంతుతూ, కొమ్మ ప్రక్కనుండి తలక్రిందుగా వ్రేలాడుతూ ఆకుల క్రిందనుండే పురుగులకై వెతుకుతాయి. ఈ పక్షులు రెండూ సొగసుగా కిచకిచలాడుతూ శ్రావ్యంగా ఈలవేస్తూ ఇవి తప్పిపోకుండా ఒక దాని ఉనికి నొకటి తెలిసికొంటూ ఉంటాయి. ఇది సాగతీసుకొంటూ కూసే మధురమైన ఈల కూత ననుస రించియే దీనికి హిందీభాషలో 'షౌబీగీ' అన్న పేరు వచ్చింది. పెట్టతో జత కూడే ముందు పుంజుచేసే అట్టహాసం మిక్కిలి ఆకర్షణీయంగా ఉంటుంది. రెక్కలను క్రిందికి బాగా దించి పిఱ్ఱలమీద ఉన్న ఈకలను పైకుబ్బించి, తోకను కొంచెంగా పైకెత్తిపెట్టి కిచకిచమంటూ, శ్రావ్యంగా ఈలలు వేస్తూ, పొడుగ్గా సాగతీసుకొంటూ 'చీ - ఈ' అని కూస్తూ పుంజు పెట్టను వెంట తరుముతుంది. పిఱ్ఱలమీద ఉన్న నిగనిగలాడే తెల్లని ఈకలను నిక్కపొడిచి, చెట్టు కొమ్మనుండి ఒకటి రెండు మీటర్ల ఎత్తుకు గాలిలోకి గెంతి, మరలాగ

చుట్టిచుట్టి తిరుగుతూ వచ్చి, ఉబ్బిన బంతిలాగ కొమ్మమీద దిగుతుంది. అయోరా గూడు శుభ్రంగా ఉంటుంది. దానిని అది మెత్తని గడ్డిపోచలతోను, వేళ్ల నారతోనూ చిక్కగా ఒక గిన్నెలాగ అల్లుతుంది. ఈ గూటిని అది ఒక రెమ్మ పలవలో నిర్మించి, దాని వెలుపలి భాగం నున్నగా ఉండటానికి, సాలెపట్టులను అంటిస్తుంది. గూటిలో సామాన్యంగా 2 లేక 4 గ్రుడ్లుంటాయి. అవి లేత గులాబీ కలిసిన తెలుపురంగులో ఉంటాయి. వాటి మీద నీలారుణ ఛాయగల గోధుమరంగులో మచ్చలుంటాయి.

మార్షల్ అయోరా (Marshall's Iora — Ae. Nigrolutea). ఈ పక్షి అచ్చంగా షౌబీగీ లాగే ఉంటుంది. కాని దీని తోక చివరిభాగం తెల్లగా ఉంటుంది. ఈ భేదమునుబట్టి దీనిని గుర్తింపవచ్చును. ఇది కచ్, రాజస్థాన్, పంజాబ్, మధ్యప్రదేశ్, బెంగాల్ మొదలగు రాష్ట్రాలలో అక్కడక్కడ చిత్రంగా వ్యాపించి ఉంది.

పచ్చాకు పిట్ట (Jerdon's Chloropsis—Chloropsis Cochinchinensis Jerdoni)— పటము 75 — హిందీ : హరీవా : ఇది ఆకుపచ్చని, సొగసైన పిట్ట. ఇది సుమారు పిగిలి పిట్టంత ఉంటుంది. దీనికి కాంతివంతమైన నీలారుణ వర్ణంలో మీసాలను బోలు చారలూ, నల్లని బుగ్గలూ, గడ్డమూ, గొంతూ, సన్నంగా ఉండి, కొద్దిగా వంపు తిరిగిన నల్లని ముక్కూ ఉంటాయి. ఆడుపక్షికి లేత నీలి కలసిన ఆకుపచ్చని గడ్డమూ, గొంతూ, కాంతివంతమైన ఆకుపచ్చ కలిసిన నీలి రంగు మీసచారలూ ఉంటాయి. సాధారణంగా ఈ పక్షులు జతలు, జతలుగా గాని, చిన్న చిన్న గుంపులుగా గాని, చెట్ల ఆకులలో వేటాడుతూ ఉంటాయి. అలా వేటాడేటప్పుడవి కొమ్మలనూ, రెమ్మలనూ పట్టుకొని తలక్రిందుగా వ్రేలాడుతూ ఇంకా పలురకాల నృత్యాలు చేస్తూ కీటకాలను వెతుకుతూ ఉంటాయి. వాటి రంగు ఆకుల రంగుతో అద్భుతంగా మిళితమవుతుంది. అందుచేత ఇవి చెట్ల ఆకులలో నున్నపుడు వాటి కూతలే వినపడతాయి. అంతేకాని అవి కనబడవు. ఒక్కొక్కప్పుడు ఈ పక్షిని కూతనుపట్టి గుర్తించడం కూడా కష్టమే. ఎందుచేతనంటే దర్జీపక్షి, పిగిలిపిట్ట, నల్ల ఏట్రింత, అయోరా, తెల్లరొమ్ము లకుముకి, సరలగాడు — ఈ పక్షుల కూతలను ఇది అచ్చంగా అనుకరిస్తుంది. ఇది ఈ విధంగా ఒక పిట్ట తరువాత ఒక పిట్టను నిర్విరామంగా అనుకరిస్తుంటే పక్షి జగత్తులో ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమా

వేశం జరుగుతుందా అన్నట్లు ఉంటుంది! పరిశీలకులెవరైనా ఆ కూతలు వస్తూన్న చెట్టును సమీపిస్తే, వారికి ఒకే ఒక పచ్చాకుపిట్ట కనుపించి, వెంటనే అదృశ్యమవుతుంది. అలా అదృశ్య మయేటప్పుడది తనలో తాను నవ్వుకొన్నట్లు చేసే శబ్దాన్ని వింటే పరిశీలకులను బాగా బోల్తా కొట్టించా ననే ఆనందంతో ఆ పక్షి తనలోతాను నవ్వుకొంటోందేమో అని అనిపిస్తుంది. కీటకాలు, సాలెపురుగులు, ఫలములు — దాని ఆహారం. అది హెచ్చుగా పూదేనెను కూడా త్రాగుతుంది.

అది లతాప్రతానాలు, నాచు, పిల్లవేళ్లు మొదలైన వాటి నుపయోగించి, వదులుగా, అట్టే లోతులేని గిన్నెవంటి గూటిని కడుతుంది. దాని లోపలి అంచున మెత్తని పదార్థాలు పెడుతుంది. అది గూటిని వెలుపలకు వ్యాపించి యున్న శాఖ చివర ఎవరికీ కనపడకుండా ఉండేటట్లు నిర్మిస్తుంది. సామాన్యంగా గూటిలో రెండు గ్రుడ్లుంటాయి. అవి ఎరుపుదాయగల మీగడ రంగులో ఉంటాయి. వాటిమీద క్లారెటు ఎరుపురంగు చారలు ఎక్కువగా ఉంటాయి.

పసిడిరొమ్ము పచ్చాకుపిట్ట (Goldfronted Chloropsis - C. Aurifrons): ఇది కూడా మనకు సామాన్యంగా కనపడే పక్షే. ఇది పచ్చాకు పిట్టకు దగ్గర చుట్టము. ఒక్కొక్కప్పుడీ రెండు రకాల పక్షులు ఒకేచోట ఒకదాని ప్రక్క నొకటి కనబడతాయి. వీటిలో మగపక్షి నుదురు నిగనిగలాడుతూ పసిడిరంగులోనూ, గడ్డమూ, గొంతూ ఊదా కలిసిన నలుపురంగులోనూ ఉంటాయి; ఆడుపిట్ట రంగులు వెలవెలపోతూ ఉంటాయి; కాంతివంతముగా ఉండవు. దాని నుదుటిమీది పసిడిరంగు కూడ అంత స్పష్టంగా ఉండదు.

పిక్నోనొటిడె కుటుంబం (Family Pycnonotidae): ఈ కుటుంబంలో చురుకైన పిగిలిపిట్టలను చేర్చారు. ఇవి దేశమంతటా ఉద్యానవనాలకు ఎంతో శోభను కలుగ చేస్తున్నాయి.

ఎఱ్ఱ మీసాల పిగిలిపిట్ట (Redwhiskered Bulbul — Pycnonotus Jocosus) — పటము 76 – హిందీ : పహారి బుల్ బుల్ : ఇది తోటలలోనూ, తుప్పలలోను సంచరిస్తూ ఉల్లాసంగా ఉండే పక్షి; మైనకన్నా చిన్నది; మైనకంటె సన్నంగా కూడా ఉంటుంది. ఈ పక్షికి కొనదేరి, ముందుకు వంగియున్న ప్రస్ఫుటమైన శిఖ ఉంటుంది. దీని పైభాగాన ఉన్న ఈకలు గోధుమ రంగులోనూ, క్రింది భాగాన ఉన్నవి తెల్లగానూ ఉంటాయి.

దీని రొమ్ముమీద నల్లని 'కంఠహారం' కొంతవరకూ ఉంటుంది. దీనికి ఎఱ్ఱని మీసాలు, తోక క్రింద ఎఱ్ఱని మచ్చా ఉంటాయి. తగిన ఆహారం, రక్షణ సమకూడే చెట్లు, పొదలు ఉన్నచోట్ల ఈ పక్షి ఉంటుంది. సందడిగా ఉండే నగరాలలో కూడా ఇది ఉండటం కద్దు. దీనిలాగే అందరికీ తెలిసిన ఎఱ్ఱముడ్డి పిగిలిపిట్టలాగ కాక, ఈ పిగిలిపిట్టకు హెచ్చుగా చెట్లూ, కొండలూ ఉండే స్థలాలంటేనే చాలా ఇష్టం. ఈ పిగిలిపిట్టలు జతలు, జతలుగా సంచరిస్తాయి. కాని పండ్లున్న చెట్లవద్దా, పొదలవద్దా ఈ పక్షులు విశేష సంఖ్యలో గుమిగూడుతాయి. వీటికి ప్రత్యేకంగా పాట అన్నది ఏదీ లేదు. కాని ఈ పక్షులు రోజు పొడుగునా ఆహ్లాదకరంగా కూస్తూనే ఉంటాయి. వీటికి పళ్ళే ముఖ్యమైన ఆహారం. వీటికి అక్షింతలచెట్ల పళ్లంటే మహా ఇష్టం. ఇవి సాలెపురుగులను, కీటకాలను, ఆకుపురుగులను కూడా విస్తారంగా కబళిస్తాయి. ఇవి ఎఱ్ఱముడ్డి పిగిలిపిట్టల జాతంత జగడగొండులు కావు. వీటిని పిల్లలుగా ఉన్నప్పుడే పట్టుకొన్నట్లైతే ముద్దుగా పెంచడానికి వీలవుతుంది. అలాంటప్పుడు ఇవి బాగా మచ్చికయి ఇంటిలో వాటి యజమానిని విన్వసంతో అనుసరించి పోతాయి; యజమాని పిలిచినపుడు చాలాదూరం నుండి అతడి వద్దకు వస్తాయి. పిన్నవేళ్లతోనూ, సన్నని రెమ్మలతోనూ, పచ్చగడ్డితోనూ గిన్నెలాంటి గూటిని అల్లుతాయి. ఈ గూటినవి పొట్టి చెట్లమీదనో, పొదలలోనో లేదా తోటలచుట్టూ ఉండే కంచెలమీదనో తరచుగా అందరికీ కనపడే చోట్ల, తెలివి తక్కువగా కడతాయి. అదీకాకుండా ఈ పక్షులు గడబిడగా గూళ్లలోకి వస్తూ, పోతూ ఉంటే, వాటి గూళ్లెక్కడున్నాయో ఇట్టే తెలిసిపోతుంది. అందుచేత వీటి గూళ్లు చాలవరకు గ్రుడ్లు, పిల్లలతో సహా మాంసాహారులైన జంతువుల పాలవుతూంటాయి. అప్పుడప్పుడవి మనుష్యులు కాపురముండే గుడిసెల తడికలలోనూ, పైకప్పులలోనూ జనసంచారం ఉన్నా లెక్క చేయకుండా గూళ్లు కడతాయి. గూటిలో 2 మొదలు 4 వరకూ గ్రుడ్లు ఉంటాయి. లేత గూలాబీరంగులో ఉంటాయి. వాటిమీద నీలారుణచ్ఛాయ గల గోధుమరంగువి గాని, క్లారెటు ఎరుపువి గాని మచ్చలు హెచ్చుగా ఉంటాయి.)

తెల్లబుగ్గల పిగిలిపిట్ట (The Whitecheeked Bulbul-P. Leucogenys) లు భారత దేశంలో ఉత్తర భాగంలోనూ, పశ్చిమోత్తర భాగంలోను సామాన్యంగా కనబడతాయి. ఆ ప్రాంతాలలో ఎఱ్ఱమీసాల పిగిలిపిట్టలంతగా

ఉండవు. వీటికి స్ఫుటంగా కనపడే తెల్లని బుగ్గలుంటాయి; మీసాలుండవు; తోక క్రింద ఎఱ్ఱని మచ్చకు బదులు పసుపు మచ్చ ఉంటుంది. గుజరాతులో పక్షులకు గుండ్రని శిఖలు, కాశ్మీరులో ఉండే వాటికి పొడుగై, కొన దేరి, ముందుకు వంగియుండే శిఖలు – ఇలా వేర్వేరు రాష్ట్రములలో ఉండే ఈ పక్షులకు వేర్వేరు ఆకారాల శిఖలుంటాయి.

ఎఱ్ఱముడ్డి పిగిలిపిట్ట (Redvented Bulbul — P. Cafer) — పటము 77 — హిందీ: బుల్ బుల్ లేక గూల్ దూమ్. ఈ పక్షి గోధుమ రంగులో ఉంటుంది. ఇది తోటలలో సంచరించే పక్షి. దీని తల నల్లగా ఉంటుంది; తలమీద శిఖ ఉంటుంది; రొమ్ముమీద, వీపుమీదా కూడా పొలుసుల వంటి చారలుంటాయి; తోకకు మొదటి భాగమున క్రింది వైపున ఎఱ్ఱని మచ్చ ఉంటుంది. ముఖ్యంగా అది ఎగిరేటప్పుడు దాని తెల్లని పిఱ్ఱలు బాగా కనపడతాయి. సామాన్యంగా చిట్టడవులలోనూ, మానవ నివాసాలకు దూరంగానూ, సమీపంలోనూ కూడా ఉండే తోటలలోనూ ఈ పిగిలిపిట్టలు కనపడతాయి. కాని ఎక్కువగా చెట్లూ, కొండలూ ఉండే ప్రదేశాలలో మాత్రం మీసాల పిగిలిపిట్టలు హెచ్చుగా ఉంటాయి. ఆహ్లాదకరమైన స్వరాలూ, చురుకైన స్వభావమూ గల ఎఱ్ఱముడ్డి పిగిలిపిట్టలు ఉండటం చేత తోటలకు చాలా నిండుతనం వస్తుంది. వీటికి పచ్చి బటాణీలూ, మరి కొన్ని కాయధాన్యాలూ ఇష్టమవడం చేత ఒక్కొక్కప్పుడీ పిగిలిపిట్టలు కూరగాయ తోటలకు ఎక్కువ నష్టం కలుగచేస్తాయి. వీటికి ముఖ్యాహార మైన బెర్రీ పళ్లనే కాకుండా అవి శలభాలనూ, అకుపురుగులనూ కూడా తింటాయి. స్వాతి వానలు కురిసిన వెంటనే భూమి అడుగునుండి పైకి వచ్చే ఇసుళ్లను అవి కన్నాలనుండి వచ్చే రావడంతో ఈ పిగిలిపిట్టలు గంతుతూ పోయి ఏరుకొని తింటాయి; లేదా పొదమీద నుండి గాలిలోకి నిట్టనిలువుగా ఎగిరి, ఇసుళ్లు గాలిలో ఎగిరేటప్పుడు వాటిని పట్టుకొని తింటాయి.

ప్రవర్తనలో గాని, అలవాట్లలో గాని, ఎఱ్ఱమీసాల పిగిలిపిట్టలకూ, ఎఱ్ఱ ముడ్డి పిగిలిపిట్టలకూ అట్టే తేడాలేదు కాని ఎఱ్ఱముడ్డి పిగిలిపిట్టలు మరీ జగడగొండులు. భారతదేశంలో పక్షులను పెంచేవాళ్లు పోట్లాడే పక్షులలో ఈ పిగిలిపిట్టలకు అగ్రస్థానం ఇస్తారు. ఈ దేశంలో కొన్నిచోట్ల పండుగ రోజులలోనూ, సెలవురోజులలోనూ ఈ పిగిలిపిట్ట పందేలను ఒక జనరంజక

మైన క్రీడగా భావిస్తారు. ఈ పక్షుల యజమానుల మధ్య తీవ్రమైన పోటీ జరుగుతుంది. ఈ పందేలలో పెద్ద మొత్తాలలో సొమ్ము, చేతులు మారుతుంది. పందేలలో బాగా నెగ్గిన పక్షులకు పెద్ద ఖరీదు వస్తుంది. మిగతా పిగిలి పిట్టలలాగే ఇది కూడా గూటిని పిల్లవేళ్లతోనూ, రెమ్మలతోనూ, పచ్చగడ్డి తోనూ గిన్నెలాగ కడుతుంది. ఈ గూటిని అది పొట్టి చెట్లమీదనో, పొదల మీదనో కడుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ పిగిలిపిట్ట మనుష్యులు వచ్చి, పోయే బంగాళా వరండాకు ఒక మీటరు దూరంలోనే బద్దలతో అల్లిన తడకకు అల్లుకొన్న లతలో గూడు కడుతుంది. గూటిలో రెండు, మూడు గ్రుడ్లుంటాయి. ఎఱ్ఱమీసాల పిగిలిపిట్ట గ్రుడ్లకీ, దీని గ్రుడ్లకీ ఏమీ తేడా కనబడదు.

పెస్సరిఫార్మిస్ వర్గంలోని మ్యుసికాపిడె (Muscicapidae) కుటుంబం అనేక జాతుల పక్షులతో క్రిక్కిరిసి ఉంటుంది. ఈ కుటుంబంలో బాహ్య దృష్టికి విరుద్ధ లక్షణాలు గల అనేక ఉప కుటుంబాలు ఉన్నాయి. తోక పిగిలి పిట్టలనూ, సైదాపిట్టలనూ, వార్బ్లర్లనూ (Warblers), త్రష్‌లనూ (Thrushes) ముఖ్యమైన అవయవ నిర్మాణాన్ని బట్టీ, అలవాట్ల సారూప్యతను బట్టీ వాటిని ఆయా ఉపకుటుంబాలలో చేర్చారు. వీటిని గురించి వివరంగా తెలిసికోవాలంటే చాలా సాంకేతిక పరిజ్ఞానం అవసరం. కావున ఆ వివరాలు తెలిసికోవడం మన ప్రస్తుత ఆశయం కాదు. కొన్ని ఉదాహరణ లను తెలిసికొంటే చాలు.

తెల్ల చుక్కల తోక పిగిలిపిట్ట (Whitespotted Fantail Flycatcher—Rhipidura Albogularis) -పటము 78-హిందీ : నాఛన్ లేక ఛక్‌దిల్. ఈ తోక పిగిలిపిట్ట గురించి పాఠకులలో చాల మందికి బహుశా తెలిసియే ఉంటుంది. ఇది ఉల్లాసంగానూ, చురుకుగానూ ఉండే పక్షి. ఇది పొగ - గోధుమరంగులో సుమారు పిచ్చుకంత ఉంటుంది; స్ఫుటమైన తెల్లని కను బొమ్మలూ, తెల్లచుక్కల రొమ్మూ, పార్శ్వమూ, తెల్లని పొత్తికడుపూ ఉంటాయి. దీని తోకకొక ప్రత్యేక లక్షణం ఉంది. దీని తోక పైకెత్తి పెట్టుకొని విసనకఱ్ఱలాగ విప్పుకొని ఉంటుంది. తోక కిరుప్రక్కలా దీని రెక్కలు క్రిందికి వ్రేలపడి ఉంటాయి. ఈ తోక పిగిలిపిట్ట చిట్టడవులలోనూ, తోటలలోనూ, తోపులలోనూ సుఖంగా జీవిస్తుంది. ఇది మిక్కిలి సందడిగా ఉండే జనసమ్మర్దమైన పట్టణాలలో కూడా సంచరిస్తుంది. ఇది మనుష్యుని

లక్ష్యపెట్టదు. ఇది బాగా మచ్చికవుతుంది. మనుష్యునిపట్ల విశ్వాసంతో మెలగుతుంది. అవి ఏర్పరచుకొన్న ప్రత్యేకమైన ప్రదేశాలలో జతలు, జతలుగా కొమ్మనుండి కొమ్మకూ, ఒక చెట్టునుండి మరియొక చెట్టుకూ విధీ విరామం లేకుండా గెంతుతూ, నృత్యం చేస్తూ, గిఱ్ఱుమని తిరుగుతూ కాలక్షేపం చేస్తాయి. దోమలకొరకూ, అటువంటి మరి కొన్ని చిన్న రెక్క పురుగుల కొరకూ ఈ పక్షులు చురుకుగానూ, తీవిగానూ వలయాల్లో మెలికలు తిరుగుతూ, ఎగురుతూ గాలిలో వాటిని తమ దవుడలతో లటుక్కుమని పట్టుకొంటాయి. ఆ దవుడల చప్పుడు ఈ పక్షుల నృత్యానికి సరియైన వాద్యంలాగుంటుంది. సాధారణంగా ఇది "చక్ చక్" అని కూస్తుంది. కాని అది గాలిలో ముందుకు దూకినపుడల్లా రమ్యంగా అనేక స్వరాలతో ఆరోహణ అవరోహణలలో ఈలవేస్తూ పాడుతుంది. దోమలూ, ఈగలూ మొదలైన రెండు రెక్కల కీటకాలను ఈ పక్షి తింటుంది. దీని గూడు వైను గ్లాసువంటి చిన్న అందమైన గిన్నె. ఈ గూటిని అది సన్నని గడ్డిపోచల తోను, నార పోగులతోను కడుతుంది. గూటిపై భాగాన సాలెపట్టులను అందంగా అంటించి సాపు చేస్తుంది. చూడడానికిది అయోరా గూడులాగే ఉంటుంది. కాని ఈ గూటినుండి పుల్లముక్కలూ, చెట్టు బెరడు ముక్కలూ వ్రేలాడుతూ, కొంత వరకు అందవికారంగా ఉంటుంది. అయోరా గూడునుండి ఇటువంటి ముక్కలేవీ వ్రేలాడవు; అది నీటుగా ఉంటుంది. ఇదే దీని గూటికీ అయోరా గూటికీ తేడా. ఈ గూటిని అది మామిడివంటి పొట్టిచెట్ల రెమ్మల చివర పలవలో భూమికి 3 మీటర్లకు మించని ఎత్తులో కడుతుంది.

సామాన్యంగా గూటిలో మూడు గ్రుడ్లుంటాయి. అవి కొంచెం ఎరుపు ఛాయగల మీగడరంగులో ఉంటాయి. గ్రుడ్డు యొక్క వెడల్పైన కొన చుట్టూ వలయాకారంలో చిన్న గోధుమరంగు చుక్కలు ఉంటాయి.

తెల్లనుదురు తోక పిగిలిపిట్ట (Whitebrowed Fantail Flycatcher-R. Aureola): ఇది తెల్ల చుక్కల తోక పిగిలిపిట్టకు దగ్గర చుట్టము. దీనికి వెడల్పైన తెల్లని నుదురూ, తెల్లని క్రింది భాగాలూ ఉంటాయి. సామాన్యంగా ఇది భారత ఉపఖండంలో అన్నిచోట్లా కనబడుతుంది.

దేవలోకపు తోక పిగిలిపిట్ట (Paradise Flycatcher — Terpsipho Paradisi) - పటము 79 -హిందీ: షాబూల్ బూల్ లేక దూద్ రాజ్. తోక రిబ్బనులను మినహాయిస్తే ఈ పక్షి సుమారు పిగిలిపిట్టంత ఉంటుంది.

తోక రిబ్బనులు 25 - 30 సెంటీమీటర్లు పొడుగుంటాయి. బాగా వయసు వచ్చిన మగది వెండి తెలుపురంగులో ఉంటుంది; దాని తోకలో రెండు పొడుగుపాటి రిబ్బనులవంటి ఈకలుంటాయి. దీని శిఖతో కూడిన తల లోహంలాగ నిగనిగలాడుతూ నల్లగా మెరుస్తుంది. ఆడుపక్షి, పిన్న వయసులోని మగపక్షి, పై వైపున చెస్నటు రంగులోనూ, క్రింది వైపున బూడిద చాయగల తెలుపురంగులోను ఉంటాయి; వీటికి కూడ శిఖగల నల్లని తల ఉంటుంది. పిన్న వయసులోని మగపక్షి తోకలో చెస్నటు రంగు రిబ్బనులవంటి ఈకలుంటాయి. ఆడుదాని తోకలో రిబ్బను ఈక లుండవు; ఆడుపక్షి చూడడానికి చాలవరకు పిగిలిపిట్టలాగే ఉంటుంది. ఈ అందమైన పిట్టను 'జువ్వపిట్ట' (Rocket Bird) అనీ 'అనాథ పిట్ట' (Widow Bird) అనీ, 'రిబ్బను పిట్ట' (Ribbon Bird) అనీ కూడా అంటారు. నీడ బాగా ఉన్న తోటలలోనూ, తోపులలోనూ, ఆకులను రాల్చే చెట్లున్న అడవులలోనూ, వెదురు పొదల దగ్గరనున్న కాలువల వద్దా ఈ పక్షులు సంచరిస్తాయి. ఇవి జతలు, జతలుగానైనా తిరుగుతాయి. లేదా కీటక భక్షకులైన ఇతర పక్షులతో కలిసి కీటకాలను వేటాడుతాయి. మగపక్షి రెక్క పురుగుల వెంబడి ఆకాశంలో వలయాకారంగా మెలికలు తిరుగుతూ చేసే విన్యాసాలూ, కొరడాను అదలించినపుడు తాడు మెలికలు తిరిగినట్లు దాని తోకలోని రిబ్బనువంటి ఈకలు తిరగడమూ, అవి ఒక చోటునుండి మరియొక చోటునకు అలలు, అలలుగా ఎగరడమూ—ఈ సొగసైన దృశ్యాలు చూస్తే వాటిని మనం ఎన్నటికీ మరవలేము. ఈ అందాలరాశి పాటకూడా బాగుంటుందని మనం ఆశిస్తాం. కాని ఈ పక్షి ఏ పాటా పాడదు. 'ఛె' లేదా 'ఛె ఛ్వే' అంటూ కఠినంగానూ, బొంగురుగానూ కూస్తుంది. అయితే, గ్రుడ్లను పెట్టేకాలంలో మాత్రం మగపక్షి, ఆడుపక్షి కూడా పలురకాల శ్రావ్యమైన స్వరాలను పలుకుతాయి. ఈ రెండింటి కూతలను కలిపితే కొంతవరకూ పాటలాగే ఉంటుంది. ఈగలూ, దోమలూ, శలభాలూ మొదలైనవి దేవలోకపు తోక పిగిలిపిట్టల ఆహారం. వీటిలో చాలావాటిని ఈ పక్షులు గాలిలో ఎగురుతోనే పట్టుకొంటాయి. మన ఉపఖండంలో చాలాచోట్ల ఈ దేవలోకపు తోక పిగిలిపిట్ట గూళ్లను కడుతుంది. కాని కాశ్మీరులోయలో సామాన్యంగా గ్రుడ్లను పెట్టే పక్షులలో ఇది ఒకటి. ఆ రాష్ట్రము యొక్క రమణీయతకు ఇవి ఎంతైనా దోహదం చేస్తూ విలాస యాత్రికులను ఆకర్షిస్తాయి.

ఈ పక్షి సన్నని గడ్డి పోచలతోనూ, నార పోగులతోనూ గిన్నెవంటి గూడును కట్టి దాని వెలుపల సాలెపట్టులనూ, సాలె పురుగుల గూళ్లనూ అంటిస్తుంది. సాధారణంగా నేలకు 2 మొదలు 5 మీటర్ల ఎత్తులో ఒక్క రెమ్మ కొననున్న పలవలో ఈ గూటిని అది కడుతుంది. గూటిలో 3 మొదలు 5 వరకూ గ్రుడ్లుంటాయి. అవి లేతమీగడ ఎరుపు రంగులో ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు చుక్కలూ, మచ్చలూ ఉంటాయి.

సైదాపిట్టలు (Babblers) పెద్ద సంఘాలుగా కూడి ఉంటాయి. ఈ సంఘాలలో చిన్నవీ, పెద్దవీ, మధ్య రకంవీ అనేక పరిమాణాలు కలవి కలిసి ఉంటాయి. వీటి ఈకలు అచ్చంగా గోధుమరంగులో గాని, కాంతిమంతమైన రంగులలో గాని ఉంటాయి. ఈ పక్షులు ముఖ్యంగా సంఘజీవులు. ఈ క్రిందివి టిమేలీనె (Timaliinae) ఉప కుటుంబంలో మనకు బాగా పరిచితమైన పక్షులు.

పచ్చకంటి సైదాపిట్ట (Yellow-eyed Babbler — Chrysomma Sinesis) – పటము 80 – హిందీ: బూలాల్ ఛాషమ్: ఈ పక్షి పిగిలిపిట్ట కన్న కొంచెం చిన్నది ; తోక పొడుగుగా ఉంటుంది. తుప్పలున్న చిట్టడవులలోనూ, గుల్మవాటికలలోనూ ఉంటుంది. దీని పైభాగం లేతపసుపు–గోధుమరంగులోనూ, క్రింది భాగం తెల్లగానూ ఉంటాయి. దీని కనురెప్పలు నారింజ–పసుపు రంగులోనూ, కళ్లు పసుపుపచ్చగానూ ఉంటాయి. ఈ కుటుంబంలోని అనేక పక్షులలాగ ఇవి కూడా 5-7 పక్షులు గుంపుగా కూడి ముళ్లతుప్పలు, పొడుగుపాటి గడ్డిగల అడవులందూ, పంట పొలాల గట్లమీద పెరిగే పచ్చగడ్డి దుబ్బులలోనూ సంచరిస్తాయి. చిన్న పొదలలో ఇవి కీటకాలను వేటాడతాయి. గడ్డి మొక్కల నెక్కి, తరచుగా వాటిని పట్టుకొని ప్రక్కలకు గాని, తల క్రిందుగా గాని వ్రేలాడుతూ కీటకాలను వేటాడుతాయి. అవి శత్రువులకు కనబడకుండా దాక్కోవడంలో ప్రసిద్ధికెక్కాయి. వాటిని కలవరపెడితే పొదనుండి పొదకు గెంతుకుంటూ, పుట్టి మునిగినట్లు అరుస్తూ పోయి తుప్పలలో దూరి యిట్టే మాయమవుతాయి. అవి "చీప్ - చీప్ - చీప్" అంటూ గట్టిగా, స్పష్టంగా, ఏడుస్తున్నట్లుగా అరుస్తాయి. గ్రుడ్లను పెట్టే కాలంలో మగ పక్షులు ఏ పొదమీదకో, గడ్డి దుబ్బునో ఎక్కి గట్టిగా, ముచ్చటగా "చీప్" అంటూ పాడతాయి. ఈ

పక్షులు సాలెపురుగులనూ, మిడుతలనూ, మరికొన్ని కీటకాలనూ తింటాయి; కాని వీటి మిగతా బంధువులలాగే ఈ పక్షులకు కూడా మకరందం అంటే ఎంతో ఇష్టం. ఆకర్షణీయంగా ఉండే బాడిద పువ్వులూ, బూరుగ పువ్వులూ దొరికినపుడు అవి వాటికి అతిథులవుతాయి. పచ్చకంటి సైదాపిట్ట ముతక గడ్డితో లోతైన గిన్నెవంటి గూటిని కట్టి, లోపలి వైపున మెత్తదనం కొరకు మృదువైన పదార్థాల నుంచుతుంది. గూటి వెలుపలి భాగాన అది సాలెపట్టులను విరివిగా అంటిస్తుంది. ఈ గూటిని అది భూమికి రెండు మీటర్ల లోపు ఎత్తున ఒక పొదలో రెండు కొమ్మల వలనలోనైనా ఉంచుతుంది, లేదా నిట్టనిలువుగా ఉండే రెండు గడ్డి మొక్కల మధ్య ఉయ్యాల లాగనైనా వ్రేలాడ తీస్తుంది. గూటిలో పసుపు చాయగల తెల్లని నాలుగైదు గ్రుడ్లుంటాయి. వాటిమీద లేత ఊదా కలిసిన గోధుమరంగులో చక్కని చుక్కలుంటాయి.

అడవి సైదాపిట్ట (Jungle Babbler - Turdoides Striatus) - పటము 81 – హిందీ: సాత్ భాయ్ లేక ఘొంఘాయి: ఇది మట్టిరంగు పక్షి. ఇది దుర్వాసన వేస్తూ అందవిహీనంగా ఉంటుంది; మైనగోరు కన్న కొంచెం చిన్నది. దీని తోక పొడుగ్గా ఉంటుంది. ఈ తోక దాని దేహంలోకి వదులుగా దూర్చి ఉంచినట్లు కనబడుతుంది. ఇవి 6 లేక 7 పిట్టలు చేరి గుంపుగా తిరుగుతూంటాయి. అందుచేతనే వీటికి "సాత్ భాయ్" అనే హిందీ నామం, "సెవెన్ సిష్టర్సు" (ఏడుగురు అక్కచెల్లెళ్లు) అనే ఆంగ్ల నామం సార్థకమయాయి. అడవి సైదాపిట్టలు ఊరి వెలుపల చిట్టడవులలోనే కాక పట్టణాలకు, గ్రామాలకు లోపల, వెలుపలకూడా ఉండే దట్టంగా చెట్లున్న తోటలలోనూ, ఇళ్ల ఆవరణలలోనూ, చెట్లతోపులలోనూ కూడా ఇవి నివసిస్తాయి. ఈ 'అక్క చెల్లెళ్లు' నేలమీద గెంతుతూ కీటకాల కోసరం రాలిన ఆకుల మధ్య వెదకుతూ కాలయాపన చేస్తాయి. అడవులలో సంచరిస్తూ కీటకఖాదులైన ఇతర పక్షులతో ఇవికూడ కలిసి తిరుగుతూ కీటకాలను వేటాడుతాయి. ఈ పక్షులు కఠోరంగా సంభాషణ సరళిలో ఎల్లపుడూ వాగుతూ, కిచుకిచుమంటూ ఉంటాయి. ఈ విధంగా ఈ అక్కచెల్లెళ్ల మధ్య మైత్రి విస్తారంగా వర్ధిల్లుతుంది. కాని అప్పుడప్పుడు వాటిలో వాటికి పేచీలుకూడా వస్తుంటాయి. అప్పుడు వాటి మధ్య మైత్రి పొసగక ముక్కుతోనూ, గోళ్లతోనూ పోరాటం ప్రారంభిస్తాయి. అప్పుడీ పక్షుల ఈకలు

విడి పైకి ఎగురుతాయి. అయితే ఇటువంటి పొరపాట్లు ఎప్పుడో కాని రావు; వచ్చినా అవి అట్టేకాలం నిలువవు. త్వరలోనే వాటి మధ్య సద్భావం ఏర్పడుతుంది. ఇతర పక్షులేవైనా వీటిని బెదరించి, కలహానికి కాలు దువ్వితే ఈ అక్క చెల్లెళ్లన్నీ కలిసి, మూక ఉమ్మడిని ఎదురుదెబ్బ తీయ డానికి నిలబడతాయి. ఈ పక్షుల గుంపులో ఏదైనా ఒకదాని మీదికి పిల్లి కానీ, డేగకానీ వస్తే దానిని ప్రమాదం నుండి తప్పించడానికి మిగతా పక్షులన్నీ ధైర్యంగానూ, పట్టుదలతోనూ గోల చేస్తూ ఆ శత్రువు మీదపడి అది పలాయనం చిత్తగించేటట్లు చేస్తాయి. ఈ పక్షులు సాలీడులనూ, బొద్దింకలనూ, శలభాలనూ, మరికొన్ని కీటకాలనూ, కీటకాల లార్వాలనూ తింటాయి. అవి మట్టి, రావి, లాంటానా మొదలైన పళ్లనూ, గింజలనూ, తృణధాన్యాలనూ కూడా తింటాయి. బూరుగ, బాడిద పూవుల మకరంద మంటే సైదాపిట్టలకు మహా ఇష్టం. ఆ మకరందాన్ని అందుకొనడానికవి చేసే ప్రయత్నంలో ఈ పక్షులు ఆ పూవులందు పరపరాగ సంపర్కానికి ఎంతో సహాయం చేస్తున్నాయి. భూమికి 3 మొదలు 5 మీటర్ల ఎత్తున బాగా ఆకులున్న కొమ్మ పలవలో అడవి సైదాపిట్టలు పుడకలతోనూ, పిల్ల వేళ్లతోనూ గిన్నెలాంటి గూడు కడతాయి. గూటిలో నీలాకుపచ్చ రంగులో మూడు నాలుగు అందమైన గ్రుడ్లుంటాయి. అడవి సైదాపిట్టలలో తలి దండ్రులేకాక మరికొన్ని పక్షులు కూడా కలిసి ఉమ్మడిగా గూళ్లు కట్టడమే కాకుండా గూటిలోని పిల్లలకు ఉమ్మడిగా ఆహారమిచ్చి పోషించడం శాస్త్రజ్ఞులు పరిశీలించారు. ఈ పక్షులలో ఈ అలవాటు సర్వ సామాన్య మైనదిగా గోచరిస్తుంది. గోలకోవెలా (Pied Crested Cuckoo), కుట్టిపిట్టా (Hawk Cuckoo) కూడా సరిగా ఇలాంటి రంగు గుడ్లే పెడతాయి. ఇవి వాటి గ్రుడ్లను అడవి సైదాపిట్టల గూళ్లల్లో పెట్టి వాటి పిల్లలను పరభృ తాలుగా చేస్తుంటాయి.

సామాన్య సైదాపిట్ట (Common Babbler — Turdoides Caudatus) పటము 82 — హిందీ: దుమ్రీ లేక చిల్ చిల్: సైదాపిట్టల గణంలోని ఈ పక్షి అందరికీ బాగా తెలిసిందే. ఇది పిగిలిపిట్టంత ఉంటుంది. దీని తోక మాత్రం పిగిలిపిట్ట తోకకన్నా పొడుగుగా ఉంటుంది. ఇది అడవి సైదాపిట్ట కన్న సన్నగా ఉంటుంది. కాని ఈ పక్షులు కూడా అడవి సైదా పిట్టలాగే సుమారు ఆరేసి కలిసి 'అక్క చెల్లెళ్ల' లాగా గుంపులు గుంపులుగా

పటము 81

**అడవి సైదాపిట్ట**

(*Turdoides striatus*)

పేజీ 143





పటము 82

**సామాన్య సైదాపిట్ట**

(*Turdoides caudatus*)

పేజి 144

పటము 83

**బూడిదరంగు కూజుపిట్ట**

**(*Prinia socialis*)**

పేజి 146





పటము 84

**దర్జీపక్షి (లిక్కుజిట్ట)**

**(*Orthotomus sutorius*)**

పేజి 147

పటము 85

**సరలగాడు**

(*Copsychus saularis*)

పుట 148





పటము 86

**షామా**

***(Copsychus malabaricus)***

పేజీ 150



పటము 87

**బట్టపొదజిట్ట**

*(Saxicola caprata)*

పేజీ 150



పటము 88

**నల్లంచిగాడు**

(*Saxicoloides fulicata*)

పేజి 151

పటము 89

కస్తూరిపక్షి

(*Myiophoneus horsfieldii*)

పేజి 152






పటము 90

బూడిదరంగు గంగిజిట్ట

(*Parus major*)

పేజీ 154



పటము 91
సిరిపిట్ట
(*Sitta castanea*)
పేజీ 155

పటము 92

**బూడిదరంగు కంపజిట్ట (పై చిత్రం)**

**(*Motacilla caspica*)**

← **బట్టకంపజిట్ట (క్రింది చిత్రం)**

**(*Motacilla maderaspatensis*)**

పుటలు 157 & 158

పటము 93

**గుల్లజిట్టంగి**

**(*Anthus trivialis*)**

పుట 159






పటము 94

**టికెల్ పూపొడుపుపిట్ట**

(***Dicaeum erythrorhynchos***)

పేజీ 161



పటము 95

**ఊదాతేనెపిట్ట**

(*Nectarinia asiatica*)

పు. 162




పటము 96

వెల్లకంటి

(*Zosterops palpebrosa*)

పేజీ 164

నేలమీదను, ముళ్ల పొదల మధ్యను తిరుగాడుతూ ఉంటాయి. ఈ సైదా పిట్ట పైభాగమున ఉన్న ఈకలు మట్టిరంగులో ఉంటాయి. వాటిమీద ముదురురంగులో చారలుంటాయి. దీని తోక పోను పోను వెడల్పుగా ఉండి దేహానికి వదులుగా అతికినట్లు కనబడుతుంది. ఈ తోకమీద అడ్డ చారలుంటాయి. ఈ పక్షులు నేలమీద ఎలుకలులాగ గునగున నడుస్తూ దగ్గర దగ్గర అడుగులు వేసికొంటూ పరుగెత్తుతూ, పొదల క్రిందా, తుప్పల గుండా లొడపెడుతూ, కీటకాలనూ, ఆకు పురుగులనూ వెతుకుతూ, కాల క్షేపం చేస్తాయి. ఇవి ఎగరడానికంతగా ఇష్టపడవు. వాటిని కలవరపరుస్తే పారిపోవడానికి అవి వాటి చురుకైన కాళ్లమీదే ఎక్కువగా ఆధారపడ తాయి. ఇవి పొదనుండి పొదకు పరుగెత్తుకుంటూనే పోతాయి. ఇవి సత్తు వతో చాల దూరం ఎగురలేవు — కొన్నిసార్లు త్వర త్వరగా రెక్కలను కొట్టి, వెంటనే రెక్కలను, తోకనూ బాగా విప్పియుంచి, ముందుకు జారు తాయి. ఈ పక్షి ఇంపైన మధుర స్వనములు గల ఈలలు వరుసగా వేస్తుంది. ఏదైనా పామునో, పిల్లినో చూచి, అవి కలవరపడినపుడు "విచ్-విచ్ – విచీ – రీ – రీ – రీ – రీ – రీ – రీ" అంటూ శ్రావ్యమైన ఈలలు వేస్తాయి. అలాంటప్పుడు భయంతో రెక్కలనూ, తోకనూ ఊడుస్తూ, శత్రువులను తొంగి చూస్తూ 'అక్క చెల్లెళ్ల'ంతా కలిసి దానిమీద ఈలల తిట్లను కురిపిస్తాయి. సాలె పురుగులూ, కీటకాలూ, పళ్లూ, గింజలు, తృణ ధాన్యాలు, పూదేనె ఈ పక్షుల ఆహారం. ఈ పక్షి పచ్చ గడ్డితోనూ, పిల్ల వేళ్లతోనూ గిన్నెలాంటి నీటైన గూటిని నేలకు సుమారు 2 మీటర్ల ఎత్తున ముండ్లపొదలో కడుతుంది. గూటిలో మూడు నాలుగు గ్రుడ్లుంటాయి. అవి నిగనిగలాడుతూ నీలాకు పచ్చరంగులో ఉంటాయి. అడవి సైదాపిట్ట, బూడిదరంగు పెద్ద సైదాపిట్టల గూళ్లలో లాగే ఈ సైదాపిట్టల గూళ్లలో కూడా గోల కోవెలా, కుట్టి పిట్టా గ్రుడ్లను పెట్టి పిల్లలను పరభృతాలు చేస్తాయి. ఈ పక్షులన్నిటి గ్రుడ్లు రంగులో ఒకేలాగుంటాయి.

బూడిదరంగు పెద్ద సైదాపిట్ట (Large Grey Babbler — T. Malcolmi), పై సైదాపిట్టలకిది దగ్గర చుట్టమే. వాటికంటే ఇది ఎక్కువ గాఢమైన బూడిద, గోధుమరంగులో ఉంటుంది. దీని నుదురు బూడిద రంగులోను, దీని తోకలోని వెలుపలి ఈకలు తెల్లగాను ఉంటాయి. ఈ పక్షి ఎగిరేటప్పుడు తోకను బాగా విప్పి ఉంచుతుంది. అప్పుడు తోకలోని తెల్ల

ఈకలు స్పష్టంగా కనపడతాయి. ఈ పక్షి మన ద్వీపకల్పంలోని పొడిగా ఉండే ప్రదేశాలలో సామాన్యంగా కనపడుతుంది; దక్కను పీఠభూమిలో ఇవి విరివిగా లభిస్తాయి.

కూజా పిట్టలు (Warblers) చాల చిన్న పక్షులు. వీటి రంగంతగా ఆకర్షణీయంగా ఉండదు. ఇవి పిచ్చుకలకన్నా చిన్నవి. మొత్తంమీద ఈ ఉపకుటుంబం లక్షణాలను విశదీకరించడం చాలా కష్టం. వీటిలో అనేక జాతులు మన దేశంలో నివాసం ఏర్పరచుకొన్నవే. మిగిలినవి వలసపోతూ, వస్తూంటాయి. సిల్వినె ఉపకుటుంబా (Subfamily Sylviinae) నికి ఉదాహరణంగా మనకు బాగా పరిచయమైన ఈ క్రింది పక్షులను తీసికొనవచ్చును.

బూడిదరంగు కూజా పిట్ట (Ashy Wren-Warbler—Prinia Socialis)- పటము 83 – హిందీ : పూట్కీ (చాలా కూజాపిట్టలకు హిందీలో ఈ పేరే వాడతారు): ఈ పక్షి పై భాగం బలపపు బూడిదరంగులో ఉంటుంది; క్రింది భాగం గోధుమ చాయకల తెలుపురంగులో ఉంటుంది; తోక వదులుగాను, పొడుగుగాను ఉంటుంది. తోక కొనను నలుపూ – తెలుపూ గుర్తులుంటాయి. ఈ తోకను అది కొంచెం ఎత్తిపెట్టుకొని, ఎల్లప్పుడూ పైకీ క్రిందికీ ఆడిస్తూ ఉంటుంది. శీతకాలంలో దీని ఈకలకు బలపపురంగు పోయి గోధుమరంగు వస్తుంది. చుట్టూ చిన్నమొక్కల కంచె కలిగి, బాగా నీటిపారుదల గల తోటలలో ఈ చిన్న కూజాపిట్ట తరచుగా కాన వస్తుంది. ఇది పిరికిది కాకపోయినా సాత్విక స్వభావం కలది. ఇది తోకను పైకెత్తిపెట్టుకొని, దానిని మధ్య మధ్య ఆడిస్తూ కీటకాలకొరకూ, ఆకు పురుగుల కోసరం పొదల మధ్య గెంతుతూ ఉంటుంది. అలాంటప్పుడది ఉండి ఉండి "టీ – టీ – టీ" అంటూ కీచుగా కూస్తుంది. గ్రుడ్లను పెట్టేకాలంలో మగ పిట్ట ఆడంబరంగా ఏ చెట్టు కొమ్మమీదకో ఏ పొద శిఖరానికో ఎక్కి, ఉత్సాహంతో అదే పనిగా కూస్తుంది. ఇది తోకను పైకి క్రిందికీ ఆడిస్తూ, రెక్కలను కొట్టుకొంటూ మిడిసి పడుతూ ఎగురుతుంది. అది పైకీ, క్రిందికీ ఇలా ఎగురుతూ చేస్తున్న నృత్యం మనం చూస్తూ ఉంటే ఈ పక్షి తోక బరువవడం వలన దాని మోయలేక పోతోందా అనిపిస్తుంది. దానిని గూటినుండి తరిమివేస్తే, అవి కలవరపడుతూ ఎగిరి, వాటిచుట్టూ ఉన్న చుట్టాలతోపాటు "కిట్ – కిట్ – కిట్" అంటూ కరకుగా విద్యుత్

కణాలలాగ శబ్దం చేస్తాయి. బహుశా అది ముక్కుపుటాలను ఒక దానిపై ఒకటి కొట్టడంవలన ఈ రకం శబ్దం కలుగవచ్చును; కాని ఈ శబ్దానికి మూలమేమిటో ఇంకా రుజువు కాలేదు. ఈ కూజుపిట్ట సామాన్యంగా దర్జీ పక్షి గూడులాంటి గూడు కడుతుంది. అది ఆకులను కుట్టి ఒక గరాటు వంటి గూటిని నిర్మిస్తుంది. కాని గూటికి కావలసిన పెద్ద ఆకులు లభించనప్పుడు నారపోచలతో దీర్ఘవృత్తాకారపు సంచిలాంటి గూడును అల్లుతుంది. ఈ గూటికి ఆధారంగా కొన్ని చిన్న ఆకులను చేర్చి సాలెపట్టులతో టాకాలు వేస్తుంది. సామాన్యంగా ఈ గూడు నేలకు 1 ½ మీటర్లలోపులోనే ఉంటుంది. గూటిలో మూడు నాలుగు గ్రుడ్లుంటాయి. అవి అందంగా నిగనిగలాడుతూ ఇటుక–ఎరుపురంగులో ఉంటాయి. గ్రుడ్డుకు వెడల్పైన కొననుచుట్టి నల్లని వలయం ఉంటుంది.

భారతదేశపు కూజుపిట్ట (The Indian Wren — Warbler — P. Subflava) : ఈ పక్షి ఎట్టని గోధుమరంగులో అనగా శీతకాలంలో బూడిద రంగు కూజుపిట్ట రంగులో ఉంటుంది. అయితే దీని తోక కొనను తెలుపు-నలుపు గుర్తులుండవు. దీనికి తడి నేలలకన్నా పొడి నేలలంటే ఎక్కువ ఇష్టం. బూడిదరంగు కూజుపిట్టకూ, దీనికీ ఇవే తేడాలు.

దర్జీపక్షి (The Tailor Bird — Orthotomus Sutorius) — పటము 84 : – దీనిని లిక్కుజిట్ట అని కూడా అంటారు. యోగ్యతను బట్టి ఈ పక్షి మనకు బాగా పరిచితమైనది. కిప్లింగు వ్రాసిన 'జంగిల్ బుక్' అనే ప్రసిద్ధ గ్రంథం ద్వారా ఈ పక్షి ఖ్యాతి పెంపొందింది. ఈ పక్షి చాల చురుకైనది ; ఆలివ్ ఆకుపచ్చరంగులో ఉంటుంది. దీని క్రింది భాగాలు తెల్లగా ఉంటాయి ; తల త్రుప్పురంగులో ఉంటుంది. నీటుగా పైకెత్తి పెట్టుకొన్న తోకలో పొడుగుపాటి సన్నని సూదులవంటి నడిమి ఈకలుంటాయి. ఈ పక్షి ఒంటరిగా గాని, జతలుగా గాని, తుప్పలలోనూ, తోటలలోనూ కనబడుతుంది. ఇది పట్టణాలలోనూ, పల్లెటూళ్లలోనూ కూడా సుఖంగా ఉండగలదు. ఇది ప్రతి చోటా మచ్చికగా మసలుతుంది. మనుష్యులు నివసిస్తున్న బంగాళాల వరండాలలోకి ఈ పక్షులు నిర్భయంగా నేలమీద గెంతుకుంటూ పోయి, వాటి గూళ్ల కోసరం దారపు ముక్కలనూ, ప్రత్తి పిసళ్లనూ ఏరుకొంటాయి ; లేదా ఇంట్లో ఉండే వాళ్లకు కొన్ని అడుగుల దూరంలోనే ఉన్న కుండీ మొక్కలలోనూ, తడకలమీద ప్రాకే లతల

లోనూ ఉండే పురుగులకై వేటాడుతాయి. ఈ పక్షి 'టోవిట్ - టోవిట్ - టోవిట్' లేదా 'ప్రెటీ - ప్రెటీ - ప్రెటీ' అంటూ గట్టిగా ఉత్సాహ జనకంగా కూస్తుంది. పేటలలోని తోటలలో మనకు సుపరిచితమైన పక్షి కూతలతోపాటు దీని కూతలను కూడా మనం తరచుగా వింటూంటాం. మిగతా కూజుపిట్టలలాగే ఇదికూడా చిన్న కీటకాలనూ, వాటి గ్రుడ్లనూ, ఆకుపురుగులనూ తింటుంది. ఈ పక్షికి కూడా పూదేనె అంటే ఎంతో ఇష్టం. ఆకర్షణీయమైన ఎఱ్ఱని బూరుగూ, బాడిదా పువ్వులలోని మకరందాన్ని ఈ పక్షులు జుఱ్ఱుతూ ఉండడం మనం నిత్యమూ చూస్తూనే ఉంటాం. గూటి నిర్మాణ కౌశలంలో దర్జీపక్షి ఉన్నతస్థాయి నందుకొంది. దీని గూడు నిజంగా ఒక అద్భుతమైన నిర్మాణం. ఇది ఒక అకు పచ్చని పెద్ద ఆకును మడచి, దాని అంచులను దగ్గరగా చేర్చి ఆ యంచులను కుట్టివేస్తుంది గిన్నెవంటి ఈ గూటిలో అది మెత్తని నారపోచలు, వెంట్రుకలు, ప్రత్తి మొదలైనవి ఉంచుతుంది. తగినంత పెద్ద ఆకు దొరకకపోతే రెండు మూడు ఆకులను చేర్చి కుడుతుంది. ఆకులను కుట్టడానికి పక్షి దూదిని కాని లేదా నారను కాని పేని ఆ దారాన్ని ఉపయోగిస్తుంది. కుట్టేటప్పుడు కుట్టులోంచి దారం కొసలు ఊడి రాకుండా దారం కొసను ముడికూడ వేస్తుంది. ఈ పక్షి గూడు కట్టడానికి క్రోటను, అత్తి, లతలూ మొదలైన పెద్ద ఆకులుగల మొక్కలనుగాని, లతలనుగాని ఉపయోగిస్తుంది. ఇది తరుచుగా ఇంటి ప్రాంగణంలోనూ, వరండాలలోనూ నేలకు ఒకటి రెండు మీటర్లకన్నా ఎక్కువ ఎత్తుగా ఉండని కుండీలలో పెరిగే మొక్కల నుప యోగిస్తుంది. గూటిలో మూడు, నాలుగు గ్రుడ్లుంటాయి. అవి ఎరుపు లేదా నీలిఛాయ గల తెలుపురంగులో ఉంటాయి. సాధారణంగా వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు చుక్కలుంటాయి.

కస్తూరి పక్షులనూ (Thrushes), నల్లంపిగాళ్లనూ (Robins), పొద జిట్టలనూ (Chats) కూడా తోక పిగిలి పిట్టల (Turdinae) ఉపకుటుంబంలో చేర్చారు.

సరలగాడు(Magpie Robin—Copsychus Saularis)— పటము 85— హిందీ: దైయర్ లేక దైయా. ఇది టర్డినె ఉపకుటుంబానికి అందరికీ బాగా తెలిసిన ఉదాహరణము. మగపక్షి నలుపు - తెలుపులో చక్కగా ఉంటుంది; ఇది తరచుగా తోకను ఎత్తిపెట్టుకొని ఉంటుంది. మగపక్షిలో నల్లగా ఉండే

భాగాలన్నీ ఆడుపక్షిలో గోధుమరంగులోను బలపపురంగులోను ఉంటాయి. ఈ పక్షులు చిట్టడవులలో ఒంటరిగ గాని, జతలుగగాని సంచరిస్తాయి. మనుష్యులు నివసించే ప్రాంతములందు కూడ వీటిని మనం తరచుగా చూస్తూంటాము. గ్రుడ్లను పెట్టని కాలంలో మగపక్షి సాధువుగను, అణకువగను ఉంటూ పొదలలోనూ, చిన్న చెట్ల మధ్యా నక్కుతూ ఉండి ఉండి 'స్వీ-యీ' లేదా 'చిర్-ర్, చిర్-ర్' అంటూ శోకస్వనముతో దాని కంఠం విడుతుంది. అప్పుడప్పుడు చక్కగా పాడే పక్షులలో అదికూడా ఒకటి అని కూసి చూపిస్తుంది. ఆకులులేని చెట్టుయొక్క ఎత్తైన రెమ్మ మీదనో లేదా గేటు స్తంభంమీదనో నిగనిగలాడుతూ పెక్కులు రంగులు గలిగిన నిరైన ఉడుపులో మగపక్షి చాలా అందంగా అనుతుంది. అటు వంటి చోట కూర్చొని, అది చాల దూరం వినపడేలాగ, ఆనందభరితంగా, అవిచ్ఛిన్నంగా కూస్తుంది. దీని కూత షామా కూతంత దివ్యంగా లేక పోయినా కూసే ఉద్రేకంలో మాత్రం దాని కిది ఏమాత్రం తీసిపోదు. అది పాడేటప్పుడు దానితోకను క్రిందికి దించి కొంచెంగా విప్పియుంచి పాట పాడినంత సేపూ ఆ పాటకు తాళం వేస్తూందా అన్నట్లు అది తోకను పైకెగరవేస్తూ, విప్పుతూ ఉంటుంది. అది పగలంతా చీకటి పడేవరకూ, స్వల్ప విరామాలతో ఇలా కూస్తూనే ఉంటుంది. గ్రుడ్లను పెట్టే కాలంలో అవి నివసించే స్థలాలను భుక్తం చేసికోవడానికి మగపక్షులు జగడ గొండులుగా తయారవుతాయి. పుంజులు తోకను విప్పి, వీపుమీదకు బాగా వచ్చేటట్లు దానిని నిక్కపొడిచి, పరిహాసాస్పదంగా రొమ్మును ముందుకు ఉబ్బించి, ముక్కును ఆకాశంకేసి పెట్టి, ఆడుపిట్టల ఎదుటను, వాటి కోసరం తగుదునమ్మా అంటూ వచ్చిన మిగతా మగపక్షుల ఎదుటను, అందంలో తానే హెచ్చనేటట్లు తలను ఆడిస్తూ అతి గర్వంగా నిక్కుతూ అడుగులు వేస్తాయి. ఈ పక్షి ముఖ్యంగా కీటకాలను తింటుంది. కాని అవి అప్పుడప్పుడూ పండ్లనుకూడా తింటాయి. బూరుగ, బాడిదచెట్ల అందమైన ఎఱ్ఱని పువ్వులందలి మకరందమంటే వాటికెంతో ఇష్టం. అది పచ్చ గడ్డితోను, పిల్లవేళ్ళతోను, వెంట్రుకలతోను చుట్టకుదురు లాంటి గూడు కడుతుంది. ఈ గూటిని అది ఒక గోడలేక చెట్టుమ్రాను కన్నంలో కాని డాబాలనుండి నీరు జారిపోవడానికి పెట్టిన నీటి గొట్టాల మీదగాని ఉప యోగంలేని వీధి లాంతరులో గాని నిర్మిస్తుంది. గూడుగా ఉపయోగించు

కోవడాని కనువైన పెట్టె ఏమైనా దొరుకుతే దానిలో కూడా గ్రుడ్లు పెట్టి డానికీ పక్షుల కెటువంటి అభ్యంతరం ఉండదు. గూటిలో 3 మొదలు 5 వరకూ గ్రుడ్లుంటాయి. అవి లేత నీలి-ఆకుపచ్చ చాయలో ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు మచ్చలూ, చుక్కలూ ఉంటాయి.

షామా (Shama — Copsychus Malabaricus) — పటము 86 :— ఇది సరలగాళ్లకు అడవులలో నివసించే ప్రతినిధి. చక్కగా పాడ గలిగిన పంజరపు పక్షులలో దీనిని ఉత్తమమైన దానిగా పట్టణవాసులు పరిగణిస్తారు. దీని పైభాగం నల్లగా ఉంటుంది. దీని వీపు క్రింది భాగాన అనగా దాని పొడుగైన నలుపు-తెలుపురంగులో ఉండే తోక మొదట తెల్లని మచ్చ స్పష్టంగా కనబడుతుంది. ఈ పక్షి క్రింది భాగాలు త్రుప్పు చాయ గల గోధుమరంగులో ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ఈ పక్షులు బొంబాయి దగ్గర ఉన్న మథిరాన్‌వంటి విశేషంగా చెట్లు, కొండలు ఉండే చల్లని విశ్రాంతి స్థలాలకు (వేసవి విడుదలకు) తెగించివెళ్లి, అచ్చట వేసవిలో విశ్రాంతి కొరకు వచ్చిన వాళ్లను, వాటి చక్కని పాటలతో ఉల్లాస పరుస్తాయి.

బట్టి పొదజిట్ట (Pied Bushchat—Saxicola Caprata) — పటము 87—హిందీ : కాలాపిద్దా : ఇది సుమారు ఊరపిచ్చుకంత ఉంటుంది. మగపక్షి కారు నలుపు. కాని దాని పిట్టలమీదా, పొత్తి కడుపు క్రిందా, రెక్కలమీదా నిగనిగలాడే తెల్లని మచ్చలుంటాయి. రెక్కలమీద ఉన్న మచ్చలు అది ఎగిరేటప్పుడు బాగా కనపడతాయి. ఆడపక్షి మట్టిరంగులో ఉంటుంది. దాని పిట్టలు వెలవెలపోతున్న త్రుప్పురంగులో ఉంటాయి. బట్టిపొదజిట్టలలో కొన్ని స్థానికంగా మన దేశంలో నివసిస్తాయి. మరి కొన్ని శీతకాలంలో మన దేశానికి వలసవస్తాయి. ఈ రెండు రకాల పక్షుల జతలూ వేరువేరుగా పంట భూములచుట్టూ, పొదలమీదా, రెల్లుకోలమీదా కూర్చుంటాయి. అక్కడనుండి మిడుతలనో, నల్లులనో ఏరుకోవడానికి తరుచుగా భూమిమీదకు లటుక్కున దిగుతాయి. ఒక్కొక్కప్పుడీ పక్షి గాలిలోకి నిట్టనిలువుగా ఎగిరివెళ్లి రెక్కపురుగులను పట్టుకొంటుంది లేదా తోక పిగిలిపిట్టలాగ రెక్కపురుగుల మీదకు దుముకుతుంది. ఇది సామాన్యంగా ''చెక్, చెక్'' అని కఠోరమైన స్వరంలో కూస్తూ, తుదకు ''ట్వీట్'' అంటూ దీనస్వరంలో ముగిస్తుంది. గ్రుడ్లను పెట్టే కాలంలో మగపక్షి

"చిక్ – చిక్" అంటూ ఋంటస్వరంతో ప్రారంభించి, శ్రావ్యమైన చిన్న ఈలపాటను ఆలాపిస్తుంది. ఈ పాట భారతదేశపు నల్లంచిగాడి (Indian Robin) పాటను పోలియుంటుంది. అది దాని స్వస్థలంలో పోటీకి వచ్చిన మిగతా మగ పక్షులను సవాలుచేస్తూ పెంటిని మెప్పించడానికి పాట పాడుతుంది. ఇలా పాడుతూ పోటీదారులను బెదిరించడానికి భయంకర మైన అంగవిన్యాసాలు కూడా చేస్తుంది. ఈ పక్షి నేల బొరియలోగాని, గోడకన్నంలో గాని పచ్చగడ్డితో చుట్టకుదురులాంటి గూడుకట్టి దానిలో రోమాలను కాని, ఉన్నెనుకాని ఉంచుతుంది. గూటిలో 3 మొదలు 5 వరకూ గుడ్లుంటాయి. అవి వెలవెలపోతున్న నీలి చాయగల తెలుపురంగులో ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు చుక్కలూ, మచ్చలూ ఉంటాయి.

కంఠమాల గల పొదజిట్ట (The Collared Bushchat — Saxicola Torquata) : – ఇది పంటపొలాల్లోనూ, ఎత్తుగా పెరిగే పచ్చిక బీళ్లలోను శీతకాలంలో కనపడుతుంది. మగపక్షికి నల్లనితల, నారింజ – గోధుమరంగు రొమ్ము ఉంటాయి. దాని మెడ కిరువైపులా "కంఠమాల", రెక్కలమీదా, తోక మొదట్లో పైవైపునా స్ఫుటమైన తెల్లని మచ్చలుంటాయి. ఆడుపక్షి బట్టపొదజిట్టలలో ఆడుదాన్ని పోలి ఉంటుంది కాని దీని పైభాగములందు ఇంకా నల్లని రేఖలుంటాయి.

నల్లంచిగాడు (The Indian Robin — Saxicoloides Fulicata) — పటము 88 — హిందీ : కాల్చురి : —కస్తూరి పక్షుల గణంలో ఇది యొక పిట్ట. పల్లెసీమలలో మనకు బాగా పరిచయమైన పక్షులలో ఇది ఒకటి. ఈ పక్షిని గ్రామాలలో పూరింటి కొప్పుమీదనో, రోడ్డు ప్రక్కల కంచె మీదనో, రాతిమీదనో, ఎత్తిపెట్టుకొని ఉన్నతోకను పైకి క్రిందికి ఆడిస్తూ ఈ వైపుకొకమారు ఆ వైపుకొకమారు తిరుగుతూ, ఉత్సాహకరంగా కూస్తూ కూర్చొని ఉండడం మనం తరచుగా చూస్తూ ఉంటాం. మగది చాల చురుకైన చిన్న పక్షి. అది గోధుమరంగులోనూ, నిగనిగలాడే నలుపు రంగులోనూ ఉంటుంది. ఎల్లప్పుడూ ఎత్తిపెట్టుకొని ఉండే దాని తోక క్రింద దట్టమైన చెస్టనటురంగు ఉంటుంది. దాని రెక్కలమీద తెల్లని మచ్చ దాగి ఉంటుంది. అది ఎగిరేటప్పుడీ మచ్చ స్ఫుటంగా మెరుస్తూ కనపడుతుంది. పెట్ట బూడిదరంగులో ఉంటుంది. దాని ఎత్తి పెట్టుకొని ఉన్న తోక క్రింద

బాగా వెలవెల పోతున్న చెస్నటు రంగుంటుంది.) ఈ పక్షులు ఆగి ఆగి పరుగెత్తుతూ, ఒకమారు పొదమీదకో, చెదపుట్ట మీదకో ఎక్కుతూ, మరొక మారు ఏదో చిన్న కీటకాన్ని ఏరుకోవడానికి క్రిందికి దిగుతూ కాలయాపన చేస్తూ ఉంటాయి. ఈ కీటకాన్వేషణలో అవి లోపల ఉన్నవారి చర్యల నేమాత్రం లక్ష్యపెట్టక గుడిసెల్లోకి, బంగాళాల వసారాలలోకి నిర్భయంగా ప్రవేశిస్తాయి. ఈ నల్లంచిగాడు ప్రత్యేకంగా కీటకాలనూ, ఆకుపురుగులనూ తింటుంది. దీనికి చెదపురుగులంటే ఎంతో ఇష్టం. అందుచేత అది చెద పుట్టల దగ్గరనే సామాన్యంగా హాజరవుతుంది. అది ఉత్సాహంతో కొన్ని ఇంపైన స్వరాలు పలుకుతుంది; అంతకుమించి ఈ పక్షి ఏమీ పెద్ద పాట పాడదు. ముఖ్యంగా ఈ కూతలను తన హొయలు ప్రకటించి పెంటిని ఆకర్షించేటప్పుడో లేదా తన స్థలంలోకి చొరపడే పరాయి పక్షిని ఎదుర్కొనే టప్పుడో కూస్తుంది. అలాంటప్పుడది తన రొమ్మును ముందుకుబ్బించి, దార్ఢ్యంచేస్తూ నిలబడగలిగినంత ఎత్తుకు సాగి నిలబడి, ఎత్తిపెట్టుకొని ఉన్న తోకను వీపుమీద బాగా ముందుకు ఎగురవేస్తూ ఉంటుంది. భారత దేశపు నల్లంచిగాడు పచ్చగడ్డితోనూ, పిల్లవేళ్లతోనూ ఒక గిన్నెలాగా గూడు కడుతుంది. అది ఈ గూటిని పాము కుబుసములతో అలంకరిస్తుంది. ఈ గూడును అది నేలలోని బొరిలోయనో, కుళ్లుతున్న చెట్టు మోడులోనో, పనికి మాలిన డబ్బాలోనో లేదా చట్టిలోనో నిర్మిస్తుంది. గూటిలో రెండు, మూడు గ్రుడ్లుంటాయి. గ్రుడ్లు మీగడ తెలుపులోనో, ఆకుపచ్చ ఛాయగల తెలుపులోనో ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు చుక్కలూ, మచ్చలూ ఉంటాయి.

కస్తూరి పక్షి (The Malabar Whistling Thrush - Myiophoneus Horsfieldii) – పటము 89 — హిందీ: కస్తూర: కస్తూరి పక్షుల ఉప కుటుంబంలో ప్రసిద్ధి చెందిన పాటగాళ్లలో ఇది ఒకటి. ఇది నీలి-నలుపు రంగులో అందంగా ఉండే పెద్ద కస్తూరి పక్షి. దీని పరిమాణం మైనాకు, పావురాయికి మధ్యగా ఉంటుంది. దాని నుదురుమీదా, భుజములమీదా నిగ నిగలాడే కోబాల్టు నీలిరంగు మచ్చలుంటాయి. దాని ముక్కూ, కాళ్లూ నల్లగా ఉంటాయి. మనుష్యుల నివాసాలకు దగ్గరగానూ, దూరంగానూ, కొండ కాలువల వద్దా, ప్రవాహ వేగంగల కొండవాగుల దగ్గరా ఈ పక్షి నివసిస్తుంది. గ్రుడ్లు పెట్టే కాలంలో అరుణోదయాన్ని సూచిస్తూ గట్టిగా

ఈలపాట పాడే పక్షులలో ఇదొకటి. శ్రావ్యతలో దీని కంఠం మానవ కంఠాన్ని అద్భుతంగా పోలి ఉండటం చేతనూ, అది ఆరోహణ అవరోహణ క్రమంలో కూయడంచేతనూ ఈ పక్షికి 'సోమరి బడి పిల్లకాయ' లేదా 'ఈలవేసే బడి పిల్లకాయ' అనే సార్థకనామం వచ్చింది. మిగతా కస్తూరి పక్షులలాగే ఇదికూడా గుడ్లు పెట్టని కాలంలో మౌనంగా ఉంటుంది. ఆ రోజుల్లో అది 'క్రీ-ఈః' అంటూ మాత్రమే కరకుగా పలుకుతుంది. ఈ స్వరం ఈ కుటుంబ పక్షుల ప్రత్యేకత. ఈ ఈలవేసే కస్తూరి పక్షి జల కీటకాలనూ, నత్తలనూ, పీతలనూ తింటుంది. అది నత్తలనూ, పీతలనూ రాతిమీద బాది వాటి పైనున్న గట్టిపెంకును పగులకొడుతుంది. వేగంగా ప్రవహిస్తున్న ప్రవాహంలో ఒక రాతిమీద నుండి మరియొక రాతి మీదకి పక్షి దుముకుతూ నీటిలో కొట్టుకొనిపోతున్న ఎరను పట్టుకొంటుంది. తరచుగా అది దాని తోకను విసనకఱ్ఱలాగ విప్పి, పైకి క్రిందికీ ఆడిస్తూ, పల్లాలలోనూ, రాళ్ళసందులలోనూ దాక్కొన్న ఎరను పైకి రప్పిస్తుంది. పక్షుల పెంపకంలో ఆసక్తిగలవారు దీనిని బాగా పాడే పక్షిగా పరిగణిస్తారు. చిన్న పిల్లలను తెచ్చి పెంచితే అవి బాగా మచ్చికవుతాయి. ఈ పక్షి వేళ్లు, నాచు, పచ్చగడ్డిని అడుసుతో చేర్చి కుదురులాంటి పెద్ద గూడు కడుతుంది. ఈ గూటిని అది జలపాతం దగ్గరగా ముందుకు చొచ్చుకొని ఉన్న రాతి అంచున కడుతుంది. గూటిలో మూడు నాలుగు గుడ్లుంటాయి. అవి లేత పసుపురంగులోనో, బూడిదరంగులోనో ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు లేదా లవండరురంగు మచ్చలూ, చుక్కలూ ఉంటాయి.

హిమాలయ కస్తూరి పక్షి (The Himalayan Whistling Thrush — M. Temminckii) : – ఇది మలబారు కస్తూరి పక్షికి చాలా దగ్గర చుట్టము. ఇది హిమాలయ పర్వతాలకు పాద భాగంలో బర్మావరకూ వ్యాపించి ఉన్న ప్రాంతాలలో నివసిస్తుంది. మలబారు కస్తూరిపక్షి ముక్కువలె దీని ముక్కు నల్లగా ఉండదు; పసుపుపచ్చగా ఉంటుంది; దీని నుదురు మీదా భుజాలమీదా కోబాల్టు నీలి మచ్చలుకూడా ఉండవు. ఈ లక్షణాలను బట్టి ఈ పక్షిని సులువుగా గుర్తించవచ్చును.

పేరిడె (Paridae) లేక గంగి జిట్టలు (Tits) కుటుంబంలోని పక్షులు ఊర పిచ్చుకలంతగాని, అంతకన్నా చిన్నవిగా గాని ఉంటాయి. ఇవి చురుకైన పక్షులు; చెట్లమీద నివసిస్తాయి. వీటి ముక్కులు పొట్టిగానూ, బలిష్ఠం

గానూ ఉంటాయి. ఈ పక్షులలో కొన్నింటికి నిటారైన శిఖలుంటాయి. హిమాలయములలో ఇవి విశేషంగా ఉంటాయి.

బూడిదరంగు గంగిజిట్ట (Grey Tit — Parus Major) – పటము 90 – హిందీ: రాంగంగ్రా: ఈ ద్వీపకల్పంలో ఉండే గంగిజిట్టలలోని మూడు జాతులలోను ఇది అనేక ప్రదేశాల్లో కనపడుతుంది. ఇది ఊరపిచ్చుక వంటి ఉల్లాసకరమైన పక్షి. దీనికి శిఖలేని నిగనిగలాడే నల్లని తల, మెరిసే తెల్లని బుగ్గలూ, బూడిదరంగు వీపు, తెల్లని బొజ్జ, దాని మధ్య అడ్డుగా వెడల్పైన నల్లని చార ఉంటాయి. ఈ లక్షణాలను బట్టి ఈ పక్షిని సులభంగా గుర్తు పట్టవచ్చును. ఇవి చిట్టడవులలో చెట్లమధ్య సంచరిస్తాయి. ఈ పక్షులు ఆర్ద్రత ఎక్కువగా ఉండే నిత్యహరితారణ్యాలలో ఉండవు. ఇవి ఒక్కొక్కటిగా గాని, జతలుగా గాని లేదా చిన్న గుంపులుగా గాని తిరుగుతాయి. ఒక్కొక్కప్పుడీ పక్షులు మిగతా కీటకభక్షక జాతులతో కలసి మసలుతాయి. ఇవి ఆకుల మధ్యకు చెల్లాచెదరుగా ఆహారాన్వేషణకై బయల్దేరుతాయి. అవి తప్పిపోకుండా ఉండడానికి, అవి ఉండే తావును తోటి పిట్టలకు తెలియ చేయడానికి "చీపు చీపు" అంటూ కూస్తూ వుంటాయి. అవి రెమ్మలను, పుష్పాలుండే కొమ్మలను పట్టుకొని తలక్రిందుగా వ్రేలాడుతూ, ఎగబ్రాకుతూ పెక్కు రకాల దొమ్మరి విన్యాసాలు చేస్తూ, ఆకుల అడుగుభాగాల యందు, పువ్వులలోను, బెరడుబీటలలోను ఉన్న కీటకాలనూ, గ్రుడ్లనూ, లార్వాలనూ వెతకి, ముక్కులతో పట్టి తింటాయి. తోటలలో పళ్లకూ, మొగ్గలకూ కొంచెం హాని కలిగించినా అసంఖ్యాకములైన హానికరములగు కీటకాలను నాశనం చేయడంలో గంగిజిట్టలు మనకెంతో ఉపకారం చేస్తున్నాయి. కఠినమైన కవచంగల బీజాలనూ, పిక్కలనూ, అవి కాళ్ల క్రింద మట్టిపెట్టి బలిష్ఠమైన ముక్కుతో వాటిని తెగబాది బ్రద్దలుకొట్టి, వాటిలోని పప్పును తింటాయి. గ్రుడ్లు పెట్టేకాలంలో మగపక్షి "వీచీచి, వీచీచి, వీచీచి" అంటూ స్పష్టంగా ఈలపాట పాడుతుంది. బూడిదరంగు గంగిజిట్ట వెంట్రుకలూ, నాచూ, ఈకలూ కలిపి కుదురులాంటి గూడు కడుతుంది. అది దీనిని చెట్టు బోదెలోనో, కొమ్మలోనో ఉండే తొఱ్ఱలోనో, గోడ కన్నంలోనో నిర్మిస్తుంది. గూటిలో 4 మొదలు 6 వరకూ గ్రుడ్లుంటాయి. అవి తెల్లగా గాని లేత ఎరుపు చాయగల తెలుపులోగాని ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు చుక్కలూ, మచ్చలూ ఉంటాయి.

పసుపు బుగ్గల గంగిజిట్ట (Yellowcheeked Tit—Parus Xanthogenys) — ఇది మన ద్వీపకల్పంలో బాగా వ్యాపించి ఉన్న మరియొక గంగిజిట్ట. ఇది నలుపు - పసుపురంగులలో ఉండే నాజూకైన గంగిజిట్ట. దీనికి కొన దేలి ప్రస్ఫుటంగా నల్లని శిఖ, పసుపురంగులో క్రింది భాగాలు, అక్కడ మధ్యగా వెడల్పైన నల్లని చార ఉంటాయి. బూడిదరంగు గంగిజిట్ట ఉండే స్థలాల్లోనే ఇదీ ఉంటుంది. అయితే చెమ్మగా ఉండే ప్రదేశాల్లో కూడా ఇది కనపడుతుంది.

సిట్టిడె కుటుంబా (Family Sittidae) నికి చెందిన సిరిపిట్టలు (The Nuthatches) చెట్లమీదా, కొండలమీదా నివసించే చిన్న పక్షులు. ఈ పక్షులు చెట్ల బోదెలమీదా, కొమ్మలమీదా, లేదా రాతి పలకలమీదా, పరుగెత్తుతూ, ఒక్కసారి కొంచెం ఆగి మళ్లీ పరుగెత్తుతూ, పగుళ్లలోనూ, సందులలోనూ ఉండే సాలీళ్లను, కీటకాలను వెతుకుతాయి. వీటి తోకలు పొట్టిగానూ, చతురస్రంగానూ, ముక్కులు వడ్రంగి పిట్టల ముక్కుల్లాగ పొడుగ్గానూ ఉంటాయి.

సిరిపిట్ట (Chestnutbellied Nuthatch – Sitta Castanea) - పటము 91-హిందీ : సిరి లేక కట్‌ఫోరియా: ఈ జాతి ముఖ్యంగా భారతదేశమంతటను, తూర్పు పాకిస్తానులోనూ కనపడుతుంది. ఈ పక్షి ఊరపిచ్చుకకన్న చిన్నది. దీని పైభాగం నీలిరంగులోనూ, క్రింది భాగం ముదురు చెస్నటురంగులోనూ ఉంటాయి. దీని ముక్కు పొడుగ్గా, కొనదేరి ఉంటుంది. ఆడు పక్షి క్రిందిభాగాలు వెలవెలపోతూ ఉంటాయి. చిట్టడవులలో ఇవి ఒంటరిగాగాని, జతలు జతలుగాగాని చిట్టెలుకలలాగ కొమ్మల పైకి, కొమ్మలను చుట్టీ, ప్రాకుతూ కనపడతాయి. గ్రామాలను చుట్టియుండే మామిడి తోపులలోనూ, పెద్దచెట్లుగల తోటలలోనూ ఈ పక్షి మక్కువతో తిరుగుతుంది. ఆహారపుటలవాట్లలో ఇది గంగిజిట్టనూ, వడ్రంగి పిట్టనూ పోలి ఉంటుంది. గంగిజిట్టలాగ ఈ పక్షి బోదెలను, కొమ్మలను ఉండి ఉండి అకస్మాత్తుగా, గునగునలాడుతూ ఎగబ్రాకుతుంది; ప్రక్కలకున్నూ ప్రాకుతుంది; తలక్రిందుగా దిగుతుంది — ఇంతసేపూ అది పగుళ్లలోకి పురుగుల కోసరం పరికిస్తూనే ఉంటుంది; వడ్రంగి పిట్టలాగ ఇది చెట్టు బోదెను ఎక్కుతూ దాక్కొని ఉన్న కీటకాలను పైకి రప్పించడానికి దాని ముక్కుతో బెరడును కొడుతుంది. ఈ విధంగా పురుగులను వెతికే

టుప్పుడు ఈ పక్షి కొమ్మ అడుగు తలాన్ని పట్టుకొని అద్భుతమైన లాఘవంతో పరుగెత్తుతుంది. ఇది సాలీడులనూ, కీటకాలనూ, వాటి గ్రుడ్లనూ, లార్వాలనూ తింటుంది. అంతేకాదు. గంగిజిట్టలాగ ఇదికూడా అడవిలోని చెట్ల పిక్కలలోనూ, కర్కశ కవచాలుగల బీజాలలోనూ ఉండే పప్పును కూడా తింటుంది. అది బీజాలను బోదె బీటలలో బిగించి, దాని బలిష్ఠమైన ముక్కుతో సుత్తితో బాదినట్లు మళ్లీ మళ్లీ బాది లోపలి పలుకులను బైటకు తీసి తింటుంది. ఇది సామాన్యంగా చిట్టెలుకలా, కీచుకీచుమంటూ బలహీనంగా కూస్తుంది. కాని అది "చీప్–చీప్" అంటూ శ్రావ్యమైన జంట ఈలలు, వెనువెంటనే, మళ్లీ మళ్లీ వేస్తుంది. గ్రుడ్లను పెట్టేకాలంలో జత కట్టినపుడు తప్ప ఇతర సమయాల్లో ఈ పక్షులు చిన్న, చిన్న గుంపులుగా చెదిరిపోయి, తరుచుగా గంగిజిట్టలతోనూ, కీటకఖాదులైన పక్షుల గుంపులతోనూ, కలిసి అడవులలో తిరుగుతాయి. చెట్లలో సహజంగా ఏర్పడిన తొఱ్ఱలలోనూ, కంసాలిపిట్ట చేసిన కన్నాలలోనూ, మెత్తదనానికి ఆకులనూ, నాచునూ, ఉన్నినూ పెట్టి ఈ సిరిపిట్ట గ్రుడ్లను పెడుతుంది. ఈ గూటి ద్వారాన్ని, రాకపోకలకు గుండ్రని చిన్న రంధ్రం మాత్రముంచి, తడిమట్టితో గోడకట్టి మూసి వేస్తుంది. ఈ గోడ త్వరలో ఎండి గట్టిపడుతుంది. గూటిలో 2 మొదలు 6 వరకూ గ్రుడ్లను పెడుతుంది. ఇవి తెల్లగా ఉంటాయి. వాటిమీద ఎఱ్ఱని మచ్చలుంటాయి.)

(మొటసిల్లిడె కుటుంబం (Family Motacillidae) లోకి గురప్ప మడిజిట్టలు (Pipits) కంపజిట్టలు (Wagtails) వస్తాయి. ఈ కుటుంబంలోని పక్షులు సన్నంగా, సొగసుగా ఉంటాయి. వీటికి పొడుగైన తోకలుంటాయి. అవి తోకలను ఎల్లప్పుడూ పైకి క్రిందికీ ఆడిస్తూ ఉంటాయి. అవి చిన్న కీటకాలను ఏరుకొంటూ పసరిక మైదానాలలోనూ, బాడవలలోనూ పరుగెత్తుతూ ఉంటాయి. వీటిలో చాల జాతులు పాలార్క్టిక్ ప్రాంతం (Palaearctic Region) నుండి మన దేశానికి శీతకాలంలో వలసవస్తాయి.

వెల్లకంపజిట్ట (White Wagtail — Motacilla Alba) — హిందీ : ధోబన్ లేక ఖన్జన్ : మన దేశానికి శీతకాలంలో తప్పకుండా వలసవచ్చే పక్షులలో ఇది ఒకటి. ఇది ఊరపిచ్చుకంత ఉంటుంది. కాని ఇది ఊరపిచ్చుకకన్నా సన్నంగా ఉంటుంది; దీని తోక ఊరపిచ్చుక తోకకన్నా పొడుగ్గా ఉంటుంది. దీని పైభాగం బూడిదరంగులోనూ, క్రిందిభాగం

తెలుపురంగులోను ఉంటాయి. శీతకాలంలో ఈకలరంగు మారుతుంది. శీతకాలంలో గడ్డం, గొంతుల నల్లదనం బాగా తగ్గుతుంది. మిగతా క్రింది భాగాల లాగే అవి కూడా తెల్లగానే ఉంటాయి. ఇవి ఒంటరిగనో, రెండేసి మూడేసి కలిసో లేదా చిన్న, చిన్న గుంపులుగా చెదరిపోయో కనబడతాయి. తోకలను అదేపనిగా పైకి క్రిందకి ఆడిస్తూ, కులుకుతూ, అడుగులు వేసికొంటూ నేలమీద నలుమూలలకూ పరుగెత్తుతాయి. కీటకాలను పట్టుకోవడానికి ఈవైపుకూ ఆవైపుకూ తిరుగుతూ ఒకొక్కప్పుడు పైకి దుముకుతూ అవి కాలక్షేపం చేస్తాయి. పచ్చిక బయళ్లలోనూ, దున్నిన పొలాలలోనూ, వీళ్లలోనూ, ఈ పక్షులు సంచరిస్తాయి. గాఫ్ ఆట స్థలాల్లోనూ, మైదానాలలోనూ, మనుష్యులు రద్దీగా ఉండే స్థలాల్లోనూ, క్రికెటు మొదలైన ఆటగాళ్ల మధ్యను, నిర్లక్ష్యంగా కీటకాలను వేటాడుతూ ఈ పక్షులు మనకు సామాన్యంగా కనబడుతూ ఉంటాయి. ఈ కుటుంబం లోని మిగతా పక్షులలాగే ఇవి కూడా రెక్కలను త్వరగా ఝూడించి, ముడిచి, మళ్లీ ఝూడించి, ముడిచి పైకీ, క్రిందకీ ఊగులాడుతూ ఎగురు తాయి. అలా ఎగిరేటప్పుడీ పక్షులు "చిచిప్, చిచిప్, చిచిప్" అంటూ ప్రత్యేకమైన కూత కూస్తాయి. దట్టంగా ఆకులున్న చెట్ల ఆకుల మధ్యనో లేదా రెల్లు మడులలోనో, చెరకుతోటలలోనో ఈ పక్షులు మందలు మందలుగా చేరి నిద్రపోతాయి. శీతకాలంలో మనదేశానికి వలసవచ్చే కంప జిట్టలలో చాలావరకు మనదేశపు పొలిమేర్లను దాటిపోయి ఉత్తర దేశాలలో గ్రుడ్లు పెడతాయి. కంపజిట్టలలో ఒక జాతి కాశ్మీరంలో గ్రుడ్లు పెడతాయి. ఈ కంపజిట్టలు పచ్చగడ్డి, పిల్లవేళ్లు, ఉన్ని ఉపయోగించి గిన్నె వంటి గూడు తయారు చేస్తాయి. రాతి క్రిందనో, పొద క్రిందనో, లేదా ఏటి ఒడ్డున వేళ్లతో పెల్లగింపబడి పడిపోయిన చెట్లవేళ్ల మధ్యనో, ఏటి మధ్య ఉన్న రాళ్లతిప్పమీదనో అవి గూటిని నిర్మిస్తాయి. గూటిలో 4 మొదలు 6 వరకూ తెల్లని గ్రుడ్లుంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు మచ్చలూ, చుక్కలూ ఉంటాయి.)

బూడిదరంగు కంపజిట్ట (Grey Wagtail — Motacilla Caspica) — పటము 92 లో పైచిత్రం: ఇది మన ఉపఖండంలో చెట్లు హెచ్చుగా ఉండే ప్రదేశాల్లో శీతకాలంలో కనపడే మరియొక కంపజిట్ట. కొండవాగుల వద్దను, కొండలలోను, అడవులలోను ఉండే బాటల ప్రక్కలను పారే వర్షపు

నీటి పిల్లకాల్వల వద్దను, ఈ పక్షి ఒంటరిగా ఇటూ అటూ పరుగెత్తుతూ కన బడుతుంది. శీతకాలంలో ఈ పక్షులు మన దేశంలో ఉన్నంతకాలము మగ పక్షి, ఆడుపక్షి ఒక్కలాగే ఉంటాయి. అప్పుడు మగపక్షికి గడ్డము, గొంతు, రొమ్ము ఈ భాగాలపై ఈకలు నలుపురంగులో ఉండవు. వేసవి కాలంలో, సంతానోత్పత్తి చేసేటప్పుడు, పటములో చూపిన విధముగా మగ పక్షికా భాగాలలోని ఈకలకు నల్లనిరంగు వస్తుంది. సాధారణపు టలవాట్లలో దీనికి వెల్లకంప జిట్టకు, మిగతా కంపజిట్టలకూ తేడా ఏమీలేదు. గూళ్లు కట్టేకాలంలో మగపక్షి చక్కగా చిన్నపాట పాడుతుంది. కాశ్మీరంలోనూ, పశ్చిమ హిమాలయాలలోనూ ఇది గ్రుడ్లు పెడుతుంది. వెల్లకంపజిట్ట ఎక్కడ, ఎలా గూడు కడుతుందో అక్కడ అలాగే ఇదికూడా గూడు కడుతుంది. గూటిలో 4 మొదలు 6 వరకూ గ్రుడ్లుంటాయి. అవి పసుపు కలిసిన బూడిద రంగులో కాని, లేత ఆకుపచ్చ రంగులో కాని ఉంటాయి. వాటిమీద ఎరుపు కలిసిన గోధుమరంగు మచ్చలుంటాయి.

(వేరే మరికొన్ని బూడిద, పసుపురంగులు కల కంపజిట్టలు (M. Flava) మన దేశానికి శీతకాలంలో వలసవస్తాయి. శీతకాలపు ఈకలరంగును బట్టి వాటిలో వేర్వేరు జాతులను పోల్చుకోవడం కష్టం; కాని అవి ఉత్తరదిశలో ఉన్న స్వదేశాలకు తిరుగు ప్రయాణం కట్టేటప్పుడు వాటిని సులువుగా గుర్తు పట్టవచ్చును. ఏలన అప్పుడు కంపజిట్టలు చాలావరకు వాటి జాతికి ప్రత్యేక మైన వేసవి దుస్తులను ధరించి ఉంటాయి.

బట్ట కంపజిట్ట (Large Pied Wagtail — M. Maderaspatensis) — పటము 92 లో క్రింది చిత్రం: ఈ కంపజిట్ట ఒక్కటే వలసపోకుండా, భారత ద్వీపకల్పంలో ఎల్లప్పుడూ ఉండేది. ఇది మిగతా కంపజిట్టలకన్న పెద్దది; సుమారు పిగిలిపిట్టంత ఉంటుంది. దీని ఈకలు, సరలగాడి ఈకల మాదిరిగ, నలుపు – తెలుపులలో ఉంటాయి. కాని బట్ట కంపజిట్టకు తెల్లని కనుబొమ్మ ప్రముఖంగా కనపడుతుంది; అది దాని తోకను ఎత్తిపెట్టి ఉంచదు. బాడవల వద్దా, గ్రామలలోని చెరువులవద్దా ఈ బట్ట కంపజిట్టలు జతలు, జతలుగా తిరుగుతాయి. గులకరాళ్లు గాని, బండరాళ్లు గాని ఉండి నెమ్మదిగా ప్రవహించే సెలయేళ్లంటే, ఈ కంపజిట్టల కెంతో ఇష్టం. ఈ పక్షులకు జంకంటూలేదు. ఇవి మానవ నివాసాలకు తరుచుగా వస్తూంటాయి. అక్కడ అవి ఇంటి కప్పులమీద కెక్కి కూర్చొంటాయి. లేదా చాకిరేవులాంటి

ప్రదేశాల్లో ఇటూ అటూ పరుగెత్తుతూ ఆహారం సంపాదించుకొంటాయి. ఈ పక్షులు పలురకాలుగా శ్రావ్యంగా ఈలవేస్తూ కూస్తాయి. గ్రుడ్లుపెట్టే కాలంలో మగపక్షి ఒక గుట్ట పైనుండో లేదా ఇంటికప్పు పైనుండో మధురంగా కూస్తుంది. సాధారణంగా దీని పాటలో సరలగాడి పాటలోని కొన్ని మెలకువలుంటాయి. ఇది పిల్లవేళ్లతోనూ, వెంట్రుకలతోనూ, ఉన్నితోనూ, ఎండిన ఆల్గాలతోనూ, ఏదైనా గోడకన్నంలోనో, ముందుకు పొడుచుకు వచ్చిన రాతి క్రిందనో, మనుష్యులు నివసిస్తున్న ఇంటివాసాల మధ్యనో, వంతెన దూలాల క్రిందనో గూడు కడుతుంది. అది గూటిని ఎక్కడ కట్టినా ఆ గూడు ఎప్పుడూ నీటికి దగ్గరగానే ఉంటుంది. గూటిలో మూడు, నాలుగు గ్రుడ్లుంటాయి. ఆ గ్రుడ్లు – బూడిద, గోధుమ, లేత ఆకుపచ్చ — ఇందులో ఏదో ఒక ఛాయగల తెలుపురంగులో ఉంటాయి. వాటిపై పలుఛాయలు గోధుమరంగు మచ్చలు, చారలు ఉంటాయి.)

(జిట్టంగులు (Pipits), కంపజిట్టలు కూడ ఒకటే కుటుంబానికి చెందుతాయి. కనుకనే జిట్టంగులు పరిమాణంలోనూ, రూపంలోనూ చాలవరకు అలవాట్లలోను కంపజిట్టల మాదిరిగానే ఉంటాయి. కాని జిట్టంగులు భరత పిట్టల లాగ అనాకర్షణీయమై గోధుమరంగులో ఉంటాయి. వాటి శరీరం భరత పిట్ట శరీరంకన్నా సన్నగానూ, ఎక్కువ పొడుగుగానూ ఉంటుంది; వాటి తోకలు కూడా పొడుగ్గా ఉంటాయి. పరిమాణం, రంగు, నివాసం – వీటిని బట్టి జిట్టంగులలో కొన్ని జాతులను సులభంగా గుర్తుపట్టగలం. మరికొన్ని జాతులు బాహ్య దృష్టికి, ఒక్కలాగే కనబడటం మూలాన వాటిని చూడగానే గుర్తుపట్టలేము. ఈ జాతులలో చాలమట్టుకు మన దేశానికి శీతకాలంలో వలస వచ్చేవేను.

గుల్మజిట్టంగి (Tree Pipit—Anthus Trivialis) — పటము 93 — హిందీ: రూగెల్ లేక చర్చరీ (అన్ని జిట్టంగులకు హిందీలో ఈ పేరే వాడతారు):— ఈ జిట్టంగి శీతకాలంలో మన దేశానికి వలసవస్తుంది. ఇది సామాన్యంగా దేశంలో పలుచోట్ల కనపడుతుంది. రంగులో ఇది ఆడు ఊరపిచ్చుకను పోలి ఉంటుంది; కాని ఇది ఊరపిచ్చుకకన్నా సన్నంగా ఉంటుంది; దీని ముక్కు సన్నంగా ఉంటుంది; తోక పొడుగ్గా ఉంటుంది. దీని తోకలోని వెలుపలి ఈకలు తెల్లగా ఉంటాయి. ఎగురుచున్న పక్షి క్రిందికి దిగేటప్పుడు ఈ తెల్లని ఈకలు స్పష్టంగా కనపడతాయి. దీని పైభాగాలు

ఇసుక గోధుమ రంగులో ఉంటాయి. వాటిపైని నల్లచారలుంటాయి. వెల వెలపోతున్న కనుబొమ స్పష్టంగా కనపడుతుంది. క్రింది భాగాలు ఎరుపు ఛాయగల పసుపురంగులో ఉంటాయి. రొమ్ముమీద మాత్రం దట్టంగా నల్లని చారలుంటాయి. శీతకాలంలో ఈ ఉపఖండమంతటా, ఆకులు రాల్చే చెట్లుగల ప్రదేశాలలోను, గ్రామాలలోను చేరియుండే మామిడి తోటలలోను, తోపులలోను గుల్మజిట్టంగి కనబడుతుంది. ఆరుబయళ్లలోకాక చెట్లనీడలలో ఇది ఆహారాన్ని సంపాదించుకొంటుంది. ఈ అలవాటునుబట్టి దీనిని మిగతా జిట్టంగుల నుండి గుర్తు పట్టవచ్చును. అది రాలిన ఎండాకుల మధ్య కదల కుండా ఉన్నపుడు దాని రంగు ఎండాకుల రంగుతో కలిసిపోవడం చేత అది కనపడదు. దానికాహారమైన పెంకుపురుగులూ మొదలైన చిన్న కీటకాలను ఏరుకొంటూ అది నేలమీద నిశ్శబ్దంగా నడుస్తుంది. ఏదైనా ప్రమాదం శంకించినపుడు దగ్గరనున్న చెట్టమీద కది ఎగిరిపోతుంది. ప్రమాదం దాటిపోయిన పిదప మళ్లీ అది క్రిందికి దిగి తన పని కానిస్తుంది. అది ఎగిరేటప్పుడు 'ట్సీప్ - ట్సీప్' అంటూ బలహీనంగా కూస్తుంది. మన పొలిమేరలు దాటిన తరువాత జతకట్టే సమయంలో పెంటి నాకర్షించ డానికి మగపక్షి ఎగురుతూ, శ్రావ్యంగా పాడుతుంది. కాని అది మన దేశంలో ఉండగా ఈ పాట పాడదు. అది మన దేశపు సరిహద్దులను దాటి, ఉత్తరంగా గూళ్లు కట్టే ప్రదేశాలకు పోయినప్పుడే, ఈ పాట వినిపిస్తుంది.)

భారత జిట్టంగి (Indian Pipit — A. Novaeseelandiae). ఇది ఒక్కటే మన దేశంలో నివాసిగా ఉండే జిట్టంగి. ఉపఖండంలో ఇది పలుచోట్ల కనపడుతుంది. సామాన్యంగా ఇది మైదానాలలో గ్రుడ్లు పెడుతుంది. బయళ్లలో — దున్నని భూములందూ, పశువుల బీడులందూ — ఒంటరిగా గాని, జతలు, జతలుగా గాని ఇవి తోకలను మెల్లగా పైకి క్రిందికీ ఆడిస్తూ త్వరత్వరగా పరుగెత్తుతూ ఉంటాయి. అవి ఎగురుతున్నప్పుడు హీన స్వరంతో 'పిపిట్ - పిపిట్' అంటూ కూస్తాయి. గ్రుడ్లను పెట్టేకాలంలో మగ పక్షి కొన్నిమీటర్ల ఎత్తుకు రెక్కలను కొట్టుకొంటూ గాలిలోకెగిరి, "చీప్" అంటూ హీనస్వరంలో కూసి, రెండు నిముషాలలో మళ్లీ భూమి మీదకు దిగుతుంది. భారతజిట్టంగి పచ్చగడ్డి, పిల్లవేళ్లు, రోమాలూ మొదలైన వాటితో అట్టే లోతులేని గిన్నెవంటి గూడును కడుతుంది. ఈ గూటిని అది

పశువుల గిట్టవలన నేలమీద కొంతకాలం క్రితం ఏర్పడిన అచ్చులోనో, మట్టిపెల్ల క్రిందనో లేదా చిన్న పొదచాటుననో కడుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ గూటిని కొంతవరకు కప్పుతూ ఒక డోమునుకూడా నిర్మిస్తుంది. గూటిలో మూడు, నాలుగు గ్రుడ్లుంటాయి. అవి లేత పసుపురంగులో కాని లేదా బూడిదరంగు ఛాయగల తెలుపులో కాని ఉంటాయి. వాటిమీద అడ్డదిడ్డంగా గోధుమరంగు మచ్చలూ, చుక్కలూ ఉంటాయి. గ్రుడ్డు యొక్క వెడల్పైన కొనవద్ద అవి దగ్గర దగ్గరగా హెచ్చు సంఖ్యలో ఉంటాయి.

డైసీఇడె కుటుంబం — పూపొడుపు జిట్టలు ( Family Dicaeidae — Flowerpeckers ) : — ఈ కుటుంబంలోని పక్షులు చాలా చిన్నవి, ఎప్పుడూ ఒకచోట నిలవవు; వాటి తోకలు పొట్టివి; పువ్వులలోకి జొన్పడానికి అనువుగా వాటి ముక్కులు సన్నంగాను, కొంచెం వంగి, కొనదేరియు ఉంటాయి.

టికెల్ పూపొడుపు జిట్ట (Tickell's Flowerpecker — Dicaeum Erythrorhynchos) — పటము 94 — హిందీ: ఫూల్‌చూకీ (అన్ని పూపొడుపు జిట్టలకు హిందీలో ఈ పేరు వాడతారు). ఇవి భారతదేశంలోనూ, తూర్పు పాకిస్తానులోనూ బాగా వ్యాపించి ఉన్నాయి. ఇది ఆలివు - గోధుమ రంగులోనూ, లేత బూడిదరంగులోనూ ఉండే చురుకైన చిన్న పక్షి. ఇది ఊరపిచ్చుకకన్న చాలా చిన్నది. బహుశా ఇది భారత దేశంలోని పక్షులన్నింటిలోకీ చిన్నది. ఇది కొంతవరకు ఆడు తేనె పిట్టను పోలి ఉంటుంది. కాని దీని ముక్కు తేనెపిట్ట ముక్కుకన్న పొట్టిగా ఉండి మాంసపు రంగులో ఉంటుంది. పూదేనె, హానికరములైన లొరాన్థసు, విస్కమువంటి బదనికల పళ్లూ ఈ పక్షి ముఖ్యాహారం. ఈ పక్షి మకరందాన్ని అందుకొనే ప్రయత్నంలో లొరాన్థసు అనే బదనికలో పరపరాగ సంపర్కం కల్గిస్తుంది. లొరాన్థసువి, విస్కము అనే మరియొక బదనికవి పండిన పండ్లను ఈ పక్షులు మ్రింగివేస్తాయి. ఈ పండ్లలోని బీజాలు జిగురుగా ఉండి అంటుకొంటూ ఉంటాయి. ఆ పక్షులు దగ్గరగా ఉన్న మరో చెట్టుమీద రెట్ట వేసినపుడు, రెట్టతో పడిన ఆ బీజాలు చెట్టుకు అంటుకొని మొలకెత్తి, బదనికలను వ్యాపింపచేస్తాయి. ఆహారం సంపాదించుకోవడానికి పూపొడుపు జిట్టలకు ప్రత్యేకమైన ప్రదేశాలుంటాయి. ఆ ప్రదేశాలలోనే బదనికలున్న ఒక వృక్షము నుండి మరియొక వృక్షానికవి తిరుగుతూ ఉంటాయి. ఒక బదనిక నుండి వేరొక బదనికకు అవి ఎగురుచున్నపుడూ లేదా గెంతుతున్నపుడూ

ఎడతెగకుండా "చిక్ - చిక్ - చిక్" అంటూ తగ్గుస్థాయిలో పాట పాడతాయి. ఈ పూపొదుపు జిట్ట గూడు కోలెవలె వ్రేలాడే ఒక అండాకారపు సంచి. తేనెపిట్ట గూడుకన్న దీని గూడు చిన్నది; నీటుగా ఉంటుంది; గూటి వెలుపల పనికిమాలిన పదార్థాల అలంకరణ ఏమీ ఉండదు. అది గూటిని మెత్తని నారపోచలతోనూ, మెత్తని దూదివంటి శాకీయ పదార్థాలతోనూ కడుతుంది. గూడు ఎరుపు కలిసి గోధుమరంగులో ఫెల్టుతో కట్టినట్లు ఉంటుంది. గూటిని అది నేలకు 3 మొదలు 10 మీటర్ల ఎత్తున చెట్టుకొమ్మ నుండి వ్రేలాడ తీస్తుంది. గూటిలో సామాన్యంగా 2 తెల్లని గ్రుడుంటాయి. వాటిమీద మచ్చలుగాని, చుక్కలు గాని ఏమీ ఉండవు.)

లావుముక్కు పూపొదుపు జిట్ట (Thickbilled Flowerpecker — D. Agile):— ఇది సామాన్యంగా కనపడే మరొక పూపొదుపుజిట్ట. ఇది రూపం లోనూ, అలవాట్లలోనూ టికెల్ పూపొదుపు జిట్టను పోలి ఉంటుంది. దాని క్రింది భాగాల పైనుండే లేత గోధుమరంగు చారలనుబట్టి, లావుగా, లేత నీలిరంగులో తూటిపిట్ట ముక్కులా కూచిగా ఉండే కొమ్ము ముక్కునుబట్టి ఈ పక్షిని గుర్తు పట్టవచ్చును.

(నెక్టారినీడె కుటుంబం - తేనెపిట్టలు (Family Nectariniidae - Sunbirds or Honeysuckers):— ఈ కుటుంబంలో లోహపు కాంతితో నిగనిగలాడే రంగుగల పూపొదుపు జిట్టలవంటి చిన్న పక్షులను చేర్చారు. కాని పువ్వులలోని మకరందాన్ని గ్రహించడాని కనువుగా, వీటి ముక్కులు పూపొదుపు జిట్టల ముక్కులకన్న పొడుగ్గానూ, సన్నంగానూ ఉంటాయి. అంతేకాదు. వీటికి మకరందాన్ని జుఱ్ఱడానికనువైన నాళాకారపు నాలుకలున్నూ ఉంటాయి.

ఊదా తేనెపిట్ట (Purple Sunbird — Nectarinia Asiatica):— పటము 95 - హిందీ: షకర్ ఖోరా (హిందీలో అన్ని తేనెపిట్టలకు ఈ పేరు వర్తిస్తుంది): - తేనెపిట్టలన్నింటికి దీనిని నమూనాగా తీసికొనవచ్చును. ఇది ఊరపిచ్చుకకన్న చిన్నది. గ్రుడ్లు పెట్టేకాలంలో మగపక్షి ఈకలు నల్లగానూ, లోహపుకాంతితో మెరిసే ఆకుపచ్చ, ఊదారంగుల లోనూ ఉంటాయి. దాని 'చంకల' వద్ద నిప్పులా మెరుస్తూ, నారింజ - ఎరుపురంగు ఈకల కుచ్చులుంటాయి. - గ్రుడ్లు పెట్టని కాలంలో మగ పిట ఆలివు - గోధుమరంగు పైభాగము, వెలవెలపోతున్న పసుపురంగు

క్రింది భాగము కలిగి, కొంతవరకు ఆడుపిట్టలాగే ఉంటుంది. - కాని మగపిట్ట రెక్కలు నల్లగా ఉంటాయి; దాని రొమ్ము మధ్యనుండి క్రింది వైపుకు ఒక వెడల్పైన నల్లని చార ఉంటుంది. తేనెపిట్టలు సాధారణంగా జతలు, జతలుగా తిరుగుతాయి. పువ్వునుండి పువ్వుకు ఉన్నచోట ఉండకుండా మిడిసిపడి ఎగురుతూ, వాటికి ప్రధానాహారమైన మకరందాన్ని ఆస్వాదించడానికి, వంగి ఉన్న ముక్కును మకుట దళావళిలోనికి జొన్పడానికనువుగా పువ్వులను పట్టుకొని, తలక్రిందుగా వ్రేలాడుతూ ఉండడం మనం తరచుగా చూస్తూంటాము. ఒక్కొక్కప్పు డీపక్షి పువ్వు ముందు శ్యేనశలభం (Hawkmoth) లాగ ఒక్క క్షణం రెక్కలను త్వర త్వరగా ప్రకంపింపచేస్తూ అల్లాడి ఆ పూవునుండి ఏ సాలీడునో, కీటకాన్నో పట్టుకోవడం కూడా కలదు. అయితే మకరందాన్ని గ్రహించేటప్పుడు మాత్రమీ పిట్ట ఈ పద్ధతిలో ఎగురదు. బాగా పువ్వులున్న కొమ్మల మధ్య మిడిసిపడుతూ ఎగురుతూన్నపుడది 'విచ్, విచ్' అంటూ ఏకస్వర శబ్దాలలో పొట్టిగా కూస్తుంది. ప్రత్యుత్పత్తి కాలంలో మగది ఆరుబయట ఆకులు లేని ఏ చెట్టుకొననో, టెలిగ్రాఫు తీగమీదనో హాయిగా కూర్చొని, ఇరుప్రక్కలకూ తిరుగుతూ, తత్తరపాటుతో రెక్కలను పైకెత్తి దించుతూ, నిగనిగలాడే పసుపు – ఎరుపురంగుల చంక ఈకల కుచ్చులను ప్రకటిస్తూ, తోకను విస్తరింపచేసి ముడుచుకొంటూ, ఉద్రేకంతో పాడుతుంది. దాని పాట హుషారుగా ఉంటుంది; "చీవిట్, చీవిట్, చీవిట్" అంటూ కీచుస్వరంలో త్వరత్వరగా, మళ్లీ మళ్లీ కూస్తుంది. మిగతా తేనెపిట్టల మాదిరిగానే, ఇది కూడా మెత్తని పచ్చగడ్డీ, పనికిమాలిన పదార్థాలూ, సాలెపట్టులూ ఉపయోగించి, జోలెవంటి గూడుకట్టి, దాని వెలుపలివైపున కాగితంలా పల్చగా ఉండే బెరడును, ఆకుపురుగుల పెంటికలను అంటిస్తుంది. మానవ నివాసాలైన బంగాళాల గోడలకు ప్రాకిన లతల నుండిగాని, పొట్టి పొదనుండిగాని సాధారణంగా నేలకు 3 మీటర్లలోపు ఎత్తులో ఈ గూళ్లు వ్రేలాడుతూంటాయి. గూటిలో బూడిద లేదా ఆకుపచ్చ చాయగల తెల్లని గ్రుడ్లు రెండో, మూడో ఉంటాయి. వాటిమీద గోధుమ, బూడిదరంగుల మచ్చలుంటాయి.)

ఊదా పిరుదుల తేనెపిట్ట (Purplerumped Sunbird — N. Zeylonica): ఇది ఈ ద్వీపకల్పపు మైదానాలలో సామాన్యంగా కనపడే మరోజాతి తేనెపిట్ట. మగపక్షి తలా, పైభాగాలూ, రొమ్మూ నిగనిగలాడు ఆకుపచ్చ,

ఎరుపు, నీలి – ఎరుపురంగులో ఉంటాయి. పిరుదులు నిగనిగలాడు ఊదా రంగులో ఉంటాయి. క్రింది భాగాలు కాంతిమంతమైన పసుపురంగులో ఉంటాయి. ఆడుపక్షి ఊదా తేనెపిట్టలలో ఆడుదానిని పోలి ఉంటుంది కాని దీని బుగ్గలు, గొంతు లేత బూడిదరంగులోనూ, క్రింది భాగాలు మిగుల కాంతి మంతమైన పసుపురంగులోను ఉంటాయి.

జోస్టెరొపిడె కుటుంబం (Family Zosteropidae): – ఈ కుటుంబానికి పూపొడుపు పిట్టలు, తేనెపిట్టల కుటుంబానికి దగ్గర సంబంధం ఉంది.

వెల్లకంటి (White - eye - Zosterops Palpebrosa) —— పటము 96 – హిందీ: బబూనా: ఇది జోస్టెరొపిడె కుటుంబంలోని పక్షి. ఇది ఆకుపచ్చ ఛాయగల పసుపురంగు, కాంతిమంతమైన పసుపురంగు గల చిన్న పక్షి. దీనితోక చతురస్రంగా ఉంటుంది. దీని కన్నులచుట్టూ స్ఫుట మైన తెల్లని వలయం (సులోచనం) ఉంటుంది. దీని ముక్కు సన్నంగా కొన దేరి, కొంచెం వంగి ఉంటుంది. తోటలలోను, అడవులలోను ఉండే చెట్లమీద ఇవి 5 మొదలు 20 పక్షుల వరకూ చేరి చిన్నచిన్న గుంపులుగనో, మందలు గనో తిరుగుతాయి. అప్పుడప్పుడవి ఇంకా పెద్దపెద్ద మందలుగా కూడ చేరు తాయి. ఇవి కేవలం వృక్షాలమీదనే నివసించే పక్షులు. అవి చెట్ల ఆకుల మధ్యా, పొదలలోనూ ఉపాయంగా ఆకులనూ, మొగ్గలనూ వెతుకుతూ ఆహారం కోసరం వేటాడుతాయి. అలాంటప్పుడది దొమ్మరి విన్యాసాలలో అనేక విధముల కొమ్మలను పట్టుకొని వ్రేలాడుతూ, దాక్కొనియున్న కీట కాలు, సాలీడుల కోసరం పరికిస్తాయి. వీటినేకాక అవి బాగా పండిన పండ్ల గుంజును కూడ తింటాయి. అంతేకాదు. పలురకాల పువ్వులలోని మకరం దాన్ని కూడా అవి ముఖ్యమైన ఆహారంగా గ్రహిస్తాయి. మకరందం కోసరం అవి వాటి ముక్కులను పుష్పనాళాలలోకి జొన్పేటప్పుడు, ఆ పుష్పా లకు పరపరాగ సంపర్కం గలిగించి మహోపకారం కూడా చేస్తున్నాయి. ఆకులమధ్య గంతుతూ, ఎగురుతూ ఉన్నపుడవి గలగలమనీ, కిచుకిచుమనీ మంద స్వరాలు అదేపనిగా పలుకుతాయి. గూళ్లను కట్టేకాలంలో మందలు విడిపోతాయి. ఆ కాలంలో మగపక్షి గలగలమంటూ శ్రావ్యమైన చిన్న పాటను అందుకొంటుంది. ఈ పాటను విన్నప్పుడు హిమాలయాలలోని తోక పిగిలిపిట్ట పాట జ్ఞప్తికి వస్తుంది. ఈ పాట మొదట్లో వినీ వినపడకుండా ప్రారంభమవుతుంది; క్రమంగా బిగ్గరగా వృద్ధిపొంది, మూడు, నాలుగు



పటము 97

**ఊర పిచ్చుక**

(***Passer domesticus***)

పేజి 165



పటము 98

**గిజిగాడు (బంగారుపిచ్చుక)**

**(*Ploceus philippinus*)**

పేజీ 166



పటము 99

ఎఱ్ఱమునియా (4)

(*Estrilda amandava*)

చుక్కలమునియా (3)

(*Lonchura punctulata*)

పేజీ 168 - 9




పటము 100
గులాబీ పూటిపిట్ట
(*Carpodacus erythrinus*)
పేజి 169

సెకనులలో తిరిగి క్రమంగా క్షీణించిపోతుంది. వెల్లకంటెలు సొగసైన పెంపుడు పిట్టలుగా ఉపయోగపడతాయి. త్వరలోనే అవి మచ్చికయి, విశ్వసనీయంగా ఉండి, పంజరపు వాసానికి పూర్తిగా అలవాటు పడతాయి. అది నారపోచలను బంధించి ఒక చిన్న గిన్నెవంటి గూడును తయారుచేస్తుంది. దానికి సాలెపట్టుల నతుకుతుంది. కొమ్మకొసనున్న పలవనుండి ఊయలలాగ ఈ గూడు వ్రేలాడుతూంటుంది. ఇది అచ్చంగా వంగ పండుపిట్ట గూడులాగే ఉంటుంది. కాని అంతకంటె చిన్నది. వెల్లకంటి ఈ గూడును భూమికి సుమారు రెండు, మూడు మీటర్ల ఎత్తున పొదలోనో, చిన్న చెట్టులోనో కడుతుంది. గూటిలో రెండు, మూడు అందమైన లేత నీలిరంగు గ్రుడ్లుంటాయి. గ్రుడ్డు యొక్క వెడల్పైన కొన నొక్కొక్కప్పుడు ఒక గాఢమైన నీలిరంగు టోపీ ఉండుటయు కలదు. గ్రుడ్లమీద చుక్కలు కాని, చారలు కాని ఉండవు.)

(ప్లొసియిడె కుటుంబం (Family Ploceidae) - లో పిచ్చుకలు (Sparrows), గిజిగాళ్లు (Weavers) ఉన్నాయి. వీటిని తెలియనివారుండరు. ఈ పక్షులను గురించి తెలిసికోవాలనే అభిలాష లేనివారు కూడ వీటిని సులువుగా గుర్తు పట్టగలరు.

ఊరపిచ్చుక (House Sparrow — Passer Domesticus) - పటము 97- హిందీ: గౌరియ్యా. పిచ్చుకలలో ఇది మొట్టమొదటిది. ప్రపంచంలో మనుష్యులు నివసించే అన్నిచోట్లా ఇవి ఇప్పుడు వ్యాపించియుంది. పెట్టకూ, పుంజు (పటంలో చూడవచ్చును) కూ తేడా ఉంది. పెట్ట మట్టిరంగులో ఉంటుంది. దీని పైభాగం గోధుమచాయగల పసుపురంగులో ఉంటుంది. అందుపైని నల్లని చారలుంటాయి. పెట్ట క్రింది భాగాలు తెల్లగా ఉంటాయి. కొండ కానిమ్ము, మైదానము కానిమ్ము, జనంతో క్రిక్కిరిసి సందడిగా ఉండే నగరము కానిమ్ము లేదా ప్రశాంతమైన చిన్నపల్లె లేక పొలంలో ఉండే ఇల్లు కానిమ్ము - ఏ ప్రదేశంలోనైనా సరే పిచ్చుకలు వాటి ఆహారానికై మానవునిమీద ఆధారపడియే జీవిస్తాయి. ఏదైనా దూరప్రదేశంలో జనం చేరి, ఇళ్లు కట్టుకొని నివాసాలేర్పరచుకొంటే అక్కడికి ప్రప్రథమంగా చేరి, ఆ నూతన పరిస్థితులకు అనుగుణ్యంగా జీవించగల పక్షులు పిచ్చుకలు. శీతకాలంలో ఈ పక్షులు పెద్ద పెద్ద మందలుగా కూడి పంటపొలాల్లోను, వాటి చుట్టుప్రక్కలను ఆహారం సంపాదించుకొంటాయి. బీజాలూ, తృణ

ధాన్యాలూ వాటి ఆహారం. పిచ్చుకలు వీటిని నేలమీద నుండి ఏరుకొని తింటాయి. కాని అవి గోధుమ తదితర తృణధాన్యపు పంటలమీదకు కూడా దాడి వెడతాయి. అవి పెద్ద మందలుగా పొలాలమీదపడి తరచుగా పంటలకు విశేషంగా నష్టం కలుగచేస్తాయి. అవి గుర్రాలు, పాడి పశువుల మలంలో జీర్ణం కాకుండా మిగిలిపోయిన గింజలనుకూడా తింటాయి కనుక గ్రామాల లోనూ, పట్టణాలలోనూ ఉండే పిచ్చుకల సంఖ్య అచటి గుర్రాలు, పశువుల ఉనికిపై ఆధారపడి ఉంటుంది. పిచ్చుకలు ఆకు మొగ్గలనూ, పూ మొగ్గలనూ కూడ నాశనంచేసి, కూరగాయ తోటలకు కూడా హాని కలుగచేస్తుంటాయి. ఇలా చేసే అపకారాన్ని సరిదిద్దుకోవడానికా అన్నట్లు అవి ఉపకారం కూడా చేస్తున్నాయి. పిచ్చుకలు వాటి పిల్లలకు కేవలం ఆకు పురుగులను, మెత్తని శరీరంగల కీటకాలను పెట్టి పోషిస్తాయి. ముఖ్యంగా అవి గూళ్లలో ఉన్న లేత పిల్లలను పోషించే కాలంలో అప్పటి పంటలలోని చీడపురుగు లను నాశనంచేసి, వ్యవసాయానికి మహోపకారం చేస్తున్నాయి. గ్రుడ్లను పెట్టే కాలంలో మగపక్షి ఈకలను వదులుచేసి, పిరుదులను పైకెత్తి, రెక్కలను వ్రేలాడవేసి పొగరుగా అడుగులువేస్తూ, పైకెత్తి పెట్టుకొని ఉన్న తోకను గుంజుతూ "ట్సి, ట్సి, ట్సి" లేదా "చీర్, చీర్, చీర్" అంటూ ఏకరీతిగా, బొంగురు గొంతుకతో, చీదరెత్తేవాకా పాట పాడుతుంది. బాగా ఆకులున్న చెట్టులోనో, ముండ్ల పొదలోనో రాత్రులందు పెద్ద పెద్ద గుంపు లుగా పిచ్చుకలుచేరి నిద్రపోవడానికి ముందు పోరాడుకొంటూ ఎంతైనా సందడిచేస్తాయి. పిచ్చుక హెచ్చుగా ఎండుగడ్డినీ, చెత్తనీ తెచ్చి ఇంటి గోడ కున్న కన్నంలోనో, లేదా ఇంటి చూరులోనో, సరంబీలోనో కుక్కుతుంది. ఇదే దాని గూడు. గూటిలో 3 మొదలు 5 వరకూ గ్రుడ్లుంటాయి. అవి లేతాకు పచ్చచాయ తెలుపురంగులో ఉంటాయి. వాటిమీద పలు చాయలలో. గోధుమరంగు మచ్చలుంటాయి.)

గిజిగాడు, బంగారు పిచ్చుక (Baya Weaver Bird - Ploceus Philippinus) – పటము 98 - హిందీ: బయా: - ఇవి పంట పొలాల చుట్టుపట్ల చెట్లనుండి వ్రేలాడునట్లుగా రిటార్టు ఆకారంలో గూళ్లను అద్భుతంగా అల్లడంచేత ఈ పక్షులను గూర్చి అందరికీ తెలియును. జత కట్టే కాలంలో ఏర్పడే ప్రత్యేకమైన ఈకలతోనున్న మగపక్షిని పటంలో చూడవచ్చును. గ్రుడ్లు పెట్టని కాలంలో మగదానికీ, ఆడుదానికీ ఒకటే రకమైన ఈకలుం

డటం మూలాన, ఏది మగదో ఏది ఆడదో గుర్తుపట్టడం కష్టం. ఆ కాలంలో రెండూ కూడా ఆడు ఊరపిచ్చుకను పోలి ఉంటాయి. కాని వీటి ముక్కు ఊరపిచ్చుక ముక్కుకన్నా లావుగాను, తోక అంతకన్నా పొట్టిగాను ఉంటాయి. పంట పొలాలచుట్టూ ఉండే చెట్లులేని బయలు ప్రదేశాలలో గిజిగాళ్లు గుంపులుగా చేరి ఉంటాయి. ఒక్కొక్కప్పుడవి మిగుల పెద్దవైన గుంపులుగా సంచరిస్తాయి. పండి, కోతకు సిద్ధముగా నున్న తృణధాన్యపు పొలాలమీద అవి పడి ఒక్కొక్కప్పుడు స్థానికంగా పంటలకు విపరీతమైన నష్టాన్ని కలుగచేస్తాయి. స్థానికంగా ఇవి ఒకచోటునుండి వేరొక చోటుకు పోతూ ఉంటాయి. ఈ విధమైన స్థానచలనం ఋతుపవనాలమీద అందు ముఖ్యంగా వరిపంట మీద ఆధారపడి ఉంటుంది. తరచుగా పిచ్చుకల తోనూ, మైనగోరలతోను కలిసి రాత్రులందు నిద్రపోవడానికి బంగారు పిచ్చుకలు అసంఖ్యాకాలుగా రెల్లుమడులలోకీ, చెరకుతోటలలోకీ చేరుతాయి. అవి సామాన్యంగా ఊరపిచ్చుకల్లాగ "చిట్-చిట్-చిట్" అని కూస్తాయి. గ్రుడ్లను పెట్టేకాలంలో మగవి గూళ్లను అల్లుతూ, గూళ్లను పట్టుకొని వ్రేలా డతూ తమకు కాబోయే భార్యలను ఆకర్షించడానికి ఉద్రేకంతో రెక్కలను కొడుతూ — "చీ- ఈ" అంటూ, సాగదీసుకొంటూ అహ్లాదకరంగా, శ్రావ్యంగా పాడుతాయి. గూళ్లు కట్టి, గ్రుడ్లు పెట్టడంలో గిజిగాళ్లన్నింటికి ఒక ప్రత్యేకత ఉంది. ఒకే ప్రాంతంలో మగది కొన్ని గూళ్లను, ఒకదాని తరువాత ఒకటి చొప్పున కడుతుంది. అవి ఇంకా పూర్తి కాకమునుపే ఆడువి వాటిని, ఒకటి తరువాత ఒకటి ఆక్రమించుకొంటాయి. అలా ఆడుది ఆక్రమించుకొన్న గూటినే మగది పూర్తి చేస్తుంది. ఈ విధంగా ప్రతి పుంజూ రెండు మొదలు అయిదువరకూ గూళ్లను కడుతుంది. ఈ గూళ్ల సంఖ్యలోనే దానికి భార్యలూ, కుటుంబాలూ ఒకే సమయంలో ఉంటాయి. వరి ఆకులను గాని, గరుకు అంచులుగల గడ్డిపోచలనుగాని సన్నగాచీరి ఆచీరికలతో అది రిటార్టువంటి గూటిని అల్లుతుంది. ఈ గూటిలో ప్రవేశించడానికి వీలుగా నిట్టనిలువుగా ఒక పొడుగైన గొట్టం అమరి ఉంటుంది. ఈ గూళ్లను తరచుగా అది నీటిమీదకు వాలియున్న తుమ్మకొమ్మలకో, తాటాకులకో, ఈతాకులకో వ్రేలాడ తీస్తుంది. గూటిలో గ్రుడ్లగది డోము లోపలి భాగాన అది తడిమట్టి ముద్దలను అంటిస్తుంది. అది వాటిని ఇలా ఎందుకు అంటిస్తుందో కారణం తెలియదు. గూటిలో 2 మొదలు 4 వరకూ తెల్లని గ్రుడ్లుంటాయి.

**దారల గిజిగాడు** (Striated Weaver Bird — P. Manyar), **నల్లగొంతు గిజిగాడు** (Blackthroated Weaver Bird—P. Benghalensis): — ఇవి మనకు పరిచితమైన మరి రెండు సామాన్యమైన గిజిగాళ్లు. గూళ్లు కట్టే కాలంలో మగ గిజిగాళ్లకు బయలుదేరే ఈకల రంగునుబట్టి వీటిని సులభంగా గుర్తుపట్టవచ్చును. వీటిలో మొదటిదానికి రొమ్ము ఎరుపుదాయగల గోధుమరంగులో ఉంటుంది. దానిమీద నల్లని చారలు స్ఫుటంగా ఉంటాయి. తల పైభాగం కాంతిమంతమైన పసుపురంగులో ఉంటుంది. నల్లగొంతు గిజిగాడుకు తల పైభాగం తళతళలాడే బంగారపు పసుపురంగులోనూ, గొంతు తెలుపురంగులోనూ ఉంటాయి. ఈ తెల్లని గొంతుకూ, తెల్లని క్రింది భాగాలకూ మధ్యనొక స్ఫుటమైన నల్లనిచార ఉంటుంది. ఈ రెండు జాతులూ నీటిలోను, బాడవలలోను పెరిగే పచ్చగడ్డి లేక రెల్లుదుబ్బుల మధ్యను గూళ్లు అల్లుతాయి.

**ఎఱ్ఱమునియా** (Red Munia — Estrilda Amandava) — పటము 99 (4) — హిందీ: లాల్ లేక లాల్ మునియా:- ఇది ఊరపిచ్చుక కన్న చిన్నది. పటములో మగదాన్ని గూళ్లుకట్టే కాలంలోని ఈకల దుస్తుల్లో చూడవచ్చును. గూళ్లుకట్టని కాలంలో ఈకలు మగదానికి ఆడుదానికి ఒక్కలాగే ఉంటాయి. అవి లేత బూడిదరంగులో ఉంటాయి. వాటిమీద అక్కడక్కడా తెల్ల చుక్కలుంటాయి; ముక్కూ, పిరుదులూ మాత్రం ఎఱ్ఱగా ఉంటాయి. దాని తోక, చుక్కలమునియా కున్నట్లు కొనదేరి ఉండక, గుండ్రంగా ఉంటుంది. మునియాల అలవాట్లను, ప్రవర్తనను తెలిసికోవడానికి, ఎఱ్ఱమునియాను నమూనాగా తీసికోవచ్చును. బాడవల అంచులవంటి చెమ్మ ప్రదేశాలలో ఉండే పొడుగైన పూ గడ్డిలోనూ, రెల్లులోనూ ఇవి మందలు మందలుగా కూడుతాయి. ఎఱ్ఱమునియా గడ్డిగింజలనూ, కీటకాలనూ తిని జీవిస్తుంది. గూళ్లు కట్టే కాలంలో మగది కీచుకీచుమంటూ అవిచ్ఛిన్నంగా పాడుతుంది. చాలామంది ఎఱ్ఱమునియాను పంజరంలో పెట్టి పెంచుతారు. తరచుగా దీనిని ప్రకృతిలోకన్నా పంజరాల్లోనే చూస్తూంటాము. పొదలో బాగా క్రిందుగా ఈ పక్షి గడ్డితో గుండ్రంగా గ్లోబులాగ గూడు కడుతుంది. గూటిలోనికి మార్గం ఒక ప్రక్కనుంటుంది. గూటిలో మెత్తదనానికి మిక్కిలి సన్నని గడ్డినీ, ఈకలనూ ఉంచుతుంది. గూటిలో స్వచ్ఛమైన తెలుపు రంగులో 4 మొదలు 7 వరకూ గ్రుడ్లుంటాయి.

చుక్కల మునియా (Spotted Munia - Lonchura Punctulata) — పటము - 99 (3) — హిందీ: తీలియా మునియా లేక సైనీవాజ్ :— ఇదికూడా ఎఱ్ఱమునియా అంతే ఉంటుంది. కాని తోక సూత్రం కొనదేరి ఉంటుంది. గూళ్లు కట్టని కాలంలోనూ లేతవయసులోనూ మగపక్షులూ, ఆడు పక్షులూ కూడా గోధుమరంగులోనే ఉంటాయి. చుక్కలమునియా మందలుగా తిరుగుతుంది. — ఒక్కొక్కప్పుడు మందలో 200 అంతకు పైగానూ ఈ పక్షులు ఉంటాయి. ఇవి పంటపొలాల పరిసరాలలో తిరుగు తూంటాయి. ఈ పక్షులు నేలమీద గెంతుతూ, గడ్డిగింజలనూ, అప్పుడప్పుడు వర్షంవల్ల తడిసిన నేలనుండి పైకెగిరివచ్చిన ఇసుళ్లను తింటాయి. వాటిని కలవరపరుస్తే అవి కిచకిచలాడుతూ చెట్లలో కెగిరిపోతాయి. ఈ పక్షులు గుంపులో ఒకదాని ప్రక్క ఒకటి మిక్కిలి దగ్గరగా అల్లరిమూకగా చేరి, సూటిగా ఎగురక, పైకీ క్రిందికి అలలలాగ ఎగురుతాయి. ఇలా ఎగురడం మునియా పక్షుల ప్రత్యేక లక్షణం. ఎఱ్ఱమునియా గూడులాగే దీని గూడు కూడా గుండ్రంగా గ్లోబులా ఉంటుంది. దీనిలోకి ఉండే ప్రక్క మార్గం ఒక పొట్టి గొట్టంలా ఉంటుంది. అది ఈ గూడును పొదలో క్రిందిభాగంలో కడుతుంది ; కాని అప్పుడప్పుడు గూటినది భూమికి 10 మొదలు 15 మీటర్ల ఎత్తున తాటి మొవ్వులోనో, దాని ఆకులమీదనో నిర్మించడం కూడా కలదు. సాధారణంగా గూటిలో 4 మొదలు 8 గ్రుడ్లదాకా ఉంటాయి. అవి స్వచ్ఛ మైన తెలుపురంగులో ఉంటాయి.

(ఫ్రింజిల్లిడె కుటుంబం— తూటిపిట్టలు (Family Fringillidae - Finches) : ఈ కుటుంబంలోని తూటిపిట్టలకు, పిచ్చుకలకు చాల దగ్గర పోలికలున్నాయి. ఈ కుటుంబంలో నిగనిగలాడే రంగులుగల పిచ్చుకలవంటి పక్షులున్నాయి.

గులాబీ తూటిపిట్ట (The Common Indian or Hodgson's Rose-finch — Carpodacus Erythrinus) - పటము 100 - హిందీ : తూటి లేక లాల్ తూటి :— ఈ కుటుంబంలోని పక్షులకు దీనిని నమూనాగా తీసి కొనవచ్చును. భారతదేశపు ఉపఖండానికిది శీతకాలంలో వలస వస్తుంది. మగపక్షికి అందమైన గులాబీ ఎరుపురంగు తల, రొమ్ము, వీపు, భుజములూ ఉంటాయి ; ఆడుది ఆలివుపచ్చ చాయగల గోధుమ రంగులో ఉంటుంది. మగపక్షిలోనూ, ఆడుపక్షిలోనూ కూడా కూచిగా ఉండే బరువైన ముక్కు, చీలినతోక, రెక్కమీద వెలవెలపోతున్న జంటచార ప్రస్ఫుటమైన లక్షణాలు.

వేసవి సమీపించినపుడు వాటి శీతకాల ప్రదేశాలనవి వదలిపెడతాయి. అప్పుడు మగపక్షులకు అంతకు పూర్వములేని గాఢమైన ఎరుపు రంగు వస్తుంది. తూటిపక్షులు 10 మొదలు 20 వరకూ కలిసి చిన్న గుంపులుగా పంటపొలాల చుట్టుప్రక్కల తిరుగుతూంటాయి. అవి పొదలలోనూ, పంటకు వచ్చిన పైరు పొలాలలోనూ ఆహారం సంపాదించుకుంటాయి. వాటి ఆహారం – పూ మొగ్గలు, లాంటానా, మఱ్ఱి, రావి మొదలగు చెట్లపళ్లు, దొరికినపుడు వెదురు గింజలు, పక్వమైన జొన్న, అవిసి మొదలైన వాటి బీజాలున్నూ. బూరుగ, బాడిద మొదలైన చెట్లయొద్దకవి వాటి పుష్పాల్లోని మకరందం కోసం తరచుగా వెడుతుంటాయి. అవి మకరందాన్ని అందుకునే ప్రయత్నంలో ఈ పక్షుల నుదుటికి, గొంతు ఈకలకు పరాగరేణువు లంటుకుంటాయి. ఈ విధంగా అవి పూవులలో పరపరాగ సంపర్కం కలుగచేయడంలో ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. తూటిపక్షులు తిరుగుతున్నపుడెల్లా సామాన్యంగా 'తూయీ? లేదా చూయీ?' అని ప్రశ్నార్థకంగా, శ్రావ్యంగా, ఈలవేస్తూ ఉంటాయి. గ్రుడ్లు పెట్టే స్థలాలకవి బయలుదేరేముందు మగపక్షి బిగ్గరగా శ్రావ్యమైన పాట పాడుతుంది. ఈ జాతి పక్షులు కాశ్మీరంలోనూ, పశ్చిమ హిమాలయాల్లోనూ ఒక మోస్తరు ఎత్తున గ్రుడ్లు పెడతాయి. అది పచ్చగడ్డితో కప్పువంటి గూటిని కట్టి, అందులో మెత్తదనం కోసరం సన్ననివేళ్లు, రోమాలూ ఉంచుతుంది. ఈ గూటిని అది భూమికొకటి రెండు మీటర్ల ఎత్తున అడవి గులాబిలోనో, లేదా అటువంటి మరో ముళ్ల పొదలోనో నిర్మిస్తుంది. గూటిలో మూడు, నాలుగు గ్రుడ్లుంటాయి. అవి నీలిరంగులో ఉంటాయి. వాటిపైని లేత ఎరుపువి మచ్చలు, చుక్కలు ఉంటాయి.)

(పెస్సరి ఫార్మిస్‌లోని చివరి కుటుంబం ఎంబెరిజిడె — గంధం పిట్టలు (Family Emberizidae — Buntings) గంధం పిట్టలు బాహ్యారూపంలో తూటిపిట్టలలాగే ఉంటాయి. కాని అవి తూటిపిట్టలకన్నా సన్నంగా ఉంటాయి. అంతేకాదు. వాటి శరీరం, తోకా పొడుగ్గా ఉంటాయి. వీటిలో చాలా పక్షులకు, చర్చరీ పిట్టలలాగ తోకలోని వెలుపలి ఈకలకు తెలుపుదనం ఎక్కువగా ఉంటుంది. అవి ఎగురుతూన్నపుడీ తెలుపు బాగా ప్రకటితమవుతుంది.

నలతల గంధంపిట్ట (Blackheaded Bunting — Emberiza Melanocephala), ఎఱ్ఱతల గంధంపిట్ట (Redheaded Bunting — E. Bruniceps) -



పటము 101

నల్లతల గంఘంపిట్ట (పై చిత్రం)

(*Emberiza melanocephala*)

ఎఱ్ఱతల గంఘంపిట్ట (క్రింది చిత్రం)

(*Emberiza bruniceps*)

పేజీ 170

పటము 101 — హిందీ : గంధాం (హిందీలో ఈ రెండు పిట్టలకు ఈ పేరే వాడతారు). ఈ కుటుంబంలోని ఈ రెండు జాతుల గంధంపిట్టలు అందరికీ బాగా పరిచితమైనవి. పటములో మగపక్షులు మాత్రము చూపబడినవి. ఈ రెండు జాతుల పక్షులూ కూడా ఊరపిచ్చుకలకన్న కొంచెం పెద్దవిగా ఉంటాయి. మన ప్రాంతాల కవి శీతకాలంలో వస్తాయి. నల్లతల జాతిలోని ఆడుదానికి పైభాగం ఎరుపు కలిసిన పసుపురంగులో ఉంటుంది ; ఎఱ్ఱతల జాతిలోని ఆడుదానికి పైభాగం బూడిద రంగులో ఉంటుంది. రెండు జాతుల ఆడుపక్షులలోనూ క్రింది భాగాన ఉన్న ఈకలు ఎరుపు కలిసిన పసుపు రంగులో ఉంటాయి ; అందు పసుపుపచ్చదనం ఎక్కువగా ఉంటుంది. శీతకాలంలో రెండు జాతులూ తరచుగా కలిసి పెద్ద గుంపులుగా పంట పొలాల యందు, ఆ పొలాల మధ్య అక్కడక్కడ ఉండే తుప్పలలోను, తుమ్మచెట్ల లోను కనబడతాయి. పంటకు వచ్చిన జొన్న, గోధుమ మొదలైన తృణ ధాన్యపు పైరులమీదకు ఈ పక్షులు గుంపులు గుంపులుగా 'మేఘముల' వలె పైనుండి కిందికి దిగి, వాటికి విపరీతమైన నష్టం కలుగచేస్తాయి. పంటచేల మీదపడి, వెన్నులను త్రెంపి ధాన్యాన్ని కొల్లగొట్టడమే కాకుండా, వ్యవసాయదార్లు కోసివేసిన కుప్పలలోని ధాన్యాన్నికూడా వారు నూరిచి తీసికొని పోయేవరకు కాజేస్తూనే ఉంటాయి. తుమ్మచెట్ల ముదురాకుపచ్చ ఆకులు మధ్య నిగనిగలాడే పసుపురంగులో ఈ పక్షులు దూరానికి మెరిసిపోతున్న పువ్వులులాగ కనపడతాయి. ఆ దృశ్యం నిజంగా చూచి తీరవలసినదే. శీతకాలంలో అవి మనతో ఉన్నపుడవి ఎగురుతూ 'ట్వీట్' అంటూ ఊరపిచ్చుకల్లాగ కూస్తాయి. కాని వీటికూత శోకస్వరంలో ఉన్నప్పటికీ ఇంపుగానే ఉంటుంది. నల్లతల గంధంపిట్ట మనదేశపు పొలిమేరలను దాటిపోయి పశ్చిమాసియాలోనూ, తూర్పు ఐరోపాలోనూ గ్రుడ్లను పెడుతుంది. ఎఱ్ఱతల గంధంపిట్టలు మనకు చాలా దగ్గరగానున్న పశ్చిమ పాకిస్థాను, బెలూచిస్థానులలో గ్రుడ్లను పెడతాయి. ఈ పక్షి సన్నని కాండములతోను, నారపోగులతోను, గిన్నెఆకారంలో గూడుకడుతుంది. దానిలో మెత్తదనం కోసరం గొర్లఉన్ని నుంచుతుంది. ఈ గూటినది నేలకు $1\frac{1}{2}$ మీటర్ల ఎత్తున ఎవరికీ సులభంగా కనబడనిచోట ఏ పొదలోనో కడుతుంది. గూటిలో 5 గ్రుడ్లుంటాయి. అవి లేతాకుపచ్చ ఛాయగల తెలుపులో ఉంటాయి. వాటిపైన గోధుమ, లవండరు, బూడిదరంగులలో చుక్కలు, మచ్చలు ఉంటాయి.